ప్రకాశకులు :
అఖిలభారత సర్వసేవా సంఘ పక్షమున
సర్వోదయ సాహిత్య ప్రచారసమితి
గాంధీభవన్ :: హైద్రాబాదు.

★

ప్రథమ ముద్రణ
జనవరి 1958
ప్రతులు : ఐదువేలు

వెల : రెండు రూపాయలు

★

ముద్రణ :
అజంతా ప్రింటర్స్
సికింద్రాబాదు.

# शिक्षण विचारधारा

*विनोबाजी कृत*

**'शिक्षण विचार'**

का

तेलुगु अनुवाद

अनुवादक

**के. वि. एन्. अप्पाराव**

★

पहलीबार
जनवरी 1958
प्रतियाँ : पाँच हज़ार
मूल्य : दो रुपये

★

*प्रकाशक :*
अखिल भारत सर्व सेवा संघ
की ओर से
सर्वोदय साहित्य प्रचार समिति
गान्धी भवन :: हैदराबाद

★

मुद्रक
'अजन्ता प्रिण्टर्स'
सिकन्दराबाद

# రెండు మాటలు

★

ఈ పుస్తకములో శిక్షణకు సంబంధించిన నా భావములు సంగ్రహింప బడియున్నవి. ఇందలి 2-5 వ్యాసములు "మధుకర్" లో వచ్చియేయున్నవి. అయినను ఒకే చోట సమావేశపరచుటకై ఇందు చేర్చబడినవి. నా జీవితమంతయు శిక్షణ కార్యమందే గడచినది, గడచుచున్నది. ఒకమారు ఆత్మశిక్షణ నడచినది, ఇంకొకమారు విద్యార్థుల శిక్షణ కావున పాఠకులకిందు లభించునని కేవలము అనుభవముతో నిండిన ఆలోచనలేగాని ఇష్టానుసారముగా చెప్పిన ఆలోచనలు కావు.

పది సంవత్సరములలో దేశమంతటను నవీన శిక్షణ పద్ధతి సాగింపవలెనని మనదేశము సంకల్పించినది. ఇట్టిసమయమున ఈ పుస్తకము మిక్కిలి ఉపయోగకారి కాగలదని నేను ఆశించుచున్నాను.

మకాము :

డాంగరసురుడా
(కోరాపుట్టు) ఒరిస్సా
31-8-55

వినోబా

# అనుక్రమణిక

•

# శిక్షణ విచారధార

## :1: నివృత్త శిక్షణము

### రూసో ప్రతిభ

ఫ్రెంచి విప్లవ సందర్భమున రూసో, వాల్టేర్ అను ఈ ఇద్దరు రచయితల పేరులు మిక్కిలి ప్రసిద్ధములైనవి. ఈ గ్రంథకారుల భాష, విచారధార, లేఖన పద్ధతి తేజస్వంతము, సజీవము విప్లవాత్మకము ఐనవి. వారి కలమునకు భయపడినంతగా మహాబలవంతులైన మహారాజుల శస్త్ర బలమునకు కూడ ప్రజలు భయపడలేదు. వీరి వ్రాతల క్రియారూపమైన పరిణామమే ఫ్రెంచి విప్లవము. ఈ ఇద్దరు గ్రంథకారులలోను రూసో మిక్కిలి భావనా ప్రధానుడు. వ్యాసము వ్రాయుట కొరకు అత డెప్పుడును భాషా శాస్త్రము నభ్యసింపలేదు. హృదయమున ఇముడ్చ కొనజాలక పోవుటచే బలవంతముగా వెలికి త్రోయబడు అగ్ని పర్వతము యొక్క జాజ్వల్యమానమగు అగ్ని ద్రవమువోలె - అంతేకాదు - అంత కంటెను ఎక్కువ దహనశీలమై ఆ రచయిత భావములు అతనికి తెలియకుండగనే అతనికి ఇష్టము లేకపోయినను బయట కురుకుచుండె డివి. అతని వ్రాతలలో అతని హృదయము మాట్లాడుచుండెడిది. అందుచే బుద్ధి, తర్కము అను గీటురాతిపై నిలువజాలక పోయినను అవి "మండునట్టి అగ్నికణములు" అని చరిత్రకూడ అంగీకరింప వలసి వచ్చుచున్నది. "మృతజీవనము కంటె జీవిత మృత్యువే శ్రేయస్కరము" అనునది అతని వ్రాతలలోని ఏకైక మూలసూత్రము. ఇట్టి ప్రభావశాలియు ప్రతిభావంతుడునైన గ్రంథకారుడు శిక్షణనుగూర్చి వెల్లడించిన భావములను గంభీరముగా పర్యాలోచించుట మన కర్తవ్యము.

## శిక్షణయొక్క మూడు విభాగములు

రూసోమతము ప్రకారము శిక్షణను మూడు విభాగములుగ చేయవలెను:- (1) నిసర్గ శిక్షణము (2) వ్యక్తి శిక్షణము (3) వ్యవహార శిక్షణము.

శరీరములోపలి ప్రతి అవయవమునకు పూర్ణమైన సక్రమమైన వృద్ధికలుగుట. ఇంద్రియములు నైపుణ్యము చురుకుతనము కార్యకౌశలము కలవగుట, వివిధములైన మనోవృత్తులకు సర్వతోముఖమైన వికాసము కలుగుట, స్మృతి, ప్రజ్ఞ, మేధా, ధృతి, తర్కము, మొదలైన బుద్ధిశక్తులు ప్రౌఢములు, తీక్ష్ణములు అగుట-ఈ నైసర్గికములైన, అనగా స్వాభావికములైన ప్రవృత్తులు అన్నియు అతనిమతము ననుసరించి నిసర్గ శిక్షణలో చేరును. అనగా మానవుని లోలోపలనే జరుగు శారీరిక మానసిక బౌద్ధిక వికాసమును, లేదా ఆత్మవికాసమును "నిసర్గ శిక్షణము" అని చెప్పవచ్చును.

ఇట్లే మానవునికి బాహ్య పరిస్థితివలన లభించు జ్ఞానమును వ్యవహారములో లభించు అనుభవమును కలుపగా వచ్చిన పదార్థ జ్ఞానమునకు, లేదా భౌతిక జ్ఞానమునకు అతడు 'వ్యవహార శిక్షణ' యను పేరు పెట్టెను.

నిసర్గశిక్షణ వలన పొందిన ఆత్మ వికాసమును బాహ్య వ్యవహార జ్ఞానదృష్టిలో బాహ్య జగత్తునందు ఏ విధముగా ఉపయోగించవలెను. అను విషయమున ఇతర మనుష్యుల ప్రయత్నములకు సంబంధించి వాగ్రూపముగను, సాంప్రదాయకముగను, పాఠశాలాగతముగను అయి లభించు శిక్షణకు అతడు 'వ్యక్తిశిక్షణ' అని పేరిడెను. అనగా అతని దృష్టిలో వ్యక్తిశిక్షణ వ్యవహార శిక్షణకును - నిసర్గ శిక్షణకును నడుమ నుండు లంకె.

వాస్తవముగా చూచినచో రూసో శిక్షణను ఎన్ని విభాగములు చేసెను, అనునది ఒక పెద్ద ప్రశ్నకాదు. ఈ విషయమును ఇన్ని విభాగములు చేయవలెను అను నియమ మెద్దియు లేదు. ఇది యంతయు సౌకర్యముకొర కేర్పడినది. అనగా దృష్టి భేదమువలన వర్గీకరణ మందును భేదము కలుగుట స్వాభావికము. రూసోచే చేయబడిన మూడు విభాగములును తప్పక జరుగవలసినవే అవియును చెప్పజాలము. ఏల యన వ్యక్తి శిక్షణయేమి, వ్యవహార శిక్షణయేమి, రెండును మానవునికి వెలుపలినుండి లభించునవే; కేవలము నిసర్గ శిక్షణ మాత్రమే లోపలి నుండి లభించునది అని చెప్పవలసి యుండును. ఈ దృష్టితో అంతశ్శిక్షణ, బాహ్యశిక్షణ అని రెండు విభాగములు చేయుటలో ఏమి హాని కలదు ? కాని ఇంకను కొంచెము ముందుకు పోయి బాహ్యశిక్షణ అభావాత్మకమును, అంతః శిక్షణ భావాత్మకమును కావున అంతశ్శిక్షణ ఒక్కటియే శిక్షణకు నిజమైన తాత్వికమైన విభాగము కాగలదు అని కూడ చెప్పవచ్చును.

## బాహ్యశిక్షణ యొక్క అఖండ ప్రవాహము

పైన తెలిపిన బాహ్యశిక్షణ మానవుల నుండియు పాఠశాలల నుండియు మాత్రమే లభించునని చెప్పరాదు. వాస్తవమునకు ఈ అనంత విశ్వమందలి ప్రతి పదార్థము నుండియు ఆ శిక్షణ మానవునికి ఎడతెగకుండ లభించుచునే యున్నది. అందెప్పుడును ఆటంకము కలుగుటయే లేదు. షేక్స్పియర్ చెప్పినట్లు జలజలపారు సెలయేటిలో ప్రసాదపూర్ణమగు గ్రంథములు ఇమిడి యున్నవి. పాషాణములలో దర్శన శాస్త్రములు దాగియున్నవి. అన్ని పదార్థముల యందును శిక్షణయొక్క సమస్త తత్వములు నిండి నిబిడీకృతమై యున్నవి. వృక్షములు, వనస్పతులు, పుష్పములు, నదులు, పర్వతములు, ఆకాశము, నక్షత్రములు-అన్నియు తమతమ ప్రత్యేక పద్ధతిలో మనుష్యునికి శిక్షణ ఇచ్చుచునే యున్నవి.

నైయాయికుల అణువు మొదలు సాంఖ్యుల మహత్తత్వము వరకు, రేఖాగణిత మందలి బిందువు మొదలు భూగోళ మందలి సింధువువరకు, చిన్న పిల్లల భాషలో చెప్పవలెనన్న "రాముని శిఖ మొదలు తులసి వేరు వరకు" [1] చిన్నవియు పెద్దవియు అగు సమస్త పదార్థములును మానవునికి గురువులు. విజ్ఞానశాస్త్ర పండితుల దూరదర్శన యంత్రములలోను, వ్యవహార విశారదుల చర్మ చక్షువుల యందును, కల్పనాకుశలులగు కవుల దివ్య చక్షువులందును, లేదా తార్కిక తత్వవేత్తల జ్ఞాననేత్రము లందును ప్రతిభాసించు నట్టియు, ప్రతిభాసింప నట్టియు సమస్త పదార్థ ముల నుండియు మనకు నిత్యమును శిక్షణ లభించుచునే యున్నది. ఈ విశాలసృష్టి అందరి శిక్షణ కొరకు పరమేశ్వరునిచే మన యెదుట తెరచి యుంచబడిన శాశ్వతము, దివ్యము, ఆశ్చర్యమయము, పరమ పవిత్రము అయిన ఒక గ్రంథము. దాని యెదుట వేదములు వ్యర్థములు; కురాన్ నిరర్థకము, బైబిలు బలహీనము.

## బాహ్యశిక్షణ అభావాత్మక కార్యము

కాని ఈ గ్రంథరూపమైన గంగానది ఎంత లోతుగా నున్నను మానవుడు అందలి నీటిని తన పాత్రము పట్టునంత మాత్రమే ముంచు కొనగలడు. కనుక ఈ విశ్వమునుండి దేనియొక్క బీజములు ఎన్నెసి మన 'లోపల' నిహితములై యుండునో ఆ శిక్షణయే, అంత మాత్రమే మనకు బాహ్య జగత్తునుండి లభించును. ప్రతి యొక్కని అనుభవము ఇదే. మనము ఇన్ని విషయములు నేర్చుకొను చున్నాము; ఇన్ని గ్రంథ ములు చదువుచున్నాము; ఇన్ని అభిప్రాయములు వినుచున్నాము; ఇన్ని పదార్థములు చూచుచున్నాము. వీనిలో ఎన్ని మనస్సున నిల్చుచున్నవి?

---

(1) మహారాష్ట్ర దేశములో పిల్లలు ఒట్టు పెట్టుకొను నప్పుడు, ఒకరితో నొకరు కలహించు కొనునప్పుడు ఇట్టి మాటలను తరచుగా ఉపయోగించుట కాననగును.

సారాంశ మేమనగా మనము ఈ బాహ్యజగత్తునుండి నేర్చుకొనిన దంతయు మఱచి పోవుచున్నాము. దాని స్థానమున దాని సంస్కారము మాత్రము మిగులు చున్నది. ఇంతయేల, శిక్షణ అనగా తెలిసికొనుట అనునది నశించి సంస్కారములు మిగులుట అని అర్థము. ఇట్లగుటకు కారణము మన "లోపల" లేనిది "బయట" నుండి లభించుట అసంభవ మగుటయే అని పైననే తెలుపబడినది. ఈ విధముగా బాహ్యశిక్షణ ఒక స్వతంత్రమైన తాత్త్విక పదార్థముకాక కేవలము అభావాత్మకకార్యమని స్పష్టపడుచున్నది.

## సనాతన వాదము

ఇక ఇటువంటిచోట్ల నెప్పుడును ఇటు అటు తేలని సమస్య ఒకటి తయారగు చుండుట సహజము. బాహ్యశిక్షణ మిథ్య అని చెప్పిన పక్షమున సంస్కారములు తయారగుటకుకూడ కొన్ని బాహ్య నిమిత్తములు, ఆలంబనములు లేక ఆధారములు కావలెను గదా! అట్లుగాక బాహ్యశిక్షణ నిజమైనది, భావాత్మకమైనది అని చెప్పిన పక్షమున పైన తెల్పినట్లు అంతర్వికాసమునుబట్టి కొద్ది భాగము మాత్రమే, అదికూడ సంస్కార రూపముగనే మిగులును. అనగా రెండు పక్షములందును విప్రతిపత్తి (Dilemma - పరస్పర విరోధము) కలుగు చున్నది. ఇట్టి స్థితిలో చివరకు ఈ రెండు శిక్షణలకు పరస్పరము ఎట్టి సంబంధము చెప్ప వలెను ? అను ప్రశ్న బయలుదేరుచున్నది.

కాని ఈ వాదము క్రొత్తదికాదు. కావుననే దాని సిద్ధాంతముకూడ క్రొత్తదికాదు. అన్ని శాస్త్రములందును ఇట్టి వాదములు బయలుదేరుచునే యున్నవి. అన్ని యెడలను వాని సిద్ధాంతముకూడ ఒకటిగనే తేలు చున్నది. ఉదాహరణము నిమిత్తము సుఖమునకు బాహ్య పదార్థములతో ఏమి సంబంధము ? అను వేదాంతుల వాదమును తీసికొనుడు. ఇచ్చటను ఇదియే సమస్య. సుఖము బాహ్య పదార్థములందు ఉన్నదని చెప్పినచో

వానివలన ఎప్పుడును సుఖమే కలుగవలెను. కాని అట్లు కలుగుటలేదు. మనస్సు సరిగా లేనపుడు, ఇతర సమయములలో సుఖకరముగ కన్పించు పదార్థములే సుఖము నీయజాలకున్నవి. దీనికి విపరీతముగ "బాహ్య పదార్థములలో సుఖములేదు, సుఖము ఒక మానసిక భావన" అని చెప్పినచో అట్లు నిత్యము అనుభములోనికి వచ్చుటలేదు. షేక్స్పియర్ చెప్పినట్లు కోరికయే గుఱ్ఱము కాగలిగినచో ప్రతి వ్యక్తియు గుఱ్ఱపు రౌతు కావచ్చును. కాని అట్లగుటలేదు అనునది ప్రత్యక్ష సత్యము. ఇక ఈ ప్రశ్న ఎట్లు పరిష్కారమగును ?

ఇక్కడే న్యాయశాస్త్ర మందలి ఒక ఉదాహరణము తీసికొనుడు. "మట్టికి, కుండకు ఏమి సంబంధము ?" — ఇది ప్రశ్న 'మట్టియే కుండ' అన్నపక్షమున మట్టితో నీరు తెండు ! కాక మట్టి వేఱు వస్తువు. కుండ వేఱు వస్తువు అన్న పక్షమున మామట్టిమాకు ఇచ్చి మీ కుండ మీరు తీసికొనుడు ! ఇట్టి స్థితిలో చివరకు రెండింటి సంబంధమేమి ? అను ప్రశ్న బయలుదేరును. ఎట్టి సంబంధమో మేము చెప్పజాలము అని స్పష్టముగ చెప్పుదుమా అందు మన అజ్ఞానమే కనిపించును. కావున ఈ సంబంధమునకు 'అనిర్వచనీయ సంబంధము' అనునది శ్రేష్ఠము, ప్రశస్తము అయిన సంస్కృతనామము. కాని ఈ సంబంధము అనిర్వచనీయమైనప్పటికిని ఒక పక్షములో "వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవసత్యమ్" అనగా 'మట్టి వాస్తవము, కుండ మిధ్య' అని తారతమ్యముచే నిర్ణయము చేసినట్లే, రెండవ పక్షములో అంత శ్శిక్షణ భావరూపకార్యము, బాహ్యశిక్షణ అభావ రూపకార్యము అని చెప్పవచ్చును.

## బాహ్య శిక్షణయొక్క 'భావము' అల్పము.

కాని ఇట్లు చెప్పినమీదట మొదటికే మోసముతెచ్చు ప్రశ్న ఇంకొకటి బయలుదేరుచున్నది. మనము శిక్షణను రెండు విభాగములు చేసి

తిమి. వానిలో అంతశ్శిక్షణ లేదా ఆత్మవికాసము భావరూప మైనప్పటి కిని అది ప్రతివ్యక్తికి లోలోపలనే యుండును. దాని విషయమున మన మేమియు చేయజాలము. దాని కేవిధమైన పాఠ్యక్రమము తయారుచేయ వీలులేదు. తయారు చేసినను దానిప్రకారము కార్యమును నడపుట సంభవముకాదు. బాహ్యశిక్షణ సామాన్యముగను, వ్యక్తిశిక్షణ విశేషముగను అభావ రూపములని నిశ్చయింప బడినది. ఇట్టిస్థితిలో "నహిశశక విషాణం కోపి కస్మై దదాతి"—కుందేటి కొమ్మును ఎవడును, ఎప్పుడును, ఎవనికిని ఈయజాలడు - అన్నట్లు శిక్షణ విషయమై చేయబడు ఆందోళన యంతయు మూర్ఖతా ప్రదర్శనమనియే చెప్పవలసి యుండునా అను ప్రశ్న బయలుదేరుచున్నది.

పైకి ఈ ఆక్షేపణము తిరుగులేనిదిగ కన్పించినను నిజమున కట్లుకాదు. ఏలయన బాహ్యశిక్షణ అభావాత్మకమని చెప్పునప్పుడు మేము అది కార్యమేకాదని చెప్పుటలేదు. నిజమున కది కార్యము, ఉపయుక్తమగు కార్యము. కాని అది అభావాత్మకమగు కార్యము. ఇదియే మేము చెప్పదలచుకొనిన విషయము. శిక్షణద్వారా స్వతంత్రమగు తత్వమేదియు పుట్టింపబడదు. నిద్రించుచున్న తత్వములను మేల్కొలుపుట మాత్రమే జరుగును అన్న పక్షమున ప్రజలు శిక్షణయొక్క ఉపయోగమును ఏవిధముగ అర్థము చేసికొనుచున్నారో ఆవిధమైన ఉపయోగము కలుగుటలేదని చెప్పవలసి యుండును. కాని ఇంతమాత్రముచే శిక్షణ నిరుపయోగి కాజాలదు. తీవ్రసంఘ సంస్కరణవాదుల విధవా వివాహోద్యమమునకు సమాజ శిక్షకుడైన కార్వేయొక్క "విధవా వివాహ ప్రతిబంధ నివారణము" నిరుపయోగముగ కన్పించి నప్పటికిని, వాస్తవమున కది ఉపయోగ కరమైనదే అను విషయమును కాదనుటకు వీలులేదు. శిక్షణ ఉద్రేకింపచేయు మందుకాక ప్రతిబంధములను నివారించు ఉపాయమని సారాంశము.

రస్కిన్ శిల్పకళనుగూర్చి కూడ ఇట్టివ్యాఖ్యానమే చేసియున్నాడు. శిల్పిపని రాతిచేగాని మట్టిచేగాని విగ్రహమును క్రొత్తగా పుట్టించుటకాదు. అది అందే సిద్ధముగ నున్నది. కేవలము దాగియున్నది. దానిని వెలికి తీయుటయే శిల్పకారునిపని. ఈవిధముగ శిక్షణ అభావాత్మక మైనప్పటి కిని ఉపయుక్త మైనదనియు ప్రతిబంధ నివారణ మూలముగనైనను దానికి కొంత భావాత్మకత్వము కూడ లభించినదనియు స్పష్టముగ కన్పించుచున్నది. ఈ విషయమును ధ్యానమం దుంచుకొనియే శిక్షణ "తారతమ్యముచే అభావాత్మకము" అని జాగరూకమైన భాషలో పైన చెప్పబడినది. "ఆత్మ వికాసార్థముల్ శిక్షణ అభావాత్మకము, అనగా దానిభావము చాలఅల్పము".

## మూర్ఖత్వముతో నిండిన పద్ధతి

కాని మనము శిక్షణయొక్క భావమును అపరిమితముగ పెంచి వేయుటచే నేటి మన శిక్షణపద్ధతి మిక్కిలి అస్వాభావికము, విపరీతము, హాస్యాస్పదముఅయినది. పిల్లవాని స్మరణశక్తి చురుకుగ కనపడినచాలు, వానిని సాధ్యమైనంత ఎక్కువ చదువు చదువుటకు ప్రోత్సహించు చున్నాము. అప్పుడు ఈ పిల్లవాని మెదడులో ఎంతచదువు ప్రవేశ పెట్ట వలెను, ఎంతకాదు. అనునదే వానితంత్రి ఆలోచన. పాఠశాలా శిక్షణ పద్ధతిలోకూడ ఇదేవిధానము అవలంబింప బడుచున్నది. దీనికి విపరీత ముగ శిష్యుడు మందబుద్ధియైనచో అతనిని బుద్ధిపూర్వకముగనే ఉపే క్షించుట జరుగుచున్నది, బుద్ధిమంతులని చెప్పబడు విద్యార్థులు కాలే జీలో చేరువరకు ఏదోవిధముగ నిలబడుచున్నారు. కాని ఆ తరువాత తరచుగ వారును వెనుకబడుచునే యున్నారు. కాలేజీలో వెనుకపడక పోయినచో ఆ తరువాత వ్యవహారములో వారు శక్తిహీనులుగ తేలు చునే యున్నారు. దీనికి ఒకేఒక కారణము. వారి కోమలమైన బుద్ధిపై నిరర్థకమైన భారము పెట్టుటయే. గుఱ్ఱము చురుకుగలదై సరిగా నడచు

చున్నప్పుడు దానిని అదలింప వలసిన అవసరములేదు. కాని అట్లు చేయక గుఱ్ఱము చురుకైనదే కదాఅని ఇంకను ఒకచురక తగిలింపుడు! దానివలన నేమగును? గుఱ్ఱము రెచ్చిపోయి గోతిలోనికి వెళ్ళిపడును, రౌతునుకూడ పడవేయును. ఈ మూర్ఖత్వముతో నిండిన మోటుపద్ధతి కనీసము జాతీయ పాఠశాలలలో నైనను మానుకొనవలెను.

## శిక్షణ యొక్క రహస్యము

నిజమునకు విద్యార్థియందు, 'నేను విద్య నేర్చుకొను చున్నాను' అను భావము కలిగినదా శిక్షణయొక్క రుచియంతయు పోయినదనియే అనుకొన వలెను. చిన్న పిల్లలకు ఆడుకొనుట ఉత్తమ వ్యాయామమని చెప్పబడు చున్నది. దీని రహస్యముకూడ ఇదియే. ఆడుకొనుటలో వ్యాయామము జరుగుచునే యున్నది, కాని "మేము వ్యాయామము చేయు చున్నాము" అను భావము ఉండదు. ఆడుకొను సమయమున చుట్టు ప్రక్కలనున్న ప్రపంచము లేనట్లుగ భాసించును. బాలురు ఆటలో లీన మయి అద్వైతభావము ననుభవింతురు. దేహస్మృతి యుండదు. ఆకలి, దప్పిక, అలసట, బాధ, ఏదియు తెలియదు. అనగా ఆటకు అర్థము ఆనందము 'లేక' మనోరంజనము అని సారాంశము. అది వ్యాయామ రూపమైన కర్తవ్యముగ రూపొందదు. ఈ సూత్రమునే అన్ని విధము లైన శిక్షణలకును వర్తింప చేయవలెను. 'శిక్షణ ఒక కర్తవ్యము' అను కృత్రిమ భావనకంటె 'శిక్షణ యొక్క అర్థము ఆనందము' అను సహజ మైన ఉత్సాహపూర్ణమైన భావన కలుగవలెను. కాని మన పిల్లలలో నేడిట్టిభావన కన్పించుచున్నదా? "శిక్షణ ఆనందము" అనుమాట అటు వుండనిండు. "శిక్షణ కర్తవ్యము" అను భావనకూడ నేడు తరచు కన్పించుటలేదు. నేటి విద్యార్థులలో బానిసతనపు భావన ఒకటియే వ్యాపించి యున్నది. శిక్షణ అనగా "దండనము," పిల్లవాడు కొంచెము ఉత్సాహవంతుడుగను, స్వతంత్ర ప్రవృత్తి కలవాడుగను కన్పించుటయే

తడవుగ ఇంటిలోనివారు 'ఇక వీనిని పాఠశాలలో బంధించవలె' నని చెప్పుదురు. పాఠశాల అననేమి ? 'బంధనాగారము' అనగా ఈ పవిత్ర కార్యములో చేయూతనిచ్చు ఉపాధ్యాయులు ఈ సెంట్రల్ జైలుకు చిన్న - పెద్ద అధికారులన్నమాట.

## శిక్షణ కార్యము

కాని ఈతప్పు ఎవరిది ? శిక్షణను గురించి మన అభిప్రాయములు, వాని ప్రకారము మన మవలంబించిన పద్ధతి, లేదా ఏ పద్ధతియు లేక పోవుట అనువానిదే ఈ దోషము, విద్యార్థియొక్క శిక్షణ తెలియకుండగను సహజముగను జరుగవలయును. చిన్న తనమున బాలుడు తన మాతృభాషను ఎట్టి సహజపద్ధతిలో నేర్చుకొనునో అతని తరువాతి శిక్షణకూడ అట్టి సహజ పద్ధతిలోనే జరుగవలయును. చిన్న పిల్లవాడు వ్యాకరణమన నేమో ఎరుగడు. కాని వాడెప్పుడును "అమ్మ వచ్చినాడు" అని అనడు. అనగా వానికి వ్యాకరణము తెలియునన్నమాట. వానికి వ్యాకరణమను శబ్దము తెలియకపోయినను వ్యాకరణ పరిభాష అర్థము కాకపోయినను వ్యాకరణముయొక్క ముఖ్య కార్యము మాత్రము నెరవేరినది.

సాధ్య సాధనములలో అస్తవ్యస్తత కలుగరాదని జ్ఞాపక ముంచుకొనవలెను. సాధ్యము కొరకే సాధనములు ఉన్నవి. కాని సాధనముల కొరకు సాధ్యములేదు. ఇదియే తర్కబద్ధమైన మాట. కాకున్న గౌతముని న్యాయసూత్రములు కాని, అరిస్టాటిల్ తర్కశాస్త్రమునుగాని ఎందుకు చదువుదుము ? సక్రమమైన ఆలోచనచేసి దోషరహితమైన అనుమానమును నిర్ణయింపగల మనియేకదా ? దీపము తగ్గుచున్నదనగనే బాలునికికూడ "బహుశః ఇందు నూనె లేకపోవచ్చును" అని అనుమానము కలుగును. వానిమెదడులో తర్కమంతయు ఉండనే యున్నది.

వాడు పంచావయవ * వాక్యములను లేక "శిలాజిజము"ను రచించి చూపలేడనుట నిజమే, అయినను విద్యార్థులలో తర్కశక్తి మొదటి నుండియు ఉన్నది. ఆ తర్కశక్తికి మాటిమాటికి ఆహారము లభించు అవకాశములను కల్పించుటయే శిక్షణయొక్క పని, అన్ని శాస్త్రములు, అన్ని కళలు, అన్ని సద్గుణములు బీజ రూపములో మానవుని యందు స్వయం సిద్ధములయియే యున్నవి, మన కా బీజము కన్పించదు. అంత మాత్రముచేత బీజమే లేదనరాదు.

## రూసోలోని భావదోషము

కాని చాలచోట్ల రూసోకు ఈ అభిప్రాయము ఇష్టము కానట్లు కన్పించుచున్నది. ఏలయన అత డప్పుడప్పుడు మానవ స్వభావము దుర్బలము, నీతిబాహ్యము అను భావమువచ్చు భాషనుకూడ ప్రయోగించి యున్నాడు. శిక్షణవలన వానిని బలవంతుని, నీతిమంతిని చేయవలెను; మొదట్లో అతడు పశువు, కాని అతనిని మనుష్యునిగా చేయవలసి యున్నది. "పాపోహం పాపకర్మాహం పాపాత్మా పాపసంభవః"-నేను పాపుడను, పాపము చేయువాడను, పాపాత్ముడను, పాపమునుండి పుట్టినవాడను. ఇది వాని పూర్వరూపము; వాని ఉత్తరరూపము శిక్షణ వలన పుట్టవలసి యున్నది. ఇట్టిమాటలు అత డచ్చటచ్చట వ్రాసి యున్నాడు. దీనికి విపరీతమైన వాక్యములుకూడ అతని గ్రంథములో కన్పించక పోవుటలేదు. ఈ హేతువుచే 'అతనిమత మిదియే' అని చెప్పుట కష్టసాధ్యము.

---

* న్యాయశాస్త్రములో ఇతరులకు బోధించుటకు అనుమాన ప్రమాణము కలదు. అందు క్రింద వ్రాయబడిన ఐదు అవయవములు కల వాక్యములు ప్రయోగింపబడును. (1) ప్రతిజ్ఞ (2) హేతువు (3) ఉదాహరణము (4) ఉపనయము (5) నిగమనము. ఎట్లన పొగయున్నది కాన పర్వతమునందు అగ్ని కలదు. పొగ యున్నచోటనెల్ల అగ్ని యుండును, ఉదాహరణము : వంటఇల్లు. ఈ పర్వతము ఎప్పుడును అగ్నిని విడిచి యుండని పొగతో కూడియున్నది. కావున ఈ పర్వతము అగ్నితో కూడి యున్నది.

ఇక అతనిమత మిదే అయినప్పటికిని అందతని తప్పేమియు లేదు. ఆదోషము ఆ సమయమునకు పరిస్థితికి చెందినదని చెప్పుటకు అవకాశము కలదు. స్వతంత్రులైన బుద్ధిమంతులు కూడ "పరిస్థితికి దాసులు" అని పిలువబడక పోయినను, పరిస్థితివలన తయారయిన వారే. రూసో కాలములో ఫ్రాంస్‌స్థితి చాల భయంకరముగ నుండెను. నేడు భారత దేశములో ముప్పదియొక్క కోట్ల జంతువుల భయంకర దృశ్యమెట్లు కన్పడుచున్నదో ఆ సమయమున ఫ్రాంసు స్థితికూడ అట్లే యుండెను. తత్ఫలితముగ రూసోవంటి అగ్నిపర్వత సదృశ తీవ్ర భయంకర విస్ఫోటము కల మానవుని భావనామయమును వికారావేశితము నైనహృదయము మానవజాతిమీది తిరస్కారముతో నిండిపోయినదన్న అది క్షమింపదగినదే. బానిసతనమును చూడగనే అతనికి ఒడలు మండె డిది. రక్తము ఉడికెడిది. మనస్సు వశము తప్పెడిది. ఇట్టిస్థితిలో మానవ జాతియందలి తిరస్కారముచే "మానవుడు ఒక జంతువుగా ఉండి శిక్షణవలన కొంతవరకు మానవు డగుచున్నాడు" అను అభి ప్రాయ మతనికి ఏర్పడినదన్న, దాని అర్థమును మనము చక్కగా తెలిసికొన వచ్చును. కాని రూసోపై మనకెంత సహానుభూతి యున్నను, అతని అభిప్రాయము ఏస్థితియందు, లేదా ఎట్టి స్థితియందు చెప్పబడిన దైనను అది నిస్సందేహముగ అనుచితాభిప్రాయమే.

## మానవుడు స్వభావముచే దుష్టుడుకాడు

మానవుడు స్వభావతః దుష్టుడని తలచుటలో మానవజాతి నంత టిని అవమానించుటయే కాక దీనిలో నిరాశావాదముకూడ కావలసినంత యున్నది. మానవుడు సహజముగనే దుష్టుడైనచో ఎట్టి శిక్షణనూ ఆశింప వలసిన పనియేలేదు. తర్కదృష్టితో చూచిన ఏ వస్తువు నుండియు దాని స్వభావమును శాశ్వతముగ వేరు చేయుట అసంభవము. కావున మానవ స్వభావము సహజముగ చెడ్డదైనయెడల దానినిసంస్కరించు ప్రయత్నము

లన్నియు వ్యర్థములని తేలి నిరాశావాదమును, దానితో బాటు పశు ప్రవత్తియు రాజ్యము చేయుట ప్రారంభించును. ఏలయన శిక్షణమీది ఆశ తీరిపోయినదనుటకు అర్థము దండనీతి యొక్క స్థాపన అగుటయే.

నేటి కాలమున చాలమంది ఆవేశములో "మాకు బ్రిటిష్ ప్రభుత్వముపై విశ్వాసము శాశ్వతముగ నశించినది" అని చెప్పుచున్నారు. అదృష్టవశమున వారి మాటలు కేవలము ఆవేశపూరితములు. అట్లుగాక అవి నిజమే అయినచో శాంతిమయమైన ఏ ఆందోళనయైనను "నిరాశామయమైన కర్మయోగము" అను అర్థములోనికి వచ్చివేసి యుండును. స్వావలంబన దృష్టితో. "ప్రభుత్వము మీద విశ్వాసముంచుట వలన పని జరగదు" అని చెప్పుట సరియైనదే. కాని దీని అర్థము "ఇంగ్లీషువారికి హృదయము లేదు. వారిలో ఎప్పటికిని మార్పు రాజాలదు" అని దృఢ విశ్వాసము కలుగుటయే అయినచో అహింసాత్మక ఆందోళనకు అర్థము, 'కుదరని రోగమునకు చికిత్స' కాగలదు. "ప్రతి మానవునకును ఆత్మ కలదు" అను మూల సిద్ధాంతమే సత్యాగ్రహము, లేక శిక్షణకు ముఖ్యమైన ఆధారము. శత్రువులకు ఆత్మలేదు అను నిశ్చయము కలిగిన తోడనే సత్యాగ్రహము ఏవిధముగ నశించి పోవునో సరిగా నట్లే మనుష్యుడు స్వభావముచే దుష్టుడైనచో శిక్షణ మీద ఆశకూడ చాల భాగము నశించి పోవును. ఇక "బెత్తము చం, చం, అని తగిలిన చదువు ఘం, ఘం, అని వచ్చును" అను వాక్య మొకటియే శిక్షణకు యథార్థ సూత్రముగ తేలును. ఇందుచే ఆలోచనగల తత్వజ్ఞులు, విద్యావేత్తలు మానవుని మనమునందు పూర్ణత్వమునకు కావలసిన అన్ని తత్వములును బీజరూపముగ స్వతస్సిద్ధములై యున్నవని నిస్సందేహాగ నిర్ణయించి వేసిరి.

## సహజ శిక్షణయే నిజమైన శిక్షణ

ఈ శాస్త్రీయ సిద్ధాంతమును అంగీకరించిన మీదట నేటి హాస్యాస్పదమైన శిక్షణ పద్ధతి తప్పని తేలినట్లే "శిక్షణ యొక్క పని సుయో

గ్యుడయిన నాగరికుని తయారు చేయుట" అను నిట్టి ఆత్మ సంభావిత సిద్ధాంతములు కూడ నిరాధారములని తేలుతున్నవి. మానవుని మూర్ఖతాతిశయమును చూడుడు. మనము పిల్లలకు ఏదో కొంత శిక్షణ యిచ్చుచున్నాము. పిల్లల మనస్సులో ఏ విషయమైనను చక్కగ నాటుకొనును. మనము ఆ నాటుకొనుటకును, మన శిక్షణకును ముడిపెట్టి "అస్మాకమేవ అయం విజయః" — ఈ విజయము మాదే, "అస్మాకమేవ అయం మహిమా" — ఈ గొప్పతనము మాదే, అని గంతులు వేయుచున్నాము. విద్యార్థులలో "మనము శిక్షణ పొందుచున్నాము" అను భావనయే కలుగనట్టిదిగా శిక్షణ పద్ధతి ఉండవలెనని వెనుకనే చెప్పబడినది. అట్లు జరుగవలెనన్న దానితోపాటు ఉపాధ్యాయుని మనము నందుకూడ 'నేను శిష్యులకు శిక్షణ ఇచ్చుచున్నాను' అను గురుత్వభావన అస్పష్టముగనైన నుండరాదు. గురువు స్వయముగ అనన్య సహజ శిక్షకుడు కానిదే విద్యార్థులకు సహజ శిక్షణ లభింపజాలదు. విద్యార్థులతో ఎవరైన "మేము ఫ్రోబెల్, పౌస్టాలజీ లేక మాంటెసరి పద్ధతిపై శిక్షణ ఇచ్చుచున్నాము" అని చెప్పినచో మీరు అది కేవలము వాక్పరిశ్రమ, శబ్దశిక్షణ, ఏదో పద్ధతిని అర్థము లేకుండ అనుకరించుట, కేవలము శవప్రాయము, అందు ప్రాణములేదు అని చక్కగ తెలిసికొనవచ్చును. శిక్షణ అనగా బీజగణితము యొక్క ఒకానొక ఫార్ములా (సూత్రము) కాదు, దానిని జోడింపగనే సమాధానము తయారగుటకు; నేడివ్వబడు శిక్షణ శిక్షణయే కాదు, దానినిచ్చు నేటి పద్ధతి నిజమైన పద్ధతియుకాదు, "సహజముగ బయటకు పొంగివచ్చు లోపలి భావసంచార మేదికలదో" అదియే శిక్షణ.

## శిక్షణయొక్క అనిర్వచనీయ స్వరూపము

ఈ సహజశిక్షణ, 'సదోషమపి'—దోషముతో కూడిన దైనప్పటికిని—సాగవచ్చును. కాని ఒక ప్రత్యేక పద్ధతితో బానిసలద్వారా క్రమబద్ధ విధానముపై లభించు అజ్ఞానము ఎంతమాత్రమును పనికిరాదు.

ఏలయన, చివరకు శాస్త్రమన నేమి? శాస్త్రమునకు అర్థము "క్రమబద్ధమైన అజ్ఞానము." ఇంతకంటె శాస్త్రమునకు ఇంకే అర్థమైన నున్నదా? శిక్షణశాస్త్ర పండితుడయిన స్పెన్సర్ శిక్షణ శాస్త్రమును గురించి వ్రాయుచు "శిక్షణవలన అలౌకిక వ్యక్తులు తయారు చేయబడరు" అని వ్రాసియున్నాడు. ఇక ఇట్టి శాస్త్రములకు శాస్త్రదృష్టిచే ఎంతవిలువ ఈయవచ్చును? నిజమునకు శాస్త్రముయొక్క ప్రతిజ్ఞ ఇట్లుండవలెను.- "ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్, కృతకృత్యశ్చ భారత"—అర్జునా! ఇది తెలిసికొని బుద్ధిమంతుడవు, కృతకృత్యుడవు కాగలవు. ఏశాస్త్రమిట్టి ప్రతిజ్ఞ చేయజాలదో అది స్పష్టముగ ప్రజల కన్నులలో దుమ్ముజల్లుట కేర్పడిన చక్కని ఏర్పాటగును. షేక్స్పియరు ఏ నాట్యశాస్త్రమును చదువుకొనెను? ఎవడైనను ఎప్పుడైనను అలంకారశాస్త్ర నియమములను పల్లించి ప్రతిభావంతుడగు కవిగా గాని కావ్యరసికుడుగా గాని అయ్యెనా? "శాస్త్రము" "పద్ధతి" అనువానికి శబ్దసృష్టికంటె మించిన ప్రయోజనం, గొప్పతనం ఏదీ లేదు. ఇది కేవలము భ్రమ. "యాస్తేషాం స్వైరకథాః తా ఏవ భవన్తి శాస్త్రాణి"—శ్రేష్ఠపురుషులు స్వేచ్ఛగా చెప్పు కొన్న కథలే శాస్త్రము లను ఈ భర్తృహరి వాక్యముచాల సారగర్భితమైనది. ఈ ప్రసంగములో అదియే నిజమైన అర్థములో సరిపోవును.

"ఏపద్ధతి లేకుండగనే ఒకపద్ధతితో కూడినట్లు క్రమబద్ధమైయుండునది; ఏ గురువును ఇవ్వజాలనిది, కాని ఇవ్వబడునది, ఇదియే శిక్షణయొక్క అనిర్వచనీయ స్వరూపము. ఇందుచేతనే దివ్యదృష్టిగల మహాత్ములు శిక్షణ ఎట్లు ఈయవలెను? అను విషయమున అది మాకు తెలియదు— "నవిజానీమః" (కేనోపనిషత్తు) అని పలికిరి. శిక్షణ పద్ధతి, పాఠ్యక్రమము, సమయపట్టిక — ఇవన్నియు అర్థములేని శబ్దములు, వీనిలో ఆత్మవంచనతప్ప ఇంకేమియులేదు. జీవన విధానములోనే శిక్షణ లభింపవలెను. జీవన విధానముకంటె వేరుగ శిక్షణమను పేరుగల ఒక స్వతంత్రమగుపని తయారయినచో ఏదైన విజాతీయ

పదార్థము శరీరములో ప్రవేశించునపుడు కలుగు దుష్పరిణామము వలెనే శిక్షణవలన కూడ మనస్సుపై విషపూర్ణమును, రోగయుక్తమునైన పరిణామము కలుగును. కర్మ అను కసరత్తు చేయనిదే జ్ఞానమను ఆకలి పుట్టదు. అట్టిస్థితిలో విజాతీయ రూపముతో లోపలకు బలవంతముగ ప్రవేశించిన జ్ఞానమును దాచుకొనుశక్తి పచనేంద్రియముల కుండదు. కేవలము పుస్తకములను మెదడులోని కెక్కించుట వలననే మానవుడు జ్ఞాని కాగలిగినచో లైబ్రరీలోని బీరువాలన్నియు జ్ఞానులు కావలసినదే. బలవంతముగ లోపలకు త్రోయబడిన జ్ఞానము అరగక పోవుటచే "బుద్ధికి అతిసారము" ప్రారంభమై మానవునికి నైతికమృత్యువుకల్గును.

## నివృత్త శిక్షణకు వ్యాఖ్యానము

విద్యార్థుల శిక్షణకు ఏసూత్రము వర్తించునో, అదియే లోకశిక్షణకు, లేదా లోకసంగ్రహమునకు కూడ వర్తించును. మహాపురుషుల దృష్టిలో సమాజము చిన్నశిశువు. భీష్మాచార్యుడు ఆమరణము బ్రహ్మచారిగ నుండెను. పుత్రులు లేనివారికి సద్గతిలేదని చెప్పుచున్నారుగదా! భీష్మాచార్యునికి సద్గతి ఎట్లుకలుగును? అను ఒకపెద్ద శంక పుట్టగనే దానికి సమాధానము భీష్మాచార్యుడు సమాజమున కంతటికి తండ్రివంటివాడు కావున మనమందరము ఆయన పుత్రులము అని చెప్పబడెను. కావున లోకసంగ్రహమను ప్రశ్నకు అర్థము మహాపురుషుల దృష్టిలో చిన్నపిల్లలకు శిక్షణ ఇచ్చు ప్రశ్నయే. కాని నేడు శిక్షణ సంబంధమగు ప్రశ్నవలెనే లోకసంగ్రహమును కూడ ఒకపెద్ద బూచిగా తయారుచేసి దానిబాధ్యత జ్ఞానులదే అనునట్టి సంప్రదాయమొకటి బయలుదేరినది.

నిజమునకు లోక సంగ్రహము ఏ విశేషవ్యక్తి పయినను ఆధారపడి లేదు. "లోక సంగ్రహము నామీద ఆధారపడి యున్నది" అని అనుకొనుట లకుముకి పిట్ట తనకాలు పైకెత్తి నా మీదనే ఆకాశము నిల్చియున్నదని తలచి నట్లుండును. "కర్తాహం" నేను కర్తను, అనుట

అజ్ఞానమునకు లక్షణము కాని జ్ఞానమునకు కాదు. ఇంత యేల "కర్తాహం" అను భావన ఎచ్చట బయలుదేరినదో అచట నిజమైన కర్తృత్వము ఉండుటకే వీలులేదు. శిక్షణ వలెనే లోక సంగ్రహముకూడ అభావాత్మకము, లేదా ప్రతిబంధ నివారణాత్మకము అయిన పని. ఈ హేతువు చేతనే శ్రీ శంకరాచార్యులవారు "లోకస్యఉన్మార్గ ప్రవృత్తి నివారణం లోకసంగ్రహః" — ప్రజల యొక్క చెడుమార్గమున బోవు ప్రవృత్తిని మళ్ళించుటయే లోక సంగ్రహము, అని లోక సంగ్రహము యొక్క నివర్తక స్వరూపమును చూపి యున్నారు.

నిజ మేమన నిజమైన శిక్షకుడు శిక్షణ ఈయకుండగనే అతని యొద్దనుండి స్వయముగ శిక్షణ లభించునట్లు, జ్ఞానికూడ స్వయముగ లోక సంగ్రహమును చేయడు; అతని చేతులతో అది అప్రయత్నముగ జరిగిపోవు చుండును. సూర్యుడు తనంతట తా నెవరికిని ప్రకాశమును ఈయడు; అతనినుండి సహజముగనే అందరకు ప్రకాశము లభించు చుండును. ఈ అభావాత్మక కర్మయోగమునే గీత "సహజకర్మ" అని చెప్పినది. మనువు ఈ సహజకర్మకు "నివృత్త కర్మ" అను మిక్కిలి అందమైన పేరు పెట్టెను. "నివృత్త శిక్షణ" కూడ ఈ విధముగ ఏర్ప డిన సంజ్ఞయే, ఈ విధమైన నివృత్తి శిక్షణ ఇచ్చు ఆచార్యుడే సమాజము నకు గురువు. ఇతడే సమాజమునకు తండ్రి, తక్కిన జీతము పుచ్చు కొను గురువులు గురువులును కారు, జన్మనిచ్చిన తండ్రులు తండ్రులును కారు. ఇట్టి గురువు చరణముల యొద్ద కూర్చుండి శిక్షణ పొందినవారే "మాతృమాన్, పితృమాన్, ఆచార్యవాన్" అను గౌరమునకు పాత్రులు. తక్కిన వారందరు అనాధ బాలకులవంటి వారు; అశిక్షితులు, ఇట్టి ఉదార శిక్షణపొందు అదృష్టము ఎందరకు పట్టుచున్నది ? *

[మహారాష్ట్ర ధర్మ 4-వ సంచిక. జనవరి 1923]

---

*ఫ్రెంచి గ్రంథకారుడైన రూసో యొక్క 'ఎమిలీ' అను పేరుగల శిక్షణ శాస్త్ర గ్రంథముపై ఒక సభలో అధ్యక్ష పీఠమునుండి వెలువర్చబడిన భావములు.

2

## : 2 : కేవల శిక్షణము

"ఏమండీ ! మీ రేపని బాగుగ చేయగలమని తలచు చున్నారు" అని ఒక దేశసేవాభిలాషిని ఒకరు ప్రశ్నించిరి.

"నేను కేవలము శిక్షణ కార్యమును చేయగలనని తలచు చున్నాను, అందు నాకు ఆసక్తి కూడ కలదు." అని యువకుడగు ఆ గృహస్థు జవాబిచ్చెను.

"ఇది బాగుగనే యున్నది. ఏలన తరచుగ చేతనైన విషయము నందు తప్పనిసరిగ ఆసక్తి ఉండియే తీరును. కాని ఇంకేదైనపని మీరు చేయగలరా, లేరా ? చెప్పండి."

"లేదండి, నా కింకేపని చేయుటరాదు: కేవలము బోధింపగలను. ఆపని బాగుగ చేయగలనను విశ్వాసముకూడ కలదు."

"అవునవును. బాగుగ నేర్పుటలో సందేహ మేమున్నది ? కాని బాగుగ దేనిని నేర్పగలరు ? వడుకుటా, పింజుటా, నేయుటా, బాగుగ నేర్ప గలుగునది ?"

"కాదు, అవి నేర్పుటరాదు."

"అయిన కుట్టుట, రంగులు వేయుట, వడ్రంగమా ?"

"కాదు. ఇవేవియు కాదు"

"వంట చేయుట, పిండి విసరుట మున్నగు గృహకృత్యములు నేర్పగలరా ?"

"కాదు, పనిపేరుచెప్పి నే నేదియు చేయనేలేదు. నేను కేవలము శిక్షణ........"

"అన్నా! అడిగినవాని కన్నిటికి లేదు లేదుఅని చెప్పుదురు. 'కేవలము' శిక్షణకార్యము చేయగలనని చెప్పుదురు. దీని కర్థమేమి? తోట పని నేర్పగలరా ?"

"ఇంకేమి అడిగెదరండీ! నేను మొదటనే చెప్పితినికదా! నాకింకేపనియు చేయుటరాదని. నేను సాహిత్యము నేర్పగలను" అని దేశసేవాభిలాషి కొంచెము చిరాకుతో పల్కెను.

"బాగుగ చెప్పితిరి. ఇప్పుడు కొంచె మర్థమయినది. తులసీ రామాయణమువంటి గ్రంథము ఎట్లు వ్రాయవలెనో చెప్పగలరా?" అని పృచ్ఛకుడు కొంచెము పరిహాసముగ నడిగెను. దానితో ఆ దేశసేవాభిలాషి ఒడలుమండి ఏదో వంకరమాట అనబోవునంతలో పృచ్ఛక మహాశయుడు మధ్యలోనే "శాంతి, క్షమ, తితిక్ష - వీనిని సాధించుటెట్లో నేర్పగలరా?" అని అడిగెను.

దానితో భ్రుతిమించినది. నిప్పుమీద కిరసనాయలు పోసినట్లయినది. అంత నాసంవాద మొకమంట మండెడిదే కాని పృచ్ఛకుడు దానిని ఇట్లు నీళ్ళుపోసి ఆర్పివేసెను.

"మీరుచెప్పినది నాకర్థమైనది. మీరువ్రాయుట, చదువుట మున్నగునవి నేర్పగలరు. వీనివలన కూడ జీవితమునకు కొంచెము ఉపయోగము కలదు. బొత్తిగ లేదని చెప్పుటకు వీలులేదు. మంచిది. కాని మీరు నేతపని నేర్చుకొనుటకు సిద్ధముగ నున్నారా?"

"ఇప్పుడు క్రొత్తదేదియు నేర్చుకొన వలెనని సరదాలేదు, అందుసు నేతపని నాకు రానేరాదు. ఏలన నేటివరకు నాచేతి కట్టి అలవాటే లేదు."

"కానిండు. అట్లయిన నేర్చుకొనుటకు కొంచెము ఎక్కువకాలము పట్టును. కాని రానే రాదననేల?"

"నాకు రానేరాదని తోచుచున్నది. ఒకవేళ ఎక్కువ శ్రమ పడిన మీదట వచ్చుననుకొన్నను, నాకదేదో గొడవగ నున్నది. ఇందుచే అది నావల్ల అగునది కాదనియే ఎంచుడు?"

"మంచిది, వ్రాతపని నేర్పగలిగినట్లే, మీరే వ్రాతపనిగూడ చేయగలరా?"

"ఆ! చేయగలను, చెప్పండి. కాని అదేపనిగ వ్రాయుచు కూర్చుండుమనుచో అదికూడ చిరాకుపనియే! అయినను, దానిని చేయుటకు అడ్డులేదు."

ఈ సంభాషణ ఇచ్చటనే ఆగిపోయెను. దాని తరువాత ఏమి జరిగెనో తెలిసికొన వలసిన అవసరము మనకు లేదు.

శిక్షకుల మనస్తత్వ మెట్లుండునో తెలిసికొనుటకు పై సంభాషణ చాలును.

## నేటి శిక్షకుని స్వరూపము

నేటి శిక్షకుడనగా—

(1) ఏవిధమైన జీవితమునకూ ఉపయోగించు పనిని చేయలేనివాడు (2) క్రొత్తపనిని నేర్చుకొనుటకు స్వాభావికముగనే అసమర్థుడైనవాడు, పని చేయుట అన శాశ్వతముగ విసుగు పొందినవాడు, (3) "కేవల శిక్షణ" యొక్క అహంభావము కలవాడు. (4) పుస్తకములలో పాతుకు పోయినవాడు (5) సోమరిపోతు, అని అర్థము వచ్చుచున్నది.

"కేవల శిక్షణ" అనగా జీవితమునుండి వేరుచేయునట్టి 'మృత శిక్షణ', శిక్షకుడనగా "జీవన్మృతుడు".

## బుద్ధిజీవికి జీవన్మృతునికి భేదము

ఈ జీవన్మృతుడనే కొందరు "బుద్ధిజీవి" అందురు. కాని ఇది వాగ్వ్యభిచారము. బుద్ధిజీవి ఎవ్వరు? గౌతమబుద్ధుడు, సోక్రటీసు, శంకరాచార్యుడు, జ్ఞానేశ్వరుడు ఇటువంటి వారెవరో ఒకరిద్దరు బుద్ధి జీవనమగు జ్యోతిని వెలిగించి చూపుచున్నారు. బుద్ధిగ్రాహ్య జీవనమన అతీంద్రియ జీవనము అని గీతయందు అర్థము చెప్పబడి యున్నది. ఇంద్రియ దాసులును, దేహాసక్తి బద్ధులును బుద్ధిజీవులుకారు. బుద్ధికి పతి ఆత్మ. దానిని విడిచి దేహమునకు దాసియైనబుద్ధి వ్యభిచారి బుద్ధి

యగును. ఇట్టి వ్యభిచారిబుద్ధిచే జీవించుటయన మరణమే. అట్లు జీవించు వాడును జీవన్మృతుడనియే చెప్పవలయును. "కేవల శిక్షణ" పైననే జీవించుప్రాణులు ఈ విశేషార్థముచే జీవన్మృతులు. ఈ కేవల శిక్షణపై జీవించువారికి "మృ (భృ) తకాధ్యాపకులు" అనగా "జీతగాండ్రైన శిక్షకులు" అని పేరుపెట్టి వీరిని శ్రాద్ధకర్మలలో నిషేధించినాడు. ఇది బాగుగనే యున్నది. శ్రాద్ధకర్మలో చేయవలసినపని చనిపోయిన పెద్దలస్మృతి నుజ్జీవింపచేయుట. జీవితమును ప్రత్యక్షముగ చంపి చూపించువారు ఇందెట్లు పనికివత్తురు?

## ఆచార్యు డననేమి?

శిక్షకుని పూర్వులు "ఆచార్యుడు" అని పిల్చిరి. ఆచార్యుడనగా ఆచారవంతుడు. తాను స్వయముగ ఆదర్శజీవన మాచరించుచు దేశముచే అట్లాచరింప చేయువాడు ఆచార్యుడు. ఇట్టి ఆచార్యుల కృషిఫలననే దేశనిర్మాణము జరిగినది. నేడు భారతదేశమున నూతన శకమును ప్రారంభింపవలసి యున్నది. దేశనిర్మాణ కార్యము నేడు మనయెదుట నున్నది. ఆచారవంతులైన శిక్షకులు లేనిదే అది కాజాలదు.

ఇందుచేతనే జాతీయశిక్షణ అనుసమస్య నేటి ప్రధాన సమస్యయై యున్నది. దాని అర్థమును దాని వైశాల్యమును మనము బాగుగ దృష్టి యందుంచుకొనవలెను. దేశమునందలి సుశిక్షితులందరు కాంతిహీనులు, క్రియాహీనులు అయిపోవుచున్నారు. దీని కుపాయము జాతీయ శిక్షణాగ్నిని రగుల్కొల్పుటయే!

## అగ్నికిగల రెండు శక్తులు

కాని ఆ అగ్నియు కావలసియే యున్నది. అగ్నికి రెండు శక్తులున్నట్లు ఎంచబడుచున్నది. (1) "స్వాహా" (2) "స్వధా" ఈ రెండు శక్తు లున్నచోట్ల అగ్నియుండును. 'స్వాహా' అనగా ఆత్మాహుతి

ఇచ్చుట, లేదా ఆత్మత్యాగముయొక్క శక్తి. 'స్వధా' యనగా ఆత్మ ధారణ శక్తి. ఈ రెండుశక్తులును జాతీయ శిక్షణలో మేల్కొనవలెను. ఈశక్తులు మేల్కొన్న యెడలనే అది జాతీయశిక్షణ అనిపించుకొనును. మిగిలినవన్నియు మృతములు, నిర్జీవములు అయిన "కేవల శిక్షణలు."

ఇంతవరకు మన జాతీయశిక్షకులు గొప్ప ఆత్మత్యాగము చేసినట్లు పైపైకి గాన్పించుచున్నది. కాని అది అంత సరియైనదికాదు. కొద్దికొద్దిగ చేయబడిన స్వార్థత్యాగముకాని గర్భితమైన త్యాగముకాని ఆత్మత్యాగ మనిపించుకొనవు. దానికొక ఒరవుడు రాయికూడ కలదు. ఆత్మత్యాగశక్తి ఉన్నచోట ఆత్మధారణశక్తి కూడ నుండును. ఆత్మ ధారణశక్తి లేనియెడల ఎవ్వడైనను త్యాగమెందుకు చేయును? తనకు తాను నిలువబెట్టుకొనలేని ఆత్మ ఎగురగలుగుటెట్లు? అనగా ఆత్మత్యాగ శక్తి అను మాటలోనే ఆత్మధారణకూడ మొదటినుండియు ఇమిడి యున్నది. ఈ ఆత్మధారణశక్తి - స్వధా - జాతీయ శిక్షకులకు ఇంకను అబ్బలేదు. కావున ఆత్మత్యాగము చేసినట్లు భాసించునది పూర్తిగ "ఆభాసమే". మొదట 'స్వధా' యుండవలెను. పిమ్మట 'స్వాహా'. జాతీయ శిక్షణ, లేదా జాతీయశిక్షకులు ఇప్పుడు స్వధా సంపాదనమునకు సిద్ధపడ వలెను.

## జీవిత బాధ్యతను వహింపవలెను.

శిక్షకులు "కేవల శిక్షణ" అను భ్రమాత్మకమైన ఊహను విడిచిపెట్టి స్వతంత్రమైన జీవిత బాధ్యతను - కర్షకులపై నున్న బాధ్యతవంటి దానిని - తమపై వేసికొనవలెను. తమ విద్యార్థులకుకూడ దానిలో బాధ్యతాయుతమైన భాగమిచ్చి వారి చుట్టుప్రక్కలనే శిక్షణ ఏర్పాటులను చేయవలెను. లేదా దానిని స్వాభావికముగనే జరుగనీయ వలెను. "గురోః కర్మాతిశేషేణ" అనుదానికి అర్థము - గురువుగారి పనిని పూర్తిచేసి వేదాభ్యాసము చేయవలయు ననునదే సరియైనది. లేక గురువుగారి

వ్యక్తిగతసేవ అనిమాత్రమే "గురోః కర్మ" అనుదాని అర్థము గ్రహించినచో ఆరీతిని గురువుగారిసేవ ఎంతఉండును? దానికొరకు ఎంతమంది బాలుర కెంతపని యుండును? కాన "గురోః కర్మ" చేయుటయనగా గురువుగారి జీవితమునందలి బాధ్యతలో పాల్గొనుట అనియే అర్థమగును. ఇట్టి బాధ్యతలో పాల్గొని అం దేయేశంక లుత్పన్నమగునో వానినిగూర్చి గురువుగారి నడుగవలెను. గురువుకూడ తన జీవిత బాధ్యతను నిర్వహించుకొనుచు అందే ఒక అంగముగఎంచి వారికి యథాశక్తి సమాధానము లిచ్చుచుండవలెను. ఇది శిక్షణ స్వరూపము.

## శిక్షణకొరకై ఒకటి రెండు గంటలు

ఇందులోకూడ కొంత ప్రత్యేక సమయము ప్రార్థనారూపమైన వేదాభ్యాసము కొరకు ఏర్పాటు చేయవలెను. ప్రతికార్యమును ఈశ్వరోపాసన అనియే చేయవలయును. కాని అట్లు చేయుచునే ప్రాతః సాయం కాలములందు కొంతసమయము "ఉపాసనము కొరకు" ఇవ్వవలెను. ఈన్యాయమే వేదాభ్యాసమునకు లేదా శిక్షణకుకూడ వర్తింప చేయవలెను. అనగా జీవితమునందలి బాధ్యతకు సంబంధించిన పనులే నిత్యకృత్యములో ప్రధాన భాగము కావలెను. ఇవి అన్నియు శిక్షణకు సంబంధించినవనియే ఎంచవలెను. అయినను ప్రత్యేకముగ ఒకటి రెండు గంటలు "శిక్షణ నిమిత్తము" ఇవ్వవలెను.

## ఆదర్శశిక్షకునియొద్ద ఉండుటయే శిక్షణ

జాతీయజీవనము ఎట్లుండవలెను అను ఆదర్శము తన జీవితములో చూపుటయే జాతీయ శిక్షణయొక్క కర్తవ్యము. ఈ కర్తవ్యము పాలించుచుండ శిక్షకుని జీవితమునుండి స్వాభావికముగనే అతని చుట్టుప్రక్కల శిక్షణకిరణములు వ్యాపించును. ఆకిరణముల కాంతిచే చుట్టునున్న వాతావరణమందు తమంతట తామే కార్యములు జరిగిపోవుచుండును.

ఇట్టి శిక్షకుడే స్వతఃసిద్ధశిక్షణ కేంద్రము. అతని సన్నిధిలో నుండుటయే శిక్షణ పొందుట.

మనుష్యుడు పవిత్రజీవనము నడుపు లక్ష్యముతో నుండవలెను. శిక్షణను జాగ్రత్తగా నడుపుటకు అట్టి జీవనమే సమర్థమైనది. దీని కొరకు కేవల "శిక్షణ" పై ఆశ పెట్టుకొనవలసిన ఆవశ్యకత లేదు.

( "మధుకర్" నుండి )



## : 3 : సాక్షరమా? లేక సార్థకమా?

### వ్యాధిగ్రస్తమగు మనస్సు లక్షణములు

ఎవరిఇంటనైన ఎక్కువగ మందుసీసాలు కన్పించినచో బహుశః అతడు రోగియైయుండునని మన మూహింతుము. అట్లే ఎవరిఇంటనైన చాల గ్రంథములు కన్పించినచో మన మతనిని బుద్ధిమంతుడని తలంతుము. ఇది అన్యాయము కాదా? "తప్పని సరిఅయిననేకాని సీసా జోలికి పోకుము" అనునది ఆరోగ్యమునకు మొదటి నియమము. అట్లే సాధ్యమయినంతవరకు గ్రంథములలో కన్నులు పెట్టుకొని కూర్చుండక పోవుట - లేదా కన్నులలో గ్రంథములు పెట్టుకొని కూర్చుండక పోవుట అనుడు - బుద్ధి మత్తకు మొదటి నియమము. మందుసీసాను మనము వ్యాధిగ్రస్తశరీరమునకు చిహ్నముగ తలచుచున్నాము. గ్రంథమునుకూడ - అది ప్రాపంచిక గ్రంథమయిననుసరే, లేక పారమార్థిక గ్రంథమయినను సరే - వ్యాధిగ్రస్తమనస్సునకు చిహ్నముగ తలపవలెను.

### 'సు' కంటె 'అ' మంచిది

శతాబ్దములు గడచిపోయినను నేడుకూడ ప్రపంచమంతట ఎవరి విజ్ఞాన పరిమళము వ్యాపించియున్నదో వారి ధ్యానము జీవితమును సాక్షరము చేసికొనుటకు బదులు సార్థకము చేసికొనుటయందే లగ్నమై యుండెను. సాక్షరజీవితము నిరర్థకము కావచ్చును. దీని కుదాహరణములు ప్రస్తుత సుశిక్షిత సమాజములో వెదుకనక్కర లేకుండగనే లభించును. దీనికి వ్యతిరేకముగ నిరక్షరజీవితముకూడ సార్థకము కావచ్చును. దీనికి అనేకోదాహరణములు చరిత్ర చూపియేయున్నది. చాలమారులు సుశిక్షితులయొక్కయు, అశిక్షితులయొక్కయు జీవితములను పోల్చి

చూడగ "అక్షరాణామకారోఽస్మి" అను గీతావాక్యమున చెప్పబడినట్లు 'సు' కంటె 'అ' యే మెచ్చుకొనదగినదిగా కన్పడుచుండును.

## నిజమైనజ్ఞానము సృష్టియందే కలదు

పుస్తకమునం దక్షరములుండును. కావున పుస్తక సాంగత్యముచే జీవితమును సార్థకపరచుకొన నాశించుట వ్యర్థము. "మాటల కూర, మాటల అన్నముతిని కడుపు నింపుకొనినవా రెవ్వరైన కలరా ?" అను ప్రశ్నలో చాల నర్థము కలదు. ఒక కవి చెప్పినట్లు పుస్తకములోని బావి ముంచదు, పుస్తకములోని నావ దాటించదు. 'అశ్వ'మనగా 'గుఱ్ఱ' మని నిఘంటువులో వ్రాయబడియుండును. 'అశ్వ' శబ్దముయొక్క అర్థము నిఘంటువులో వ్రాయబడియున్నదని పిల్లలు తలంతురు. కాని అది సరికాదు. 'అశ్వ'శబ్దముయొక్క అర్థము నిఘంటువునకు వెలుపల గుఱ్ఱపుసాలలో కట్టబడియున్నది. అది నిఘంటువులో ఇముడుట సంభవముకాదు. 'అశ్వ'మనగా 'గుఱ్ఱము' అను నిఘంటువునందలి వాక్యము 'గుఱ్ఱ'మను శబ్దమునకు ఏది అర్థమో 'అశ్వ' శబ్దమునకును అదేఅర్థము అనిమాత్రము చెప్పును. అది ఏదో గుఱ్ఱపుసాలలోనికిపోయి చూడవలెను. నిఘంటువులో పర్యాయపదములు మాత్ర మీయబడును. పుస్తకములో అర్థముండదు. అర్థము సృష్టిలో నుండును. ఈ విషయము బుద్ధికి తట్టినప్పుడే నిజమైన జ్ఞానమునందు రుచి కలుగును.

## రెండు అక్షరముల సార్థకత

జపవిధానమును కనిపెట్టినవాని ఉద్దేశములలో ఒకటి సాక్షరతకు సంక్షిప్తరూప మిచ్చుట. 'సాక్షరత్వము అదేపనిగా మొరుగుట' చూచి "దాని ముందు జపమను ముక్క ఒకటి పారవైచిన" పాపము దాని మొరుగుడు కట్టుబడుననియు అంతట జీవితమును సార్థకపరచుకొనుట కవకాశము లభించుననియు ఆతని అంతర్గతాభిప్రాయము. వాల్మీకి శత

కోటి రామాయణమును వ్రాసెను. దానిని కొల్లగొనుటకై దేవ దానవ మానవుల మధ్య జగడము ప్రారంభమయ్యెను. జగడము తెగక శంకరుని మధ్యవర్తిగ నెన్నుకొనిరి. ఆయన ముగ్గురకు ముప్పదిమూడేసి కోట్ల శ్లోకముల చొప్పున పంచిపెట్టెను. ఒక కోటి మిగిలెను. మరల ముప్పదిమూడేసి లక్షలు పంచిపెట్టెను. ఒకలక్ష మిగిలెను. ఈ విధముగ పంచుచుపోగా చివరకొక శ్లోకము మిగిలెను. రామాయణమునందలి శ్లోకములు అనుష్టుప్ఛందములో వ్రాయబడెను. అనుష్టుప్ఛందమునకుండు అక్షరములు, ముప్పదిరెండు. శంకరుడందుండి పదేసి అక్షరములు ముగ్గురకు పంచిపెట్టెను. ఇక రెండక్షరములు మిగిలినవి. అవి ఏవి ? "రా-మ" శంకరుడు తాను పంచిపెట్టినందులకు ప్రతిఫలమున ఆ రెండు అక్షరములను తానే తీసికొనెను. శంకరుడు తన సాక్షరత్వమును రెండక్షరములలోపూర్తిచేసికొనెను. అందుచేత నేదేవతలలోకాని, దానవులలో కాని మానవులలోకాని ఎవరునుజ్ఞానమునందు ఆయనతో సమానులు కాలేకపోయిరి. మహాత్ములు కూడ సాహిత్యముయొక్క సారమంతయు రామ నామమందే ఇమిడ్చిపెట్టిరి. కాని, "అభాగ్యా నరా పామరా హేఽకశేనా"- నిర్భాగ్యుడైన ఈ పామర నరునికి ఈ సంగతే తోచదు.

## అక్షరములు వల్లించుట వ్యర్థము

భక్తులు రామాయణమును రెండక్షరములలో సమాప్తముచేసిరి. ఋషులు వేదములను ఒక్క అక్షరములోనే ఇమిడ్చిపెట్టిరి. "సాక్షరుడనుకావలెను అను కోరిక తీరనిచో 'ఓంకార' జపము చేయుము చాలును. ఈమాత్రముచే పని జరుగనిచో చిన్నదైన 'మాండూక్యోపనిషత్తు' చదువుము. ఇంకను వాసనలు వదలనియెడల దశోపనిషత్తులు చూడుము" అను అర్థము గల ఒక వాక్యము ముక్తికోపనిషత్తునందు కలదు. దీని వలన ఋషియొక్క అభిప్రాయము స్పష్టముగ వెల్లడి యగుచున్నది. ఒక అక్షరమైనను జపముచేసియే తీరవలెనని ఋషి చెప్పలేదు. ఒకటి

గాని పెక్కుగాని అక్షరములనువల్లించుటలో జీవితమునకు సార్థకతలేదు. వేదములయొక్క అక్షరములు గ్రంథములో లభించును. వాని అర్థమును జీవితమునందు వెదుకవలెను. సంస్కృతము నేర్చుకొనకుండగనే తమకీ వేదము లర్థమయ్యెనని తుకారాములవారు చెప్పిరి. ఈ మాటను నేటివర కెవ్వరును కాదనలేదు. శంకరాచార్యులవారు ఎనిమిదవ యేటనే వేదాభ్యాసమును పూర్తిచేసిరని ఆశ్చర్యపడి ఒక శిష్యుడు తన గురువు నిట్లడిగెను. "అయ్యా ఎనిమిదేండ్ల వయస్సున ఆచార్యులవారు వేదాభ్యాస మెట్లు పూర్తిచేయగలిగిరి?" గురువు గంభీరభావముతో ఇట్లు సమాధాన మిచ్చెను. "ఆచార్యులవారి బుద్ధి బాల్యమున అంత తీక్షణముగ నుండ లేదుకాబోలు. కావుననే వారికి ఎనిమిదేండ్లు పట్టెను."

## దెబ్బతిను స్వేచ్ఛ

ఒకడు మందులు తినితిని విసిగెను. ఏలయన 'మందు తినిన కొలది రోగము హెచ్చుచొచ్చెను'. చివరి కెవరి ఉపదేశముననో ఆతడు పొలములో పనిచేయుట ప్రారంభించెను. దానివలన రోగముపోయి కొలదిదినములలోనే ఆతడు స్వాస్థ్యమును పొందెను. అనుభవముచే సిద్ధించిన ఈ ఆరోగ్య సాధనను ఆతడు ఇతరులకు బోధింపసాగెను. ఎవరిచేతియందైనా మందుసీసా చూచుట తడవుగ 'సీసావలన నీకేమియు ప్రయోజనములేదు. చేతితో త్రవ్వుగోల పుచ్చుకొంటివా ఆరోగ్యవంతుడ వయ్యెదవు.' అని ఎంతో ఆసక్తితో నచ్చచెప్పుచుండెను. దానిపై ప్రజలు 'నీవు సీసాలు త్రాగి త్రాగి తృప్తుడవై కూర్చుండి మమ్ము వద్దనెదవా?' అని అడుగుచుండిరి. ప్రపంచస్థితి అట్లేయున్నది. ఇతరుల అనుభవము వలన జ్ఞానము సంపాదించుకొను కోరిక మనుజునకులేదు. అతనికి స్వతంత్రానుభవము కావలెను. స్వయముగ దెబ్బతినవలెను. 'గ్రంథముల వలన ఏమియు లాభములేదు. వ్యర్థముగ గ్రంథములలోపడి కొట్టుకొనవద్దు' అని నేను హితవాక్యము చెప్పుచుండ ఆతడు 'అవును నీవు

మాత్రము గ్రంథములన్నియు చదివివేసి మాకిట్టి ఉపదేశములు చేయు చున్నావా !' అనును. 'అవును. నేను గ్రంథములు చదివివేసితిని. కాని నీవుమాత్ర మట్టితప్పు చేయకుండుటకై చెప్పుచున్నాను.' అనిన 'నాకను భవము కావలెను' అని ఆతడనును. 'మంచిది అనుభవము పొందుము. దెబ్బలుతిను స్వాతంత్ర్యము నీకు జన్మహక్కేగదా' ! చరిత్రలోని అను భవముల వలన మనము జ్ఞానము పొందుటలేదు. ఇందుచేతనే చరిత్రకు పునరావృత్తి కలుగుచున్నది. మనము చరిత్రయందు లక్ష్యముంచినచో చరిత్రకంటె ముందుకు సాగిపోగల్గుదుము. చరిత్రకు తగిన 'విలువ నీయకపోవుటచే దానివిలువ అనవసరముగ పెరిగిపోయినది. కాని మన ధ్యాన మటు పోయినప్పుడుకదా !

( మధుకర్ నుండి )

•

## : 4 : జీవనము - శిక్షణము

### జీవితము రెండు ముక్కలగుట

నేటి విచిత్రమైన శిక్షణపద్ధతివలన జీవితము రెండుముక్కలగు చున్నది. ఆయువునందలి మొదటి ఇరువది సంవత్సరములు మనుష్యుడు జీవితముయొక్క జంజాటములో పడక కేవలము శిక్షణ నందవలెను. పిమ్మట శిక్షణ నొక మూట కట్టి మూలపెట్టి చనిపోవు వరకు జీవింప వలెను !

ఈ పద్ధతి ప్రకృతివిధానమునకు విరుద్ధము. మూరెడు పొడుగున్న బాలుడు మూడున్నర మూరలపొడుగు ఎట్లగుచున్నాడు అను విషయము ఆ బాలునికిగాని ఇతరులకుగాని దృష్టియందులేదు. శరీరము ప్రతిదినము పెరుగుచున్నది. ఈ పెరుగుట సావకాశముగ, క్రమక్రమముగ, కొంచెము కొంచెముగ జరుగుచున్నది. కావుననే అది జరుగుచున్నట్లే తెలియదు. నేటిరాత్రి నిద్రించుచున్నప్పటికి రెండడుగుల పొడవుండి రేపటి ఉదయము లేచి చూచునప్పటికి రెండున్నర అడుగులగుట జరుగదు. ఫలానా సంవత్సరములో చిట్టచివరి రోజువరకు మనుజుడు జీవితవిషయములో పూర్తిగ బాధ్యతారహితుడై ఉండినను ఏమియు ఇబ్బందిలేదు. ఇంతేకాదు బాధ్యతారహితముగనే యుండవలెను. తరువాతి సంవత్సరమునందలి మొదటిదినము ప్రారంభముకాగానే సంపూర్ణ బాధ్యతను వహించుటకు సిద్ధముగ నుండవలెను ! పూర్ణమైన బాధ్యతారహితస్థితినుండి పూర్ణమైన బాధ్యతాహితస్థితికి గంతువేయుట అన అది ఆంజనేయుని గంతు అగును. ఇట్టి ఆంజనేయుని గంతువేయు ప్రయత్నములో చేతులును, కాళ్ళును విరిగిన ఆశ్చర్యమేమున్నది !

## కురుక్షేత్రములో భగవద్గీత

భగవానుడు అర్జుననికి కురుక్షేత్రమున 'భగవద్గీత'ను చెప్పెను. మొదట భగవద్గీత 'క్లాసు' పెట్టి తరువాత అతనిని కురుక్షేత్రమునకు త్రోయలేదు. కావుననే అతనికి గీత అర్థమయ్యెను. మనము 'జీవితమును తయారుచేయు జ్ఞానము' అని చెప్పుదానినే జీవితమునకు ఏమియు సంబంధము లేనిదానినిగా చేయగోరుచున్నాము. ఇందుచే ఆ జ్ఞానము మరణమునకు తయారుచేయున దగుచున్నది.

## ఆంజనేయుని గంతునకు ఫలము

ఉత్సాహముగల ఇరువదియేండ్ల యువకుడు చదువులో నిమగ్నుడై యుండును. అనేకవిధములైన ఉన్నతభావములను మనస్సులో పెట్టు కొనియుండును. "నేను శివాజీవలె మాతృభూమికి సేవచేయుదును. నేను వాల్మీకివంటి కవినగుదును. నేను న్యూటనువలె పరిశోధనల నొనర్తును" ఈరీతి నొకటా, రెండా? యెన్నో యోచనలు చేయును. ఇట్టి యోచ నలుచేయు భాగ్యము కూడ కొద్దిమందికే లభించును. అయినను అట్లు లభించినవారి విషయమే తీసికొందము. ఈ యోజన లైనతరువాత ఏమి జరుగును? ఉప్పు చింతపండు సమస్యలో పడి పొట్టప్రశ్న యెదుట నిలువగనే పాపమాతడు నీరుకారిపోవును. జీవితముయొక్క బాధ్యత అననేమో అతనికప్పటివరకు ఊహకూడలేదు. కాని ఇప్పుడొక పర్వ తము ఎదుటవచ్చినిలచినది. ఏమిచేయునో ఇకపొట్టకొరకు ప్రతివనమును తిరుగు శివాజీ, కరుణగీతముల నాలపించు వాల్మీకి, ఒకప్పుడుద్యోగము కొరకును ఇంకొకప్పుడు భార్యకొరకును మరొకప్పుడుకూతురునిమిత్తము వరునికొరకును చివరకు స్మశానమును శోధించు న్యూటను - ఈ రీతి పాత్రముల ధరించి తన ఊహలను సార్థకపరచుకొనును. ఆంజనేయుని గంతుయొక్క ఫలమిది.

"ఏమోయి ! నీవిక ముందు ఏమిచేయుదువు" అని ఒక స్కూలు ఫైనలు విద్యార్థిని అడిగిరి.

"ఇకముందా ? కాలేజీలో చేరెదను."

"సరే ! కాలేజీలో చేరెదవు. కాని తరువాతనేమి ? అను నాప్రశ్న అట్లే యున్నది."

"ప్రశ్న ఉండుగాక : దాని ఆలోచన ఇప్పుడెందుకు ? తరువాత చూచుకొనవచ్చును."

పిమ్మట మూడేండ్లకు తిరిగి ఆ విద్యార్థిని ఆ ప్రశ్నయే అడిగిరి.

"ఇంతవరకు ఏమియు నిశ్చయింపలేదు."

"నిశ్చయింప లేదనగా, ఆలోచించితివా ఏమి ?"

"కాదండి ! ఆలోచించనేలేదు. ఏమి ఆలోచించను ? ఏమియు తోచుటలేదు. అయిన నింకను ఒకటిన్నర సంవత్సర మున్నదికదా ! తరువాత చూచుకొనవచ్చును."

తరువాత చూచుకొనవచ్చును అను నీమాటలు మూడుసంవత్సరముల క్రిందట ఉచ్చరించినవే. కాని పూర్వపు ఉచ్చారణలో నిశ్చింతత కలదు. ఇప్పటి ఉచ్చారణలో కొంత విచారము కన్పించుచుండెను.

తిరిగి సంవత్సరమున్నర అయినపిమ్మట అపృచ్ఛకుడా విద్యార్థిని లేదా ఇప్పటి గృహస్థుడను ఆ ప్రశ్నయే అడిగెను. ఈమారు మొగముపై చింతారేఖలు గ్రమ్మెను, మాటలోని నిశ్చింతత ఎచ్చటికో ఎగిరిపోయెను. "తతఃకిమ్, తతఃకిమ్, తతఃకిమ్" అని శంకరాచార్యులవారడిగిన సనాతన ప్రశ్న ఇప్పుడతని తలలో గిర్రున తిరుగసాగెను. కాని అతనియొద్ద దీనికి సమాధానములేదు.

నేటి మరణమును రేపటికై వాయిదా వేయుచు పోగాపోగా తప్పనిసరిగ మరణింపవలసిన దినము ఒకానొకనాడు రానేవచ్చును. మరణమునకుముందే మరణించువారికి ఇది వర్తింపదు. వారు తమ మరణమును తమ కన్నులతో కాంతురు. మరణము రాబోవుచున్నది

అను అనుభవము కలవారి మృతి తప్పుచున్నది. మరణము రాబోవు చున్నదను అనుభవమునుండి తప్పించుకొనుచు దూరముగ పోవువారి గుండెలపై అదివచ్చి పడుచున్నది. ఎదుట స్తంభమున్నదను సంగతి అంధునికి ఆ స్తంభము సాక్షాత్తు గుండెలకు గ్రుద్దుకొన్న పిమ్మట తెలియును. కన్నులు కలవానికి ఆ స్తంభము ముందే కనుపించును. కావున దానిదెబ్బ ఆతని గుండెలకు తగులదు.

## బాధ్యతను తప్పించుకొన కూడదు

జీవితముయొక్క బాధ్యత ఏమియు భయానకమైనదికాదు. ఈశ్వర నిర్మితమైన సూటి జీవిత పద్ధతులను దృష్టియందుంచుకొని చెడుతలంపుల నణచిపెట్టగలశక్తి యున్నచో అది ఆనందపూర్ణమైనది. ఆనందపూర్ణమైనట్లే అది శిక్షణాపూర్ణమును. జీవితముయొక్క బాధ్యత నెరుగనివాడు శిక్షణలాభము నంతనుకూడ కోల్పోయినాడని నిశ్చయముగ తెలిసికొనవలెను. చిన్నతనమునుండియే జీవిత బాధ్యతను గురించిన జ్ఞానము బాలకుని కున్నయెడల అతని జీవితము వాడిపోగలదని చాల మంది అభిప్రాయము. అట్లు జీవిత బాధ్యతను గుర్తెరుంగుట వలననే జీవితము వాడిపోయిన యెడల అట్టి జీవితము ఉండదగినది కాదనియే చెప్పవలసి యుండును.

## నిజమైన మానవత్వము

కాని నేదు చాలమంది శిక్షణ శాస్త్రజ్ఞులకు కూడ ఇట్టి అభి ప్రాయము కలదు. దీనికి ముఖ్యకారణము జీవిత విషయమైన దుర్భావ నయే. అనగా జీవితమున 'కలహము' అని తలచుట. ఈనపు నీతి ప్రకారము 'అరసికత' అని తలపబడినను నిజమైన తత్వము నెరిగి యున్న కోడిపుంజునుండి జ్ఞానము నేర్చుకొని, జొన్నగింజకంటె ముత్యమునకు ఎక్కువ విలువనిచ్చుట మానివేసినచో జీవితమునందలి

కలహము నశించి జీవితమునందు సహకారము కానవచ్చును. 'కోతిచేతి ముత్యాలదండ' అను సామెతను నిర్మించినవారు మనుష్యుని మనుష్యత్వము స్థాపింపక తిన్నగ మనుష్యుని పూర్వజుల విషయములో డార్విన్ చెప్పిన సిద్ధాంతమును స్థాపించిరి. 'హనుమంతుని చేతిలో ముత్యాల దండ' అను కథను రచించినవారు తమ మనుష్యత్వమును గుర్తెరిగిన వారు.

జీవితము భయానకమే అయి 'కలహమే' అయి ఉన్నచో పిల్లలనందు ప్రవేశపెట్టకుము. నీవుకూడ జీవింపకుము; కాని అది జీవింపతగిన వస్తువే అయినచో పిల్లలనందు తప్పక ప్రవేశపెట్టుము. అదిలేనిదే వారికి శిక్షణ లభింపదు; కురుక్షేత్రమున భగవద్గీతవలె జీవన క్షేత్రమున శిక్షణ నీయవలెను. 'ఇవ్వబడగలదు - ఇవ్వబడగలదు' అను భాషకూడ సరికాదు. జీవనక్షేత్రముననే అది లభింపగలదు.

## జీవించు శిక్షణ

అర్జునుని యెదుట ప్రత్యక్ష కర్తవ్య మొనర్చు సమయమున ప్రశ్న ఉత్పన్న మయ్యెను. దాని కుత్తర మిచ్చుటకై భగవద్గీత నిర్మిత మయ్యెను. దీనినే శిక్షణ అనవలెను. బాలకుని పొలములో పనిచేయ నిమ్ము. అందేదైన ప్రశ్న ఉత్పన్నమైనచో దానికి సమాధాన మిచ్చుటకై సృష్టిశాస్త్రమునుగాని, పదార్థ విజ్ఞాన శాస్త్రమునుగాని, లేక అవశ్యకమైన ఇంకొక శాస్త్రమునుగాని బోధించుచుండుము. ఇది సరియైన శిక్షణ కాగలదు. పిల్లవానిని వంటచేయనిమ్ము. అందుకు కావలసిన రసాయనశాస్త్రము నచట బోధింపుము. కాని ముఖ్యవిషయ మేమన అతనిని జీవనము జీవింపనిమ్ము. వ్యవహారములలో తిరుగు మనుష్యులకు కూడ శిక్షణ లభించుచునే యున్నది. అట్లే చిన్నపిల్లలకు కూడ లభింపవలెను. పిల్లవానికి దగ్గరగా అవసరమునుబట్టి మార్గము చూపించు మనుష్యులుండవలెను. ఇంతే భేదము. ఈ మనుష్యుడు కూడ 'నేర్పు

వాడు'గ 'నియుక్తుడు' గాకూడదు. అతడుకూడ వ్యవహారములలో తిరుగు మనుజులవలె 'తనబ్రతుకు తాను బ్రతుకువాడై' యుండవలెను. ఇక భేదమేమన, ఈ శిక్షకు లనబడువారి జీవితము ఆలోచనామయమై యుండి వారి ఆలోచనలను సందర్భానుసారముగ పిల్లలకు బోధించి చెప్పు శక్తి వారికుండును.

## శిక్షణ ఒక వృత్తి కాకూడదు

కాని 'శిక్షకత్వము' అను ప్రత్యేకవృత్తి అక్కరలేదు. 'విద్యార్థి' అని వేరే మనుష్యులలో చేరని ప్రాణియు అక్కరలేదు. ఏమిచేయు చున్నావని అడిగిన నేర్చుకొనుచున్నానని గాని, నేర్పుచున్నానని గాని సమాధాన మీయనక్కరలేదు. వ్యవసాయము చేయుచున్నాను లేదా బట్టలు నేయుచున్నాను అను కేవల వృత్తిబోధకములు కానిండు, లేదా వ్యవహార బోధకములు కానిండు - జీవితమునుండి అట్టి సమాధానమే రావలెను,

## ఆదర్శ గురు శిష్యులు

దీనికి రామలక్ష్మణులవంటి విద్యార్థులును, విశ్వామిత్రునివంటి గురువును ఉదాహరణముగ తీసుకొనవలెను. విశ్వామిత్రుడు యజ్ఞము చేయుచుండెను. దాని రక్షణకొరకాతడు దశరథుని పుత్రుల పంపుమని యడిగెను. ఆ పనికొరకే దశరథుడు తన పుత్రులను పంపెను, ఆ బాలురకు కూడ తాము యజ్ఞరక్షణమను పని చేయుటకై వెళ్లుచున్నామను బాధ్యతాయుతభావము కలదు. ఆ పనిలో వారి కపూర్వమైన శిక్షణ లభించెను. కాని రామలక్ష్మణు లేమిచేసిరో చెప్పుమన్నచో వారు 'యజ్ఞ రక్షణ చేసిరి' అని చెప్పవలసియుండును, 'శిక్షణ పొందిరి' అని కాదు. అయినను వారికి లభింపవలసిన శిక్షణ లభించియేయున్నది.

## శిక్షణ ఆనుషంగిక ఫలము

శిక్షణ అనునది కర్తవ్య కర్మకు ఆనుషంగిక ఫలము. కర్తవ్య కర్మచేయువారి కెవరికైనను ప్రత్యక్షముగనో, పరోక్షముగనో అది లభించును. పిల్లలకు కూడ అది అట్లే లభింపవలెను. ఇతరులకది కష్టము ననుభవించినమీదట కలుగుచున్నది. చిన్నబిడ్డలకింకను అంత శక్తి వచ్చియుండదు కనుక పెద్దకష్టము లనుభవింప నక్కరలేని వాతావరణమును వారి చుట్టుప్రక్కల నిర్మింపవలెను. వారు మెల్లమెల్లగ తమ కాళ్ళపై తాము నిలబడవలెనను ఉద్దేశ్యమున, అట్టి విధానము ఉండవలెను. శిక్షణ ఒక ఫలము. "మా ఫలేషుకదాచన" అను నియమము ఈ ఫలమునకు కూడ వర్తించును.

## శిక్షణమోహ ముండరాదు

శిక్షణకొరకే కేవలము ఏ పనియైనా చేయుట అనునది కూడ సకామమే. అందుకూడ "ఇదమద్య మయా లబ్ధం - నేను నేడిది పొందితిని." "ఇదంప్రాప్స్యే - రేపిది పొందెదను" మున్నగు వాసనలు కూడ వచ్చును. కావున ఈ శిక్షణమోహమునుండి తప్పించుకొనవలెను. ఈ మోహమునుండి తప్పించుకొనువానికి సర్వోత్తమమైన శిక్షణ లభించునని తెలిసికొనవలెను. తల్లి జబ్బుతోనున్నది. ఆమె సేవ చేయుటచే నాకు కావలసినంత శిక్షణ లభించును. కాని ఆ శిక్షణయొందలి లోభముచే నేను తల్లికి సేవచేయకూడదు. ఇది నా పవిత్రకర్తవ్యమను భావనతో నేను తల్లి సేవ చేయవలెను. ఇంతేకాక తల్లిజబ్బుతో నుండగా ఆమె సేవ చేయుట నాకు 'శిక్షణ' అని తలచి ఇంకొకటి పాడైపోవునను భయముచే తల్లిసేవనుండి తప్పుకొనరాదు.

## పరిశ్రమకు స్థానము

అన్నిటికంటె ముఖ్యమగు జీవనోపయోగమగు పరిశ్రమకు శిక్షణలో స్థానముండవలెనని అంగీకరించు కొందరు శిక్షణశాస్త్రజ్ఞులు

ఈ పరిశ్రమను కూడ 'శిక్షణ' దృష్టితోనే ప్రవేశపెట్టవలెననియు 'పొట్ట పోసికొను' దృష్టితో కాదనియు చెప్పుచుందురు. నేడు 'పొట్టపోసి కొనుట' అనుదానికి వాడుకలో గల విపరీతార్థమును చూచి కంగారుపడి ఇట్లు చెప్పుచున్నారు. కొంతవరకది యోగ్యముగనే యున్నది. కాని మనుష్యునికి 'పొట్ట' నిచ్చుటలో ఈశ్వరుని యుద్దేశమొకటి కలదు. న్యాయముగ పొట్టపోసికొనుట అనుదానిని మనుష్యుడు సాధించిన యెడల సంఘమందలి అనేక దుఃఖములు, పాతకములు లేకుండ పోవును. కావుననే మనువు "యోఽర్థేశుచిఃసహిశుచిః" - ఆర్థిక దృష్టిచే పవిత్రమైనవాడే పవిత్రుడు అని యథార్థమైన మాట చెప్పినాడు. "సర్వేషామవిరోధేన" ఎట్లు జీవించుట అను ఈ శిక్షణలో శిక్షణయంతయు వచ్చివేసినది. అవిరోధవృత్తిచే శరీరయాత్ర నడుపుట అనునదే మనుజుని ప్రథమకర్తవ్యము. ఈ కర్తవ్యమూలముగ అతనికి ఆధ్యాత్మికమైన ఉన్నతి కలుగగలదు. కావుననే శరీరయాత్ర సాగించుటకుపయుక్తమైన పరిశ్రమ చేయుట అనుదానికి శాస్త్రకారులు 'యజ్ఞ'మను పేరిడిరి. "ఉదరభరిణనోహెజాణెజేయజ్ఞకర్మ" - "ఉదరపోషణకాదిది, యజ్ఞకర్మ" అను వామనపండితుని వచనము ప్రసిద్ధమే. కనక "నేను శరీరయాత్ర నడుపుకొనుటకై పరిశ్రమను చేయుచున్నాను. అను భావనయోగ్యమైనదే. 'శరీరయాత్ర' అనగా మూడున్నర మూరల శరీరముయొక్క యాత్ర అని తలంపక సంఘశరీరయాత్ర అను ఉదారమైన అర్థమును మనస్సులో పెట్టుకొనవలెను. "నా శరీరయాత్ర అనగా సంఘసేవ, కావుననే ఈశ్వరసేవ" అను సమీకరణము దృఢపడవలెను. ఇంతేకాక ఆ ఈశ్వరసేవయందే దేహము రాలిపోవలెను. ఇది నా కర్తవ్యము, దీనిని నేను చేయవలెను అను భావన కూడ ప్రతివారియందు ఉండవలెను.

కావున ఈ భావన చిన్న బిడ్డలయందు కూడ కలుగవలసినదే. అందుకై వారికి వారి శక్తికి తగినట్లు జీవితమునందు పాల్గొను అవ

కాశము ఈయవలెను. జీవితమును ముఖ్యకేంద్రముగ చేసి దానిచుట్టు ప్రక్కల కావలసిన శిక్షణయంతయు ఏర్పాటు చేయవలెను.

ఇట్లు చేయుటవలన జీవితము రెండు ముక్కలు కాదుగదా. జీవితబాధ్యత హఠాత్తుగా వచ్చిపడుటవలన కలుగు ఇబ్బందులును పుట్టవు. తెలియకుండగనే శిక్షణ అబ్బునుగాని. 'శిక్షణమోహము' అంటదు. నిష్కామకర్మ ప్రవృత్తియు కలుగును.

( "మధుకర్" నుండి )



## : 5 : "పూర్ణాత్ పూర్ణమ్"

### పూర్ణమునుండియే పూర్ణము

"పూర్ణాత్ పూర్ణముదచ్యతే" అని వేదవాక్యము. పూర్ణమునుండి పూర్ణము; అనునది ప్రాకృతిక వికాసముయొక్క నియమము. దీని కర్థమేమని ప్రశ్నింపవచ్చును. మొదటను పూర్ణమే, చివరను పూర్ణమే అయినచో ఇక వికాసము దేనికి ? అపూర్ణమునుండి పూర్ణమని చెప్పినచో 'వికాసము' అనుమాటకు అర్ధము కుదురును. కాని 'పూర్ణాత్ పూర్ణమ్' అను ఈవాక్యము అర్ధహీనముగ కన్పించుచున్నది.

### అల్పపూర్ణమునుండి మహాపూర్ణము

నిజమే ! ఈవాక్యము అర్థశూన్యముగనే కన్పించుచున్నది. కాని ఇందు గంభీరమగు అర్థము ఇమిడియున్నది. 'పూర్ణమునుండి పూర్ణము' అనగా అల్పపూర్ణమునుండి మహాపూర్ణమని యర్థము. అప్పుడే పుట్టిన శిశువును పూర్ణుడే. ఇరువది సంవత్సరముల యువకుడును పూర్ణుడే. మొదటిది అల్పపూర్ణతకు రెండవది మహాపూర్ణతకు నుదాహరణములు. చిన్న పిల్లవానికి ఒక కన్ను, సగముముక్కు ఉండి, పడుచువానికి రెండు కన్నులు పూర్తిముక్కు ఉండుటలేదుకదా ! ఇద్దరికిని రెండేసి కన్నులు, ఆరెంటికి నడుమ ఒక ముక్కు ఉన్నవి. ఇద్దరును పూర్ణులే ! ఇక భేదమేమన ఒకడు చిన్నవాడైన పూర్ణుడు. ఇంకొకడు పెద్దవాడైన పూర్ణుడు.

రెండంగుళముల పొడవుగల సరళరేఖయు పూర్ణమే. నాలుగంగుళముల సరళరేఖయు పూర్ణ సరళరేఖయే. మొదటిది చిన్నదైన రెండవది పెద్దది. రెండంగుళముల వ్యాసముగల వృత్తమును పూర్ణ

వృత్తమే. నాలుగంగుళముల వ్యాసముగల వృత్తమును పూర్ణ వృత్తమే. మొదటిది చిన్నదైన రెండవది పెద్దది. నల్లపలకపై వ్రాయబడిన ఉసిరిక కాయంతసున్న దూరదర్శన యంత్రములో గుమ్మడికాయంత కాన్పించును. అనగా దూరదర్శనయంత్ర మేమిచేసెను ? ఎట్టి వికాసమును కల్గించెను ? అది అపూర్ణమగు సున్నను పూర్ణమగు సున్నగ చేసెనా ? లేక చిన్న పూర్ణానుస్వారమును పెద్ద పూర్ణానుస్వారముగ చేసెనా ? ఉసిరికకాయంత పరిమాణముగలసున్నను గుమ్మడికాయంత పరిమాణము గల సున్న*గా దూరదర్శిని యంత్రము చేసెనా ?

## చిన్న సున్ననుండి పెద్ద సున్న

వాస్తవమునకు శిక్షణశాస్త్రము కూడ ఇంతకంటె అధికముగ చేయునదేదియులేదు. శిక్షణశాస్త్రమునకు నిర్వచనము చెప్పవలెనన్న 'ఉసిరికాయంత సున్ననుండి గుమ్మడికాయంత సున్న' అని చక్కగ చెప్పుకొనవచ్చును. శిక్షణ ద్వారా ఉసిరికాయనుండి గుమ్మడికాయ తయారగును. లేదా సమర్థ రామదాసస్వామి చెప్పినట్లు 'మూర్ఖుని'నుండి 'చదువుకొనిన మూర్ఖుడు' లేదా ఇంకను ఎక్కువగ చెప్పవలెనన్న అర్థ పండితునినుండి ఒకటిన్నర పండితుడు‡ (అనగా మూర్ఖుడు) తయారగును. కాని ఈ పరిహాసములు విడిచి దాని అసలు భావమును గ్రహించినచో 'పూర్ణమునుండి పూర్ణము' అనునది స్వాభావికమైన వికాసమునకు ఒక నూతనసూత్ర మెట్లగునో అర్థము కాగలదు.

## అస్పష్టమునుండి స్పష్టము

తెల్లవారుజాము అయిదు గంటలకు ఎదుటనున్న చెట్టు మసకగ కన్పించును. ఆకన్పించుట పూర్తిగనే కన్పించుచున్నది. కాని అస్పష్ట

*మహారాష్ట్ర భాషలో సున్న అర్థమున 'పూజ్య' శబ్దముకూడ వాడుకలోకలదు.

‡అతితెలివి గలవాడు అనగా మూర్ఖుడని జాతీయము.

ముగ కన్పించుచున్నది. అయిదున్నరగంటలకు కొంచెము స్పష్టముగ కన్పించును. అప్పుడుకూడ మొదటివలెనే అది పూర్తిగనే కన్పించును. కాని కొంచెము స్పష్టముగ కన్పించును. సూర్యోదయ మయిన పిమ్మట కూడ చెట్టు పూర్తిగ కనుపించును. కాని మిక్కిలి స్పష్టముగా కన్పించును. అంతేకాని అయిదుగంటలకు నాలుగవవంతు చెట్టుమాత్రమే కనుపించి అయిదున్నర గంటలకు సగముచెట్టు కనిపించి, సూర్యోదయమునకు పిమ్మట చెట్టంతయు పూర్తిగ కనుపించుట జరుగదు. మూడుసార్లును అది పూర్తిగనే కన్పించును. కాని మొదటిసారి అస్పష్టమగు పూర్తిగను, రెండవసారి స్పష్టమగు పూర్తిగను, మూడవసారి అతి స్పష్టమగు పూర్తిగను కన్పించును. అస్పష్టము, స్పష్టము, అతి స్పష్టము అను ఈ వికాసము సూర్యకాంతి వలన జరిగినది. కాని మూడు పర్యాయములును ఆ వికాసము పూర్ణమైనదానికే జరిగినది. ఈ విధముగ అల్పపూర్ణమునుండి మహాపూర్ణము, అస్పష్టపూర్ణమునుండి స్పష్టపూర్ణము అనునది ప్రకృతిసిద్ధమైన వికాసమని స్పష్టపడుచున్నది.

## అపూర్ణమునుండి పూర్ణము, పూర్ణమునుండి పూర్ణము అనువాని భేదము

అపూర్ణమునుండి పూర్ణమన నేమి? పూర్ణము నుండి పూర్ణమన నేమి? ఇది తెలిసికొనుటకు ఒక దృష్టాంతమును గ్రహింతము. మన మొక సముద్రపుటొడ్డున నిలబడియున్నామనుకొందము. మన కిప్పుడు సంద్రములో ఓడలు మొదలైన వేమి కనుపించుట లేదు. కొంచెము సేపైన పిమ్మట ఒక యోడ కన్పించుచున్నది. అనగా ఓడయొక్క పై భాగము మాత్రము కన్పించుచున్నది. ఇంక కొంచెము సేపైనపిమ్మట మధ్యభాగము కన్పించుచున్నది. తరువాత పూర్తిగఓడ కన్పించుచున్నది. ఇప్పుడది పూర్తిగనే కన్పించుచున్నది. కాని దూరమగుటచే అస్పష్ట

ముగ నున్నది. పిమ్మట అది స్పష్టముగ కన్పించుచున్నది. ఓడ కన బడిన క్షణము మొదలు పూర్తిగ ఓడ కనపడువరకు మనకు కలిగిన దర్శనము "అపూర్ణమునుండి పూర్ణ"మని చెప్పుదుము. తరువాత దర్శ నమును "పూర్ణమునుండి పూర్ణ"మని చెప్పుదుము.

## భూగోళశాస్త్రముయొక్క దృష్టాంతము

ఒక ఉపాధ్యాయుడు శిష్యులకు హిందూదేశపు భూగోళమును నేర్పుచున్నాడు. ఆయన మొదట పిల్లలకు పూర్ణమగు హిందూదేశ పట మును చూపెను. తరువాత అందలి వేరువేరు ప్రాంతములను తెలిపెను. పిమ్మట అన్నిప్రాంతములలోని నదులను కనపర్చెను. ఆ పిమ్మట దానిలో అన్ని ప్రాంతములలోని చారిత్రక, ధార్మిక, వ్యాపసాయిక మహాత్త్వము గల స్థానములను చూపెను. ఈ విధముగ సూక్ష్మవిషయములను గురించి జ్ఞానమును క్రమముగ కలిగించెను.

ఈ ఉపాధ్యాయుడు శిష్యులజ్ఞానమును "పూర్ణమునుండి పూర్ణ మైన స్థితికి" తీసుకొనివెళ్ళెనని చెప్పనగును.

## ఇంకొక పద్ధతి

ఇంకొక ఉపాధ్యాయుడు ఇట్లే శిష్యులకు హిందూదేశపు భూగో ళము నేర్పుచున్నాడు. కాని అతడు మొదట శిష్యులకు ఒక జిల్లాను గురించిన సూక్ష్మాతి సూక్ష్మమగు జ్ఞానమును కలిగించెను, ఇప్పుడీ విద్యార్థులకు ఒక ప్రాంతమును గురించిన సూక్ష్మాతి సూక్ష్మమగు జ్ఞానము కలిగెను. కాని ఇతర ప్రాంతములను గురించి వారికేమియు తెలియదు. తరువాత ఉపాధ్యాయుడు ఈవిధముగనే ఇతర ప్రాంతములను గురించి కూడ వారికి సూక్ష్మాతి సూక్ష్మమగు జ్ఞానమును కలిగించెను. చివరకు విద్యార్థులకు పూర్తిగ హిందూదేశమును గురించిన జ్ఞానము కలిగెను. హిందూదేశపు భూగోళమును నేర్పుటను గూర్చి మాత్రమే చెప్పవలె

నన్న ఈ ఉపాధ్యాయుడు విద్యార్థుల జ్ఞానమును 'అపూర్ణమునుండి పూర్ణము' వైపు నడిపించుచున్నాడని చెప్పనగును.

"పూర్ణమునుండి పూర్ణము"వైపు అనునది ఆత్మవికాసమునకు సనాతన సూత్రము. ఆత్మసంబంధముగల ఏవస్తువుయొక్క వికాసమునందైనను ఇదేసూత్రము వర్తించును.

## శిల్పకళయొక్క దృష్టాంతము

"క్లేమోడలింగ్" (మట్టితో విగ్రహములు తయారుచేయు కళ)కు సంబంధించిన ఒక పుస్తకములో బొమ్మను అపూర్ణస్థితికి కొనిపోవు పద్ధతి స్పష్టముగ నిషేధింపబడినది. ఆ పుస్తకములో గ్రంథకర్త తన అనుభవమును చెప్పుచు ఇట్లు వ్రాసినాడు. "మొదట మట్టితో ఏ ఆకారము తయారుచేసినను చివరకు మనము కోరిన ఆకారము వచ్చినచో సరిపోవును" అను ఉద్దేశ్యముతో ఎప్పుడును పనిచేయరాదు. ఇట్లుకాక మొదటినుండి చివరివరకు ఏ సమయములో ఎవరు చూచినను ఏది తయారగుచున్నదో తెలిసికొనగల్గునట్లుగ నిర్మాణము జరుగవలెను. ఇట్లయిననే ఆ విగ్రహము కళగట్టును. ఇట్లుకాక చాలమంది కళాకారులు 'ఇప్పుడే ఏమి చూచెదరు? పూర్తియైన పిమ్మట చూడవలెనుగాని!' అనుచుందురు. ప్రారంభములో అవకతవకగా తయారుచేసి పిమ్మట చేసిన తప్పులు దిద్దుకొనుచు కూర్చున్నయెడల ఆ కళ కడతేరదు. కళ అనగా ఆత్మ సంబంధమయిన అమృతకళ. కావుననే "పూర్ణమునుండి పూర్ణము" అను ఆత్మవికాస సూత్రమును గ్రహించిననే కళా ప్రాదుర్భావము సంభవము కాగలదు.

దేశ పునర్నిర్మాణము చాల గొప్పకళ. "పూర్ణాత్ పూర్ణమ్" అను సూత్రము ననుసరించిననే అది సాధింపబడగలదు.

[ 'మధుకర్' నుండి ]



## : 6 :   నేటి అనర్థకారియగు విద్య

### కాలేజి విద్యపై ఆచార్య రాయ్ అభిప్రాయములు

బంగాళా రాష్ట్రమందలి కాలేజీలయొక్కయు, విశ్వ విద్యాలయముల యొక్కయు ప్రధానోపాధ్యాయుల సభ ఒకటి జరిగినది. ఆచార్య ప్రఫుల్ల చంద్రరాయ్ దానికి అధ్యక్షులు. శ్రీ రాయ్ తన ఉపన్యాసములో నేడు 'ఉన్నత' విద్యకొరకై దేశమునందలి ధనము ఎట్లు దుర్వ్యయమగుచున్నదో స్పష్టపరచిరి. ఆయన ఇట్లు చెప్పిరి. "బంగాళారాష్ట్రము లోని తొమ్మిదివందల స్కూళ్ళలో సుమారు పదిహేనువేలమంది విద్యార్థులు మెట్రిక్ పరీక్షలో ఉత్తీర్ణులగుచున్నారు. వీరిలో తొమ్మిదివేలమంది ఉన్నతవిద్యకై కాలేజీలకు వెళ్ళుచున్నారు. వారిలో అయిదువందల మంది ఎం. ఏ. పరీక్షలో ఉత్తీర్ణులగుచున్నారు. ఈ ఐదువందల మందిలోను ఏబదిమందిమాత్రమే ఉపాధ్యాయు లగుచున్నారు. తక్కిన నాలుగువందల ఏబదిమంది ఎక్కడో గుమాస్తా మొదలయిన పనిచేసి సగటున నెలకు ఏబది రూపాయలు సంపాదించుకొనుచున్నారు. వీరు కాక పై తొమ్మిదివేలమందిలో కొందరు వకీళ్ళు, డాక్టరులు, ఇంజనీయర్లు మొదలయిన వారగుచున్నారు. కాని ఈ ఉద్యోగము లన్నిటిలోనికి నేడు చాలమంది ఎగబడుచుండుటచే ఎవరికిని స్థిరమయిన పని లభించుటలేదు. ఇందుచేత ఆచార్యరాయ్ అభిప్రాయమేమన తొమ్మిది వేలమందికి బదులు తొమ్మిదివందల విద్యార్థులనే కాలేజీలలో చేర్చుకొనవలెను. అనగా అంతమందిమాత్రమే ఉన్నత విద్యా బోధన, ఉన్నతోద్యోగ నిర్వహణ చేయుటకు సరిపోవుదురు. తక్కిన ఎనిమిది వేల ఒక వంద విద్యార్థులు ప్రతిసంవత్సరము కాలేజీలో చదివి సుమారు ముప్పది లక్షల రూపాయలు దుర్వ్యయము చేయుచున్నారు. శ్రీ రాయ్

లెక్క వేయుటలో సామాన్యముగ ప్రతి విద్యార్థికి సగటున రోజుకు ఒక రూపాయి ఖర్చగునని అంచనా వేసినారు. ఈ విధముగ ఆచార్యరాయ్ తేల్చిన సారాంశమేమనగా ప్రతిసంవత్సరము ఈ మూడువందల అరవై రూపాయల పెట్టుబడితో మెట్రిక్ వరకు విద్యపొందిన విద్యార్థి ఏదైన నొక లాభసాటి పరిశ్రమ చేసికొనవచ్చును. ఉద్యోగముకంటె స్వతంత్ర పరిశ్రమయే గౌరవదాయకమని అతడు తలచవలెను.

## ప్రస్తుత విద్యవలన హాని

కాని ఇది గొప్ప భయంకర సమస్యయై కూర్చున్నది. నేటి ఈ ఉన్నతవిద్య మహిమచే మెట్రిక్ వరకు వెళ్ళగలిగిన విద్యార్థి పరిశ్రమ గౌరవ విషయ మటుండనిండు. ఆత్మగౌరవమునే పోగొట్టుకొనుచు న్నాడు. ఈ విద్యవలన సాధ్యమైనంత లాభమును పొందుటయే లక్ష్య మనువారు కూడ కలరు. గురుశిష్యభావము లేక, త్యాగముగాని సేవా భావము గాని పేరుకైనను లేక, నైతిక వాతావరణము లేక, స్వధర్మా చరణము లేక, మాతృభాషపై గౌరవములేక, శరీరశ్రమకును స్వతంత్ర భావములకును ఎట్టి విలువయు లేక, ఇక 'లాభము' పొందుట అన నేమి? ఇక దానిచే కలుగు ధననాశనమును కూడ రూపాయి అణా పైసలలో లెక్కించి చెప్పనేల? అన్నియు చర్చించి ఆత్మనాశనమునకు యంత్రములను తయారు చేసుకొన్నవారికి ధననాశము లెక్కయేమి? అయినను దాస్యభావములు కలవారికి ధనమే దైవము కనుక ధన నాశ మును గూర్చిన గణితము వారి తల కెక్కవచ్చును. ఇది ఆలోచించి ఆచార్యరాయ్ ఈ లెక్కలు తయారు చేసిరి. కనీస మివి చూచియైనను కన్నులు తెరువవలెననియే నేను చెప్పునది.

## : 7 : క్రొత్తరాజ్యములో విద్యకూడ క్రొత్తదికావలెను

### వల్లభభాయ్ అభిప్రాయము

'నాసిక్ కాంగ్రెస్' తరువాత సర్దార్ వల్లభభాయ్‌పటేలు ఇచ్చిన ఉపన్యాసములన్నిటిలోను, ఆయన ప్రస్తుత విద్యావిధానముపై తన తీవ్రమగు అసమ్మతిని ప్రకటించెను. ప్రస్తుతము హైస్కూళ్ళలోను, కాలేజీలలోను లభించు పుస్తక విద్య బొత్తిగ పనికిమాలినది అగుటయేకాక పైగా, హానికరము అని ఆయన నొక్కి వక్కాణించెను.

### ప్రభుత్వము వలలో చిక్కుకొన్నది

ఎవరైన ఒక సాధారణ విమర్శకుడు గాని, ఒక అసాధారణ విమర్శకుడు గాని ఇట్లు పలికినచో అందాశ్చర్యముండదు. కాని దేశ పరిపాలన సూత్రమును చేతిలోపెట్టుకొనిన నాయకుడే ఇట్లు చెప్పినపుడు సహజముగ ఎవరైన ఇట్లడుగవచ్చును. 'మీ అభిప్రాయములో ప్రస్తుత విద్యావిధానము అంత పనికిమాలినదైనచో, మీరు దాని నెందుకు మార్చి వేయరు ?' దీనికి సమాధానము కూడ సర్దారు పటేలు తన అహమదాబాదు ఉపన్యాసములో ఇచ్చెను. 'మేమందరము ఒకానొక వలలో చిక్కుకొనియున్నాము; దానినుండి బయటపడుట మాకిపుడు కష్టమగుచున్నది' అని ఆయన చెప్పెను.

### ప్రణాళిక తయారుచేయువరకు సెలవిచ్చివేయండి

ఎంత కష్టమైనను ఈ వల చాల త్వరలో తెంపిపారవేయవలెను అనునదియే ఆయన ఉపన్యాసములో స్పష్టముగ వినిపించు స్వరము.

నామట్టుకు నేను చాలసార్లు నా అభిప్రాయము లీవిధముగ స్పష్టపరచియే యున్నాను. బాపూజీ మన యెదుట పెట్టిన 'నవీనవిద్యా పద్ధతి' మనకు నచ్చని యెడల, ఇంకొక పద్ధతిని కనిపెట్టుటకు కొంత సమయము పట్టు నెడల, విద్యావేత్తలందరు ఒకచోట కూర్చుండి ఆలోచించి ఒక నిర్ణయమునకు వచ్చునంతవరకు దేశములోని అన్ని స్కూళ్ళకు కాలేజీలకు సెలవిచ్చివేయవలెను. ఈ సెలవు వలన దేశమునకు దోషయుక్తమగు విద్యావిధానము సాగించుటచే కలుగునంత హాని కలుగజాలదు.

## ప్రాత జెండా లేదు

ఒక రోజున చర్చాసందర్భంలో నేనొక వ్యక్తిని ఇట్లడిగితిని. 'రాజ్యములో విప్లవము వచ్చి ప్రాతప్రభుత్వము స్థానమున క్రొత్త ప్రభుత్వము వచ్చినప్పుడు ఆ క్రొత్తరాజ్యములో ప్రాతరాజ్యపు జెండా ఎగురగలదా?' సమాధానము స్పష్టమే. "ఎగురజాలదు". అంతట నేనిట్లంటిని 'విద్య విషయమున కూడ సరిగా ఈ సూత్రమే వర్తించును. క్రొత్త రాజ్యములో క్రొత్త జెండా యెట్లో క్రొత్త విద్యయు అట్లే' క్రొత్త రాజ్యము వచ్చియు ప్రాతవిద్యయే సాగుచున్నచో ఆ రాజ్యములో పైపైననే క్రొత్తదనము కాని లోలోపల ప్రాతపాటయే పాడబడుచున్నదని తెలిసికొనవలసి యుండును.

( "సేవక్", జనవరి, 1951 )

: 8 :

# పాఠశాలకు వెలుపలనే నిజమైన విద్య

చాంటిల్ సమ్మేళనములో ఒకటి రెండు సంవత్సరములు కాలే జీలు మొదలయినవి విడిచి భూదానయజ్ఞ కార్యక్రమములో పనిచేయ వలసినదని విద్యార్థులకు శ్రీ జయప్రకాశ్ సలహా ఇచ్చెను. దానిపై విద్యార్థులు నా అభిప్రాయము నడిగిరి. భూదానయజ్ఞ ఉద్యమములో పని చేయకపోయినప్పటికిని విద్యార్థులు కాలేజీ విడిచిపెట్టవచ్చునని వారితో నేను చెప్పితిని. ఇది విని విద్యార్థులకు సంతోషము కలిగెను.

## కాలేజీకి వెలుపల జ్ఞాన భాండారము

37 సం॥ క్రిందటి మాట. కాలేజీ విడిచి జ్ఞానాన్వేషణలో బయ టకు వచ్చితిని. కాలేజీలో చాల సంగతులు కన్పించినవి. కాని జ్ఞాన మెచ్చటను కన్పించలేదు. కాలేజీ విడిచిన పిదప జ్ఞానద్వారములు అనంతముగ తెరచుకొనెను.

నా జ్ఞానోపాసన నేటికిని సాగుచున్నది. జ్ఞానముతో సమానమైన పవిత్ర వస్తువు ఇంకొకటి లేదు. అని నేను మొదటినుండియు నమ్ము చున్నాను. కావున కాలేజీలో జరుగు కాలక్షేపము నేను సహింపజాలక పోతిని. విద్యార్థులతో నా కెల్లప్పుడును పరిచయము కలదు. పాఠ శాలలలో ఏమేమి నేర్పబడుచున్నదో నేనెప్పుడును పరిశీలించుచుందును. ముప్పదియేడు సం॥ కు పూర్వము విద్య అను పేరుతో మనకేవి తిని పింపబడుచుండెనో ఇంచుమించు అట్టివే నేడును తినిపించబడుచున్నది. ఆ సమయమున మన దేశము పరాధీనముగ నుండెను. నేడు స్వతంత్ర మయ్యెను.

దేశములో ఒక వైపున కోట్లకొలది జనులు కర్మజడులై యున్నారు. రెండవ వైపున లక్షలకొలది విద్యార్థులకు కర్మ శూన్యమగు మూఢ విద్య నేర్పబడుచున్నది. ఆజ్ఞాపకులు, ఆజ్ఞాపితులు—కేవలము ఆజ్ఞ ఇచ్చువారు, కేవలము ఆజ్ఞ పాలించువారు అని రెండు వర్గములు తయారయినవి. దైన్యము, దారిద్ర్యము - వీనికి మంచి కాలము వచ్చినది. ప్రస్తుత విద్యావిధానము మారనంతవరకు ఈ స్థితి బాగుపడదు.

("సేవక్" జూన్, 1953)

: 9 : విద్యావినోదము

చాలసార్లు మా మకాము పాఠశాలలలో ఏర్పాటగుచుండును. పల్లెటూరులో పాఠశాలయే మంచి భవనముగ నుండును. అక్కడ మాకును ఉండుటకు అనుకూలముగ నుండును. పిల్లలకును సెలవు లభించును గాన సంతోషముగ నుండును.

## సెలవు లిచ్చుట

నేడు మేము మకాము చేసిన పాఠశాలలో ఈ సంవత్సరము పాఠశాల కీయబడు సెలవుల పట్టిక కట్టబడియున్నది. చిన్నవి, పెద్దవి కలిసి మొత్తము నలభై పండుగలకు 55 సెలవులు వ్రాయబడి యున్నవి. మేము వచ్చినందుల కిచ్చిన సెలవు 56 వది. మనదేశములో అనేక మతములు కలవు. ఆయా మతములలో అనేక మహాత్ములు పుట్టిరి. ఆయా మహాత్ములపై అభిమానముగల వ్యక్తులును చాల మంది కలరు. వీరందరకూ కలిపి సెలవులు పంచబడుచుండును. దీనికి ఫలితముగ పిల్లలలో సహజముగనే సర్వమత సామరస్యము కలుగుచుండును.

## జనన మరణములు

అట్లే జనన మరణములయందుకూడ సమబుద్ధి కలుగును. మా బాల్యములో రాజుగారు మరణించినందుకు ఒకరోజు సెల విచ్చిన విషయము నాకు జ్ఞాపకము కలదు. ఆయన పుట్టినరోజున సెలవెప్పుడును ఉన్నదే. హిందూమతములోకూడ ఇట్లే బారసాలనాడును బూరెలతో భోజనము, ద్వాదశాహమునాడును బూరెలతో భోజనము! ఎవరయిన పుట్టినను సరే, చచ్చినను సరే ఎప్పుడును నోరు తీపి అగుచుండును!

## జయంతులు

ఈ సెలవులు ఉత్తరప్రదేశ విద్యాశాఖవారిచ్చిరి. వినోదకరమగు విషయ మేమనగా ఉత్తరప్రదేశములో సర్వజన ప్రియులైన భక్తులు తులసీదాసు, సూరదాసు, కబీరుదాసు— వీరిపేర సెలవులు లేవు. లేనిచో విద్యాలయములో అనగా 'విద్యయొక్క లయములో' ఇంకను వృద్ధికలిగి యుండెడిది. కాని నానక్, గురుగోవిందసింహుల పేర్లమీద సెలవు లీయ బడియే యుండెను. బుద్ధుడు, మహావీరుడు, మహమ్మదు మొదలయిన వారి పేర్లమీద సెలవు లుండియే తీరునుకదా! ఎవరి పేరుమీద కలహము వచ్చుట కవకాశము కలదో, అనగా ఎవరి మతముపేర సంఘము లేర్పడి యున్నవో, ఎవరు సవతి పోరుకు సిద్ధముగ నున్నారో అట్టివారి పేర్ల మీద సెలవు లిచ్చివేయబడినవి. అంతే, దానితో జగడము ముగిసినది.

## గ్రహణమునకుకూడ సెలవు

ఈసంవత్సరము చంద్ర సూర్యగ్రహణములకు 3 సెలవులు కలవు. గ్రహణము పట్టినను పట్టకపోయినను చంద్రసూర్యుల గమనములో ఆటంకము కలగదు. కాని గ్రహణమునందు విశ్వాసము గలవారు పరిశోధించి, 'గ్రహణమువలన వారి గమనము కొంచెముసేపు ఆగిపోవు' నని తేల్చిరి. దానిలాభము విద్యార్థులకు, ఉపాధ్యాయులకు కలుగుచున్నది. "భోజనమైనపిమ్మట మధ్యాహ్నము కొంచెముసేపు పండుకొనవలెను" అని చెప్పుచు నాతో ఒక మహాశయుడు "సూర్యుడుకూడ మధ్యాహ్నము వేళ కొంచెముసేపు విశ్రమించును సుమండీ!" అనెను.

## ఆదివారపు సెలవు

దేవుడు ఆరురోజులలో సృష్టిచేసి అలసి ఏడవరోజున విశ్రాంతి గైకొనెను. కావుననే ఒక మతములో శుక్రవారము, ఇంకొక మతములో శనివారము, ఇప్పుడు అంతటా ఆదివారము విధిగా సెలవు దినమని

నిశ్చయింపబడినది. కాని భోజనమునకు మాత్రము సెలవు ఎప్పుడును లేదు. ఏలయన దానివలన అలసట కలుగుట లేదు. కొంద రిట్లు చెప్పుచున్నారు. "నేను ఆదివారము కడుపునిండ భుజింతును. ఏలయన ఆ రోజున భుజించినపిదప నిద్రించుటకు కావలసినంత అవకాశము లభించును. తక్కినరోజులలో కచేరీకి వెళ్ళవలసి యుండును. ఇందుచే పొట్టలో వేసినంత వేయుదుము, లేనంత లేదు. ఆదివారమునాడు భుజించుటకు దేవుని దృష్టాంతము తీసికొనరాదు. ఏలయన ఆయనకు కేవలం విశ్రాంతియే అవసరము, భోజనము కాదు. మనకు రెండును అవసరమే, కావున మనము దేవునికంటె ఒక అడుగు ముందున్నా మన్నమాట! సెలవు, భోజనముకూడ ఆనందవర్ధక వస్తువులే యనుటలో సందేహము లేదు. దీనికి కారణము చెప్పవలసిన అవసరము లేదు. కాని "సెలవు తీసికొనినపిదప భోజన మెట్లు లభించును?" అను నీ వికట సమస్యను గూర్చి ఇప్పుడు ఆలోచింపవలసియున్నది. పనిచేసినప్పటికిని కడుపు నిండ అన్నము లభింపనప్పుడు, పని మానినచో అది ఎట్లు లభించును?

## వేసవి దినములలో

పండుగలు, ఆదివారము సెలవులు కాక వేసవికాలములో ఇచ్చు దీర్ఘకాలపు సెలవులు ఈ దేశములో ఇంగ్లీషువారి ప్రసాదము. 'విద్య, అవిద్య—రెండును కలసి పూర్ణసాధన అగును' అను నీ ఉపనిషదర్థమునకు వేసవి సెలవులకును సంబంధము చక్కగ కుదిరినది. అవిద్యకు ఒక్కసారిగ మూడునెలల అవకాశము లభించుచున్నది. పిల్లలకు అనవసరముగ నెత్తిమీద పెట్టిన విద్యాభారమును క్రింద పారవేయుటకు అవకాశము లభించుచున్నది. విద్యాదేవి నూటికి నూరు మార్కులు వచ్చిననే తప్ప ఎవరినీ ఉత్తీర్ణులుగ చేయజాలదు. కాని విద్య, అవిద్య-ఈరెండును కలియుటచే 100 కి 33 మార్కులతోనే పని జరిగిపోవుచున్నది!

## ఉపాధ్యాయులు పనిచేయు గంటలు

నాగపూరు విశ్వవిద్యాలయము నందలి ప్రధానాధ్యాపకులు వారమునకు 20 గంటలకంటె ఎక్కువ బోధించుట మావల్లకాదు అని చెప్పుచున్నారు. ఆ రాష్ట్ర ప్రభుత్వము "నేడు దేశమునకు ఎక్కువ శ్రమపడవలసిన అవసరముగలదు. మీరు వారమునకు ఇరువది నాలుగు గంటలు పని చేయుడు" అని వారితో చెప్పుచున్నది. ఈ వివాదమెట్లు తీరునో తెలియదు, కాని రెండు పక్షములవారును పద్దెనిమిది గంటల కంగీకరించినచో వివాదము తీరగలదు. వారములో రోజులు ఆరు, రోజుకు గంటలు మూడు. ఆరు మూళ్ళు 18 - ఈ విధముగ లెక్క సరిపోగలదు. 18 అంకె చాలమంచిది కనుక వ్యాసులవారి అంగీకారము కూడ దానికి లభించును. కాని ఇప్పటి గంటవలె ఉపాధ్యాయుల గంట కూడ పూర్తిగ అరవై నిమిషము లుండవలెనని ఎవరును పట్టు పట్టకూడదు. ఏలన ఏదైన ఒక విషయముపై పిల్లల మనస్సు ఏకాగ్రముగ నుండుటలో ఇంతవరకు కలిగిన అనుభవము అరవై నిముషముల గంటకు అనుకూలముగలేదు. ధర్మ శాస్త్రజ్ఞులు క్రొత్త విషయమేదైనను క్రొత్త ముహూర్తమున ప్రారంభించవలెనని నిర్ణయించిరి. ముహూర్త మనగ రెండు ఘడియలు, లేక 48 నిమిషములు. ఈ నిర్ణయము ననుసరించి నలభై - ఏభై నిమిషముల మధ్య ఎక్కడో ఒకచోట గంటను నిర్ణయించ వచ్చును!

## ఉపాధ్యాయులు - శరీర శ్రమ

వారమునకు 20 గంటల కంటె ఎక్కువ బోధించుట సంభవము కాదు. ఈ సంగతిని నేనుకూడ సహజముగనే అంగీకరింపగలను, ఏలన బోధించుటలో మెదడు, ఊపిరితిత్తులు, కంఠము - వీనికి ఎంత పరిశ్రమ

గలుగునో నా కనుభవముకలదు. ప్రస్తుతము నేను ఒక గంటకంటె ఎక్కువ బోధించు పరిశ్రమ చేయజాలను. శ్రద్ధావిశ్వాసములతో బోధించు నెడల ఎవరికైనను ఇట్టి అనుభవమే కలుగును. అయినను ప్రతిదినము 3 గంటలు బోధించుట, 3 గంటలు ఏదైన ఉత్పాదక పరిశ్రమ చేయుట అను సూచనను అంగీకరించుటలో ఏవిధమైన ఆటంకము ఉండవలసిన పనిలేదు, కాని శరీర పరిశ్రమ ఉపాధ్యాయుని పనికాదని తలచు చుండుటచే స్వధర్మ నిష్ఠగల ఉపాధ్యాయుడు ఇందుకు వెంటనే సిద్ధము కాజాలడు.

నే నీ వ్యాసము పరిహాసమునకై వ్రాసితిని. కాని నేనిందు శ్రమికుని యొక్క ఆవేదనను దాచలేకపోతిని. ఇందు నా అవశతను అంగీకరించుచున్నాను.

("సేవక్", జూలై, 1952)



## : 10 :

# సంస్కృతబోధన కూడ ఇంగ్లీషులోనే

### గానుగయెద్దు పద్ధతి

మొన్నటిరోజున వత్సల నన్ను కలసికొనుటకు వచ్చినది. ప్రస్తుత మామె కాలేజీలో చదువుచున్నది. ఏమేమి విషయములు చదువుచున్నదను చర్చలో బొంబాయి రాష్ట్రమునందు అన్ని విషయములును ఇంగ్లీషుద్వారానే బోధింపబడుచున్నవని తెలిసినది. ఈ పద్ధతి బహుశః పదియేండ్లవరకు సాగవచ్చునని ఆమె చెప్పినది. ఆమె చెప్పినది ఎంత వరకు నిజమో నాకు తెలియదు. ఇంతవరకు ఇంగ్లీషుద్వారానే బోధన సాగుచున్నదని నేనును ఎరుగుదును. కాని సంస్కృతముకూడ ఇంగ్లీషులోనే బోధింపబడుచున్నదని విని నేను ఆశ్చర్యపడితిని. అనగా ఇప్పుడు మాతృభాష ఒక్కటియే ఇంగ్లీషుద్వారా బోధింపబడుటలేదు. ఇది చాల గొప్పసంగతి. ఇంగ్లీషుద్వారా సంస్కృతము బోధించుట ఎంత విచిత్రమైన విషయమో, అందరును గ్రహింపవచ్చును. కాని ఇది ఎన్నియో సంవత్సరములనుండి జరుగుచున్నది. నేడుకూడ అట్లే జరుగుచున్నదని నాకు తెలియదు. సంస్కృతమునకు మన మాతృభాషతో ఎంత దగ్గర సంబంధముకలదో ఈ బోధించువారు ఎందు కాలోచింపజాలరు ! మాతృభాషద్వారా సంస్కృతము బోధించుటచే ఆ పని ఎంత తేలికగను, రుచికరముగను జరుగగలదు ? దానిని ఇంకను రుచికరముగ చేయవలెనన్న సంస్కృతముద్వారానే నేర్పవచ్చును. కాని ఇంగ్లీషుద్వారా బోధించుట అనునది అర్థములేని పని. దీని కర్థము పరంపరాగతమైనదానిని వీరు విడుచుటకు సిద్ధముగ లేరని తెలియుచున్నది. ఉపమానము మంచిది

కాకపోయినను గానుగయెద్దువలె మనము గాడిలోనే తిరుగుచున్నామని దీనివలన స్పష్టపడుచున్నది.

## సంస్కృత మెందుకు నేర్చుకొనుచున్నాము ?

వత్సలవలన ఇంకొక విషయము కూడ తెలిసినది. పాఠ్య క్రమములో పెట్టిన సంస్కృత సాహిత్య భాగము శృంగార వర్ణనాభూయిష్ఠమగుటచే తరగతిలో దానిని చర్చించుటయే అసంభవమై పోవుచున్నవని ఆమె చెప్పినది. 36 ఏండ్లక్రిందటము నేను బరోడా కాలేజీలో నుంటిని. అప్పు డచ్చట సంస్కృత విద్యార్థులకు ఋతుసంహారము- మేఘదూతము మొదలయినవి బోధింపబడుచుండెను. భగవదనుగ్రహము వలన నేను కాలేజీలో సంస్కృతమునకు బదులు ఫ్రెంచి తీసికొంటిని. ఇందుచే ఆ బాధలు నాకు తప్పినవి. కాని మనము సంస్కృత మెందుకు నేర్చుకొనుచున్నాము ? అనునదికూడ ఆలోచించవలెను. వివేకానందుడు "వేదాంతమును ప్రచారము చేయవలెనన్న ప్రజలకు సంస్కృతము నేర్పుము. నీపని నెరవేరును" అని చెప్పెను. అనగా వివేకానందుని దృష్టిలో సంస్కృత మనగా వేదాంతము. గీత, ఉపనిషత్తులు, రామాయణము, మహాభారతము మొదలయిన గ్రంథములు సంస్కృతము నందలి సజీవ సాహిత్యము. కాని కాలేజీలలోని నిర్జీవమైన పరంపర ననుసరించువారికి ఈ సజీవ సాహిత్యము నచ్చదు. లోకమునకు భయపడి బి. ఏ. పరీక్షకు మాత్రము వీనిలో కొన్నిభాగములు పెట్టుచున్నారు.

## ఆధ్యాత్మికదృష్టితోనే

సంస్కృతముపేరుమీద నేడు బోధింపబడునంత వాఙ్మయము మాత్రమే సంస్కృతములో నుండినచో నేను సంస్కృతమే నేర్చుకొనియుండకపోదును, సంస్కృతములో నాటకములు, నవలలు మొదలైనవి కూడకలవు, కాని సంస్కృతముయొక్క గొప్పతన మదికాదు. అధునిక

భాషలలో ఇట్టి వాఙ్మయము కావలసినంత కలదు. దీనికొరకు విశేషించి సంస్కృతము నేర్చుకొనవలెనను ప్రయత్నమెందులకు? ఆధ్యాత్మిక దృష్టితోనే సంస్కృతము నేర్చుకొనవలెనను బుద్ధి కలుగవలెను. లేదా భాషా శాస్త్రజ్ఞులైనవారు సంస్కృతమును నేర్చుకొందురు. కాని మనము సామాన్య ప్రజల దృష్టితో ఆలోచించుటలేదు కనుకనే ఈ విషయము మనకు స్ఫురించుటలేదు.

("సేవక్", డిశంబరు, 1949)

## : 11 : సెలవురోజులు మార్చండి

హిందూదేశములో కొన్ని వేల సంవత్సరముల నుండి అధ్యయనము, అధ్యాపనము సాగుచున్నవి. కాని పాఠశాలలకు దీర్ఘకాలపు సెలవులిచ్చు పద్ధతి ఎవరికిని తోచలేదు. ఇంగ్లీషు విద్య మొదలుపెట్టగనే విద్యావిధానములో సెలవుల పద్ధతి ప్రవేశించినది. మొదట సామాన్యముగా వారములో ఒకరోజు అనధ్యాయముగ నుండెడిది. ఇదికాక పెద్దవారెవ్వరైన వచ్చుట ఇతర విశేష సందర్భములు కూడ సెలవులుగ పాటింపబడుచుండెను. కాని ఇప్పుడు సంవత్సరము మొత్తములో ఏదో విధముగ ఆరు ఏడు నెలలు మాత్రమే పాఠశాల నడచుచున్నది. నేటి పాఠశాలలు చెరసాలలవలె తయారయినవి కావున సెలవులు అవసరమే అనిస్పష్టపడుచున్నది. అనగా దీనినిగురించి మనము బాధపడవలసిన కారణమేమియులేదు.

### సెలవులు వర్షాకాలములో నుండవలెను

కాని దీర్ఘకాలపు సెలవులు ఇవ్వవలసియే యుండునెడల ఎప్పుడివ్వవలెను ? అను విషయమున పునర్విచారణ జరుగవలెను. ఇట్టి సెలవులు ప్రస్తుతము వేసవి దినములలో ఇచ్చు అలవాటు సాగుచున్నది. ఇచ్చటి ఉష్ణము తెల్లదొరలకు సహింపరానిదిగ నుండుటచే వారు వేసవిలో ఈ సెలవులు ఏర్పాటు చేసిరి. ఆ రోజులలో వారు శీతల ప్రదేశములకుపోయి అచ్చట ఉండేవారు. కాని ఇప్పుడట్టి ప్రశ్నయేలేదు. తెల్లదొర లిప్పుడు హిందూదేశము విడచిశాశ్వతముగ ఇంగ్లండు యొక్క శీతల వాతావరణములో నుండుటకు వెళ్ళిపోయిరి. కావున ఇంతటినుండి వేసవి సెలవులు మార్చి వర్షాకాలములో ఇచ్చుట బాగుగనుండును. వర్షా

కాలములో రైతులు పొలములు దున్నుదురు. అప్పుడు పిల్లలు పొలములలో పనిచేయ గల్గుదురు. ఒకేసారి ఒకటి రెండు నెలలు సెల విచ్చుటకాక పొలము దున్ను సమయమును చూచి ప్రతిసారి 15 రోజులు సెలవులు ఇచ్చుచుండవచ్చును. వేసవిలో పగలు దీర్ఘముగ నుండును. అప్పుడు పొలములలో కూడ పనియుండదు. ఆ సమయములో సెలవు లిచ్చుట వలన పిల్లలు ఎండలో ఇటునటు తిరుగుట లేదా ఇంటిలో నిద్ర పోవుట తప్ప ఇంతకంటె వేరు పనియుండదు. కావున ఈ మార్పు చాల అవసరము. తెల్లదొరల రాజ్యము పోయి రైతుల రాజ్యము వచ్చినది అనుసంగతి అందరును గమనింపవలసి యున్నది.

('సింహావలోకనము' నుండి)

## :12: కౌటుంబిక పాఠశాల

మనోభావములకు ప్రత్యక్ష జీవితముతో ఎడబాటు కల్గినయెడల అవి నిర్జీవములగును. ఆ జీవితము భావశూన్య మగును. మనుజుడు ఇంటియందు జీవించుచున్నాడు. పాఠశాలయందు ఆలోచించుట నేర్చుకొనుచున్నాడు. ఇందుచే అతని జీవితమునకును భావములకును సంబంధ ముండుట లేదు. దీని కుపాయ మేమన ఒకవైపునుంచి ఇంటియందు పాఠశాలను ప్రవేశపెట్టవలెను. రెండవవైపునుంచి పాఠశాలయందు ఇంటిని చొనుపవలెను. సాంఘికశాస్త్రము పాఠశాలీన కుటుంబములను నిర్మింపవలెను. శిక్షణ శాస్త్రము, కౌటుంబిక పాఠశాలలను స్థాపింపవలెను. ఈ వ్యాసములో పాఠశాలీన కుటుంబ విషయములుకాక కౌటుంబిక పాఠశాలనుగూర్చి కొంత సూచింప దలచితిని. ఛాత్రాలయము లేదా ఉపాధ్యాయుని ఇల్లు శిక్షణకు పునాదిగానెంచి దానిపై శిక్షణ భవనమును నిర్మించు పాఠశాలయే కౌటుంబిక పాఠశాల. ఇట్టి కౌటుంబిక పాఠశాల యొక్క జీవనక్రమ విషయమున—పాఠ్యక్రమము నటుంచి—కొన్ని సూచన లీ వ్యాసములో చేయవలసి యున్నవి. అవి యేవన :—

(1) దైవభక్తి ప్రపంచములో సారవంతమగు వస్తువు. కావున నిత్య కార్యక్రమములో రెండువేళలను సాముదాయకమయిన ఉపాసన లేదా ప్రార్థన ఉండవలెను. ప్రార్థనాస్వరూపము భక్తవరుల సూక్తులతో కూడిన ఈశ్వరస్మరణముగ నుండవలెను. ఉపాసనలో ఒకభాగముగ నిత్యము ఒక నిశ్చితమైన గ్రంథ ముండవలెను. 'సర్వేషామవిరోధేన' అనునది ప్రార్థనకు ప్రధాన సూత్రముగ నుండవలెను. ఒక ప్రార్థన రాత్రి నిద్రించుటకు ముందు, రెండవది ఉదయమున నిద్రలేచినపిమ్మట జరుగవలెను.

(2) ఆహార శుద్ధికి చిత్తశుద్ధికి దగ్గర సంబంధముకలదు. కావున సాత్వికాహారమే ఏర్పాటుచేయవలెను. మసాల కూరలు, మిరపకాయలు, వేపుడు కూరలు, పంచదార ఇంకను ఇతర నిషిద్ధ పదార్థములను విడువ వలెను. పాలను, పాలతో తయారయిన వస్తువులను నియమిత పరిమాణ ములో ఉపయోగింపవలెను.

(3) బ్రాహ్మణునిచేగాని, మరి యే ఇతర మనుష్యునిచేగాని వండించకూడదు. పాకశిక్షణకూడ శిక్షణలో ఒక ఆవశ్యక భాగమే. సార్వజనిక కార్యము లొనర్చువారికి వంటచేయుట తెలిసియుండవలెను. సైనికునికి, ప్రయాణీకునికి, బ్రహ్మచారికి, అందరికిని ఇది రావలసినదే. స్వావలంబమునకు ఇది యొక అంగము.

(4) కౌటుంబిక పాఠశాల తన పాకీపనిని తానే చేపట్టవలెను. అస్పృశ్యతా నివారణమునకు అర్థము ఎవరికినీ దూరముగ నుండుట మాత్రము కాదు, సమాజోపయోగమైన ఏపనీ ఏవగించుకొనకుండుట కూడ జరుగవలెను. పాకీదొడ్డిని శుభ్రపరచుట అంత్యజుల పని అను భావన పోవలెను. ఇంతేకాక పరిశుభ్రతగురించిన నిశిత శిక్షణ అందే లభించును. సార్వజనిక పరిశుభ్రతను కాపాడు అభ్యాసముకూడ దీని వలననే కలుగును.

(5) అస్పృశ్యులతోసహా అందరకు పాఠశాలలో ప్రవేశముండ వలెనను నియమ ముండనే యున్నది. ఇక కౌటుంబిక పాఠశాలలో భోజనమందుకూడ పంక్తిభేద ముండుటకు వీలులేదు. ఆహారశుద్ధినియమ మున్న చాలును.

(6) స్నానము మున్నగు కాలకృత్యములు తెల్లవారు జాముననే తీర్చుకొను నియమ ముండవలెను. శరీర ఆరోగ్యమునుబట్టి మినహా యింపు లుంచుకొనవచ్చును. స్నానము చన్నీటితో చేయవలెను.

(7) ప్రాతఃకృత్యములవలెనే పండుకొనుటకు ముందు సాయం కృత్యములుకూడ ఉండవలెను. పండుకొనుటకు ముందు శరీరశుద్ధి అవ

సరము. ఈ సాయంకృత్యములకును, గాఢనిద్రకును, బ్రహ్మచర్యమునకును సంబంధము కలదు. ఆరుబయట వేరువేరుగ పండుకొను పద్ధతి యుండవలెను.

(8) పుస్తకశిక్షణకంటె ఏదో యొక పనియందు ఎక్కువ పరిశ్రమ చేయింపవలెను. అధమము 3 గంటలలైనన పరిశ్రమ చేయవలెను. ఇది లేనిదే చదువునకు తేజస్సు కలుగదు. 'కర్మాతిశేషేణ' అనగా పనిచేయగా మిగిలిన సమయములో వేధాధ్యయనము చేయవలసినదని శృతివిధానము.

(9) శరీరమునకు 3 గం. పరిశ్రమ లభించిన పిమ్మటను, గృహకృత్యములును, తన కృత్యములు తానే చేసికొనుపద్ధతి పెట్టుకొను పిమ్మటను ఇక రెండుపేళల వ్యాయామముచేయ నవసరమే లేదు. అయినను ఒకపూట వారివారి అవసరములనుబట్టి ఆరుబయట నాడుట, తిరుగుట లేక ఏదైన నొక వ్యాయామము చేయుటకూడ మంచిదే.

(10) నూలు వడకుటను దేశధర్మము లేదా ప్రార్థనవలె నిత్యకర్మలలో గణింపవలెను. దీనికి పరిశ్రమకిచ్చిన సమయముకాక ప్రత్యేకముగ కనీస మరగంట ఇవ్వవలెను. ఈ అరగంటలోను తకిలీ ఉపయోగించినను పనిజరుగును. నూలు వడుకుట అను ఈ నిత్యకర్మ ప్రయాణాదులలోకూడ మానకుండ చేయవలెనన్న తకిలీయే తగిన సాధనము. కావున తకిలీపై వడకుట వచ్చియే తీరవలెను.

(11) వస్త్రముల విషయములో ఖద్దరునే ఉపయోగింపవలెను. ఇతర వస్తువులుకూడ సాధ్యమైనంతవరకు స్వదేశీవే వాడుచుండవలెను.

(12) సేవకొరకు తప్ప ఇంకే పనికొరకును రాత్రులు మేల్కొని యుండరాదు, వ్యాధి గ్రస్తుల సేవకు మాత్రము ఇది వర్తింపదు, కాని వినోదమునకు లేదా జ్ఞాన సంపాదనమునకైనను సరే రాత్రి మేల్కొనుట నిషిద్ధము. నిద్రకు రెండున్నర జాముల సమయ మీయవలెను.

(13) రాత్రి భోజనము చేయరాదు. ఆరోగ్యము, వ్యవస్థ, అహింస అను ఈ మూడిటి దృష్టిచేతను ఈ నియమము ఆవశ్యకము.

(14) ప్రస్తుత విషయములపై సంపూర్ణ దృష్టి నుంచుచు వాతావరణమును ప్రశాంతిగా నుంచవలెను.

ప్రత్యక్షానుభవమును బట్టి కౌటుంబిక పాఠశాల జీవన క్రమమునకు సంబంధించిన ఈ పదునాలుగు సూచనలు చేయబడినవి. ఇందు పుస్తక శిక్షణకు, పరిశ్రమ శిక్షణకు సంబంధించిన పాఠ్య క్రమ వివరములు ఈయలేదు. వానినిగురించి వ్రాయవలయు నన్నచో ప్రత్యేకముగా వ్రాయవలసి యుండును.

("మధుకర్" నుండి)

## : 13 : అయిదు పద్ధతులు

కుండ, మట్టి ఒకటా, రెండా ? మీరు రెండు అన్నయెడల మా మట్టి మాకు ఇచ్చి మీకుండ మీరు తీసికొనిపొండు। కుండ, మట్టి ఒకటే అనేయెడల అదుగో అక్కడ మట్టిగుట్ట ఉన్నది. దానితో నీళ్ళుతెండి। మట్టికి కుండకుగల యీ సంబంధమును 'సమవాయ' సంబంధమందురు. వార్ధా విద్యావిధానమునకు నేను 'సమవాయపద్ధతి' అని పేరిడితిని. ఎందుకన ఈ పద్ధతిలో పరిశ్రమకు, శిక్షణకు ఇట్టి సమవాయ సంబంధమే గ్రహింపబడినది.

బాలుర శిక్షణప్రణాళికయంతయు ఏదో ఒక ప్రధాన పరిశ్రమను ఆధారముగ చేసికొని నిర్మించవలెను. పరిశ్రమవలన శిక్షణకు తేజస్సు లభింపవలెను. శిక్షణవలన పరిశ్రమ ప్రకాశవంతము కావలెను. దీని పేరు 'సమవాయపద్ధతి'.

పారిశ్రామిక శిక్షణ అనునది వేరు. అందు కేవలము పరిశ్రమయే నేర్పబడును. అది మట్టి గుట్ట. పుస్తకవిద్య వేరు. అందు కేవలము జ్ఞానము గరపబడును. అది కుండబొమ్మ. దానిని చూడవచ్చును, కాని అది నీరు పట్టుటకు పనికిరాదు.

### కేవల పద్ధతి

ప్రస్తుత విద్యావిధానములో మానవునియొక్క వేరువేరు అంగములలో కేవలము ఒక అంగమునే—బుద్ధినే ప్రధానముగ గ్రహించుచున్నది. అదికూడ వికాసమునకు బదులు విలాసము పెంపొందించినదై యున్నది. ఈ పద్ధతిలో కేవలము బుద్ధి విలాసముపైపే, లేదా దానిని ప్రోత్సహించువారిభాషలో, కేవల శిక్షణపైపే ఎక్కువశ్రద్ధ చూపబడు

చుండుటచే నేను దానిని 'కేవలపద్ధతి' అని పిలుచుచున్నాను. ఈ పద్ధతి లోని ఇతర దోషములు చాలవరకు వదలివేసినప్పటికిని శిక్షణశాస్త్ర దృష్టిలో ఒక గొప్ప దోషము కలదు. అది ఏదన ఈ పద్ధతిలో బాహ్య ఆధారము లేకుండగనే జ్ఞానము గరపబడుచున్నది. కావుననే అది బుర్ర లోనికి అదేపనిగా ఎక్కింపవలసి వచ్చుచున్నది. తత్ఫలితముగ అది సరిగ జ్ఞాపక ముండకపోవుట, జీవితముతో దానికి సామరస్యము లేక పోవుట జరుగుచున్నది. ఇంతేకాక ఇట్టి విద్యవలన నిరుద్యోగముకూడ పెరుగుచున్నది.

## పరిశేష పద్ధతి

రెండవపద్ధతి 'పరిశేషపద్ధతి' ఒక్కొక్క గ్రంథమునకు పరి శిష్టము ఉండునట్లే విద్యకు పరిశిష్టరూపముగ అందు పరిశ్రమకు కొంత స్థానమీయబడుచుండును. ఈ పద్ధతిలో పరిశ్రమ కలిసియున్నను, దాని విలువ ఒక తోక వంటిదిగా గణింపబడుచున్నది. ఇదికాక పరిశ్రమను ఒక మనోరంజనముగను, ఆటగను లేదా అలంకారముగను కూడ స్వీక రించుచున్నారు. విద్యయందు కలుగు శ్రమను పోగొట్టుకొనుటకు లేదా ప్రదర్శనము కొరకు మాత్రమే అది ఉపయోగపడుచున్నది.

## సముచ్చయ పద్ధతి

మూడవ పద్ధతి 'సముచ్చయ పద్ధతి', ఈ పద్ధతిలో పరిశ్రమకు విద్యకు రెండింటికి సమానమగు విలువ ఇచ్చుటకు ప్రయత్నము చేయ బడుచున్నది. అనగా జ్ఞానమున కెంత సమయ మీయబడునో పరిశ్రమ కును అంత సమయమీయబడును. మట్టి - నీరు అను వాని అర్థము కుండకాదు, రెండిటిని కలిపి కుమ్మరి దానిలో తన కళను, కుమ్మరించి నప్పుడే కుండ తయారగును. సముచ్చయ పద్ధతిలో శిక్షణ పొందు వారికి సంతోషము కలుగుటలేదు, నేను చదువుకొనవలసిన సమయము

వ్యర్థముగ ఈ పరిశ్రమలో గడచిపోవు న్నదని అజ్ఞాతడనుకొనును. అతడు ఒకప్పుడు తప్పనిసరియై పరిశ్రమ చేయును. ఒకప్పుడు స్వార్థము కొరకు చేయును, ఇంకొకప్పుడు విద్య పేరుతో చేయును. ఈ పద్ధతిలో పరిశ్రమ శిక్షణకు ఒక అంగముగ సమావేశ పరచక ఏర్పుటచే దాని విషయములో అది ఒక జీవికాసాధనము మాత్రమే అను దృష్టి ఏర్పడు చున్నది. ఈ దృష్టివలన దానియందు గౌరవము విద్యకంటె తగ్గిపోవు చున్నది. కావున పరిశ్రమ చేయుచున్నప్పటికిని అతనికి దానియందు ఉండవలసినంత రుచి ఉండుటలేదు. అంతేకాక విద్యకును పరిశ్రమ కును పరస్పర సంబంధము కూడ సరిగా కుదురుటలేదు, విద్యలో 'శాకుంతలము' లేదా ఆఫ్రికా భూగోళము నేర్పబడుచుండును. పరిశ్రమలో అతనికి కావలసినవి వడ్రంగము, దానికి కావలసిన కలప దొరుకు ప్రదేశముల విజ్ఞానము. ఈ హేతువుచే ఈ రెండిటి విషయములు ఒకదాని కొకటి పూరకములు కాలేకపోవుచున్నవి.

## సంయోజన పద్ధతి

పైన తెలిపిన మూడు పద్ధతులకంటె వేరైన 'సంయోజనము' అను పేరుగల ఒక పద్ధతి శిక్షణ శాస్త్రజ్ఞు లెరుంగుదురు, 'కర్మద్వారా జ్ఞానము' అను నీ సమవాయి పద్ధతియొక్క సూత్రము ఇం దంగీకరింప బడినది, కాని ఈ పద్ధతిలో కర్మకు అప్రధాన స్థాన మీయబడినది. ఏదైన జ్ఞానము గరపవలెనన్న దాని కనుకూలమైన ఒక సంయోజనమును గ్రహించి నేర్పుట జరుగుచున్నది. కాని అది కృత్రిమ రూపముగ తయారగుచున్నది.

## సమవాయ పద్ధతి

సమవాయ పద్ధతిలో జీవనవ్యాపి ఐనట్టియు అన్ని అంగములతో కూడినట్టియు ఏదో ఒక ప్రధాన పరిశ్రమ శిక్షణకు ఆధారముగ స్వీకరింప

బడును. ఈ పరిశ్రమకు శిక్షణకు కేవలమొక సాధనగాకాక దానినుండి విడదీయరాని ఒక అంగముగ నుండును ఆ పరిశ్రమ ద్వారా ఈ క్రింది మూడు ఉద్దేశ్యములు పూరింపబడును (1) పిల్లవాని యందలి అన్ని విధములైన శక్తులను వికసింపచేయుట (2) పిల్లవానికి జీవనమున కుపయోగించు సమస్త విషయముల జ్ఞానము కలిగించుట (3) పిల్లవానికి జీవికను సంపాదించుకొనుటకు సమర్థమైన సాధనమును తయారుచేసి పెట్టుట; ఈ ఉద్దేశ్య పూర్తికి ప్రమాణముగ బాలుర పరిశ్రమనుండి పాఠశాలలో విద్య నేర్పినందులకైన వ్యయములో కొంత భాగము కూడా రావలెనని అపేక్షింపబడుచున్నది. ఈ ప్రమాణము చిన్నదే అయినను చాల మహత్తరమైనది.

ఈ విధముగ సమవాయ పద్ధతి ప్రస్తుతమున్న విద్యావిధానము లన్నిటికంటె భిన్నమైనదియు, ఇంతవరకు కలిగిన అనుభవములపై నిశ్చయింపబడిన ఆఖరు పరిణామము నయి ఉన్నది. ఈ పద్ధతిలో ఎన్నుకొనబడు ప్రధాన పరిశ్రమకు వ్యాపకమైనదియు అన్ని అంగములతో కూడినదియు అయిఉండవలెనని పైన చెప్పబడినది. నేటి హిందూదేశ పరిస్థితి చూచిన నూటికి 80 పాఠశాలలలో ఇట్టి ప్రధాన పరిశ్రమగా నూలు వడకుటయే ప్రారంభింప తగినదని నా అభిప్రాయము. 7 సంవత్సరముల వయస్సుగల పిల్లలను దృష్టిలో పెట్టుకొని నేనిది చెప్పుచున్నాను.

("ప్రధాన పరిశ్రమ వడకుట" నుండి కొంచెము మార్చి)

:14: # ప్రధాన పరిశ్రమను ఎన్నుకొనుటలో వివేచన

## మన సంస్కృతియొక్క విశిష్టత

ప్రాతిపదికవిద్యను బోధించు పాఠశాలలో కోళ్ళపెంపకము చేపలుపట్టు పరిశ్రమలను ప్రధాన పరిశ్రమలుగ స్వీకరింపవచ్చునా ? అని నేడొక ప్రశ్న వచ్చినది. ఈ ప్రశ్న హిందూదేశములో మాత్రమే బయలుదేరుచున్నది. కాని ప్రపంచమునందలి ఇంకేదేశమందును ఇట్టి ప్రశ్న బయలుదేరదు. ఇది హిందూదేశముయొక్క దురదృష్టము కాక పోవుటమేకాక దీనిలో మన సంస్కృతియొక్క చరిత్ర ఇమిడి యున్నది.

అహింసా దృక్పథము కలవారు దీనిని రెండు విధములుగ వీక్షింపగలరు. ఇద్దరును అహింసకులే కావచ్చును. అయినను ఇద్దరును తమ నిర్ణయములను వేరువేరుగ తెలుపవచ్చును. దీనికొక ఉదాహరణము నిచ్చుచున్నాను. నా కహింసపై ఎంత విశ్వాసము కలదో కాకాగారికిని అంతేకలదు. మాంసాహారమును నేనెంత నిషిద్ధమని తలచుచున్నానో ఆయనయు అంత నిషిద్ధమని తలచుచున్నారు. ఆయన ఫిషరీ విషయములో ఒక వ్యాసమును వ్రాసియున్నారు. అందు "ఫిషరీ శిక్షణ సంబంధమైన అనేకములగు ఆవశ్యక విషయములతోకూడిన పరిశ్రమ కావున దీనిని 'బేసిక్ క్రాఫ్ట్'గా చక్కగ నడిపింపవచ్చును" అని చెప్పిరి. బేసిక్ క్రాఫ్ట్‌కు కావలసిన మంచి విషయములన్నియు ఈ పరిశ్రమలో ఉన్నవనియు ఇతర పరిశ్రమవలెనే ఈ పరిశ్రమలను నాధారముగ చేసికొని కూడ అనేక విషయములను గురించిన జ్ఞానము గరపవచ్చుననియు

నేనంగీకరించుచున్నాను. కొంతమంది "నే డీపద్ధతి క్రూరపద్ధతితో నడచు చున్నది. ఇంతకంటె శాస్త్రీయమైన పద్ధతితో నడచిన యెడల ప్రాణ హింస తగ్గిపోగలదు. ఈ పరిశ్రమ పిల్లలకు నేర్పినయెడల తప్పే మున్నది?" అని చెప్పుదురు.

## చేపలుపట్టుట ప్రధాన పరిశ్రమయా ?

ఈ పరిశ్రమనుగూర్చి ఆలోచించినమీదట దీనిద్వారా పిల్లలకు విద్యగరపుటకు నేను సిద్ధపడజాలకున్నాను. ఏలన దీనిలో పిల్లలకు గేలము ఏవిధముగ తయారుచేయవలెనో నేర్పవలసి యుండును. పిమ్మట దానికి యెర్ర ఎట్లు గ్రుచ్చవలసియుండునో చెప్పవలసి యుండును. యెర్ర గ్రుచ్చుటవలన దానిని తినుటకై చేప ఆకర్షింప బడును. అనగా చేపను మోసగించుట అన్నమాట. మనము దానికి ఆహారము పెట్టుచున్నట్లు కన్పించుచున్నాము. పాపమది తినుటకు గేలమును పట్టుకొనగనే మనము దానిని వెంటనే పట్టుకొని బుట్టలో వేసికొనుచున్నాము. ఇందేవిధముగ చూచినను అసత్యమును కలదు, హింసయు గలదు. కావున నాకీపని చాల దుష్కరము. పిల్లలకీవిధముగ విద్యనేర్పుట నావలన కానిపని. ఈ విధముగ ఆకర్షించి మోసగించుట కూడ మానవధర్మమగు సత్యములో భాగమే యని నేను పిల్లలకెట్లు బోధింపగలను. అనగా మానవీయ సత్యము, ఇతర సత్యము అని ఒక భేదమును మనము కల్పించుకొనవలసి వచ్చును. ఎప్పుడైనను అవసరమైనచో హింసనైనను అంగీకరింపగలనుగాని అసత్యము నంగీకరించుటకు నామనస్సెంతమాత్రమును ఒప్పదు. ఇక చేపలను మోసగించ నక్కరలేకుండ వాని కెక్కువ బాధకలుగకుండ అవి మన చేజిక్కు ఉపాయము నెవరైనను చెప్పవచ్చును. అప్పుడుగూడ పిల్లల శిక్షణలో ఇట్టి విషయమును నేర్పుట ఉచితము కాదనియే నా అభిప్రాయము. ఈ ప్రాణులలో స్పష్టమగు భావనాశక్తి నాకు కన్పించుచున్నది.

మనము తినుట కేదైన పెట్టినచో వెంటనే ప్రేమతో దానిని తినుటకు మనవద్దకు చేప పరుగెత్తుకొని వచ్చుచున్నది. భయపెట్టినచో పారిపోవు చున్నది. అనగా అది మన ప్రేమను గుర్తించుచున్నది. క్రోధమును గుర్తించుచున్నది. వానియందు ఇట్టిభావన స్పష్టముగ కన్పించుచున్నపుడు వానిని చంపవలసినదని పిల్లలకు బోధించుట ఎట్లో నా కర్థమగుట లేదు. ఇది చేపలుపట్టు విషయము. కోళ్ళను పెంచు పరిశ్రమనుగూర్చి నా కిట్టి విరోధభావము లేదు. దానిలో ఇంకను ఇతర విషయములు కూడ గలవు. దానినిగూర్చి ఇచ్చట నే నధికముగ చెప్పను. ఫిషరీ విషయములో నాకు కలిగిన భావము పౌల్ట్రీ విషయములో కలుగుటలేదు. అది దీనికంటె భిన్నమైనదనియే నేను చెప్పదలచుకొనినది.

## అహింసాధిష్ఠితమైన ప్రధాన పరిశ్రమ

'సమవాయ మన నేమి?' అని ఒకరు న న్నడిగిరి. సమవాయ మనగా 'జ్ఞాన కర్మల సమ్మేళనము' అని నేను చెప్పితిని. అంతట ఆత డిట్లనెను. 'అట్లయినచో అణుబాంబుల కర్మాగారములో మనము విద్యా ర్థులను అప్పగించినచో కర్మయు జరుగును, దాని ద్వారా వారికి జ్ఞాన మును లభ్యమగును. జ్ఞాన కర్మల భేదము నశింపచేయబడగనే అది 'సమవాయ పద్ధతి' కాగలదు. దీనిని మీరంగీకరింతురా?' నే నిట్లు చెప్పితిని 'అంగీకరింపను, సమవాయమునందు జ్ఞాన కర్మలకు అభేద ముండును. కాని మీరు చెప్పినది అణుబాంబుల కర్మాగారము. అందు విద్యార్థిని నేను ప్రవేశపెట్టను. ఏలన అందు మా సర్వోదయ సిద్ధాంత మునకు బాధ కలుగును. ఇట్టి పరిశ్రమ నవీన విద్యలో నడువదు' అంతట ఆతడు ఇట్లనెను. 'అయితే మీ అభిప్రాయములో జ్ఞాన కర్మల భేదము నశించుటయు, సాధ్యసాధనములు రెండును పరిశుద్ధములగుటయు సమవాయమని తెలుచున్నది.' ఇది విని నాకు చాల సంతోషము కల్గెను. ఆయన చెప్పినదానికి నే నంగీకరించితిని. మన సమవాయ పద్ధతిలో

మన సాధనసాధ్యముల రెండింటియొక్కయు పరిశుద్ధని గూర్చిన వివేక మవసరము.

కొంద రిట్లడుగుచున్నారు 'మీరు చిన్నచిన్న పనిముట్లు చేపట్టు చున్నారుగదా, వానిచేత ఉత్పత్తి ఏమిజరుగును?' వారికి నా సమాధానము 'హిందూదేశపు పరిస్థితి ఎట్టిదో చూడండి. ఇచ్చటి పేదతనమును చూడండి. తరువాత ప్రశ్న అడగండి. మా ప్రయత్నమంతయు పేదవారి కొరకే. గ్రామములలో ఎంత పేదతనమున్నదన గ్రామస్థులు తమ పిల్లలను మనవద్దకు చదువుకొనుటకు పంపరు. పిల్లలు ఇంటిదగ్గర ఉన్నచో కుటుంబభారము కొంత తగ్గింతురు. స్కూలులో సంపాదన ఏమియు లేదుగదా! ఇట్టిస్థితిలో వారు తమ ఇంటిదగ్గర పనిచేసికొనుచు స్కూలుకుకూడ వెళ్ళుట కవకాశముగల పద్ధతిని మనము అమలులో పెట్టవలెను.'

మన స్కూలుద్వారా బీదలకు సేవ జరుగవలెను అను విషయము మన దృష్టిలో నుంచుకొన్నచో 5 గంటలు చదివించవలెనా? లేక 6 గంటలు చదివించవలెనా? ఒకసారి చదివించవలెనా? లేక రెండుసార్లా? ఇట్టి ప్రశ్న లన్నిటికి సమాధానములు స్వయముగనే లభించును. ఏ పద్ధతిలో పేదవారి సేవకు అవకాశముండునో ఆ పద్ధతియే నవీన విద్యను బోధించు పాఠశాలలో సాగగలదు. ఇట్టి పద్ధతిగల పాఠశాలను నడపుట ప్రారంభించినపుడే అవి ఎక్కువ సంఖ్యలో స్థాపింపబడుటయు జరుగును.

## : 15 : శిక్షణా కార్యక్రమముయొక్క సూత్రత్రయము

మకాము, దమోర్. 28 - 9 - 55

(ఒక బాలునుండి)

....నవీన విద్యయొక్క కార్యక్రమములో ఏవిధమైన జ్ఞానము కలుగును? ఏ విధమైన జ్ఞానము కలుగదు? అని వివరించు ఒక నియత మైన విభాగము లేదు. సాధారణముగ అందు సమస్త జ్ఞానము లభించును. కాని దాని కొక గీటురాయికలదు. పదిరోజుల ఆకలితీర్చుకొనుటకు నేడే భుజింపక నేటి ఆకలికి మాత్రమే ఎట్లు భుజింతుమో అట్లే బాలకుని నేటి జీవితమునకు ఎంత జ్ఞానము అవసరమో అంత జ్ఞానమే నేడు వాని కిచ్చెదము. ఇది జ్ఞానార్జన సూత్రము. లేనిచో అది జ్ఞాన పరిగ్రహము కాగలదు. దాని భారము బాలుడు మోయజాలక క్రింద పారవేయుటకాని బలవంతముగ అతనిచే దానిని మోపింపజేయుటగాని చేసినయెడల అతని బుద్ధిశక్తిపై అధిక భారము పడి అతని జీవిత వికాసము కుంటు వడుట జరుగును.

### నవీనవిద్యయొక్క దృష్టి

'నవీనవిద్య' అని మనము చెప్పుచున్నాము. కాని వానిలో క్రొత్త ఏమియులేదు. ఉత్తమమైన ఆత్మవికాసమును పొందినవారు జ్ఞానము అజ్ఞానము అను రెండును ఉపకారములే అని తలచి, రెంటిని బాగుగ సంపాదించిరి. కావుననే వారికి ఆత్మదర్శనము కల్గెను. ఇదియే నవీనవిద్యయొక్క దృష్టి.

## నూటికి నూరుపాళ్లు జ్ఞానము

నేటి పాఠశాలలో నూటికి 33 మార్కులు వచ్చిన ప్యాసుచేయు పద్ధతి ఎందుకు పెట్టబడినది ? దీని కారణము స్పష్టమే. ఈ పద్ధతి ప్రవేశపెట్టినవారికి మనము పిల్లలనెత్తిపై నేడు వారికక్కరలేని జ్ఞానము కూడపెట్టుచున్నా మను సంగతి తెలియును. ఇట్టిస్థితితో నూటికి నూరు పాళ్లు ఎట్లాశించగలము ? కాని నవీన విద్యలో నేను నూటికి 100 పాళ్ళ జ్ఞానము ఆశింతును.

## యోగ్యమైన శిక్షణ విభాగములు

భూగోళము, చరిత్ర, గణితము, రేఖాగణితము ఈ విధముగ విషయములను లెక్కింపవలెనన్న అవి అసంఖ్యములుగ లెక్కింప వచ్చును. ఈ లెక్క యేల ? వాగ్వికాసము, మనోవికాసము, దేహ వికాసము, బుద్ధి వికాసము, ఇంద్రియవికాసము ఇట్టి విభాగములు చేయ వచ్చును.

ప్రాచీనకాలములో మన పెద్దలు పంచభూతములను పాటించు చుండెడివారు. నేడు కనిపెట్టబడిన మూలపదార్థములుకూడ ఆ పంచ భూతములను ఖండింపజాలవు. ఆ పంచభూతములు దృశ్యవస్తువును విభజించుటచే ఏర్పడినవి కావు. దర్శనముయొక్క విభాగములోనుండి వచ్చినవి. మనకు 5 ఇంద్రియము లున్నంతవరకు మన దర్శనము 5 విధములుగ నుండును. సృష్టియందు 5 భూతములే స్థిరముగా ఉండును. దీనికి తాత్పర్యమేమన మనము అనేక విషయములనుగాని అనేక గ్రంథములనుగాని నిర్మించుట కావలసినది. పిల్లలను తయారు చేయుట అవసరము. అనగా మనస్సు, బుద్ధి మొదలయినవానిని వికసింపచేయవలెను.

పిల్లలు భుజింతురు ; జబ్బుపడుచుందురు ; కావున ఆహార శాస్త్రము, రోగశాస్త్రము, ఆరోగ్యశాస్త్రము వారి కవసరమనుట స్పష్టమే.

## నవీన విద్యయందలి స్వాభావిక విషయములు

మీ బాలకులు గోశాలలో పనిచేయువారును, పాలు త్రాగువారును అయినచో వారికి ఆ విద్య తెలిసికొనవలెనను కోరిక, తెలిసికొనవలసిన ఆవశ్యకత రెండును ఉండును. వారికి చక్కని భాష వచ్చియే ఉండవలెను. నిత్య వ్యవహారమునకు సంబంధించిన గణితము యొక్క అవసరమును ఎవరును కాదనజాలరు. ఒకరితో నొకరు ఎట్లు ప్రవర్తింపవలెనో తెలియనివారిని పశువులుగ నెంతుము కావున నీతివిషయములు, ధర్మవిషయములు విడచుటకు వీలులేదు. చరిత్రవిషయముగ కిశోర్ లాల్ భాయిని గూర్చినజ్ఞానము ఈ పిల్లలకు తప్పక ఉండవలెను. కైజరు యొక్కకాని సీజరుయొక్కగాని జ్ఞానము వారికి ఆవశ్యకము కాదు. గోపురియందలి చర్మ పరిశ్రమాలయము ఎట్లు తయారయ్యెను ? వాళు జంకర్ జీ చర్మము నెట్లు ఒలుచును ? పామును పట్టుకొను విద్య భాపూకు ఎట్లు పట్టుపడెను ? మనోహర్ జీకి కుష్ఠురోగుల సేవచేయవలెనని సంకల్పము ఎట్లు కలిగెను ? ఈ విషయము లన్నియు తెలిసికొనవలెను. ఇతర దేశకాలములకు సంబంధించిన విషయములకు నవీన విద్యలో స్థానములేదని దీని కర్థము కాదు. అవియును కావలసినవేకాని వాని ప్రసంగము, వాని ఆవశ్యకత కలిగినప్పుడే అవి చెప్పవలెను.

## నవీనవిద్యయొక్క త్రివిధజ్ఞానము

ఉయ్యాలమొదలుకొని శ్మశానమువరకు తెలియవలసిన జ్ఞానమంతయు చెప్పుకొనుచు పోవుటకాదు చేయవలసినది. నేడవసరమైనంత మాత్రమే చెప్పుట, ఆయాసమయములలో ఏయే జ్ఞానము ఆవశ్యకమో దానిని సంపాదించుకొనుశక్తిని కలిగించుట, లోపల దాగియున్న స్వతస్సిద్ధమగు జ్ఞానము వెలుపలికి గొనివచ్చుట చేయవలెను. ఇదేవిధముగ త్రిముఖమగు కార్యక్రమ మగుచున్నది. వీనికి (1) ప్రకృతి

జ్ఞానము, (2) జ్ఞానశక్తి సంపాదనము, (3) ఆత్మజ్ఞానము అని పేర్లు పెట్టవచ్చును. ఈ దృక్పథమే వేరయినది, కనుక నేటి నీరస పద్ధతికిని దీనికిని ఎట్లు సరిపడగలదు ?

(సేవక్ - జనవరి 1953)

## : 16 : తారతమ్యము అసంభవము

(ఒక లేఖనుండి)

16 వ ఏట అనగా ప్రాతిపదిక విద్యాభ్యాసము ముగిసినపిమ్మట తయారయిన మీ పిల్లవానిని ప్రభుత్వ పాఠశాల పిల్లవానితో పోల్చిచూచు నట్టి అవసరమే కలుగనివిధముగ పరిస్థితి ఏర్పడవలెను.

మీ పిల్లవాడు అధ్యాత్మవిద్యాసంపన్నుడు కాగా మామూలు శిక్షణ పొందిన బాలునికి దాని వాసనకూడ అంటియుండదు. ఇతడు ఒక వృత్తి పరిశ్రమలో నేర్పరికాగా అతడు పూర్తిగ నిరుద్యోగిగ నుండును. ఇత డన్ని వ్యవహారములలోను సమర్థుడుకాగా అతడు వ్యవహార జ్ఞాన శూన్యుడుగ నుండును. ఇతని యెదుట తన శక్తిని ప్రదర్శించుటకు కావలసిన రంగమేర్పడియుండ అతని కన్నుల యెదుట కటిక చీకటి వ్యాపించియుండును. ఇతడు విమర్శించువాడుకాగా అతడు విమర్శింపబడువా డగును.

## : 17 :

## దిగ్దర్శనము

గోసాయీగంజ్ 29 - 4 - 52

*(ఒక లేఖనుండి)*

బొత్తిగా చిన్న పిల్లలకు ఒకే విషయము బోధించుట వలన ఉపయోగములేదు. అట్లే వారిమీద అనేక విషయముల భారము మోపుటయూ వ్యర్థమే. వారికి బోధించవలసిన విషయ మొక్కటియే. అది 'జీవన వికాసము'. దానికి మూడు అంగములు కలవు. వాక్కు, శరీరము, మనస్సు.

(1) వాక్కునకు మంచి భజన కీర్తనలు, పద్యములు మున్నగునవి తియ్యని కంఠముతోను, స్వచ్ఛమగు ఉచ్చారణతోను చదువుట, సామాన్యమైన అర్థజ్ఞానము, పఠనము, వాక్ప్రకాశనము, సత్యము, ప్రియము, మితము అగునట్లు మాట్లాడు నభ్యాసము.

(2) శరీరమునకు బహిరంగ స్థలములో పరిశ్రమ, ఒకటి మార్చి ఇంకొకటి చొప్పున పగలంతయు ఏదో ఒక పనిచేయుట, ఆటలు, హితమైన మితాహారము, దినచర్య, ఋతుచర్య, సామాన్యమయిన ఉపచారము, వీనికి సంబంధించిన మనము, దానికి తగిన ఆచరణము.

(3) మనస్సునకు - మన ప్రవర్తన మెట్లుండవలెను ? మనము అందరకు ఎట్లు ఉపయోగకారులము కాగలము ? దేహేంద్రియములను ఎట్లు నిగ్రహింపవలెను ? మనము దేహముకంటె భిన్నులము అను నీ విషయములను గూర్చిన జ్ఞానము; చుట్టుప్రక్కలనున్న సమాజమును గూర్చియు సృష్టిని గూర్చియు అవసరమైనంతవరకు తెలిసికొనుట.

ఇట్లది సంగ్రహముగ శిక్షణ స్వరూపము. పిల్లలు శిక్షణ, ఇవి రెండును కలిసియే జీవనము నడువవలెను.

## మూడు ముఖ్యవిషయములు

ఏదో ఒక భాషలో చక్కని జ్ఞానము, తనపని నెరవేర్చుకొనుటకు కావలసిన నిశ్చిత గణితజ్ఞానము, ఏదో ఒక పరిశ్రమలో స్పష్ట, స్థూలముగా ఈ మూడు విషయములును ఉండవలెను.

## సమవాయమును గూర్చి చింతింపనక్కరలేదు

పరిశ్రమపై ఆధారపడిన జ్ఞానము అనగా పరిశ్రమరు జ్ఞానముతో సంబంధము కలుపుట. దీనినిగూర్చి ఆలోచించుటలో జనులు విభ్రాంతు లగుచున్నారు. కాని దీనినిగురించి చింతింపవలసిన అపసరములేదు. నేతపనికి 'జ్ఞానేశ్వరి'తో ఏమి సంబంధము? ఇట్టి చర్చలో మనము పడకూడదు. పుస్తకముల రాసితో మనకు పనిలేదు. కాని ఏ గ్రంథము మొత్తముసమాజమునంతటిని నిలిపియుంచగలిగినదో దానికి పరిశ్రమతో సంబంధ మేమి అను శంక, 'తల్లికి పిల్లతో ఏమి సంబంధము' అనుట వంటిది. జ్ఞాన మెప్పుడును అపరిపక్వముగ నుండరాదు. ఆచరణతో కూడిన జ్ఞానము ఎప్పుడును అపరిపక్వముగ నుండజాలదు.

## శిక్షకుని ఆశ్రమము

శిక్షకుని ఆశ్రమ మనగా వానప్రస్థాశ్రమము. ఆ వైపు ఎంత చురుకుగా పురోగమింపగలమో అంతవరకు పిల్లల శిక్షణకూడ సరియైన ప్రాతిపదిక పద్ధతికి చెందినదగును.

---

## : 18 : గుణవికాసమునకు అంగములు

(1) అకారణముగ భయపడరాదు. భయము కలిగినపుడు భగవన్నామము స్మరింపవలెను. భగవన్నామము నెదుట భయము నిలువజాలదు.

(2) తాను చేయు తప్పులను ఏరోజుకారోజే దిద్దుకొనుచుండవలెను. నిన్నటి తప్పులను నేడు చేయరాదు. నేటి తప్పులను రేపు చేయరాదు, అను విషయమును ధ్యానమందు ఉంచుకొనవలెను.

(3) ఏ విషయమైనను సరిగా అర్థము చేసికొనవలెను ; "అర్థము చేసికొనిన ఆలోచనలను అమలులో పెట్టియే తీరెదను" అను దృఢ నిశ్చయము చేసికొనవలెను.

(4) యథాశక్తిగ ఆవశ్యకత కలిగినపుడు ఇతరులకు సహాయము చేయవలెను. మనకు చాలమందివలన ఇట్టిసహాయము లభించియున్నదని ఎప్పుడును మరువరాదు.

(5) ప్రతి విషయిములోను తానే మొనగాడుగా తయారు కారాదు. ఆత్మనిగ్రహ ముండవలెను.

(6) ఏదో ఒక ఉత్పాదక పరిశ్రమ చేయనిదే భుజింపరాదు.

(7) ప్రతిదినము కొంచెముసేపు నియమముగ గ్రంథపఠనము చేయవలెను.

(8) స్వయముగ గురుజనుల సేవ చేయవలెను.

(9) తిన్నగ కూర్చుండవలెను. తిన్నగ మాట్లాడవలెను, తిన్నని ఆలోచనలే చేయవలెను.

(10) ఎవరితోను దెబ్బలాడరాదు. ఎవరి మనస్సును దుఃఖ పెట్టరాదు.

(11) సత్యముగ ప్రవర్తింపవలెను. ఎప్పుడును సత్యమునే మాట్లాడవలెను.

(12) క్రోధ మెప్పుడును రానీయరాదు. క్రోధమువచ్చుట దౌర్బల్య చిహ్నము,

(13) ప్రతి విషయములోను తన క్షేమిలాభమని చూడరాదు. ప్రపంచము మన భోగమునకు కాదనియు, మనము ప్రపంచ సేవకై ఉన్నామనియు గుర్తుంచుకొనవలెను.

(14) గడబిడ, గందరగోళము, తొందరపాటు. ఉండరాదు.

(15) ఇతరుల దోషములను చూడరాదు; గుణములనే గ్రహింప వలెను.

(16) ఇతరుల దుఃఖమువలన దుఃఖ పడవలెను, ఇతరుల దుఃఖము పోగొట్టుటకు వ్యాకులత చెందవలెను.

(17) ఏవిధమైనరుచిని కోరరాదు, తిండిపోతుతనము ఉండరాదు, స్వల్పముతోనే తృప్తిపడవలెను.

(18) పొగరుబోతుతనము పనికిరాదు, అందరితో కలసిమెలసి యుండవలెను, మృదువుగ మాట్లాడవలెను.

(19) చెడ్డపనిచేయుటకు సిగ్గుపడవలెను, మర్యాదను అతిక్రమింప రాదు.

(20) చేయి, కాలు, కన్ను మొదలైన అవయవములకు అనవ సరముగ బాధ కలిగింపరాదు.

(21) ఎవడైన బలవంతుడు అణచిపెట్టునెడల తాను అణగి యుండరాదు.

(22) దుర్బలు డేదైన తప్పుచేసినచో వానిని క్షమించవలెను.

(23) శరీరమున కేదైన కష్టముకలిగినచో వ్యాకులతచెందక ధైర్యము వహింపవలెను.

(24) పరిశుభ్రత నెప్పుడును పాటించవలెను.

(25) ఎవరిపైనను ఈర్ష్య యుండరాదు. తన ఉన్నతికై ఇతరులకు అధోగతి కలిగించరాదు.

(26) నేను గొప్పవాడను అని తలపరాదు, ఇందే నిజమైన గొప్పతనము కలదు.

చిన్నపిల్లల శిక్షణకొరకు గీతయందు చెప్పబడిన దైవసంపత్తి లక్షణములకు సరళమైనట్టియు ప్రధానమైనట్టియు నర్థమును పైన తెల్పియున్నాను. విశేషార్థము 'జ్ఞానేశ్వరి' లో చెప్పబడియే యున్నది.

## శిక్షణ - పరిశ్రమ

పాఠశాలలలో బోధింపబడు గణితము, చరిత్ర, భూగోళము మున్నగు విషయములను సంస్కరించి వానిలో పరిశ్రమనుగూడ జేర్చవలసియున్నదని మేము చెప్పుచున్నాము. జీవితములో గణితము మొదలైనవాని ఉపయోగము కలదనుటలో సందేహములేదు. పరిశ్రమయొక్క ఆవశ్యకత స్పష్టమే. అయినను ఇంతమాత్రముచే పనిజరుగదు. శిక్షణ యందు ప్రధానముగ గుణవికాసముమీద దృష్టి ఉండవలెను. దానికొరకే పరిశ్రమను తక్కినవిషయములనుకలిపి ప్రణాళిక తయారుచేయవలెను.

## గుణవికాసము

విషయ విభాగము ననుసరించి సమయపట్టిక (టైంటేబులు) తయారుచేయుట పొరపాటు. పరిశ్రమలేకుండ గుణవికాసమునుకలుగదు. గుణపరీక్షయు జరుగదు. కావున పరిశ్రమకూడ నేర్పవలసినదే, దాని వలన బాలుడు స్వావలంబి కాగలడు. ఇదికూడ ఒకగుణమే. తన

ఆలోచనలను చక్కగ ప్రతిపాదింపజాలనిచో వాస్తవమైన సత్యరక్షణ కూడ జరుగదు. కావున భాషాబోధనకూడ గుణవికాసములోనికే వచ్చు చున్నది. కాని పీనియన్నిటికిని శిక్షణదృష్టిలో స్వతంత్రమైన విలువలేదు.

["సేవక్," ఆగష్టు, 1953]

## : 19 : శిక్షకుని ఆశ్రమము

[ బోధగయలో కార్యకర్తల యెదుట ఈయబడిన ఉపన్యాసము ]

ప్రాతిపదికవిద్యలో పరిశ్రమలద్వారా విద్యాబోధన జరుగవలెను. ఇటువంటి విషయములు మన యెదుట ప్రధానములై కూర్చున్నవి. కాని శిక్షకుని ఆశ్రమము ఎట్టిదై యుండవలెను? అను సంగతిపై ఎవరును ఆలోచించునట్లును, లేదా ఆలోచించుట అవసరమని భావించునట్లును కనుపించుటలేదు.

### శిక్షకుడు - గృహస్థుడు

నేడు జరుగుచున్న దిది. మెట్రిక్ పరీక్షలో ఫేలయిన ఒక పిల్లవానిని తీసికొని వానికి ప్రాతిపదిక విద్యానుభవము కలిగించుచున్నారు. అంతట నాతడు శిక్షకుడుగ తన జీవితమును ప్రారంభించుచున్నాడు. దానితోపాటే ఆతడు గృహస్థుడుగ తన గార్హస్థ్యజీవనమునుకూడ ప్రారంభించుచున్నాడు. ఈరెండు ప్రారంభములును ఒకేవిధమైన మహత్త్వము కలవియు, గొప్ప బాధ్యతతోకూడినవియు అయి ఉన్నవి. ఈ హేతువుచే ఈ రెండును ఒకేసారి వహించుట సాధ్యమా? లేక ఈ రెంటిటినిగూర్చి ఏదయిన నియమము ఏర్పాటు చేయవలెనా? అను విషయమునుగూర్చి యోచింపవలసి యున్నది. ఏదైనను ఒక మిక్కిలి గంభీరమైన సమస్యగా ఇది మనయెదుట నున్నది.

### వానప్రస్థుడే శిక్షకుడుగ నుండవలెను

చాల సంవత్సరములనుంచి నేనీ విషయముపై ఆలోచించిన మీదట శిక్షకుని ఆశ్రమము వానప్రస్థాశ్రమమే యని నిర్ణయమునకు

వచ్చితిని. సన్యాసి శిక్షకుడు కాజాలడు. ఏలన అతడు ప్రపంచ సంతతి కిని చెందినవాడు. అతనిది స్వేచ్ఛావిహారము. కేవలము విద్యార్థులకొరకే అతని జీవితము నడువజాలదు. బ్రహ్మచర్యాశ్రమమునందుండువాడు తానే విద్యార్థిగనుక ఆ ఆశ్రమమునుకూడ శిక్షకుని ఆశ్రమము మనుటకు వీలులేదు. ఇక మిగిలినవి రెండే ఆశ్రమములు. గార్హస్థ్యము, వానప్రస్థము. ఈ రెండు ఆశ్రమములును శిక్షకు చెందినవని అనుకొనుయెడల మన దృష్టి స్పష్టమైనది కాబోదు.

మనము గృహస్థాశ్రమ మని చెప్పునది అనుభవ సంపాదన మునకై ఏర్పడిన ఆశ్రమము. అది వానప్రస్థముగ మారినపుడు దానికి గృహస్థాశ్రమమునుండి ముక్తి లభింపవలెను. కాని శరీరము, మనస్సు, బుద్ధి, వాక్కు ఇవి యన్నియు శిథిలమై పోవునప్పుడు వానప్రస్థుడు అయినా డనుకుంటే పొరబాటు కాగలదు. ఒక అనుభవమునుపొంది దానిని ఇతరులకు బోధించు యోగ్యత కలిగినదని తలచినప్పుడును, విషయ వాసనలు నశించి శరీరము, మనస్సు, బుద్ధి మొదలైన ఇంద్రియములు పనిచేయుటకు సమర్థములుగ నున్నప్పుడు మాత్రమే వానప్రస్థుడు కావలెను. ఇట్టి వానప్రస్థుడే శిక్షకుడు కాగలడు. అతడే ప్రచారకుడు కూడ కాగలడు.

గృహస్థాశ్రమముతోపాటే కొంత విద్యనుకూడ నేర్పవచ్చునని మనము తలచినచో అదికూడ చేయుట కవకాశము కలదు. కాని అట్టిది ఇంటిలో నేర్పబడు విద్యమాత్రమే యగును; అది ఆయా తల్లిదండ్రుల వలన వారి పిల్లలకు మాత్రమే లభించును. దానినే విస్తరింపచేయవలె నన్న ప్రస్తుత సమాజ వ్యవస్థలో పిల్లలు తమ తల్లిదగ్గర ఉండుటకు బదులు నలుబది యేబదిమంది తల్లుల బిడ్డలను ఒకేచోట ఒకే తల్లియొద్ద ఉంచుట, తక్కిన తల్లులు తమతమ పనులకై వెళ్ళుట- ఇట్టి యేర్పాటు కూడ చేయవచ్చును. కాని ఆ విద్య సంఘస్వరూపమును మార్చునది కాజాలదు. సంఘస్వరూపముపై ఆధారపడి దానిలో స్వల్పమైనమార్పును

తెచ్చునదిమాత్రమే కాగలదు. నేను దానిని నవీన విద్య యని పిలువను. అది ప్రాత విద్యయే.

## నవీన విద్యకు అర్థము

నవీన విద్యకు నా ఉద్దేశ్యములోని ఒక అర్థము; అది నవీన సంఘమును తయారుచేయునది అని. నవీన సంఘమును నిత్యము తెగకుండ తయారు చేయుచుండవలసినదే అను విషయమును కూడ తెలిసికొనవలసియున్నది. ఒక నూతన సమాజమును మనము తయారు చేసినచో దాని తరువాత ఇంకేనూతన సమాజమును తయారు కానక్కరలేదని అనుకొనరాదు. మనము తయారు చేసిన సమాజము ప్రాతదై తిరిగి క్రొత్త సమాజమును తయారు చేయవలసిన పని ఎప్పటి కప్పుడు కలుగుచునే యుండును. నవీన విద్య అనగా నిత్యమును నవీన సమాజమును తయారు చేయు విద్యయని అర్థము. ఇట్టి విద్య అనుభవజ్ఞులైనట్టియు, ఆ అనుభవమును ఇతరులకిచ్చుటకు సమర్థులైనట్టియు, వ్యక్తిగతముగ పరిశుద్ధులైనట్టివారి చేతులలోనే యుండవలెను, వారే విప్లవ పతాకమును ఎగురవేయకలరు.

## వానప్రస్థుడనగా అనుభవశాలి

నెపోలియన్‌వంటివాడైనచో తన పరాక్రమ గాథలను వినిపించి తన అనుభవములను ప్రజలకు తెలియజెప్పగలడు. యుద్ధానుభవమే లేని మనుష్యుడు పిల్లలను పరాక్రమ వంతులుగ ఎట్లుచేయగలడు? సత్య వ్రతమును వీడకుండ కోట్లమీద వ్యాపారము చేసిన వర్తకులెవరైన ఉండి వారు శిక్షకులైనచో పిల్లలకు వ్యాపారము చేయుటలో అనుభవ పూర్వకమైన జ్ఞానమును నేర్పగలరు. వ్యాపారమే చేయక కేవలము వర్తక కళాశాలలో ప్యాసైవచ్చిన వ్యక్తి పిల్లలకు వర్తకవిద్య యేమి

నేర్పగలడు ? వివిధములైన కార్యక్షేత్రములందు పనిచేసి అనుభవమును సంపాదించినవారే బాలురకు విద్య నేర్పుట కధికారికము కలవారు.

కావున విద్య నేర్పుపని వానప్రస్థుల చేతిలో నుండవలెనని నేను చెప్పియుంటిని. దీనికొరకు వానప్రస్థాశ్రమమును స్థాపించు ధైర్యము, కౌశలము మనలో ఉన్నచో నవీన విద్య మనము [illegible] విధముగ తయారు కాగలదు. లేనిచో నాకేమియు ఆశలేదు.

## నవీన విద్యయొక్క ఉద్దేశ్యము

విద్యార్థులకు విద్య నేర్పుటలో లక్ష్యమేమి ? అనునదియే ముఖ్యముగ ఆలోచించవలసిన ప్రశ్న. ప్రస్తుత సమాజమును సుఖవంతముగ చేయుటా ? లేక క్రొత్త సమాజమును నిర్మించుటా ? అనునది ప్రశ్న. ప్రస్తుత సమాజమును సుఖవంతముగ చేయుటయే ఉద్దేశ్యమైనచో నేనిప్పుడు వానప్రస్థాశ్రమమును ఎంత అవసరమని చెప్పుచున్నానో అంత అవసరముగ అది కన్పడదు. కాని మనము నూతన సమాజమును నిర్మించుకొన్నచో కార్యదక్షులైనట్టియు, స్వానుభవముచే ఒక అర్హతను సంపాదించినట్టియు, విషయ వాసనలు పరిశుద్ధమై వికాలదృష్టి ఏర్పడినట్టియు, మనస్సు, బుద్ధి, శరీరము మొదలైనవాని శక్తులు క్షీణింపక పోవుటయేకాక ఇంకను ఎక్కువ చురుకైనవియు సమర్థములును అయినట్టి శిక్షకుల చేతులలోనే విద్యాధికారముండవలెను. ఇట్టి శిక్షకుల ఆశ్రమము వానప్రస్థాశ్రమమే కాగలదు.

## ప్రతివ్యక్తియు శిక్షకుడుకావలెను

ఒకమారు నవీనవిద్యనుగూర్చిన ప్రసంగములో రాజాజీ దాని గొప్పతనమును చెప్పుచు "అది ఒకవిశేషమైన విద్యాపద్ధతి. దానికి అనుభవశాలురైన శిక్షకులు కావలెను" అని చెప్పిరి. మద్రాసులో ఈ నవీనవిద్య ఎందుకు నడిపించుటలేదని అడుగగా ఆయన "నేను ప్రభుత్వ

బాధ్యతనుంచి తప్పుకొన్నచో నవీనవిద్య బోధించు శిక్షకుడ నగుదును" అని చెప్పిరి.

రాజాజీ చెప్పిన ఈమాట సరియైనది. ప్రతివాని జీవితమందును శిక్షకుడగు సమయము రావలసినదే. నెహ్రూ జీవితమందు ఒకానొక సమయమున ఆయన నవీనవిద్య నేర్పు శిక్షకుడు కావలసినదే. డాక్టర్ రాధాకృష్ణ జీవితమందు ఆయన నవీన విద్యాబోధకుడగు సమయము రావలసినదే! అట్లే ఘనశ్యామదాస్ బిర్లా జీవితమందుకూడ ఆయన నవీనవిద్యాబోధకుడగు సమయము రావలసినదే! ఈ విధమైన ఏర్పాటు చేసినచో అది నవజీవనము నిచ్చు ఏర్పాటు కాగలదు.

•

## : 20 : గుణవికాసమే విద్య

### నూతన విద్యావిధానము - పురాతన విద్యావిధానము

పురాతన విద్యావిధానము జ్ఞాన ప్రధానమనియు, మనము చెప్పు నవీన విద్యకర్మ ప్రధానమనియు కొందరందురు. కాని ఈ విభాగము తప్పు. పురాతన విద్యావిధానమును జ్ఞానప్రధానమని చెప్పుట తప్పు. నవీన విద్యావిధానమును కర్మ ప్రధానమని చెప్పుటయు తప్పే. ఇక కొందరు పురాతన విద్యావిధానము పుస్తక ప్రధానమనియు నవీన విద్య పరిశ్రమ ప్రధానమనియు చెప్పుదురు. కాని ఈ వ్యాఖ్యానము కూడ పరిపూర్ణమైనదికాదు. మన లక్ష్యము కర్మకుశలులయిన వ్యక్తులను తయారుచేయుటయు కాదు. జ్ఞానవంతులయిన కార్మికులను తయారుచేయుటయు కాదు. మనకు కావలసినది మానవుని యొక్క సంపూర్ణ గుణవికాసము. ఇందు పాల్గొను శిక్షకులకును, విద్యార్థులకును ఇద్దరికినీ కూడ పూర్ణవికాసము కలుగవలెను. వారు 'కేవల జ్ఞానమునుగాని' 'కేవల కర్మకౌశలమునుగాని' లేక రెండునుగాని పొందినప్పటికిని ఆ శిక్షణ అపరిపూర్ణముగనే యుండును. ఏలన కర్మశక్తి, జ్ఞానశక్తి అనునవి అనేక గుణములలోని రెండు గుణములుమాత్రమే. మనము విద్యవలన కోరునది, అన్ని గుణముల వికాసమును.

### లోపలి వికాసము

మనము పిల్లలకు నూలు వడకుటను నేర్పుచు, దాని ద్వారా జ్ఞానమును బోధించుచున్నామని అనుచున్నారు. కాని మన పని ఇంత మాత్రమే కాదు. దీనిద్వారా మన మీ క్రింది విషయములుకూడ చూడ

వలసి యుండును. దీనివలన వారికి ఆంతరంగికమైన వికాసము కలుగుచున్నదా, లేదా ? వారిలోని అలసత్వము పోయినదా, లేదా ? వారిలో పరిశ్రమశీలత వచ్చినదా, లేదా ? వారు సర్వవిధముల నిర్భయులు అయిరా, లేదా ? వారు సత్యమును చెప్పువారు, సంయమము కలవారు, సేవాభావము కలవారు అయిరా, లేదా ? ఈ విషయము లన్నియు మనము చూడవలసి యున్నది.

## పరీక్ష అను పాడుపద్ధతి

పురాతన విద్యా విధానములోని మిక్కిలి హేయమయిన స్వరూపము పరీక్షల సమయములో నాకు గోచరించును. మనకు పరీక్షలు జరుగునపుడు మనపైన కనిపెట్టి చూచుటకు నిరీక్షకులు నియమింపబడుచున్నారు. విద్యార్థులు దొంగతనముగ ఒకరు వ్రాసినదానిని ఇంకొకరు చూచి వ్రాయకుండుటకై వీరు నియమింపబడుచున్నారు. ఇది చూచి నాకు దుఃఖము కలుగుచుండును. మన విషయములో మనము దొంగపని చేయగల మను భావన మొదటనే కలిగినయెడల ఇక విద్యార్థిదృష్టితో చూచిన మనము మొదటనే ఫేలైపోతిమి. ఇక మనలను పరీక్షించుటకు మిగిలినదేమి ?

## జాగరూకత అవసరము

మొదటినుండియు సంపూర్ణమైన జాగరూకత వహించనిచో గుణవికాసమువైపు ధ్యానముంచకపోవుట అను పురాతన విద్యావిధానములోని దోషము ఈ నవీన విద్యలోకూడ రాగలదు. 'ఇన్ని చిలపలు వడికించవలెను !' అని మాత్రమే మనము చూడరాదు. బాలుర ఆత్మశక్తి ప్రకటిత మగుచున్నదా, లేదా ? అని చూడవలెను.

## వినయమువలన గుణవికాసము

సంస్కృతములో శిక్షణకు 'వినయ'మని పేరు కలదు. ఏలన వినయము అన్ని గుణములకు ప్రవేశద్వారము. దానిద్వారా ఇతర గుణముల వికాసము కలుగును. వినీతుడు, నమ్రుడు, వినయశీలుడు అయినవాడు ఎచ్చటనైనను గుణముకాని, జ్ఞానముకాని లభించినను మంచివిషయము కన్పించినను తక్షణమే దానిని స్వీకరించును. ఈ గుణస్వీకరణమే వినయమునకు ముఖ్య లక్షణము. ఇందుచేతనే పూర్వులు మన లక్ష్యమును వినయముపై కేంద్రీకరింపచేసిరి.

## నా సత్యస్వరూపము

నేను దేహముకాను. దేహముకంటె వేరయిన వాడను. నానిజమైన స్వరూపము సుందరము, పరిశుద్ధము. అది అపరిశుద్ధముకాదు. తప్పులు దేహముద్వారా జరుగుచున్నవి. నా శరీరము అపరిశుద్ధమగుచున్నది కాని నేను అపరిశుద్ధుడ నగుటలేదు. దేహముకంటె భిన్నమైన ఆత్మను తెలిసి కొనుటయే విద్య. ఎచ్చట ఈ జ్ఞానములేదో అది మన విద్యావ్యవస్థకాదు. అది విద్యాసంస్థయు కాదు.

ఎవడైన పిల్లవాడు అపరిశుభ్రముగ కనిపించినచో నేను వానితో నీవు మురికిగనున్నావు అని చెప్పను. నేను వానితో ఇట్లు చెప్పుదును "నీవు పరిశుద్ధుడవే కాని నీ శరీరముపై కొంచెము మురికి అంటు కొనినది; దానిని నీవు శుభ్రము చేసికొనుము."

## మనస్సంస్కరణము

మనము మన మనస్సును ఒక గడియారమువలె ఎప్పుడైనను సరే చేతిలో పెట్టుకొని చూచి దానిలో ఎప్పుడైనను ఏదైన దోషము కన్పించినప్పుడు బాగుచేసికొనగలుగునట్లుగ తయారు చేసికొనవలెను. ఎప్పుడును చెడిపోనట్టియు ఎప్పుడును అపరిశుభ్రముగ నుండనట్టియు

వస్తువేదో అదియే నేను, చెడిపోవునట్టియు, అపరిశుభ్రముగ ఉండు నట్టియు శరీరమును బాగుచేయువాడను; స్వచ్ఛముగ నుంచువాడను నేను. ఈ విధమైన భావము మనలో స్థిరపడినప్పుడే మనకు నిజమైన శిక్షణ దృష్టి లభించును.

("సింహావలోకనము" నుండి)

## : 21 : జ్ఞానము యొక్క విశిష్టత

"వినోబా ఒక శిక్షకుడు" అని ఆశాదేవి ఇప్పుడే చెప్పినది. ఆమె మాట అనుపయుక్తము కాదు కాని నేనొక విద్యార్థినని చెప్పుట ఎక్కువ ఉపయోగకరము. నా జైలు సహచరులు నా విద్యార్థిత్వము నకు సాక్షులు. గ్రంథ పఠనమునకు నాకు బాహ్య ప్రేరణ అవసరముగా కన్పించదు. నేను నా జీవితములోని అధికకాలము స్వయముగ పని చేయుటలోనే గడిపితిని. కావుననే నాబుద్ధి యెప్పుడును నిర్మలముగ నుండుట నా కనుభవసిద్ధమైనది.

### బుద్ధి నిర్మలముగ ఎట్లుండును ?

బహిరంగ ప్రదేశములో ఏదో ఒక శరీరశ్రమ చేయుచుండుటయే బుద్ధి నిర్మలముగ నుండుటకు ముఖ్య కారణమని నేను తలచుచున్నాను. దీనివలన ఎండచే కాలినభూమి వర్షమునకు సిద్ధముగానున్నట్లు బుద్ధికూడ జ్ఞానమును గ్రహించుటకు ఎల్లప్పుడును సంసిద్ధమై యుండును. శరీర శ్రమచే తపించిన బుద్ధి జ్ఞానమును గ్రహించుటకు ఆసక్తితో నుండును. అది జ్ఞానమును ఫలవంతముగ చేయును. మనము విద్యార్థులలో జ్ఞాన మును నింపుటకాదు చేయవలసినపని, వారిలో జ్ఞానతృష్ణను పుట్టింప వలెను. జ్ఞానమును సంపాదించు శక్తిని కలిగింపవలెను.

విద్యార్థి స్వయముగనే నేర్చుకొనును. విద్యార్థి కొకనికి ఆవులను అప్పచెప్పినట్లును, వానిని మేపుచు తిరుగుచుండ అతనికి జ్ఞానము కలిగినట్లును ఉపనిషత్తులలో వర్ణింపబడినది. అతనికి ఒకమారు ఒక యెద్దువలన, ఇంకొకమారు ఒక పక్షివలన, వేరొకమారు ఒక చెట్టు వలన జ్ఞానము లభించినది. జ్ఞానము లభింపగనే అతని ముఖము

కాంతితో నిండిపోయినది. అతని ముఖముచూచి గురువు 'నాయనా నీకు జ్ఞానము లభించినట్లు తోచుచున్నదే' అనెను. అతడు "గురుముఖతః కాక జ్ఞాన మెట్లు లభించును" అనగా గురు విట్లు చెప్పెను. "నీకు నిజమైన జ్ఞానము లభించినది నీవిద్య నిర్దుష్టమైనది." గురువుగారి ముద్ర పడినదా అతని గురుకులవాసము సమాప్తమే.

## ముఖముపై విద్యాతేజము

శిక్షకులు, శిష్యులు ఇద్దరును ఒక ఆచరణవలన ఇంకొకరు శిక్షణ పొందుదురు. ఇద్దరును విద్యార్థులే. ఏది ఇంకొకరి కిచ్చుటకు వీలులేనిదో అదియే శిక్షణ. ఏది గ్రహింపబడుచున్నదో, దేనికి లెక్క వ్రాయుటకు వీలున్నదో. లేదా ఏది వ్రాయుట కవకాశము కలదో అది శిక్షణకాదు. శిక్షణకు వ్రాతకోతలు ఉండుట కవకాశములేదు. జీవితమే శిక్షణ. "కేలరీ" యొక్క నిజమైన లెక్క కాగితముమీదకాదు. శరీరముమీద కన్పించును. అనుభవములోనికివచ్చి, తిని, అరగించుకొని, రక్తములో కలసిన దేదో అదియే నిజమైన శిక్షణ.

## పరీక్ష అనగా భేదిమందు

నేను పరీక్ష ఈయవలసిన విషయములో నా కెక్కువ జ్ఞానము లేదు. కాని నేను పరీక్ష ఈయని విషయములో నాకు మంచి జ్ఞానము కలదు. కావున నా అనుభవమునుబట్టి నేను పరీక్ష కేమియు విలువ నీయను. కడుపు శుభ్రపరచుకొనుటకు భేదిమందు ఎట్లు తీసికొనవలసి యున్నదో పరీక్షలుకూడ సరిగా అట్టివిగనే యున్నవి. పరీక్ష ఇచ్చితిమా జ్ఞాన మంతయు చెల్లు! కావున శిక్షణ శాస్త్రముద్వారా తయారుచేయబడిన ఈ మాయలో పడవలసిన ఆవశ్యకత లేదు.

## మరచిపోవుటలోని మహిమ

ఉపనిషత్తులలో జ్ఞానముతోపాటు అజ్ఞానముయొక్క మహిమకూడ ప్రశంసింపబడినది. మనుష్యునికి జ్ఞానము కావలెను. అజ్ఞానము కావలెను. కేవల జ్ఞానముకాని, కేవల అజ్ఞానముకాని ఒకటిలోనికి తీసికొనిపోవును. ఉపయోగకరమగు జ్ఞానము ఉపయోగకరమగు అజ్ఞానము కలియుటలో సంపూర్ణమగు అమృతత్వము కలదు. ఆ విధముగ చూచినచో ప్రపంచములోని జ్ఞానమంతయు అంచిరి మెదడులోనికి ఎక్కించు ప్రయత్నము చేసినచో మానవుడు పిచ్చివాడై పోగలడు. కావుననే స్మరణ శక్తితోపాటు మరపుకూడ అంత ఆవశ్యకము అగుచున్నది. విద్యార్థి వల్లించిన విషయమును యథాతథముగ విన్పించినచో నా కది నచ్చదు. అతనిని నేను గ్రామఫోనని పిలుతును. అతడొక యంత్రమయిపోయెను. నే నాతనిని చేతను డని చెప్పను. అతడు చైతన్యుడే అయినచో కొంత వదలివేసి, కొంత క్రొత్తది కలిపి యుండును.

"క్రాంతిదర్శనము" నుండి

## : 22 : నవీనవిద్య - ఒక ఆవాహానము

(తాలిమీ సంఘ సమ్మేళనము, సేవాగ్రామము)

నవీన విద్య అను ఒక గొప్ప ఆలోచనాత్మక విషయము మన దేశమునకు లభించి నేటికి సుమారు పదునాలుగేండ్లయినవి. ఒక విధముగ అది క్రొత్తదికాదు. ఏలన సత్యమైన అనుభవమేదియు క్రొత్తది కాదు. అది సనాతనమే. దానికి బీజములు భూతకాలమునందే పడియుండును. కాని అందలి ఏదైన కొంతభాగము మనకాలములో పైకి వచ్చినచో మన కొక క్రొత్త ఆలోచన లభించునట్లు తోచును. అప్పుడు మన కది క్రొత్తదగును. మనము దానివలన ప్రేరణ పొందుటయే అందలి క్రొత్తదనము. నవీన విద్యకు సంబంధించిన విచారధార చాల సంవత్సరములనుండి తపస్సుచేసి ఇప్పుడు దేశమునెదుట నిలిచి శంఖారావ మొనర్చుచున్నది. ఇన్ని సంవత్సరములు గడచినపిమ్మట నవీన విద్య సిద్ధవస్తువైనది. ఇక దాని మూలతత్వము, దాని పౌష్టికత, దాని అమృతత్వమునుగూర్చి ఎట్టి సంశయమును ఉండుటకు అవకాశము లేదు.

### మన అజ్ఞానమునకు నిదర్శనము

కాని ఆశ్చర్యమును, దుఃఖకరమును అయిన విషయ మేమన స్వరాజ్యము లభించి మూడు సంవత్సరములయినను, దీని నమలులో పెట్టు సాహసము మనకు కలుగలేదు. స్వరాజ్యమునకు పూర్వము ప్రజలను బానిసలుగ నుంచుటకు తగినదని ఎంచి నేర్పబడిన విద్యనే స్వరాజ్యము లభించిన పిమ్మటకూడ కొనసాగించినచో ఇంతకంటె

తెలిపితక్కువ ఏమియుండగలదు! ఇంకను ఈ విషయము ప్రయోగా వస్థలో ఉన్నదని మనము తలచునెడల అనగా "వంటక మింకను తయారగుచున్నది. తినుటకు సమయ మింకను రాలేదు. పూర్తిగా తయారయిన తరువాత తినవచ్చును," అనియే ఆలోచన అయినయెడల అంత వరకు ఇటుకలు, రాళ్ళు తినుచుందురా? అని నే నడుగుదును. నేడు మీరు భుజించుటకు తగినది ఏమియున్నది? ఉన్నదేదో అవతల పార వేయ దగినదే! దానిని వెంటనే పారవేసి, "ఇంకను సరియైన విద్యా విధానము మాకు స్ఫురింపలేదు. దానినిగురించి ఆలోచించుటకు మాకింకను కొన్ని నెలలు పట్టును. అంతవరకు మేము విద్యను ఆపుచేయు చున్నాము. అంతవరకు మనపిల్ల లందరు శరీర పరిశ్రమ చేయుదురు. ఏలన మనము ఉత్పత్తిని పెంచవలసిన ఆవశ్యకత చాలకలదు." అని చెప్పనచో ఏమి కష్టము కలుగును? కాని మనకు మన జెండామీదనున్న పట్టుదల విద్య విషయములో లేదు. దీనిని నేను అజ్ఞానమని చెప్పుదును.

## నవీనవిద్య అందరికొరకు

ఇప్పు డీ విద్యకు ప్రాతికదిక విద్య అని పేరు పెట్టితిని. కాని ప్రాతిపదిక అనగా నేమి అను విషయము మనము తెలిసికొనలేదు. ప్రాతిపదిక అనగా పిల్లలకు ఆరంభములో నేర్పవలసిన విద్య అని మాత్రమే మన మనుకొనుచున్నాము. కాని దాని అర్థము ఇంతేకాదు. దాని అర్థ మేమనగా దేశములో మొదటినుండి చివరివరకు నేర్పబడిన విద్య, అది ప్రాథమిక విద్యకానిండు, మాధ్యమిక విద్యకానిండు ఉన్నత విద్యకానిండు, ఈ మొత్తము విద్యయంతయు ఈ పునాదిపై నిలువ వలెను. ఇంతేకాని పల్లెటూరివారి కొకరకపు విద్య, బస్తీవారికి ఇంకొక రకపు విద్య అను పద్ధతి పనికిరాదు. మొదటి 4 సంవత్సరాలు ఈ విద్య తరువాత దీనితో ఏవిధమైన సంబంధములేని ఇంకొక విద్య నడుపవలె ననుటయు పనికిరాదు. శరణార్థులపై ఈ విద్య యెట్లు పనిచేయునో

చూడవలెనని ఒక విద్యయు, తక్కిన దేశమంతటికి ఇంకొక విద్యయు నేర్పుటకూడ పనికిరాదు. దీని కర్థ మేమన, మనదేశమందలి విద్య అంతయు నవీన విద్య అను పునాదిపై నడువవలెను, అను విషయము నంగీకరించినప్పుడే ఈ విద్య 'ప్రాతిపదిక విద్య' అని పిలుచుటకు తగినదగును. విద్యా విషయములో ప్రయోగము చేయువారిని అనగా అనుభవ పూర్వకముగ పనిచేయువారిని చాలమందిని బస్తీల విషయములో మీరేమి ఆలోచించితిరి,' అని అడుగగా వారు 'ఈ విద్య బస్తీల కొరకు కాదు. ఇది గ్రామీణుల కొరకే,' అని చెప్పుట వినుచున్నాము. నేను చెప్పున దేమన ఇంతకంటె ఎక్కువ పొరపాటు అభిప్రాయము ఉండజాలదు. ఈ విద్య అందరికోసమును. బస్తీలు పల్లెటూళ్ళు అను భేదము ఇందులేదు.

## పీడన మానండి

నేటి పట్టణ వాతావరణమును మనమట్లే ఉంచదలచుకొనినచో హిందూదేశములో శాంతి యుండజాలదు. ఏ గ్రామీణులమీద ఈపట్టణము లాధారపడియున్నవో వారి సేవయే తమ పనిగా పెట్టుకొనవలెను. ఈ దృష్టితోనే తమ పిల్లలకు విద్య నేర్పించవలెను. దేశసేవకు సంబంధించిన విద్య పల్లెటూరివారు పొందుట, దేశమును కొల్లగొట్టు విద్య బస్తీ పిల్లలు పొందుట అను పద్ధతి పనికిరాదు. అది ఈ దేశములో నడువ జాలదు. ఏలన ఈ దేశము మేలుకొన్నది. మేల్కొను దేశము ఇట్టి భేదభావము నెంతమాత్రము సహించదు. ప్రాతిపదికవిద్య అనగా నేమియో తెలుపుటకు నేనింతదూరము చెప్పితిని.

## తంత్రము పనికిరాదు

ఇప్పుడు ఇందులోగల కొన్ని ప్రమాదములను గూర్చి మీకు సూచింప గోరుచున్నాను. మన మిచ్చటనే దీనిపై కొన్ని ప్రయోగములు

చేయుచున్నాము. దీని స్వరూపము కొంతవరకు ఆ ప్రదర్శనములో మీరు చూడగలరు. ఇచ్చటకు హిందూదేశము అన్నివైపులనుండియు జనులు విద్య నేర్చుకొనుటకు వచ్చుచున్నారు. అన్ని ప్రాంతముల యొక్క దర్శనము మన కిక్కడ కలుగుట మీరిప్పుడే చూచినారుకదా? అన్ని చోట్లనుండి జనులు ఇచ్చటికి వచ్చిరి. ఇచ్చటనుండి కొంత నేర్చుకొని వెళ్ళుచుందురు. నే నిందుకూడ ఒక ప్రమాదమును చూచు చున్నాను. ఇక్కడ మీరు నేర్చుకొనినది. చూచినది కేవలము దిజ్మాత్రముగనే యుండును. ఈ విధముగ ఏర్పాటు చేసికొననియెడల అటు ప్రభుత్వ తంత్రము, ఇటు తాలిమీ సంఘముయొక్క తంత్రము ఈ రెండు తంత్రముల నడుమ మన ఈ విద్యయంతయు ఇమిడిపోగలదు. నా కీతంత్రములన్న మిక్కిలి భయము. అందును ముఖ్యముగ విద్యా విషయములో. తంత్రము దానిని తుదముట్టించునదగును. ప్రాంతిపదిక విద్యను గురించి తాలిమీ సంఘముద్వారా లభించిన అనుభవము ఒక దృష్టాంతముగ మన యెదుటనే ఉన్నది. దానిమీద మీరు ఆలోచించండి. స్వతంత్ర బుద్ధితో ప్రతి చోటను స్వతంత్ర ప్రయోగములు జరుగవలెనని నా కోరిక.

## నవీన విద్య యొక్క విభిన్న దర్శనము

ఒక సోదరుడు ఇక్కడ జరుగు కార్యక్రమము చూచుటకు నావద్దకు వచ్చినపుడు "ఇక్కడ నవీన విద్యపై ప్రయోగము లెచ్చ టెచ్చట జరుగుచున్నవో చూడగోరుచున్నానని చెప్పెను. నే నిట్లు చెప్పి తిని. "సోదరా! సేవాగ్రామమునకువెళ్ళి అక్కడ తాలిమీ సంఘములో ఏమి జరుగుచున్నదో చూడుము. పిమ్మట మహిళాశ్రమమునకు వెళ్ళి అక్కడ ఏమి జరుగుచున్నదో చూడుము.పిమ్మట గోపురికి వెళ్ళి అక్కడ ఏమి జరుగుచున్నదీ చూడుము. పిమ్మట మగన్వాడీకి వెళ్లుము." అతడీ ప్రదేశములన్నియు చూచి తిరిగి నావద్దకువచ్చి ఇట్లు చెప్పెను: "నేను

ప్రతిచోటను వేరువేరు విషయములను చూచితిని. సేవా గ్రామములో కన్పించినది మహిళాశ్రమములో కన్పించలేదు. అక్కడ ఇంకొక విషయము నడచుచున్నది. అటు గోపురిలో మరియొక విషయము నడచుచున్నది. అక్కడ కేవలము కార్ఖానాలే కన్పించినవి. అక్కడ అంతయు పనియే నడచుచున్నది. మహిళాశ్రమములో విద్య నేర్పబడు చున్నది. బాలికలు వంటపూట చేయుచున్నారు. మరుగుదొడ్లు బాగు చేయుచున్నారు, బట్టలుకూడ నేయుచున్నారు. ఈ విధముగ ప్రతిచోట వేరువేరు స్వరూపము గోచరించినది, అప్పుడు నే నాయనతో ఇట్లంటిని: "ఇదంతయు నవీన విద్య. ఇవియన్నియు నవీన విద్యపై ప్రయోగ ములు. 'నవీన విద్య' ఒక తంత్రముకాదు. అది యొక విచారధార."

చాలమంది ఈ ప్రాతిపదిక విద్యను నేడు ఒక పద్ధతిగ భావించు చున్నారు. అనగా ఒక శిక్షణ పద్ధతి అనీ, దానికొక టెక్నిక్, ఒక విశిష్ట తంత్రము ఉన్నదనీ అనుకొని పూర్వము గడచిపోయిన శిక్షణ పద్ధతులవలెనే ఇదికూడ ఒక క్రొత్తరకము శిక్షణ పద్ధతి వచ్చినదని వారు తలచుచున్నారు. కాని ఇట్లు తలచుట తప్పు. ఇది ఒక విచారధార. ప్రాచీన కాలమున బ్రహ్మవిచారము అను ఒక వ్యాపకమైన మనన విషయము హిందూదేశమునకు లభించినట్లే నే డిది లభించినది. ఆ ఒక్క బ్రహ్మ విచారమునుండి అద్వైతోపాసన బయలుదేరినది, ద్వైతో పాసనయు బయలుదేరినది. విశిష్టాద్వైతోపాసనయు బయలుదేరినది. శుద్ధాద్వైతోపాసన బయలుదేరినది. ఈ విధమైన ఎన్నియో ఉపాసనలు ఒక బ్రహ్మవిచారమునుండి నిర్మితములైనవి. అట్లే ఇదికూడ ఒక వ్యాపకమైన శిక్షణ విచారము.

## అనుబంధమును గూర్చిన దురభిప్రాయము

ఒకమారొక సోదరునితో చర్చ జరుగుచుండెను. నే నాయన కిట్లు నచ్చచెప్పసాగితిని. పాశ్చాత్య శిక్షణ పద్ధతిలో శ్లోకములు మొద

లయినవి కంఠస్థము చేయుటకు ప్రాధాన్యము ఈయబడుటలేదు. కాని ఇది పొరపాటు. పిల్లలు తగినన్ని మంచి శ్లోకములను ఏరుకొని కంఠస్థము చేయవలెను. నా దృష్టాంతమునే ఇచ్చి నాకు దానివలన ఎంత లాభము కలిగినదో, జీవితమునం దనేక సమయములలో నాకు దాని వలన ఎంత సహాయము లభించినదో తెలిపితిని. మన వాఙ్మయములో ఉన్నతమైన అనుభవమునకు సంబంధించిన భావములు మనకు కంఠస్థములై యుండుటచే మన కెంతో లాభము కలుగుచున్నది. ఈ విషయములో పాశ్చాత్య శిక్షణశాస్త్రజ్ఞుల అనుభవమునకును మన అనుభవమునకును భేదము కలదు. వారు ప్రతి విషయమును విశ్లేషణ పద్ధతితో చూచెదరు. ప్రపంచమును ముక్కలుగ విభజించి వానిని శాఖలుగ వేరు పరతురు. కాని మనము ప్రపంచమంతటిని సంపూర్ణ రూపములో చూచి, దాని అద్వైత స్వరూపములు గుర్తింతుము. ఇది ఇచ్చటి పద్ధతికిని అచ్చటి పద్ధతికిని భేదము. కావున మనము వాఙ్మయమందలి ఉత్తమోత్తమ భావములను కంఠస్థము చేయుదుము. ఈ విధముగ చేయని వారు బుద్ధికి ఎక్కువ ప్రాధాన్యమిత్తురు. బుద్ధికి సర్వోన్నతమైన స్థానమే కలదు. కాని భావము లేదా భావన అనుదానిని విడుచుటకు వీలులేదు. హృదయముకూడ ఒక ప్రధానవస్తువే. దాని పుష్టికై ఇటువంటి మంచి విషయములను కంఠస్థము చేయుట అత్యంత ఆవశ్యకము. తప్పనిసరి. వెంటనే ఆయన ఇట్లు ప్రశ్నించెను. "మంచిది మీరు చెప్పినది సరిగానే యున్నది. కాని పరిశ్రమతో దీనికి సమన్వయము ఎట్లు కుదర్చగలము?" నే నాయనతో ఇట్లంటిని: "దీనికి సమాధానముగ నేనొక ప్రశ్న అడిగెదను. మీ పిల్లలు రాత్రి నిద్రపోదురుగదా, ఆ నిద్రపోవుటకు వారు చేయుపనికి సంబంధమేమి? ఇది నాకు కొంచెము తెలియజేయండి" ఆయన ఇట్లు చెప్పెను: "దానికి సంబంధమేమన నిద్రపోయి లేచిన పిమ్మట నూతనోత్సాహము కలుగును. పనిచేయుటకు ఉత్సాహము ఆవశ్యకముగదా. కావున సంబంధము కుదిరినది." నేనిట్లంటిని: "సరే!

ఇప్పుడీవిధముగ చూడండి. మనుష్యునిలో ఆత్మ అనునది ఒకటికలదు. ఆ ఆత్మశక్తివలననే దేహము శక్తిశాలి అగుచున్నది. కేవలము దేహమునందు శక్తియుండదు. ఆత్మకంటె వేరయిన దేహమును ప్రపంచములో దేహమని పిలవరు. శవమని పిలుతురు. దాని వినియోగము శ్మశానములో జరుగును. ఏ దేహములో ఆత్మ ఉండునో ఆ దేహమునందే కర్తృత్వశక్తి యుండును. కావుననే ఆత్మ వికాసముకొరకు కొన్ని మంచి శ్లోకములను కంఠస్థము చేయుట అవసరమని నేను తలచుచున్నాను.

ఈ దృష్టాంతము నేనెందు కిచ్చితి ననగా చాలమంది దీనిని అప్పుడే నియమబద్ధముగ చేయదలచుచున్నారు. దీనిని ఆ విధముగ నియమమను చట్రములో బిగించినచో ఇది నిర్జీవమై పోగలదు. పిమ్మట ఇక చేయవలసిన దేమియులేక ప్రతిపనిని ప్రతి జ్ఞానముతో ఎట్లుకలుపుట అను అన్వేషణలోనే ఉండిపోవలసి వచ్చును. ఇట్టి స్థితినుండి మనము బయటపడవలెను. నవీనవిద్య ఒక జీవనదర్శనము. దాని దృష్టికోణమును అర్థము చేసికొని పనిచేయవలసి యున్నది.

## నృత్యగానముల హద్దు

స్కూలులో పరిశ్రమతోపాటు కొంత మనోరంజనముకూడ ఏర్పాటుచేయుట తరచు జరుగుచుండును. దీనిని నేను ద్వేషింపను. అందు నాదబ్రహ్మోపాసన జరుగుచుండును. కాని ఒక విషయము దృష్టియందుంచుకొనవలెను. మన దేశజనులు క్షుధార్తులు. ఒకడు ఆకలితో గిలగిల లాడుచున్నాడనియు, ఇంకొకడు గిలగిలలాడి చచ్చి పడి యున్నాడనియు ఈ దృశ్యములను దృష్టియం దుంచుకొనుము. ఈ విషయమును స్మరించుచు నృత్యము చేయవలసియున్న నృత్యము చేయుము, గానము చేయవలసియున్న గానము చేయుము; వాద్యములు ప్రమోయింపవలసి యున్న వాద్యములు ప్రమోయింపుము. జనులు చిత్రకళ

నేర్చుకొనుచున్నారు. నేను వారిని కోరుసదేమనగా ఒక మనుష్యుడు ఆకలితో వ్యాకులుడయినట్లును, ఇంకొకడు ఆకలితో చచ్చుటకు సిద్ధముగ నున్నట్లును, మూడవవాడు ఆకలితో చనిపోయినట్లును ఒక చిత్రమును వ్రాయవలెను. ఇట్టి చిత్రము నెదుట పెట్టుకొని మనము పనిచేయవలెను. అప్పుడు హిందూదేశమందలి స్వరూపమెట్లుండగలదో మనకు సరిగా తెలియగలదు. మేము సాంస్కృతిక కార్యక్రమము చేయుచున్నామని స్కూలులో చెప్పుచుందురు. మంచిదే! నేను దానిని గౌరవింతును, దానికి విలువ నిచ్చెదను. మానవజీవితములో దానికొకవాడ స్థానము కలదు. కాని దానివెనుకబడి మన శిక్షణయొక్క ముఖ్యోద్దేశము ఎగిరి పోవుటగాని, మన ముఖ్యసమస్యను మరచిపోవుటగాని జరుగునంతగా ఉన్మత్తులము కారాదు.

## శిక్షణ సంయమప్రధానము కావలెను.

హిందూదేశములో జనసంఖ్య పెరుగుచున్నదని చెప్పుచున్నారు. ఇదిఒక ప్రధానవిషయమనియు; ఆలోచింపవలసిన విషయమనియు చెప్పుటకు సందేహములేదు, కాని నిర్వీర్యులైన జనులసంఖ్య పెరుగుట వలన కల భయము సామాన్య జనసంఖ్య పెరుగుటవలన నాకు కలుగుట లేదు. ప్రజలు వీర్యవంతులు, కర్మయోగులు, సమర్థులు అయినచో ఎంతమందిపుట్టినను వారిభారమును వహించుటకు ఈ వసుంధర సమర్థమైనదనియే నావిశ్వాసము. కాని నిర్వీర్యులు తేజోహీనులు అయిన ప్రజలసంఖ్య ఎందుకు పెరుగుచున్నది? ఎందుకనగా, దేశములో సంయమవాతావరణములేదు. వ్రాయబడుచున్న వాఙ్మయము, చూపబడుచున్న సినీమాలు మొదలైనవన్నియు హిందూదేశమందలి వాతావరణమునంతను పూర్తిగా నిర్వీర్యముచేయుచున్నవి. ఇట్టి వాతావరణములో మనపిల్లలు బాల్యమునుండియే సంయమవంతులు, వీర్యవంతులు, నిగ్రహస్వభావులు అగునట్లు చేయవలసినబాధ్యత మనవిద్యపై పడు

చున్నది. "హస్తసంయతో, పాదసంయతో, వాచాసంయతో" అని బుద్ధభగవానుడు చెప్పియున్నాడు. హస్తకౌశలమును చూడవలసినదే, కాని హస్తసంయమముకూడ చూడవలసియున్నది. ఇంద్రియ కౌశలముతోబాటు ఇంద్రియసంయమ మొనర్చు శక్తికూడ కలుగవలెను. సంయమశక్తిలేనిచోట కౌశలమున్నచో అది మనుష్యుని పాడుచేయుటకు పనికివచ్చును. దానివలన మనుష్యునికి లాభముకలుగదు. కేవలము శక్తియందును లాభములేదు. కౌశలమునందును లాభములేదు. ఇక శక్తిని, కౌశలమును మంచి విషయములో ఉపయోగించుటయందే లాభముకలదు. కాని ఇటువైపు మనధ్యానము తక్కువ. ప్రాతిపదిక విద్య అను మాటవచ్చినపుడే "పరిశ్రమద్వారావిద్య". ఇంతే. ఈమంత్రము జపించుటయే జరుగుచున్నది. ఈఒక్క వాక్యముతోనే మన శిక్షణాపద్ధతి యొక్క వర్ణన పూర్తియైనట్లెంచుచున్నాము. కాని ఈవర్ణన తప్పు.

## శైలికంటె శీలము ఎక్కువముఖ్యము

మన ఈ శిక్షణపద్ధతి ఒకసంయమ పద్ధతియైయున్నది. అనగా అది సంయమము ప్రధానముగాకలది. స్వేచ్ఛాప్రధానమైనదికాదు. బాల్యము నుండియు మనపిల్లలు తమ ఇంద్రియములను, తమ మనస్సును, తమ బుద్ధిని వశములోనుంచుకొనవలెనను దృష్టి ముఖ్యముగ కలుగవలెను. వారివాక్కులో సత్యనిష్ఠ ప్రవేశపెట్టవలెను. వాక్కువలన తాముద్దేశించిన భావములను ప్రకటించుట జరుగవలెను. అనగా వాగ్ధారప్రధానముకాక వాక్శుద్ధి ప్రధానముగ నెంచవలెను. శుద్ధి, ధార అనువానిలోగల భేదము వైపు మీదృష్టి నాకర్షించుటయే నాఉద్దేశము.

## నవీనవిద్య స్త్రీలచేతిలో నుండవలెను

ఇంకొకవిషయమును చెప్పెదను. వాతావరణమును సంయమముతో కూడిదానినిగా చేయవలసినబాధ్యత సరిగానిర్వహింపవలెనన్న

ప్రాతిపదిక విద్యాకార్యక్రమమును సాధ్యమయినంతవరకు స్త్రీలకప్పగించుట, ఆపనికి స్త్రీలనుతయారుచేయుట ఆవశ్యకము. మొన్న మృదులా బేన్ సారాభాయీ నన్నుచూచుటకు వచ్చినది. ఆమె స్త్రీలనుగూర్చి కొన్ని ప్రశ్నలు అడిగినది. నేనిట్లు చెప్పితిని: "చూడుము, నీవు ప్రతిచోట కస్తూరిబాకేంద్రమును స్థాపించి గ్రామములోనిస్త్రీలకు సేవచేయుఏర్పాట్లు చేయుచున్నావుగదా ! నాసూచన ఏమనగా, కస్తూరిబా కార్యక్రమము, మాయీ నవీనవిద్యాకార్యక్రమము అంతయు ఒకటై హిందూదేశములో నున్న స్త్రీలసంస్థలన్నిటితో సంబంధము పెట్టుకొనవలెను. వానిని స్త్రీల సేవకై బయటకుతేవలెను. చిన్నపిల్లలశిక్షణ స్త్రీల కప్పగించవలెను, ఉపనిషత్తులలో చెప్పినట్లు 'మాతృవాన్, పితృవాన్, ఆచార్యవాన్' 'మొదట తల్లినుండి, తరువాత తండ్రినుండి, చివర గురువునుండి స్వీకరింపవలెను' అనునది శిక్షణక్రమము కావలెను.

•

## విద్యనుండి అపేక్షింపబడు విషయములు రెండు

విద్యావిషయమున రెండు విషయములు గమనింపవలసి యున్నవి. మొదటిది మనము నేర్చువిద్య ప్రజల ఖర్చుపై నేర్పబడు చున్నది కావున ప్రత్యక్ష వ్యవహారములో దాని ఉపయోగము కన్పించ వలెను. బాలుడు విద్యావంతుడయిన పిమ్మట సమర్థతకలవాడై ప్రపంచ మునకు సేవచేయుటకై ముందుకువచ్చి ప్రపంచమునుండి తానెంత స్వీకరించెనో అంతకు పదిరెట్లు ఇతరులకు తానివ్వగలుగునట్టి విద్యను అతనికి నేర్పించవలెను. పొలములో జల్లిన ఒక శేరు విత్తనములు 25 శేర్ల పంటగా తయారయినట్లు విద్యార్థుల మనఃక్షేత్రమున చల్లబడిన భావబీజములు పది లేక ఇరువదిరెట్లు వృద్ధిపొందవలెను.

విద్యవలన అపేక్షింపబడు ఇంకొక విషయమేమన విద్యార్థి యొక్క సమగ్ర వికాసమునకు కావలసిన సామగ్రి అతని కందు లభింప వలెను. మనసునకున్న శక్తు లన్నియు ఋషులు మనకు బోధించియే యున్నారు. 'అనంతంహి మనః అనంతా విశ్వేదేవాః'— విశ్వదేవులు అనంతులు. మనస్సుకూడ అనంతము. ఒక్కొక్క మనోవృత్తిని, అట్లే మనశ్శక్తిని విశ్లేషణచేయుట మొదలిడినచో మనకు ఆ మనస్సం బంధమైన అనేక గుణములు గోచరింపగలవు. ఆత్మ సచ్చిదానందము. దాని సన్నిధానమున మనస్సులో అనేక గుణములు నీడవలె ప్రతిబింబిం చును. అనంతగుణములు మనస్సులో ప్రకాశించును.

అనుభవజ్ఞులయినవారు మనకు నేర్పినదేమనగా, మనము మన లను మనశ్శరీరములకంటె వేరని గుర్తింపచేయునదే ముఖ్యమైన విద్య. తనంతట తానిట్లు తెలిసికొనుటయే అన్నిటికంటె గొప్పగుణము.

## విద్యాస్నాతకుడు ; వ్రతస్నాతకుడు

ప్రాచీన కాలములో ఏ విద్యార్థియైనను గురుపునొద్దకు వెళ్ళి విద్యనుమాత్రమే సంపాదించినచో అతడు విద్యాస్నాతకుడని మాత్రమే పిలువబడుచుండెను. అతడు పూర్ణస్నాతకుడు కాడు. విద్యాస్నాతకు డగుటతోపాటే అతడు వ్రతస్నాతకుడు కూడ కావలసియుండెను. అతడు ఆత్మవిజయమును పొందవలసియుండెను. ఆత్మనిగ్రహము లేదా ఆత్మ నియమన మను కళ నేర్చుకొనిన వానిని వ్రతస్నాతకుడని పిల్చెడివారు.

ఈవిధముగ తపించి ఉత్కృష్టుడుగ తేలిన విద్యార్థి ప్రపంచ ములో ప్రవేశించినచో వీరత్వముతోను, సంపూర్ణముగు ఆత్మవిశ్వాసము తోను ప్రవేశించును. అత డీప్రపంచములో ఎవరియెదుటను చలపంచక రొమ్ము విరచుకొని చరించును. 'నమయతీవ గతి ర్ధరిత్రీం'. — అతని నడకచే భూమి క్రిందికి అణగిపోవుచున్నదా అన్నట్లుగా అతడు వీరా వేశముతో ప్రపంచములో ప్రవేశించును.

## విద్యవలననే వినయము కలుగును

పైన చెప్పినదాని కర్థము ఆతడు గర్వితుడగునని కాదు. అతని యందు నమ్రత ఉండియే తీరును. ఏలన జ్ఞానియైనవ్యక్తికి జ్ఞానమనంత మనియు అందు తాను పొందినది చాల స్వల్పభాగమనియు తెలిసిపోవును. కావున నిజమైనజ్ఞాని ఎంత విద్యాసంపన్నుడు వినయసంపన్నుడు అగునో విద్య పొందనివాడు అంతటివాడుగ ఎప్పుడును కాజాలడు. ఏలన అతనికి విద్యయొక్క కొలతయే లభింపలేదు. విద్యాసముద్రమును దర్శించిన వానికి సహజముగనే ఈ విద్యకు పారముగాని, అంతముగాని లేదనియు నాకు లభించిన జ్ఞానము అందలి భాగము మాత్రమేననియు, కావుననే తాను జీవితాంతమువరకు జ్ఞానార్జన చేయవలసి యున్నదనియు గోచ రించును. అతడెంత జ్ఞానమును సంపాదించినను ప్రపంచములో ఇంకను

జ్ఞానము మిగులుచునే యుండును, అతనికి వాస్తవిక సత్యము పూర్తిగ తెలిసి యుండును. కావున అతడెప్పుడును వినమ్రుడయియే ఉండును. అందుచేతనే మన పూర్వులు విద్వాంసులతో మీరు వినయవంతులుగ నుండుటయే కాదు. "ప్రజానాం వినయాధానాత్".— ప్రజలనుకూడ వినయవంతులుగ చేయవలెను- అని చెప్పిరి.

## ధైర్యముకూడ కావలసినదే

కాని వినయముతోపాటు విద్యార్థియందు దృఢనిశ్చయము ఆత్మ విశ్వాసము, ధైర్యము నిర్భయత్వము మొదలయిన గుణములన్నియు ఉండవలెను. బుద్ధితోపాటు ధృతికూడ నుండవలెను. విద్యార్థి ప్రపంచములో ప్రవేశించునపుడు విజయము నొందిన వీరునివలె ప్రవేశించును. వేదమునందొక మంత్రము కలదు. వేదాధ్యయనమును ముగించు సమయమున విద్యార్థి "మహ్యామ్ న మంతామ్ ప్రదిశ శ్చతస్రః"— ఈ నాలుగు దిక్కులును నాయెదుట వంగియుండునుగాక-అని చెప్పును. ఇటువంటి విద్యను పొందినవాడు ఎవడయినను అట్టివిద్యతో ప్రపంచమున కంతటికిని సేవచేయగలడు.

## జ్ఞానమునందుత్తరోత్తరవృద్ధి

నేడు అన్నముతినిన, రెండురోజుల అనంతరము తృప్తికలుగుట అనునది జరుగదు. తృప్తి, తుష్టిఅనువాని అనుభవము ఆ క్షణమందే కలుగును. జ్ఞానవిషయముకూడ ఇంతే. నిజమైనజ్ఞానము లభించినపుడు ఆ జ్ఞానప్రకాశము ముఖముమీదనే గోచరించును. విద్యార్థులకు అపారానందానుభవము కలుగుచుండును ; తత్ఫలితముగనే వారికి జ్ఞానతృష్ణయు వృద్ధిపొందుచుండును. జ్ఞానసంపాదనలో వారిసమయము వ్యర్థముగ నష్టపడుచున్నదని వారెప్పుడును అనుకొనరు.

## అధ్యయనముయొక్క ప్రాచీనక్రమము

ఒకసారి అధ్యయనముయొక్క రుచిమరిగినవాడు తిరిగి దాని నెప్పుడును విడువజాలడు. ఋషి ఇట్లు చెప్పుచున్నాడు. ఏపనిచేసినను దానితోపాటు "స్వాధ్యాయ ప్రవచనేచ"—స్వాధ్యాయము. ప్రవచనము కూడ చేయుచుండును. "ఋతంచ స్వాధ్యాయ ప్రవచనేచ. సత్యంచ స్వాధ్యాయ ప్రవచనేచ"—సత్యము పలుకుము. దానితోపాటు స్వాధ్యాయము, ప్రవచనముకూడచేయుము. "తపశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ"—తపముచేసినచో దానితోపాటు స్వాధ్యాయము, ప్రవచనముకూడచేయుము. ప్రజాసేవ చేసినచో దానితోపాటు స్వాధ్యాయము, ప్రవచనము కూడ చేయుము. అగ్నిహోత్రము నారాధించినచో దానితోపాటు స్వాధ్యాయ ప్రవచనములు కూడ చేయుము. గృహస్థాశ్రమమునందు ఆచరింపబడు ప్రతియొక్క పనితోపాటును స్వాధ్యాయ ప్రవచనములుకూడ ఆచరణీయములుగ చెప్పబడినవి. ఇదియుక్తమే. విద్యాభ్యాస సమయములో ఆరసాస్వాదనము చేయగలిగినవానికి దానియందు రుచి క్రమక్రమముగ వృద్ధిపొందుచునే యుండును.

## మన విద్యా సంప్రదాయము

కాని మనదేశములో నేడు అధ్యయనమనునది లోపించిపోయినట్లగపడుచున్నది. ఇది ప్రాచీనదేశము. ఇచ్చట ప్రాచీనకాలమునుండియు ఎడతెగకుండ అధ్యయనము సాగివచ్చుచున్నది. నిన్నమొన్నటివరకు ఇచ్చట ఈ అధ్యయనసంప్రదాయము అఖండముగ నడచుచువచ్చినది. తక్కినప్రపంచమందలి జనులందరు అజ్ఞానాంధకారములో మునిగి విద్యయననేమో తెలియనిస్థితిలోనున్న కాలమునకూడ ఈ దేశములో ఈవిద్య సాగుచుండెను. ఇచ్చట నివసించువారు బ్రాహ్మముహూర్తమునందే మేల్కొనెడివారు. "అనుబ్రువాణః అధ్యేతి నస్వపన్"—వారు తెల్లవారుజామున నిద్రింపక అధ్యయనము చేయుచుండెడివారు.

## నేటిదురవస్థ

కాని నేడు అధ్యయనముచేయువారు చాలవరకు తగ్గిపోయిన సంగతి మనము చూచుచున్నాము. ఈ తగ్గిపోవుటకు మూలకారణము నేటి ఈవిద్యావిధానమునందే ఇమిడియున్నది. విద్యార్థి ఈవిధానములో ప్రవేశించి 10, 15 సం॥ లలో విద్యపొందునప్పటికి అతనిలోని సార మంతయు శుష్కించిపోవుచున్నది. అతనిలోనిప్రేరణాశక్తి క్షీణించి పోవుచున్నది. పాఠశాలకు పోవుటవలన పిల్లలకనుచూపు మందగించుట, శారీరకశక్తియేకాక మానసికశక్తికూడ క్షీణించుట మనము చూచుచునే యున్నాము. ఎన్నో బుద్ధిశక్తులు వికసించుట కవకాశమే లభించుటలేదు. అన్నిటికంటె ముఖ్యవిషయమేమన, దీనివలన వారిలో ప్రాణశక్తి కొరవడుచున్నది. వారికి ఆత్మనుగురించి యేమియు తెలియదు. మనము దేహముకంటె వేరు అను సంగతియే వారికి తెలియదు. వారి ఇంద్రియములు వారివశములో ఉండవు. ఇక వారికి లభించు విద్య ఎట్టిది ?

ఇట్లు వర్ణించుట నాకు సంతోషముగనున్నదని అనుకొనరాదు. ఒకానొకకాలమున మనదేశములో విద్య పూదుపువ్వులు ఆడుకాయలుగ నుండుట ; నేటి యీస్థితి ఆలోచించినపుడు నాకు నిజముగ చాలదుఃఖము కలుగుచుండును. రవీంద్రనాథఠాగూరు మనభారతదేశము నెంతచక్కగా వర్ణించెను :

" ప్రథమ సామరవ తవ తపోవనే
ప్రథమప్రచారిత తవ వనగహనే
జ్ఞానకర్మకత కావ్యకాహినీ
అయి భువనమనమోహినీ "

జగత్తుయొక్క మనస్సును మోహితమొనర్పగల ఓ మాతా ! ఇచ్చటనే మొదటిసారి సూర్యోదయమయ్యెను. ఇచ్చటనే మొట్టమొదట సామగానము జరిగెను. ఇచ్చటనుండియే విద్యయొక్క కిరణములు

ప్రపంచమంతయు ప్రసరించెను. —మన మాతృభూమిని ఈవిధముగ స్మరించుచు నేడిచ్చట నడచుచున్నస్థితిని దర్శించునపుడు నాకానందము కలుగుటలేదు. దుఃఖమే కలుగుచున్నది.

కావున నేను మీతో చెప్పునదియేమనగా మీరు ఏకకంఠముతో "నేటి యీవిద్య మాకు యెంతమాత్రమును అక్కరలేదు" అని చెప్పవలెను.

—'సేవక్' నుండి

---

## : 24 :   ఆచార్య విద్యాపీఠము

"పిల్లవానికి పదునారవసంవత్సరము రాగానే అతని విషయములో మిత్రునివలె వ్యవహరింపవలెను" అని మనువుయొక్క వాక్యము. అనగా పదునారు సంవత్సరముల తరువాత జీవితముయొక్క బాధ్యతను పిల్లవాడే స్వయముగ వహింపవలెనని దీనికి నా అర్థము. మిత్రునికి మనము సలహా ఇస్తాము. అవసరము వచ్చినపుడు సహాయము చేయుదుము. కాని అతని జీవితభారము అతనిపైననే ఉండును.

### సమర్థమైన విద్యవలన సౌకర్యము

జీవితభారము నిజమునకు భారమేకాదు. అది ఒక ఉపకారము. కాని అది ఉపకారముగ కల్పించునట్టి సమర్థమైన విద్య మనకు లభింపవలెను. ఇటువంటి విద్య తల్లిదండ్రులనుండి పదునారు సంవత్సరముల వయస్సు వచ్చువరకు పిల్లలకు లభింపవలెను. తల్లిదండ్రులనుండి యనుటలో నా అభిప్రాయమేమనగా "సమాజమునుండి ఇట్టి విద్య లభించు ఏర్పాటు జరుగవలెను". ప్రతియొక బాలునికి ఇట్టి విద్యనిచ్చు ఏర్పాటు సమాజము చేయవలెను. దానిపై విద్య అతడు తన సంపాదనతో పొందవలెను.

మనువుయొక్క పైవాక్యమునుండి పదునారు సంవత్సరముల వయస్సు రాకముందు పసిపిల్లవానిమీద జీవితముయొక్క బాధ్యత అంతయు మోపుట తగదను అర్థముకూడ వచ్చుచున్నది.

అంతవరకు పిల్లవానికి జీవితమే ఉండదని దీని కర్థము చెప్పరాదు. జీవితభార మాతనిపై నుండదనియే చెప్పవలెను. ఆ వయస్సులో

ఆతడు తనబరువు తానే మోచుకొనుటకు క్రమముగా తయారు కావల యును. ఈ తయారగుటకే 'శిక్షణ' అనిపేరు.

## దశరథుని యుక్తి

మనువుయొక్క పైవాక్యమును నేనొక శబ్దప్రమాణముగా నీయ లేదు. మనువనగా ఏ విశేషవ్యక్తియు కాదు. సమాజము వేలకొలది సంవత్సరములనుండి పొందిన అనుభవమునే 'మనువు' అని పిలుచు చున్నాము. విశ్వామిత్రుడు తన యజ్ఞరక్షకొరకు రాముని యాచించు టకై దశరథుని యొద్దకు వచ్చెను. దశరథు డిట్లు చెప్పెను. "ఊన షోడశవర్షో మే రామో రాజీవలోచనః"— రామున కింకను పదునారు సంవత్సరములు నిండలేదు. ఇంత పెద్ద బాధ్యతగల పనికై వానిని నీకెట్లు అప్పగింపగలను? రాముడు పదునారు సంవత్సరములవాడై యుండినచో దశరథు డీయుక్తిని ప్రయోగించెడివాడు కాడు. వశిష్ఠు డాతని కిట్లు నచ్చజెప్పెను. "విశ్వామిత్రుని సంరక్షణక్రింద ఈపని జరు గును. అది యొకవిధమైన విద్యాప్రణాళికయే సుమా!" అపుడు దశరథుడు దాని నర్థము జేసికొన గల్గెను.

## నవీనవిద్యను నేర్పవలసిన కాలము

దశరథుడు చెప్పిన యీ యభిప్రాయము మనువు చెప్పిన పై వాక్యములో గలదు. ఆధునిక విద్యావేత్తలుకూడ దీని నంగీకరించి యున్నారు. పదునాలుగు సంవత్సరముల వయస్సు నిండునప్పటికి ఏడు సంవత్సరముల విద్యాప్రణాళిక నవీన విద్యాపండితులు తయారు జేసిరి. అభ్యుదయగామి దేశములలో పదునాలుగు సంవత్సరములు నిండనిదే పిల్లలను కర్మాగారములలో పనికి బంపరాదని శాసనముగలదు. మనువు వీరికంటె ఒక సంవత్సరము ముందైనాడు. ఆయన పదునైదు సంవ త్సరములు నిండనిదే పిల్లవానిని ఫ్యాక్టరీలో పనిచేయుట కనుమ

తింపఁడు ; పదునాఱవ సంవత్సరము వచ్చిన తరువాత కాలేజిలో కాలము వృథాపుచ్చుటను అంగీకరింపఁడు.

## ఆదర్శ విద్యాపీఠము

"అయితే మీ ప్రణాళిక ప్రకారము కాలేజీలు ఖాళీగావలసినదేనా? అట్లయిన దేశమునకు ఉన్నతి యెట్లు గలుగును?" అని ప్రశ్న బయలు దేరవచ్చును. కాలేజీలు ఎప్పుడును ఖాళీగావు. అవి సంపూర్ణముగా నిండియే యుండును. పేదవారి పిల్లలు అందు చేర్చుకొనబడుదురు. కాలేజిలో ప్రతి విద్యార్థియు స్వకీయశ్రమచే జ్ఞానరూపమైన అన్నమును, అన్నరూపమైన జ్ఞానమును సంపాదించుకొనుట ; రెండు చేతులతో పొట్టను, రెండు కన్నులతో బుద్ధిని నింపుకొనుట- అను దృశ్యము మనకు కన్పించును. జ్ఞానకర్మల భేదభావమే నశించిపోవును. అచ్చట పిల్లలనుండి ఎట్టి ఫీజు తీసికొనబడదు. బోర్డింగుకు (భోజనమునకు) ఖర్చేమియు నుండదు. ఉపాధ్యాయులకు జీతములుండవు. పరిశ్రమాలయము, పుస్తకభాండాగారము, ప్రయోగశాల-వీని ఏర్పాటు ప్రభుత్వము ద్వారా జరుగును. పాఠశాలలో ఏ విధమైన సెలవుండదు, ఏలయన అచ్చట ఎవ్వరికిని అదియొక బంధనమని తోచదు.

## అధికవ్యయసాధ్యమైన నేటి విద్య

నేటి కాలేజీలలో పేదవారికెట్టి సదుపాయములును లేవు. నరుగురైదుగురు పేద బాలురకు మాత్రము దయతో ఫీజు మానివేయ బడుచున్నది. కాని మా కాలేజీలలో అందఱకును ప్రవేశముండును. ధన వంతుల బిడ్డలు ఎక్కువ శ్రమ (కష్టపడ) లేనియెడల పరిశ్రమలో ఒక గంట వారికి తగ్గింపు సదుపాయము చేయవలసి వచ్చినచో అది వేరు విషయము. అయినను అందాతని ధైర్యమే ప్రకటమవును గావున అభి మానవంతుడగు ఏ బాలుడును వెంటనే దాని కంగీకరింపడు.

## హాస్యాస్పదములైన విద్యాపీఠములు

నేడు వ్యవసాయ కళాశాలలుకూడ పట్టణములలోనే స్థాపింపబడుచున్నవి. మెట్రిక్ పరీక్షలో ఉత్తీర్ణుడుకానిదే అందు ప్రవేశము లభింపదు. అనగా బాలురలో శీతవాతాతపాదులనుసహించి పనిచేయు శక్తి యేమాత్రమునులేదని నమ్మకముకలిగినప్పుడే వారు వ్యవసాయ కళాశాలలో చేరుటకు అర్హులని అర్థముగల్గుచున్నది. ఏలన, నేటి పద్ధతి ననుసరించి మెట్రిక్ పరీక్షలో నుత్తీర్ణుడగుట అనుదానికి ఇంకేయర్థమునులేదు. ప్రొఫెసర్లును, విద్యార్థులును, కుర్చీలపైనను, బెంచీలపైనను కూర్చుండి వ్యవసాయమును గురించిన జ్ఞానమును బొందుదురు। ప్రయోగరూపముగ వ్యవసాయము నామమాత్రముగనే యుండును దానిబాధ్యతకూడ కూలీలపైనుండును. ప్రయోగములు వారే చేయుదురు. పిల్లవానిఖర్చుకొఱకు అతనితండ్రిమాత్రము ప్రతిసంవత్సరము 25 ఎకరముల భూమిపైవచ్చిన ఆదాయము పంపుచుండవలసినదే. అదిలేకుండ పనియే జరుగదు.

## విద్యాపీఠములో స్వావలంబనము

ప్రాథమికవిద్య తరువాత ఉన్నతవిద్య యెట్లునడుపవలెనని చర్చ జరుగుచుండెను. నేనిట్లుసూచించితిని. బాలురు ఆఱుగంటలు పరిశ్రమచేసి శరీరశ్రమతో భోజనము సంపాదించుకొనవలెను. 2 గంటలు దానిని పరిపోషించు జ్ఞానవిజ్ఞానములను వారికి నేర్పవలెను. బాలురకగువ్యయము పాఠశాలయు భరింపరాదు. తల్లిదండ్రులును భరింపరాదు. వారుపేదవారి బిడ్డలైననుసరే, ధనవంతుల బిడ్డలైననుసరే. ఇట్లుచేసిననే నిజమైన ప్రయోగము కాగలదు. దేశము ముందుకుపోగలదు.

## విముక్తి సూత్రము

నేడు మనము మనువు చెప్పిన వాక్యమందలి రెండర్థములను నీటగలిపితిమి. అసంఖ్యాకులైన పేదబాలురు తిండికోసము పిండికావలసి వచ్చుచున్నది. అయినను వారికి తిండిలభించుటలేదు. విద్యవారికి మొదటనే లేదు. ఇంకొకవైపున దీనికి తలక్రిందులుగా పాతికేసి (25) ఏండ్లవఱకు భారభూతమైన విద్యావినోదములు నడుచుచున్నవి. పనిచేసినప్పటికిని కోట్లకొలది మనుష్యులకు కడుపునిండ అన్నములభింపనిస్థితిలో పని చేయకుండ ఇనుపపెట్టెనిండ ధనము సంపాదింపవలెననుకోరిక పీడించు చున్నది.

కావున "పదునారు సంవత్సరములవఱకు స్వావలంబనను నేర్పు విద్య, 16 సంవత్సరముల తరువాత స్వావలంబనముతో విద్య"— ఈ సూత్రము నంగీకరించి ఆ ప్రకారము విద్యావిధానమును నడుపవిదే ఈ ద్విగుణితమైన దుర్గతినుండి తప్పించుకొనజాలము.

['క్రాంతిదర్శన్' నుండి]

## : 25 : గ్రామీణ విశ్వవిద్యాలయము

[తాలిమీసంఘ సమ్మేళనము, సేవాగ్రామము]

### ఆవశ్యకతనుబట్టి పుట్టిన ఆలోచన

'గ్రామీణ విశ్వవిద్యాలయము' అను పేరు వినుటకు చాల గొప్పగ నున్నది. 'విశ్వవిద్యాలయము' అనునదొక విశాలమైన శబ్దము. దాని అర్థము మిక్కిలి వ్యాపకమైనది. అయినను దానికొక సరళమైన వ్యాఖ్యను 'నాయకం' గారు మీయెదుటబెట్టిరి. "ఎచ్చట సర్వాంగపూర్ణమైన జీవితముగలదో అదే మన గ్రామీణ విశ్వవిద్యాలయము." అని ఆయన చెప్పిరి. ఇది సరియైనవ్యాఖ్య. నేడు బయలుదేరిన చర్చకూడ ఇట్టి ఆవశ్యకతను పురస్కరించుకొనియే బయలుదేరినది. మనము గాలిలో ఆలోచించుటలేదు. ఈపనియంతయు భూమిపైననే జరుగుచున్నది. ఒక ఆవశ్యకత కలిగినదనగనే దానిని తీర్చుటకు ఈవస్తువు ప్రత్యక్షమైనది.

మనము ఇన్నిసంవత్సరముల నుండియు ప్రాతిపదిక విద్యను నడుపగా అందు కొందఱు బాలురు తయారైరి. వారిని మనము ప్రాతిపదికవిద్యలో ఉత్తరకక్ష్యలో జేర్చితిమి. వారికి అచ్చటి కార్యక్రమమును ముగియవచ్చినది. ఈపిల్లలను ఇకఏమిచేయవలెను? అని ఇప్పుడు మనయెదుట నొకప్రశ్న బయలుదేరినది. వారికి లభించిన శిక్షణ మన ఆదర్శము ప్రకారము సంపూర్ణమైనదని తలచి ఇంతతో దానినిముగించి వేయుటయేనా? వారు చదివినదేమియు తక్కువగాదు. దానితో వారు దేశమునకు లాభముచేకూర్పగలరు. జీవితములో స్వప్రయత్నముతో ముందుకుపోగలరు. కాని వారిలోకొందఱు ఇంకను పైకిచదువవలెనని కోరిన అట్టివారికేమైన సదుపాయ మున్నదా లేదా? దీనిపై ఆలోచింపగ

పూకుతోచినదేమనగా 'పరిపూర్ణము' అను శబ్దమునకు మనము ఎంత విశాలమగువ్యాఖ్య చేయగలమో అదిజీవితములోనికి ఆచరణరూపములో వచ్చినప్పుడే రానిండు. కాని 'పరిపూర్ణ' మను శబ్దమునకు మనము చెప్పుచున్న కనీసపు అర్థమునననుసరించియైనను ఆబాలురు పరిపూర్ణులై మనశిక్షణవిధానముయొక్క మచ్చుగా ప్రపంచము ఎదుట ఉన్నారనికూడ చెప్పజాలముగదా! కావున వారి పై చదువునకుకూడ నేదోయొకయేర్పాటు ఉండవలయును. ఈవిధముగా విశ్వవిద్యాలయముయొక్క ఆవశ్యకత కలిగినది.

## నమూనా యింకను తయారుకాలేదు

ఈమధ్యలో ఇంకొక ప్రశ్నబయలుదేరెను. మనము విశ్వవిద్యాలయములు పల్లెటూళ్లకు వేరుగను, పట్టణములకు వేరుగను నడుపవలెనా? "ప్రాతిపదికవిద్య' మొదటినుండి చివరవరకు 'ప్రాతిపదికగనే' ఉండవలెను" అని నేను మొదటనే స్పష్టపఱచితిని. నేడు నడచుచున్న విశ్వవిద్యాలయములు నవీనవిద్యనుగూర్చిన మన 'ఆలోచనను' అంగీకరించినచో అవి తమపద్ధతిని తదనుగుణముగా మార్చుకొనవలసి యుండును. కాని నేడిది సంభవముగ గన్పించుటలేదు. పూర్వమునుండియు వచ్చుచున్నవాని పద్ధతి ఒక్కసారిగా మాఱజాలదు. ఇదియొకకారణము. ఇంతేగాక ఇంకొక కారణముకూడగలదు. దేశమునెదుట మనము ఇంతవరకు మనవిద్యాపీఠముయొక్క నమూనాను దేనిని పెట్టజాలకపోయితిమి. కావున అన్నివిశ్వవిద్యాలయములును మారిపోవలెనని మనము ఇప్పుడే చెప్పజాలము. ప్రాతిపదికవిద్య విషయములో మనముచేసిన ప్రయోగములను, పొందినఅనుభవములను, పురస్కరించుకొని ప్రస్తుతమున్న ప్రభుత్వ ప్రాథమిక పాఠశాలలు మార్చవచ్చునని మనము చెప్పదగు స్థితికివచ్చియున్నాము. దీనివలన వారికి తప్పక లాభము కలుగగలదని మనము శపథముచేసి చెప్పవచ్చును. కాని విశ్వవిద్యాలయము నమూనా

కూడ మనయొద్ద సిద్ధముగా నున్నదనియు, ఆ నమూనాననుసరించి పద్ధతి యంతయు మార్చివేయవలెననియు మనము చెప్పజాలము.

## విద్యాపీఠములు - తమకాళ్లపై తాము నిలబడవలెను

విశ్వవిద్యాలయముగూర్చి ఆలోచించునపుడు మనయొద్దనున్న పిల్లలను దృష్టిలో పెట్టుకొనియే యేదైనవిధానమును తయారుచేయ వలయును. లేనియెడల విశ్వవిద్యాలయ మొక వ్యాపకవిషయమగుటచే దానినిగుఱించి అనేకవిధములైన ఆలోచనలను సుదీర్ఘముగను, గంభీర ముగను, జరిపి చివఱకు ఫలితార్థముగ ఏపనియు ప్రత్యక్షముగ జరుగని స్థితి యేర్పడును.

కావుననే సోదరుడు 'కిశోర్‌లాల్' చెప్పినమాట మహత్వపూర్ణ మైనది. ఆయన చెప్పినదేమన: "మనబాలురు ప్రాతిపదికవిద్యలో ఉత్తర కక్ష్య ముగించిరనగనే వారు స్వావలంబకులైరని మనమెంచవలసి యుండును." ఆయనచెప్పినమాట సరియైనది. మనదేశము దరిద్రదేశ మగుటయు, ఉపాధ్యాయులపైనను, విద్యార్థులపైనను ఎక్కువధనమును వ్యయింపజాలకపోవుట అను హేతువుచేతనే కాదు మనము స్వావలంబ కులమగుట. వాస్తవముగ ఇందు శిక్షణదృష్టియే ముఖ్యమైనది. దేశ దారిద్ర్యము ఇందు మనకు కేవలము ప్రేరణనిచ్చునదై యున్నది.

## గ్రామీణ విశ్వవిద్యాలయ మెట్లుండవలయును ?

ఈదృష్టితో ఆలోచించినచో మనగ్రామీణ విశ్వవిద్యాలయము యొక్క స్వరూప మెట్లుండవలయునో మన కర్థముకాగలదు. దాని ఉపాధ్యాయులకు, విద్యార్థులకు ఆవశ్యకమైన చక్కని పుస్తక భాండాగార మేర్పాటుచేయబడును. వారికి కావలసిన పనిముట్లు రాయబడును. కావలసినభూమి యీయబడును. కొన్ని ఇండ్లుకూడ కట్టించి యీయ బడును. తక్కినవి వారుస్వయముగ కట్టుకొందురు. ఇవి నెరవేర్చిన

పిమ్మట ఇకపైన మీకేవస్తువును ఇవ్వబడదని వారితో జెప్పుదుము. ఇక ఇద్దరునుగలసి ఒక సమిష్టిజీవనమును గడుపుచు దేశమునెదుట ఉత్తమోత్తమమైన సమగ్రజీవనమెట్లుండునో ఒకమచ్చును ప్రదర్శింపవలయును. ఇట్టి విశ్వవిద్యాలయములో జ్ఞానచర్చ జరుగును, ప్రయోగములు చేయబడును. ఆ ప్రయోగఫలితములు దేశమునెదుట నుంచబడును. ఇదంతయు జరుగును. కాని ముఖ్యవిషయమేమన నేర్చుకొనువాడు, నేర్పువారు, ఇద్దరును తమకాళ్లపై తాము నిలబడుదురు. తమచేతులతో తాము పనిచేయుదురు. తమభోజనము తాము సంపాదించుకొందురు. ఏదోవిధముగా కాదు. ఉత్తమోత్తమ పద్ధతిలో సంపాదించుకొందురు. అది ఇతరులకు ప్రదర్శింతురు. అక్కడ వారుజరుపు పని, నేర్పు విద్య, తయారుచేయు పనిముట్లు, నిర్మించు భవనములు, మన్నగు అన్నిటియందును వారివిద్యా ప్రదర్శనము కన్పట్టుచుండును. మనవిశ్వవిద్యాలయముకొరకు పుస్తకములుమొదటనే తయారుకావు. విశ్వవిద్యాలయమే తనకొరకు పుస్తకములను తరువాత తయారుజేసికొనును. దాని అనుభవములోనుండియే ప్రపంచమునకు గ్రంథములు లభించుచుండును. మన విశ్వవిద్యాలయ మీవిధముగా పనిచేసి దేశమునెదుట నొకనమూనాను నిలపినచో అది యేఆడంబరము అక్కరలేకయే తనపనిని చేసికొనుచు పోగలదు. ఇట్టి ప్రత్యక్షానుభవమువలన తయారైనవస్తువు ప్రపంచమునకు విశ్వవిద్యాలయ మిచ్చిన ఒకగొప్పకానుక కాగలదు.

['సర్వోదయ' నుండి]

: 26 :

# ఆహార ప్రయోగశాల యెట్లుండవలయును ?

[తుంసర విద్యాలయములో]

## పరిశ్రమల విజ్ఞానముయొక్క ఆవశ్యకత

నాదృష్టిలో మన విద్యావిధానమున అన్నిటికంటె మిక్కిలి ఆవశ్యకమైన వస్తు వేదైన నున్నదాయన అది విజ్ఞానము. హిందూదేశము వ్యవసాయప్రధానదేశముగ చెప్పబడినను కేలవము వ్యవసాయముపై ఆధారపడుటవలననే దాని ఉద్ధరణ జరుగదు. యూరపు ఖండమందు దేశములు పరిశ్రమ ప్రధానములని చెప్పబడుచున్నవి. హిందూదేశములో వ్యవసాయప్రధాన వృత్తులున్నప్పటికిని ఇచట ప్రతివ్యక్తికి సగటున ఒకటింబావు ఎకరము మాత్రమే గలదు. దీనికి విపరీతముగ పరిశ్రమ ప్రధానమని చెప్పబడు ఫ్రాంసులో ప్రతిమనుష్యునకు సగటున ౹౸ ఎకరముల భూమిగలదు. దీనినుండి హిందూదేశపుస్థితి యెంత పాడుగనున్నదో తెలియగలదు. హిందూదేశములో కేవలము వ్యవసాయము తప్ప ఇంకేదియు జరుగుటలేదని దీనికి అర్థము. ఈ స్థితిని మార్చుటకు మన దేశమందలి విద్యార్థులు, ఉపాధ్యాయులు, ప్రజలు, అందరును పరిశ్రమలలో ప్రవీణులు కావలెను. దానికొఱకు వారు విజ్ఞానమును నేర్చుకొనవలెను.

## ఆహార విజ్ఞానము

మన వంటయిల్లు మనకు ప్రయోగశాల కావలయును. అందు పనిచేయువానికి ఏ ఆహారపదార్థములో ఎంత ఉష్ణశక్తికలదు, ఎంత

బలముగలదు, ఎంత పుష్టికలదు మున్నగు విషయములన్నియు తెలిసి యుండవలెను. అతనిలో ఏవయస్సు మనుష్యునికి ఏపనికి ఎట్టి ఆహారము ఆవశ్యకతమో లెక్కవేయగల సామర్థ్య ముండవలయును.

## మల విజ్ఞానము

బహిర్దేశమున కందఱును పోవుదురు. కాని పాఠశాలలలో పని చేయువారికి మలమును గూర్చిన విశేషజ్ఞాన మవసరము. మలముయొక్క ఉపయోగమేమి ? సూర్యకిరణములు దానిపై ఎట్టి పనిచేయును ? మలము బహిరంగముగా నుంచివేసినయెడల దానివలన ఎట్టినష్టము గల్గును ? దానివలన ఎట్టి వ్యాధులు బయలుదేరును ? భూమికి (పొలమునకు) ఎరువుగా వాడినచో దానిపంట యెంత పెరుగును ? మొదలైన విషయముల శాస్త్రీయజ్ఞానము మలవిజ్ఞానముద్వారా మన విద్యార్థులకు కలిగింపవలయును. నేను దానిపై ఒక సూత్రమునుకూడ తయారు జేసితిని. "ప్రభాతేమలదర్శనం" మలమువలన మనకు ఆరోగ్యజ్ఞానము కలుగును. శరీరము మలాగారమని తెలియుటచే దేహాసక్తియు తగ్గును.

## ఆరోగ్య విజ్ఞానము

ఎవడైన పిల్లవాడు జబ్బుపడెననుకొందము. వాడెందుకు జబ్బుపడెను ? జబ్బెపుడును ఉరకేరాదు. నీవు నీమూటలోనుండి కొంత ఖర్చుపెట్టి తీసుకొని వచ్చితివి. అతిథిపైవలె దానిపైనను శ్రద్ధవహింపవలెను. అది యెందుకు వచ్చినది ? ఎట్లువచ్చినది ? మొదలైన సంగతులను పరిశోధించి తెలిసికొనవలెను. అది యెట్లును వచ్చివేసినది గనుక దానినుండి తెలియతగినంత జ్ఞానము తెలిసికొనవలెదు. ఇందుకు నేర్చుకొనవలసిన విషయమున్నది. 'జ్ఞానదాతయైన రోగమువచ్చినది, పోయినది. మనము మొదటనున్నట్లే వ్యర్థులుగా నుంటిమి' ఇది యితరులయెడ చెల్లినను మన విషయములో మాత్రము ఎంతమాత్రమును పనికిరాదు.

## ఖాదీ విద్య

మీరు ఇచట నూలు వడుకుచున్నారు. ఖాదీగూడ తయారు చేయు చున్నారు. మీకు అభినందనములు, కాని ఖాదీ విషయములో శాస్త్రీయ మైన ప్రశ్నలకు మీరు జవాబీయలేనియెడల పాఠశాలకును, ఉత్పత్తి కేంద్రము అనగా కార్ఖానకు భేదమేమున్నది? కాని నేను మాత్రము నా కార్ఖానానుండికూడా ఇట్టి జ్ఞానమును ఆశింతును.

## జ్ఞానదృష్టి యావశ్యకము

విద్యార్థులు భోజనము చేయుచున్నారు; ఇతరులును చేయుచు న్నారు. కానిఇద్దరు భోజనము చేయుటలోను తగినంత భేదముండవలెను. విద్యారుల భోజనము జ్ఞానమయము గావలెను. విద్యార్థి ధాన్యమును విసరి జల్లించునపుడు అందుండి యెంతపొట్టు బయటవచ్చినదో వ్రాసియుంచును. ఒక సేరునుండి 8 తులముల తవుడు వచ్చినదనుకొనుడు. అనగా నూటికి పదివంతులు వచ్చినది. ఇది చాలా ఎక్కువ. మరునాడాతడు పొరు గింటికిపోయి అక్కడి తవుడు చూచును. వారిపిండినుండి 2½ తులములే తవుడు వచ్చినట్లాతడు కనుగొనును. నూటికి పదిపాళ్ళు తవుడు పోవు టచే ఏమిహాని కలదు? ఆతవుడు పొట్టలోనికి వెళ్ళినచో నష్టమేమికలదు? మొదలగు ప్రశ్నలు అతని మనస్సులో బయలుదేరి దానికి తగిన సమా ధానములుకూడ అతనికి లభింపవలెను. అప్పుడు గీతలో జెప్పినట్లు అతడుచేయు ప్రతిపని జ్ఞానసాధనము కాగలదు.

## పరిశ్రమలో విజ్ఞానము

ఈవిధముగ ప్రయోగబుద్ధితోను, జ్ఞానదృష్టితోను ప్రతిపని చేయు టలో కొంచెము ధనవ్యయమగును. కాని దానివలన తగినంత సంపాదన కూడ జరుగును. స్కూలులో పనిచేయు చరఖా శ్రేష్ఠమైనదగును. ఏదోవిధమైన చర్ఖాతో పనిజరుగదు. స్కూలులో కొంచెము తక్కు

వయినను అయినది మాత్రము ఆదర్శప్రాయముగా నుండును. ప్రత్తి తూచి తీసుకొనబడును. అందుండియెన్నిగింజలు వెలువడునో అవికూడ తూచి తీసికొనబడును. రోజీజాతినుండి ఇన్ని గింజలువచ్చిన, వైరమ్ జాతినుండి ఇన్ని ఏలవచ్చినవి? ఈవిధముగ ప్రశ్నోత్తరములు సాగును. ప్రత్తిగింజ బఠాణీ ఆకారములో ఉన్నప్పటికిని రెండిటి తూకములో ఇంత భేదమేల? ప్రత్తిగింజలో నూనె యుండును, అందుచే అది తేలిక. పిమ్మట ఇటువంటి ఇతర ధాన్యము లింకేమేమి యున్నవని చూడబడును. ఇందు నిమిత్తము త్రాసు కావలెను. అది బజారునుండి కొనరాదు. స్కూలులోనే తయారుచేయబడును. ప్రతిపనియు ఈవిధంగా చేయు నెడల విజ్ఞానము ప్రారంభమైనట్లే. ఈవిధముగ ప్రతి విషయమును గూర్చి తెలిసికొనుట ప్రారంభించినచో జ్ఞానమనునది యెంతో మనో రంజకము కాగలదు. ఇకదాని నెవడు మరచును ? అక్బరు ఏ సంవత్సర ములో మరణించెను ? అనునది వల్లించవలసిన ఆవశ్యకమేమి ? వాడు చావనేచచ్చెను. కాని మనగుండెలపై ఏల సవారీ చేయవలెను ? నేను చరిత్రవల్లించుటకు పుట్టలేదు. నేను చరిత్ర నిర్మించుటకు పుట్టియున్నాను.

## విజ్ఞానము - అధ్యాత్మము

రెండువిద్యలు నేర్చుకొనుట ఆవశ్యకము. 1. మన చుట్టుప్రక్క నున్న వస్తువులను పరిశీలించుశక్తి. అనగా విజ్ఞానము. 2. ఆత్మజ్ఞానము. అనగా అధ్యాత్మము. ఇందుకొరకు మధ్యలో నిమిత్తమాత్రముగా భాష అవసరమగుచున్నది. దానిజ్ఞాన మంతవరకే ఆవశ్యకము. భాష తపాలా బంట్రోతుపనిచేయును. ఉత్తరములో నేమియువ్రాయకపోయినను ఆవట్టి కాగితమును కూడా పోష్టుబంట్రోతు అందజేయును. భాష విద్యకు వాహనము. విజ్ఞానము - అధ్యాత్మము - విద్యయన నివియే. వానిని గూర్చియే నేను ఆలోచించెదను. నా రాట్నము విరిగిపోయినచో నేను ఏడ్చుచు కూర్చుందునా ? వడ్రంగిదగ్గరకేగి దానిని బాగుచేయించెదను.

అల్లే నన్ను తేలుకుట్టినచో నేనుఏడ్చుచు కూర్చుండరాదు, దానికి తగిన చికిత్సచేసి వదలించుకొనవలెను. ఇదే నా పాఠశాలలో పరీక్ష, నేను భాషనుగూర్చి ప్రశ్నపత్ర మిచ్చు గందరగోళములో పడను. బాలుర సంభాషణము ద్వారానే వారి భాషాజ్ఞానమును గ్రహించెదను.

## పాఠశాలను అలంకరింపవలెను

స్కూలులో జరుగు ప్రతిపని జ్ఞానమునకు సాధనము కావలెను. దీనికొరకు పాఠశాలలను అలంకరింపవలెను. మంచి మంచి సాధనములను ప్రోగు చేయవలెను. శ్రీరామదాసస్వామి "ఈశ్వర వైభవమును వృద్ధినొందింపుము" అని చెప్పియున్నారు. ప్రజలు తమ ఇండ్లను అలంకరించుకొనుటకు బదులు పాఠశాలలను అలంకరించుటకు ఉత్సాహపడవలెను. పాఠశాల కావశ్యకమగు వస్తువులను సంపాదించి పెట్టవలెను.

పై విషయములన్నియు నేను స్వానుభవముచే చెప్పినవి. ఇవి మీమండలిలో ఉపయోగింపగలవని ఆశించుచున్నాను.

["జీవనదృష్టి" నుండి]



## : 27 : సేవా గ్రామమందలి ప్రయోగము

నేటి ఉదయము నేను సేవాగ్రామము వెళ్ళివచ్చితిని. అచట తాలిమీ సంఘములో ఒక గొప్ప ప్రయోగము సాగుచున్నది. బాలురు ధాన్యము పండించుచున్నారు. కూరగాయలు కాపించుచున్నారు. కొన్ని పండ్లు కాపించు ప్రయత్నముకూడ జరుగుచున్నది. నూలు వడకుట మొదలు నేతవరకు అన్నిపనులు స్వయముగాచేసి బట్ట తయారు చేసి కొను చున్నారు. వారు తమ చేతితో పిండి విసరి స్వయముగ వంట చేసికొను చున్నారు. ఇంటి పనులన్నియు స్వయముగ చేసికొనుచున్నారు. వ్యాధిగ్రస్తులకు సేవచేయుచున్నారు. గానుగత్రిప్పి నూనె తీయుచున్నారు. తమ జమా ఖర్చులు తామే వ్రాసికొనుచున్నారు. ఇది యంతయు చేయుచు కఠినమైన విద్యనుకూడ అభ్యసించు చున్నారు. వారు చేయుచున్న ఈ ప్రయోగముచూచి మనకుకూడ ఆ పిల్లలతో చేయి కలుపవలెనను కోరిక గలుగును.

### జ్ఞానము - కర్మ

ఈ విద్యావిధానము భావసంఘర్షణను చాలమట్టుకు లేకుండ చేసినది. కొందరు బుద్ధిమంతులు జ్ఞానకర్మలకు విరోధము కలదని చెప్పుదురు. మరికొందరు విరోధము లేదుగాని రెండింటికి భేదమున్న దందురు. కొందరు భేదమున్నది, గాని రెండిటికి కలయిక జరుగవలె నందురు. కాని ఈ పద్ధతివలన రెండును ఏకరూపమును చెందుతున్నవి. కర్మవలన జ్ఞానము లభించుచున్నది; జ్ఞానమువలన కర్మ చక్కగా నెర వేరు చున్నది. జ్ఞానకర్మలు రెండును కలియుటచే చిత్తమునకు వికా సము కల్గుచున్నది. చూచుటకు మాత్రము పిల్లవాడు పనిచేయునట్లు

కన్పించును కాని లోలోపల అతడు జ్ఞానమును పొందుచునే యున్నాడు. ఉపాధ్యాయుడు అతని సహాయముకొరకు నిమిత్తమాత్రుడుగ నున్నాడు.

## క్రొత్తపద్ధతివలని లాభము

ఇదియంతయు వ్రాయుటవలన అక్కడ జరుగుచున్నది పరిపూర్ణ మనిగాని, నిర్దుష్టమనిగాని నేను చెప్పబోవుట లేదు. అచటిలోట్లు నాకు తెలియును. అయినను అందలిదృష్టి నిర్దుష్టము గావున మనస్సమాధానము కలుగుచున్నది. హిందూదేశమునందంతట ఈ విధమైన విద్య సాగినచో ఉన్నతులు - నీచులు, ధనికులు—పేదలు మున్నగు భేదము లన్నియు నశించును. శ్రమకు గౌరవము స్థిరపడును. చక్కని సంఘ సేవకులు లభింతురు. మంచి సంరక్షకులు దొరుకుదురు. ప్రతిగ్రామము స్వావలంబకమగును.

## జ్ఞానము - వికాసము

నేడుకూడ ఈ వైపు మనదృష్టిపడవలసినంతగా పడనట్లు కన్పడు చున్నది. ప్రాచీనపద్ధతిని విద్య అభ్యసించినవారు పిల్లలను 'నీవేమి తెలిసి కొంటివి' అని అడుగుదురు. తెలిసికొనుట అనుదానికి విద్యతో - అనగా చిత్తవికాసముతో - చాల తక్కువ సంబంధమున్నదని వారెరు గరు. ఆవశ్యకత కల్గినపుడు బాహ్యజ్ఞానము సంపాదించు యోగ్యత బాలుని యందున్న చాలును. ఆ యోగ్యత సంపాదించి పెట్టుటయే విద్య చేయుపని. కాని సత్యనిష్ఠ - కార్యకౌశలము - సేవాభావము - మొదలైన గుణములే ప్రధానమైనవి. ఈ దృష్టితో చూచినపుడు శిక్షణశాస్త్రములో ఇదియొక గొప్ప ఆవిష్కరణ అని చెప్పవలసి యుండును.

## తల్లిదండ్రులు గమనింపవలెను

దేవుడిచ్చిన బిడ్డలు గలవారు ఈ పద్ధతిని అర్థముచేసికొని తమ బిడ్డలకు ఈ విద్య నేర్పించినచో చాలలాభము కల్గును. తరచు జరుగున

దేమన మనము మన బిడ్డలను మన ప్రణాళికలకు దూరముగా నుంచుదుము. ప్రణాళిక ఇతరులకొరకు అట్టే పెట్టబడుచున్నది. తత్ఫలితముగా అది సారహీనమగుచున్నది. ఈవిద్యనే మనము మన పిల్లలకిచ్చినచో అది పటుత్వము గలదగును. తరువాత నది హిందూదేశమంతట వ్యాపించుటకు ఎంతో కాలము పట్టదు. ఏలన విద్యావిషయములో వైశాల్యమున కెట్టి మహత్వమును లేదు. కేవలము లోతునకే మహత్వము గలదు. ఒకచోటనైనను విద్యావిషయములో ఒకటి రెండు గంభీర ప్రయోగములు జరిగినచో వానికి స్వయముగనే అంతట ప్రచారము జరిగిపోవును. కావున ప్రభుత్వ మీ విషయములో ఏమి చేయుచున్నది? అను ఆలోచన విడిచి మనము దీని రుచి గ్రహించి మన పిల్లల కీపద్ధతితో విద్య నేర్పించినచో అది ఒక గొప్పపని కాగలదు.

['సేవక్', మార్చి 1948]

# : 28 : నిత్యనూతనమైన విద్య

బాలుర విద్య అనునదొక మంగళప్రదమైనపని. ఇది సేవాగ్రామములో ఏండ్లతరబడి జరుగుచున్నది. ఇది నవీన విద్య అని పిలువబడుచున్నది. కాని నేను దీనిని 'నిత్యనూతన విద్య' అని పిలుతును. నిత్యనూతన విద్య కర్థము నదీజలమువోలె నిన్న ఉన్నది నేడు లేదు. నేడున్నది రేపుండదు. నది ప్రవహించుచునే యుండును. కాని ప్రతిక్షణము దానినీరు క్రొత్తదగు చుండును. అట్లే నిత్యానుభవమువలన ఏది నిత్యము మారుచుండునో అదియే నిత్యనూతన విద్య.

## నిర్ణీత పథకము కూడదు

విద్యాశాఖవారు విద్యకొక పద్ధతిని తయారుచేసి పెట్టుదురు. నిర్ణీతమైన ఒకపద్ధతి తయారుకాగానే అచట విద్య చెడినట్లే. కావున నేను నా జీవితములో ఇటువంటి పద్ధతిని ఏర్పడనీయకూడదని నిశ్చయించుకొంటిని. ప్రతిదినము క్రొత్తక్రొత్త అనుభవములు కల్గుచుండును. వాని ననుసరించి మన జీవితము నిత్యము మార్చుకొనునట్టి శక్తి మనలో నుండవలెను.

## స్థానిక పాఠ్యపుస్తకము లుండవలెను

మనము ప్రాతిపదిక విద్యనుండి ఆరంభించితిమి. ఇప్పుడు ప్రాతిపదిక విద్యలో పూర్వభాగమున ప్రవేశించుచున్నాము. అందుకూడ గ్రామదృష్టితోనే పనిచేయవలెను. కావున ప్రాతకాలపు ఆలోచనలు అచట పనిచేయవు. ప్రతి గ్రామముయొక్క పరిస్థితి వేరువేరుగ నుండును. ఆ పరిస్థితిని దృష్టిలో పెట్టుకొని, విద్యావిషయము నాలోచింప వలెను. ఏ

గ్రామము నది ఒడ్డున ఉన్నదో అచ్చటి పిల్లల విద్య ఒక రకముగా నుండును. ఏ గ్రామ ప్రాంతమున పర్వతము లుండునో అచ్చట అది ఇంకొక విధముగా నుండును. ఏ గ్రామము చుట్టుప్రక్కల అరణ్యముండునో అచ్చటి విద్య మూడవ రకముగ నుండును. ప్రతి గ్రామ ప్రాంతమందలి వాతావరణమును పరిశీలించి వేరువేరు విధమైన విద్యా విధానమును నేర్పాటు చేయవలెను. విద్యనుగూర్చి తయారు చేసి పెట్టిన ఒక పద్ధతిగాని పుస్తకములుగాని అన్ని గ్రామములకును పనికిరావు. నేడు రాష్ట్రమంతట ఒకే పుస్తకము అన్ని స్కూళ్ళలోను చదివించబడు చున్నది. ఇట్టి పుస్తకములో ప్రతి గ్రామమునందును గల విశేషము భేదము చెప్పవలెనను దృష్టియుండదు. అదియొక సర్వసామాన్యమగు పుస్తకము. ఇందుచే పిల్లల కందు మనోరంజనము కలుగదు. ఆ గ్రామమున కది విశేషముగా నుపయోగించునదియు కాదు.

## సజీవమైన చరిత్ర - భూగోళము

పుస్తకములు మన స్కూళ్ళకును కావలయును. కాని మన పుస్తకము ప్రతి పల్లెటూరు పరిస్థితి దృష్టియందుంచుకొని వేరువేరు విధముగా రచింపబడును. ఆయా పల్లెటూళ్ళ వాతావరణ మందుండును. సేవా గ్రామమందలి పాఠశాలలో చరిత్ర నేర్పవలెనన్న అచ్చటనున్న సంస్థలయొక్క చరిత్ర ఆ పుస్తకములో నుండును. సేవాగ్రామ మెట్లు తయారయ్యేనో అందుచెప్పబడును. వృద్ధులైన గ్రామస్థుల యనుభవములు అందు తెలుపబడును. ఈ విధముగ అది ఒక సజీవమైన చరిత్ర కాగలదు. భూగోళము కూడ సేవాగ్రామము చుట్టుప్రక్కలనుండియే ప్రారంభమగును. మనమున్న గ్రామమే ప్రపంచమంతటికి మధ్య బిందువు. ఏలన మనమచ్చట నివసించుచున్నాము. మన చుట్టును తక్కిన ప్రపంచమున్నది. ఇట్టి ఉద్దేశ్యముతో మన భూగోళము తయారగును.

## సృష్టి - లయముల నిత్యక్రమము

ఇది మాయొక్క అభిప్రాయము. నిత్యము నూతనానుభవములను పొందుచుందుము, ప్రయోగములు చేయుచుందుము. పూర్వానుభవముపై నిర్మింపబడిన వస్తువును నూతనానుభవము లభించినమీదట నశింపజేసి ఇంకొక క్రొత్త వస్తువును తయారుచేయుదుము. ఈ విధముగ నిర్మించుట, నశింపజేయుట అనుక్రమము ఎడతెగకుండ సాగుచుండును.

## శిక్షకులు బాలురు కావలెను, బాలురు ప్రౌఢులు కావలెను

"బాలుర విద్యకు తత్వమేమి ?" అని నన్నెవ్వరైన అడిగినచో నేను సంగ్రహముగ ఇట్లు తెల్పెదను. "విద్యనేర్పు ఉపాధ్యాయులు బాలురు కావలయును; విద్య గ్రహించు బాలురు ప్రౌఢులు కావలయును. ఉపాధ్యాయుడు బాలుడు కాజాలనిచో అతడు విద్యనేర్పుట లేదనియు, బాలుడు ప్రౌఢుడు కానిచో అతడు విద్యను గ్రహించుట లేదనియు తలంచవలెను."

## ప్రార్థన మాతృభాషలో జరుగవలెను

బాలురతో కలిసి మనము చేయుపని మన నిత్య జీవనమునకు సంబంధించినదై యుండవలెను. ప్రతిపనికి వెనుక నుండు ఉద్దేశ్యము పిల్లలకు బోధింపవలెను. ఎట్లన మనము నిత్యము ప్రార్థన చేయునెడల అది పిల్లల మాతృభాషలోనే యుండవలెను. ఖురాన్ అరబీ భాషలో చదివిననే పుణ్యమువచ్చును, మహారాష్ట్రి భాషలో గానముచేసిన ఖురాన్ పాడైపోవును - ఇట్టి భావములుండరాదు. ఈ సూత్రమే వేదమంత్రములకును, తక్కిన ప్రార్థనలకును కూడ వర్తించును. ప్రార్థన బాలుర మాతృభాషలో నున్నప్పుడే వారు దాని అర్థము తెలిసికొనగలరు. అర్థజ్ఞానము లేనిచోట ప్రార్థనకు ఏవిధమగు విశిష్టతయుకూడదు.

## శిక్షకుల ట్రెయినింగు

ఇచట ఇతర ప్రాంతములనుండి వచ్చిన ఉపాధ్యాయుల కొఱకు కొంత నియతమైన అభ్యాస క్రమము ఈయబడుచున్నది. వారిచట నవీన విద్యనుగూర్చి ఉపన్యాసములు వినుచున్నారు. కాని నేను మాత్రము వారికి సంవత్సరము మొత్తముమీద ఇప్పుడు మీయెదుట యిచ్చినంత ఉపన్యాసమే యిచ్చి "ఒక పనిలో చొరబడుడు" అని చెప్పుదును. ప్రతి దినము వారుచేయు పనిలో ఏయే సమస్య లుత్పన్నములగునో వానిపై సాయంకాలము చర్చింపుమని కోరుదును. వారు పొందిన బి. ఏ. యం. ఏ. మొదలగు విద్యలోను వారు ఉపన్యాసములు మాత్రమే విను చుండి ఇచట కూడ వారు ఉపన్యాసములు మాత్రమే విను చుండినచో నిజమైన విద్యను పొందజాలరు. నేను వారితో ఇట్లు చెప్పుదును. "మీకు ప్రభుత్వమునుండి లభించుచున్న విద్యార్థివేతనమును ఇంటికి పంప వచ్చును. కాని యిచట మీరొక నెలరోజులపాటు మీ భోజనము మీరు సంపాదించి చూపవలయును. మీరు రోజుకు పది, పండ్రెండు గజములు నేయగలరా ? యని యడుగుదును." దీనిపై "ప్రత్యక్షముగా నేయుట మాకు తెలియదు. కాని నేత సూత్రములను మాత్రము ఎఱుగుదుము" అని వారు చెప్పినచో "ఆహార సూత్రములను మీరెఱుగుదురుగదా ఇక ప్రతిదినము తినుట యెందుకని" నేనందును. అనగా మనవిద్య కేవల శబ్దవిద్యగాక శక్తి శాలిని గావలెనని నాభావము.

## ప్రాతకాలపు విద్య యందలి మోహము

కాని అసలువిషయ మేమన మన మెదడులో ప్రాతకాలపు విద్యయే నిండియున్నది. ఉపాధ్యాయు లిచట బాలురకు వంట, నూలు వడకుట, నేత, మున్నగునవి నేర్పుచున్నారు. కాని మొత్తముపై బయటి స్కూళ్ళ బాలురతో పోల్చిన మన బాలుర ప్రమాణ మెంతయుండునని లెక్కించుచున్నారు. బయటి పిల్లలతో మన పిల్లలను పోల్చుట యెట్లు

కుదురును ? మన పిల్లవాడు చక్కగా ఈదగలడు. ఇంతేకాదు, ఇంకొక నినికూడ రక్షింపగలడు. బయటి స్కూలులోని బాలుడు ఈవిధముగా ఈదగలడా ? వాడు తప్పక మునిగిపోగలడు. చదువున కేమియు విలువ లేదని నా యభిప్రాయముకాదు. కాని తక్కిన పది, పన్నెండు గుణము లలో ఇదికూడ ఒక గుణము. అట్టిచో దీనికింత మహత్త్వమేల యీయవలెను ?*

సేవక్ నుండి మార్చి, 1950.

---

*సేవా గ్రామమందు 16-2-50 న తేదీన ప్రాతిపదిక విద్యాలయముయొక్క శంకుస్థాపన సమయమున ఈయబడిన ఉపన్యాసము.

•

## :29: గ్రామసీమలకు స్ఫూర్తిస్థానము

నేను నిన్న ప్రార్థనలో యిట్లు చెప్పితిని. "మీరు హిందూదేశపు ఉప్పు తినియున్నారు. మీరేమియు చేయజాలనిచో ఇక హిందూదేశములో చేయగలవాడెవడును లేడు. ప్రభుత్వ పరిపాలనలో చేరినవారు మనలో ఉత్తమోత్తములు. కాని ప్రభుత్వము అన్ని పనులు చేయజాలదని మనము తెలిసికొనవలయును. నవీన విద్యా విషయము కూడ ఇట్టిదే. ఇందు కొంతభాగము ప్రభుత్వము చేయగలదు. కొంతభాగము ప్రభుత్వము చేయజాలదు.

### నవీనవిద్య అంతటిని కలుపునది (సర్వసంగ్రాహకము)

నవీనవిద్య యెంత వ్యాపకమైనదన అందు హిందూదేశము యొక్క అన్ని విధములైన సేవలు అంతర్భవించును. ఈ నడుమనే మనము "సర్వ సేవాసంఘమును" నిర్మించినపుడు నాయకంగారు "దీని యవసరమేమున్నది? నవీనవిద్యయే సర్వసేవా సంఘ"మని చెప్పిరి ఈ యభిప్రాయమును నేనంగీకరించుచున్నాను. కాని సర్వసేవాసంఘము యొక్క ఉద్దేశ్యమువేరు. ప్రతి సంఘముయొక్క యోజనాశక్తి వేరు వేరుగ నుండును. వాని నన్నిటిని కలుపుటకొరకే సర్వసేవా సంఘ మున్నది.

### "తాలిమీసంఘము - నవీనవిద్య"

"తాలిమీసంఘము" వేరు, నవీనవిద్య వేరు. తాలిమీసంఘము ఒక చిన్నవస్తువు. నవీనవిద్య పెద్దవస్తువు. తాలిమీసంఘము కొంత వఱకు మార్గమును చూపించును. కాని అది స్వయముగా ఎంతవఱకు

చూడగల్గెనో అంతవరకే ఇతరులకు చూపించుము. కావున మీకు చెప్ప దలచిన మొదటిమాట యేమన తాలిమీసంఘముయొక్క మార్గదర్శ కత్వమునకు మీరంత ఎక్కువ మహత్త్వమీయక మీ స్వతంత్ర బుద్ధినే ఉపయోగింపవలెను.

## మనస్థితి నరసింహమూర్తిని పోలియున్నది

ఈ ప్రణాళికను రచించిన మనమింకను గట్టిపడలేదని తెలిసికొన వలయును. మనము చదువుకొనిన విద్య పురాతనపు విద్య. కాని మన భావములలో క్రొత్తదృష్టి యేర్పడినది. ఇది మంచిదే కాని యిందువలన మనజీవితము భయంకరమైనది. నేను నా జీవితమునకును 'నరసింహ మూర్తి'ని ఉపమానముగా నిచ్చితిని. నరసింహమూర్తి పూర్తిగా పశువును కాడు. పూర్తిగా మనుష్యుడును కాడు. ఆయనకు పూర్వము వచ్చిన 'వరాహము' పశువు. ఆయన తరువాత వచ్చిన 'వామనుడు' మనుష్యుడు. కాని ఈ మధ్యవచ్చిన 'నరసింహావతారము' అన్ని అవతారములలోను భయంకరమైనది. అట్లే పూర్వకాలపు విద్యను చదువుకొని నవీన విద్యను గూర్చి ఆలోచించుచున్న మనమును భయంకరులమే.

## నాలుకపై నామము, చేతిలో పని

మనము నడిపింపదలచుకొనిన విద్యావిధానమునకు ఒక గవ్వ కూడ ఆవశ్యకము కారాదని నా యభిప్రాయము. భగవద్గీతలో ఇట్లు చెప్పబడినది. "త్యక్తసర్వ పరిగ్రహః" "శారీరం కేవలమ్ కర్మ" అన్నివిధములైన పరిగ్రహము విడిచి శరీరముతో పనిచేయుము.

నేనేదైన పల్లెటూరికిబోయి నవీన విద్యా ప్రచారము చేయగోరితి ననుకొనుడు. అప్పుడు నేనచ్చటి కూలివాండ్రతో పొలమునకు కూలి చేయుటకు పోవచ్చును. పొలము యజమాను డిచ్చిన కూలితో బ్రతుకు దును. ఈ విధముగా బ్రతుకుటకు ప్రారంభించిననాడు నేను నవీన

విద్యకు "ఉత్తమోపాధ్యాయుడను" కాగలను. మనకు ఉత్తములగు గురువులని చెప్పబడువారు ప్రాచీన కాలములో ఇట్లే పనిచేసిరి. కబీర్ ఒక ఉత్తమ గురువు. అతని బోధను హిందూదేశస్థులు నేటికిని మరువ లేరు. అట్టి గురువే "దళ్ళువన్" అను నాతడు. ఆయన తమిళనాడునకు సర్వోత్తమమగు జ్ఞానమును ప్రసాదించెను. "నామదేవు"డను నాతడు దర్జీపని చేయువాడు. "కబీరు, దళ్ళువన్" నేతపని చేయుచుండిరి. ఇట్లే యితర గురువులుకూడ ఏదో ఒక పని చేయుచుండిరి. వారు మనకు "నాలుకపై పరమేశ్వరుని నామము, చేతిలో ఉత్పాదన కార్యము" అను సూత్రమును బోధించిరి. అట్టిచో పల్లెటూరికిబోయి పొలములో పని చేయుటకు నారెండు చేతులుకాక యింకేమి కావలెనని నేనడుగుదును.

## సాధనములు తయారుచేయుటలో విద్య

పల్లెటూరికి వెళ్ళుటకు ప్రజలు భయపడుదురు. పల్లెటూరిలో లభ్య మగు సేవతో పట్టణవాసుల క్రమ జీవితమును పోల్చి చూచుకొన్నచో పట్టణవాసుల జీవిత మెంత దరిద్రమో తెలియగలదు. పల్లెటూరిలో ఒక సమిష్టి జీవనము గలదు. పట్టణములో ప్రతి ఒకడును వేరువేరుగ జీవిం చును. పట్టణవాసులు తమ స్వార్థమునకై ఒకచోటికి చేరినవారు. కావుననే ఒకానొకకవి "భగవంతుడు" గ్రామములు నిర్మింపగా మనుష్యుడు పట్టణములు నిర్మించెను." అని చెప్పెను. ఇతరులకు నేర్పు యోగ్యత గల మనుష్యుడు శ్రమికులతో గలసి పనిచేయుట ప్రారంభించినచో తాను నేర్చుకొనవచ్చును. వారికి నేర్పవచ్చును. అచటి పిల్లలకు రాత్రి పూటగాని మధ్యాహ్నముగాని అవకాశమునుబట్టి నేర్పవచ్చును. మీకు రాట్నము కావలెనన్న అరాట్నమే తన వెలను పదునైదు రోజులలో తీర్చివేయగలదు. తకిలీ కావలెనన్న దానిఖరీదు ఒకరోజులో అదియే తీర్చివేయును. ఈ చిన్నచిన్న పనిముట్లలోనున్న విశేషమే అది. మీ పనిముట్లను మీరే తయారు చేసుకొనవచ్చును. అట్లు చేయునపుడు నవీన

విద్యకు అదికూడ ఒక మంచి విషయమైనట్లు మీరు కనుగొనగలరు. కావున దేహపరిశ్రమయందు నిష్ఠ మీ గ్రామీణ సోదరులపై ప్రేమ పని చేయు సమర్థత, వైజ్ఞానిక దృష్టి ఇవి తీసికొని స్వతంత్రబుద్ధితో గ్రామములకు వెళ్ళి మీకు ఉచితమని తోచిన విధముగా విద్యను నేర్పుట ప్రారంభింపుడు.

## సెలవుల విషయము

"నేను గ్రామములో వ్యవసాయ కార్మికుడు"గనే పని మొదలు పెట్టుదునని మొదటనే చెప్పితిని. కాని మన స్కూళ్ళలో వ్యవసాయపు పనులులేని రోజులలోనే సెలవు ఈయబడుట చూచుచున్నాము. వేసవి కాలపు సెలవులను మన కాంగ్లేయులు నేర్పిరి. మనము దానినే అవలంబించితిమి. "వేసవికాలములో పని తక్కువ అగును. ఉత్సాహము (ఎనర్జీ) నిలబడదు." అని వారు మనకు బోధించిరి. కాని భూమిలో ఉష్ణత అధికముగా నున్నచోటనే మహా వృక్షములు బయలుదేరుట మనము చూచుచున్నాము. కావున స్కూలుకు సెలవు ఈయవలసి యున్నచో వర్షాకాలములో నీయవలెను. కాని నేను దానిని సెలవు అని పిలువను. జైలులో సెలవు అను మాటకు అర్థముండవచ్చును. మన పూర్వపు స్కూళ్ళుకూడ జైళ్ళవంటివి కావున వానికి సెలవు ఆవశ్యకమయ్యెను. కాని మనకు ఒక రోజుకూడ సెలవక్కఱలేదు. జ్ఞానములో ఆనంద మున్నచో సెలవెందులకు ?

## మానవ బుద్ధియే విప్లవము తేగలదు

నేను 'పవనార్' నుండి అచ్చటికి 3 మైళ్లలోనున్న 'సురగామ్'కు ప్రతిరోజు పాకీపని చేయుటకు వెళ్ళుట జ్ఞప్తియందున్నది. వర్షాకాలములో గూడ వెళ్లుచుండువాడను. ఇంత వర్షములోకూడ యెందుకు వచ్చుచున్నారని అచటి వారడిగిరి. "తమ్ముడా ! ఇతరులకు సెలవుండవచ్చును

గాని పాకీవానికి సెలవెట్లు ?" అంటిని. నా ఆదర్శము సూర్యనారాయణ మూర్తి. సూర్యుడందరికంటె గొప్ప పాకీవాడు. మనము చేయుచున్న కశ్మలమునకు హిందూదేశములో చక్కని సూర్యకాంతియే లేనియెడల మనము ఎప్పుడో నశించి యుండువారము. కాని నేను సంవత్సరము పొడుగున సూర్యనారాయణమూర్తిని అనుకరింప జాలకపోతిని. జబ్బు పడి తొమ్మిది రోజులు పనికి వెళ్ళలేకపోతిని. ఇందుకు నాకు దుఃఖము కలిగినది. నేనిట్లు పనిచేయుటవలన కలిగిన పరిణామ మేమన, ఆ గ్రామస్థులు పాకీపనిని ఒక మిక్కిలి పవిత్రమైన కార్యముగా నెంచసాగిరి.

ఒకరోజున నేను వెళ్ళుటకుముందే గ్రామమంతయు పరిశుభ్రమయ్యెను. ఆనాడు గణపతి ఉత్సవము. నేనచ్చటికి ఉదయము 7 గం॥లకు చేరితిని. గ్రామమంతయు పరిశుభ్రముగా నుండుట చూచి ఎవరీ గ్రామమును పరిశుభ్ర పరిచిరని యడిగితిని. గ్రామస్థు లిట్లుచెప్పిరి: "నేడు గణపతి ఉత్సవము కావున నేడేదైన పవిత్రమైన పని చేయవలయునని మేమాలోచించితిమి. వెంటనే మా యువజనులందరు కలిసి పనిచేసిరి." నేను దీనిని విప్లవమని పిలుతును. ఇట్టి విప్లవమును ఏ ప్రభుత్వమును చేయజాలదు. కావుననే నిన్న ప్రభుత్వాధికారము లేనిదే సమాజములో మార్పు రాజాలదను మాట విన్నప్పుడు అది నాకు నచ్చలేదు. నచ్చలేదు సరిగదా నేనిందుకు వ్యతిరేకముగ కూడ తలంచుచున్నాను. ఏ ప్రభుత్వమును విప్లవమును తీసికొనిరాజాలదు. తీవ్రమైన మార్పును దెచ్చుట ప్రభుత్వముయొక్క పనియేగాదు.

ఈ విధమైన విప్లవకార్యము తాలిమీసంఘము కూడ చేయజాలదనియే నేను చెప్పుదును. మీకు భగవంతుడు ఇచ్చిన బుద్ధి యేదిగలదో అదియే విప్లవమును తీసికొనిరాగలదు. ఏలయన చివరకు తాలిమీ సంఘముకూడ ఒక జడవస్తువే. మనుష్యుని ఆత్మ చేతన వస్తువు; మనము సంఘమని పిలుచునది జడము; వ్యక్తి చేతనము.

## విద్యాలయము గ్రామ వికాసకేంద్రము

మన స్కూలునందలి ఉపాధ్యాయుడు సమస్త గ్రామమునకు సేవకుడు కూడ కావలయును. అప్పుడు గ్రామ పాఠశాల సేవాకేంద్రము కాగలదు. గ్రామస్థుల కౌషధమీయవలసినచో అది స్కూలు ద్వారానే యీయబడును. బాలురందు సహాయము చేయుదురు. గ్రామమును పరిశుభ్ర పరచవలసి యున్నచో పాఠశాల దానికి కేంద్రముగా నుండును. పాఠశాల బాలురు, ఉపాధ్యాయులు, గ్రామస్థులకు సహాయముచేయుదురు. గ్రామములో ఏమైన తగాదాలున్నచో వానిని తీర్చుకొనుటకు కూడ ప్రజలు ఆ గ్రామమందలి ఉపాధ్యాయుల దగ్గరికి వత్తురు. గ్రామములో యేదైన ఉత్సవము చేయవలెనన్న దాని యేర్పాటుకూడ పాఠశాల చేయును. ఈ విధముగా గ్రామమునకు కేంద్రస్థానము పాఠశాలయగును. గ్రామమందున్న వస్తువునకు విద్యాలయము వికాసమును చేకూర్చును. లేనిదానిని తెచ్చి స్థాపించును. నిన్న మనము వ్యవసాయమును గూర్చియు నేతను గూర్చియు చర్చించుచుంటిమి. అన్నిగ్రామములలోనునడచుచున్నది గనుక వ్యవసాయము ముఖ్యము. ఎచ్చటను నడచుటలేదు గాబట్టి నేత ముఖ్యము. కావున విద్యాలయమందలి వ్యవసాయ విద్యకు వికాసము కల్పించవలయును; నేత విద్యను స్థాపించవలయును.

## డబ్బును వస్తువులతో పోల్చరాదు

"వ్యవసాయము, నేత, లేదా వస్త్రము యీ పనులవలన మన కెంతడబ్బు లభించును?" అను ప్రశ్నయే తప్పు. నేతవలన మనకు డబ్బు లభించదని తెలుసుకొన వలయును. అందుంచి వస్త్రము లభించును. వ్యవసాయము వలన మనకు డబ్బు లభించదు. ధాన్యము లభించును. వస్త్రపు పనివలన మనకు డబ్బు లభించదు, ఇల్లు లభించును. ఈ వస్తువులతో ధనమునకు సామ్యమే చేయుటకు వీలులేదు. పాలవెల యెక్కువ, నీటివెల తక్కువ అని చెప్పుచుందురు. కాని దాహము

వేసినప్పుడు పాలతో పని జరుగునా ? యని నేనడుగుదును. అసలు విషయమేమన ఈశ్వరసృష్టిలో అన్నింటికంటె ముఖ్యమైన వస్తువు అందరికి తేలికగా లభించు నేర్పాటుగలదు. కావున డబ్బు దృష్టి విడిచి సమస్త జీవనమును పూర్ణదృష్టితో చూడవలెను.

## ప్రపంచమునకు గ్రామము దృష్టాంతము

మన పనులన్నియు ఉపాధ్యాయులపై ఆధారపడియున్నవి. ఇందుచే హిందూదేశములోను, ప్రపంచములోను ఏమేమి జరుగుచున్నదో దానికి సంబంధించిన విషయమంతయు మన ఉపాధ్యాయులకు చక్కగా తెలిసియుండ వలయును. దేశమెదుర్కొను సమస్యలకు పరిష్కారములు కూడ ఉపాధ్యాయులవద్ద సిద్ధముగా నుండవలెను. హిందూదేశము తనకు కావలసిన ధాన్యమంతయు తానే పండించుకొనగలదా ? అని నిన్న ఒక చర్చబయలుదేరినది. "దీనికి సమాధానము 'జయరామ్‌దాస్ గారు' ఈయ జాలరు. ఇక మన ఉపాధ్యాయులేమి యీయగలరు ?" అని ఒక సోదరుడనెను. కాని నేను అనునదేమన 'జయరామ్‌దాస్‌గారు' వెంటనే దీనికి సమాధానము ఈయలేక పోవచ్చును కాని మన ఉపాధ్యాయులవద్ద సమాధానము ఉండవలసినదే. ఎందుచేతననగా జయరామ్‌దాస్‌గారు విశ్వరూప దర్శనము చేయువారు. విశ్వరూప దర్శనము వలన అర్జునుడు కూడ భయపడిపోయినాడు. కాని మన ఉపాధ్యాయుడు ఒక గ్రామమును సమస్త ప్రపంచమని తలచును. ఇందుచే ఆగ్రామ సమస్యను అతడు పరిష్కరింప గలిగినచో ప్రపంచ సమస్య అంతయు కూడ పరిష్కారము కాగలదని అతనికి గోచరించును. అతడు జయరామదాసుగారికి సలహా యీయగలడు. "మాగ్రామములోనికి వచ్చి చూడండి, మేము ఆహార సమస్యను ఎట్లు పరిష్కారము చేసికొంటిమో" అని అతడు చెప్పగలడు. ఇట్టి ప్రయోగములన్నియు వ్యాపక దృష్టితో జరుగవలెను. మనదేశ సమస్యలకు పరిష్కారము నవీనవిద్యలోనుండి లభింపవలెను.

## సత్యనిష్ఠను వికసింపజేయవలెను

పైన చెప్పిన పదములన్నింటికంటె ముఖ్యమైన సంగతి చెప్పుచున్నాను. అది సత్యనిష్ఠ. మన పాఠశాలలో సత్యనిష్ఠను నిర్మించుటకు అత్యధికమగు ప్రయత్నమును చేయవలెను. బాలురపై ఎప్పుడును విశ్వాసముంచవలెను. పిల్లవాడేది చెప్పినను అది నిజమే అని తలచి నడచుకొనవలెను. సత్యనిష్ఠగలవాడెప్పుడును ఇతరులపై నమ్మకముంచును.

ముప్పది సంవత్సరముల క్రిందటి మాట. నేనప్పుడు కాశీలో నుంటిని. ఒక దుకాణమునకు తాళమును కొనుటకు వెళ్ళితిని. వస్తువు కొనదలచుకొనకపోయినను దాని ఖరీదు అడిగి తెలిసికొనుట నా అలవాటు. ఇందుచే నాకు తాళము వెల తెలియును. దుకాణదారు తాళము వెల 10 అణాలు అని చెప్పెను. దాని వెల 3 అణాలని నేనెరుగుదును. నేను దుకాణదారుతో ఇట్లని చెప్పితిని, "నేను దీని వెల 3 అణాలని యెరుగుదును. కాని నీవు 10 అణాలు చెప్పుచున్నావు కావున నేను 10 అణాలు ఇచ్చుచున్నాను." 10 అణాలు ఇచ్చి తాళము తీసికొని వచ్చితిని. నేను పోవుమార్గము ఆ దుకాణము మీదుగనే. కావున ప్రతిదినము నేను ఆ దుకాణము మీదుగనే వెళ్ళవలసి వచ్చెడిది. 2,3, వారములయిన పిదప దుకాణమువద్ద ఇంకెవ్వరును కొనువారు లేనిసమయమున నేను ఆ దుకాణము మీదుగా వెళ్లుచుండ అతడు నన్ను బిలిచెను. అతనికేమి తోచినదో తెలియదు. "తాళము వెల 3 అణాలే, ఈ 7 అణాలు తిరిగి తీసికొనండి" అని అతడు చెప్పెను. నా కన్నులలో నీళ్లు తిరిగినవి. నేనిట్టిది జరుగునని ఊహించలేదు. ఈశ్వరుడు నాకు సత్యనిష్ఠనుగూర్చిన బోధ చేయుచున్నట్లనిపించినది. కాని ఈశ్వరుడెప్పుడును ఇట్లు చేయకపోవచ్చును. ఆయన భక్తుని ఎక్కువగా పరిశోధించును. కావున ప్రజల హృదయముపై మన సత్యనిష్ఠ యేమియు పనిచేయక పోయినప్పటికిని మనము సత్యనిష్ఠులుగనే ఉండవలయును.

## : 30 : నవీనవిద్య యేల పురోగమించుటలేదు?

హిందూస్తానీ తాలిమీసంఘము సేర్‌ఘాటిలో
ఉపాధ్యాయులతో జరిగినచర్చ

బీహారు రాష్ట్రములో ప్రాతిపదికవిద్యపై ఒక వ్యాపకము, గంభీరమునైన ప్రయోగము చాలసంవత్సరములనుండి జరుగుచున్నది. దేశముయొక్క చూపంతము ఈ ప్రయోగమువైపే ప్రసరించుచున్నది. కాని జరుగవలసిన విధముగా పని జరుగుచున్నట్లు కన్పించదు. నవీనవిద్య స్వావలంబకము కావలెనని గాంధీజీ చెప్పుచుండెడివారు. కాని నేడు నవీనవిద్య అధికవ్యయ సాధ్యమగుచున్నదని విమర్శ వినిపించుచున్నది.

### నవీన విద్యలో కూడ వేతన దృష్టి

దీనికి కారణమేమన మనము విలువలు మారవలెనని చెప్పుచున్నామేకాని నేటి నవీనవిద్యలో అవి కన్పించుటలేదు. విద్యాశాఖలో ఇంకొకచోట వేతన ప్రమాణము ఎక్కువ తక్కువలుగా నున్నట్లే, నవీన విద్యా సంస్థలలో కూడా నున్నది. అందలి నౌకరీదృష్టి, ముందురాబోవు అభివృద్ధిని గూర్చిన ఆలోచనలు మున్నగునవి యిందును పనిచేయుచున్నవి.

ప్రభుత్వము అసగ్రమైన ఆలోచనతో నడుచుచున్నది. పూర్వపు పద్ధతి పాఠశాల లెన్నిపెట్టినను అవి గ్రాండ్ ట్రంక్ రోడ్డు వంటివే. నవీనవిద్య బోధించు స్కూళ్ళలోనే కొంత ప్రమాదముకలదు.

## సింహాసనముమీద కూర్చున్నంత మాత్రమున శివాజీ కాడు

విద్యాశాఖయందలి యొక అధికారి, మాటమధ్యలో "ప్రభుత్వ శాఖలలోని ఉన్నతాధికారి ఉత్తముడగుట ఆవశ్యకము." అనెను. ఆయన తాము చెప్పిన విషయమును చక్కగనే ప్రతిపాదించెను. కాని ఇందొక బాధకలదు. నవీనవిద్యలో శిక్షణ పొందినవాడు తన కాళ్ళపై తాను నిలబడజాలనిచో ఆతడు ఆయన చెప్పిన విధముగా నున్నత పదవులలోనికి వెళ్ళినప్పటికి పనికిరానివాడుగా తేలును. స్వావలంబకుడైన ఒక కమ్మరి ప్రధానమంత్రి యైనచో అతడు చక్కగనే పనిచేయవచ్చును. కాని నౌకరీ లభించని హేతువుచే నిరుద్యోగిగా నుండునాతడు ఉన్నత పదవిని పొందినప్పటికిని ఏమియు చేయజాలడు. ప్రభుత్వ యంత్రము అతనిని జీర్ణము చేసికొనునుగాని అతడా యంత్రమును మార్పజాలడు. తనపని తాను సరిగా నెరవేర్చలేని ఒక సైనికుని తీసికొనివచ్చి శివాజీ సింహాసనముపై కూర్చుండ బెట్టినంతనే అతడు శివాజీ కాజాలడు.

## ప్రభుత్వమును నిర్మించు శిక్షకులు

నేడు విద్యయొక్క పై నిర్మాణమంతయు పాతదే. నిజమైన ప్రాతిపదికవిద్య అను పునాదిపైనే పై నిర్మాణము జరుగవలయును. కాని నేడట్లు జరుగుటలేదు. కావున నేను చెప్పునదేమన "నిర్ణాయక స్థానము" (Key position) ప్రభుత్వముకాదు. ఓటు నిచ్చువాడు. ఇందుచే నేటి ఉపాధ్యాయులు జనులలోనికి పోయి ఓటు నిచ్చువారి భావములను మార్చినచో వారి చేతిలోనికి నిర్ణాయకశక్తి వచ్చును. పిమ్మట మొత్తము ప్రభుత్వమంతయు ఎట్లు ఏర్పాటు చేయవలయును అను విషయము కూడ వారి చేతియందే యుండును. ఈ విధముగా నీ యుపాధ్యాయులు

స్వయముగా ప్రభుత్వమున ప్రవేశింపక ప్రభుత్వమును నిర్మించువారగుదురు. వారు నౌకరీ చేయక నౌకరీ చేయువారిని నియమించువారుగా నుందురు, ఈ శక్తి, విలువలలో మార్పు అమలులోనికి వచ్చినప్పుడే, నవీన విద్యాశిక్షకులలో రాగలదు.

## శిక్షకులకే విద్యలో శ్రద్ధలేదు

మా భూదాన యాత్రలో "బేసిక్" స్కూలు ఉన్నచోటకెల్ల వెళ్ళి అచటి పని చూచుచుందుము. అక్కడ నేను శిక్షకులను మీపిల్లలు ఎక్కడ చదువుచున్నారని అడుగుచుందును. వారు గయ లేక పాట్నా వంటి పట్టణములలో నని జవాబిత్తురు. తండ్రి, గురువు మంచి పద్ధతి అను ఈ మూడును కలిసినచోట అనగా తమ దగ్గఱనే ఎందుకు విద్య చెప్పించరు ? వారికి నవీన విద్యపై విశ్వాసము లేదను విషయము స్పష్టము.

బేసిక్ స్కూలులో ఖాదీ తయారగును కాని అక్కడి పిల్లల శరీరముపై ఖాదీ గాన్పించదు. అనగ అక్కడ తయారగునది ధరింపబడుటలేదు. ఈ పద్ధతి ఇతరులకు భోజనము పెట్టుటకు వంటచేయు హోటలు పద్ధతిగా నున్నది.

ప్రాతిపదిక విద్యను నేర్పు శిక్షకుని భార్య తన పిల్లలతో పట్టణములో నివసించును. ఆ తల్లి బిడ్డలకు "అబ్బాయీ! నీవు ప్రపంచములో నేపని చేసినా సరేగాని మీ తండ్రివలె తెలివితక్కువ వాడివి గాకుము." అని మాత్రము తప్పక బోధించును.

## అసమగ్రములు, అసమర్థములు నగు ప్రయోగములు

ఇక నేను ఈ శిక్షకుల నడుగున దేమన ఇక్కడ కొంత పరిశ్రమకు సంబంధించిన పనికూడ జరుగుచున్నదిగదా! మీరు మూడు గంటలు పరిశ్రమచేసి మూడు గంటలు చదువు చెప్పెద రనుకొనుడు.

ఆ పక్షమున మీరు మూడు గంటలలో ఎంత కూలి సంపాదింతురో అంతే మీరు చదువుచెప్పిన మూడు గంటలకును యిచ్చెదము. ఇది మీకు సమ్మతమేనా ? వారు కాదని చెప్పుదురు. అనగా ఆ పరిశ్రమలపై నాధారపడి యుండ జాలరని యర్థము. మనము సూలు వడుకుట, నేత మున్నగు పరిశ్రమల స్థాయి పైకెత్తవలెను. అందుకొరకు మనము మన జీవితము యొక్క స్థాయిని క్రిందకు దింపవలెను. కాని నేడు మన మందులకు సిద్ధముగాలేము. అయితే బాలురతో పరిశ్రమ చేయుమని ఎందులకు చెప్పుట ?

"ఇంకొక ప్రశ్న యేమన నేడు మీకు ప్రభుత్వము సమానమగు వేతనము లీయకపోయినను మీరు మీ జీతములను సమానముగా నెందుకు చేసికొనరాదు ? కుటుంబములో నట్లే జరుగుచున్నది గదా ?" కాని ఇందుకు కూడ వారంగీకరింపరు.

అనగా దీని కర్థమేమి ? నవీన విద్యలోని విలవలలో ఒకటి కూడ నేడు నవీన విద్యా పాఠశాలలో గన్పించుటలేదు. ఇక దానికింత కంటె ఎక్కువ ఫలిత మెట్లు లభించును ?

నేడు ఇది యెంతవరకు వచ్చిన దనగా ఆపాదమస్తకము మిల్లు వస్త్రములు ధరించి ఇంటిలో విదేశీ వస్తువులు వాడువారు నవీన విద్యను గూర్చిన సభలలో కార్యకర్తలకు ఉపదేశము లిచ్చుటకు సాహసించు చున్నారు. నేను వ్యక్తిగతముగా నెవరిని విమర్శింప దలచుకొనలేదు. గాని "మీకు నవీన విద్యను గూర్చిన భావము లిష్టమే యైనచో పిల్లలు తయారుచేసిన ఖాదీ యెందుకు ధరింపరు ?" అని అడుగుదును. నవీన విద్యను గూర్చిన ఇట్టి అసమగ్రమైనట్టియు, అసందర్భములైనట్టియు ప్రయోగముల వలన నవీనవిద్యకు యశము లభింపదు.

## ఒంటిగంట పాఠశాల

నేనైనచో ఇంకొక విధముగా నీ పని చేయుదును. ఏదో ఒక గ్రామములోనికి వెళ్లి ఒకగంట మాత్రమే నడచు స్కూలు పెట్టెదను.

పిల్లలు పగలంతయు పొలములో పనిచేయుదురు. స్కూలు మీద ఒక కాని ఖర్చుకూడా తగులదు. తర్వాత గ్రామస్థులను గ్రామములో కొంత ప్రత్తి పండించుడు అని ప్రోత్సహింతును. గ్రామస్థులు ప్రత్తి విత్తులు నాటిన పిమ్మట, వెదురు రాట్నము తయారుచేసికొనుమని బోధింతును. అది ఏవిధముగా తయారుచేసికోవలెనో నేర్పుదును. ఈ విధముగా గ్రామములో రాట్నము ప్రవేశించినచో ఆ రాట్నములే స్కూలు పిల్లలకు ఉచితముగా లభింపగలవు. ఈ ప్రకారముగా గ్రామములో పరివర్తనము తీసికొని రాగలమను నమ్మికతో స్కూలులో చరఖా ప్రవేశపెట్టుట గాని, లేదా గ్రామములో పరిశ్రమ ప్రారంభించి, పిమ్మట దానిని స్కూలులో ప్రవేశపెట్టుట గాని జరుగవలయును.

## స్కూలులో తయారగు వస్తువుల ఉపయోగము

స్కూలులో తయారగువాని ఉపయోగ మచ్చటనే జరుగవలయును. అక్కడ పండు కూరగాయలు వాటి ఉత్పత్తిపై లాభనష్టములను లెక్కించు దృష్టి మాని అచటి బాలురకు శిక్షకులకు పంచిపెట్టవలెను. ఇట్లే అక్కడ తయారగు ఖద్దరును బాలుర కీయవలెను. మీరు చూడవలసినది కేవలము ఉత్పత్తి సరిగా అగుచున్నదా లేదా అనియే. స్కూలులో తయారగు వస్తువులు అందలి విద్యార్థులకే యిచ్చుటవలన కొంచెము ఖర్చుపెరుగును. అయినను ప్రారంభములో దానిని పెరుగనిండు, చివరకు ప్రభుత్వము మీద విద్యా విషయములో గొంత ఖర్చుపెట్టవలసిన బాధ్యత ఉన్నదికదా?

## కంఠస్థము చేయుట

ప్రాతిపదిక పాఠశాలలో చదువుట, వ్రాయుట బొత్తిగా నేర్పరని కొందరనుకొందురు. కాని నేను నా విద్యార్థులచే ప్రారంభములోనే ఉపనిషత్తు చదివించెదను. "సత్యం వద, ధర్మం చర"- ఇట్టివన్నియు నేర్పెదను. సంస్కృత పుస్తకములలో 'టేబుల్' కుర్చీకథలు, బజారు

కథలు ఉన్నట్లు విన్నాను. ఇవి అన్నివిధముల నిరర్థకములు. పిల్లలకు మొదటిరోజు నుండియు ఉపనిషత్తులలోని కథలు, మంచిమంచి శ్లోకములు కంఠస్థముచేయుట నేర్పవలయును. కంఠస్థము చేయుట తప్పని కొందరు చెప్పుదురు. కాని "స్కిన్" కు ఐదేండ్ల వయస్సులోనే బైబిలు అంతయు కంఠస్థమయ్యెను. అతని జీవితమంతయు దాని ప్రకారమే నడచెను.కాని నేడు పాఠశాలలో కాకి కథలు, పిట్ట కథలు కంఠస్థము చేయించుచున్నారు.

## ప్రసంగము ననుసరించిన పాఠశాలలు

పిల్లలకు ప్రసంగము ననుసరించి చదువు చెప్పవలెను. పిల్లవాడు సోమరిగా నున్న అతని కుత్సాహము కల్గించు శ్లోకములు నేర్పవలెను. అతడు భయపడువాడైనచో నిర్భయత్వమును బోధించు శ్లోకములు నేర్పవలయును. ఈవిధముగా అవసరమును బట్టి నేర్పవలెను గాని అనవసరముగా నేర్పరాదు. ఒక పిల్లవాడు నెమ్మదిగా నూలు వడుకుననుకొనుడు, అతని నడక నెమ్మదిగా నున్నను ఆతని దారము తెగుటలేదు. ఇంకొకడు తొందర తొందరగా వడుకుచున్నా డనుకొనుడు గాని అతని దారము తెగుచున్నది. అప్పు డా పిల్లవానికి తాబేలు కుందేలు కథ చెప్పవలెను. దాని వలన ఆతనికి అఖండత్వజ్ఞానము కల్గును.

## ప్రత్యక్ష జీవనము ద్వారా జ్ఞానము

పుస్తకముల ద్వారా జ్ఞానదానము సులభమని తలచువారి అభిప్రాయము సరియైనదికాదు. ఉదాహరణమునకు పిల్లవానికి గణితము నేర్పవలెననుకొనుడు, రెండు మూడు కలిపిన ఐదగును అనుమాట అర్థముగాదు. రెండును మూడును కలవనే కలవవు. రెండు రెండే, మూడు మూడే అని చెప్పుదురు. కాని రెండు మామిడిపండ్లు, మూడు

మామిడిపండ్లు కలసి ఐదు మామిడిపండ్లగునని చెప్పినచో నీ మాట చాల తేలికగా నర్థమగును.

ప్రత్యక్షమైన పని ద్వారా జ్ఞానము కల్గించుట చాల కఠినమని అనుచున్నారు. కాని నేడు జ్ఞానము నేర్పుట కవలంబించిన పద్ధతి యెంతో కఠినముగ నున్నది. సృష్టికిని మనుష్యునికిని మధ్య తెరవేసి ఈ జ్ఞానము నేర్పబడుచున్నది. "అశ్వ" మనగా "గుఱ్ఱ" మని చెప్పుచున్నారు. కాని గుఱ్ఱమును చూడనిదే ఏమర్థమగును ? పిల్లలకు పదార్థమును చూపక కేవల పర్యాయ పదములను చెప్పుచున్నారు. కేవలము పదములను మాత్రమే చూచువారి జ్ఞానము భ్రాంతితో గూడిన జ్ఞానమగును.

పుస్తకముల ద్వారా 18, 20 సంవత్సరములు నేర్చికొని మీరు ప్రవీణులు కాగానే ఈ పద్ధతి తేలికగా నున్నట్లు మీకు తోచుచున్నది. కాని అది తేలికగాదు. నవీన విద్య పుస్తకములను బహిష్కరించదు. వానిని సరిగాను, సముచితముగాను ఉపయోగించును. ఎవరైన జబ్బు పడినచో దానికి కారణము తెలిసికొనగోరుదుము. జబ్బును మనము జ్ఞాన సాధనముగా ఎంచుచున్నాము. ఇట్లే ఎవడైన మరణించినను, ఎవడైన జన్మించినను, ఎవడైన జబ్బుపడినను, ఎవడైన రోగ విముక్తుడైనను, ఇవిఅన్నియును జ్ఞానసాధనము లగుచున్నవి. నాలుగు వైపులను ఎచ్చట చూచినను జ్ఞానమే నిండియున్నట్లు కన్పించువానికి యిక అజ్ఞాన మెక్కడిది ? ఇట్లే వంటచేయుట, కూరలు తరుగుట మొదలగు పనుల ద్వారా కూడ జ్ఞానము నేర్పవచ్చును. కూరలు తరుగు సమయమున ఎట్లు కూర్చుండవలెనో, ఎట్లు పీట వేసికోవలెనో అను జ్ఞానము కూడ కలుగజేయవచ్చును. ఇక వంటచేయునప్పుడు పొయ్యి పొగరాకుండు నట్లును, కట్టెలు తక్కువ కాలునట్లును ఎట్లు నిర్మింపవలెనో నేర్ప వచ్చును. భోజనము చేయునప్పుడు ఎంతసేపు భోజనము చేయవలెనో, ఏమి తినవలెనో మున్నగువాని జ్ఞానమును కలిగింపవచ్చును. ఈ విధముగా ప్రతి విషయములోను జ్ఞానము నిండియున్నది. కాని ఈ

జ్ఞాన మార్గములన్నియు నేటి స్కూళ్లలో మూయబడియున్నవి. ఐతే ఈ పద్ధతికి "ట్రైనింగ్" అవసరములేదని చెప్పుటకు వీలులేదు. నేటి విధానములో బి. ఏ. అయినపిమ్మట బి. టి. ఎట్లవసరమో అట్లే ఈ విధానము నందును ట్రైనింగ్ అవసరమే. కాని అది పొలములలో ప్రత్యక్ష పరిశ్రమ చేయుటద్వారా లభింపగలదు.

## గురుపత్ని లేకుండ గురుకుల మెట్లు ?

నవీనవిద్య శిక్షణ కేంద్రములలో నేను చూచిన దేమన శిక్షకులతోబాటు వారి భార్యలు అచ్చట ఉండుటలేదు. కాని గురుపత్నిలేకుండ ఎట్లు పని జరుగును ? ఆమెకుకూడ ట్రైనింగ్ ఇవ్వవలెను. అది అయిన పిమ్మట ఆమె భర్తతోకూడ కలిసి పనిచేయవలెను. ఉపనిషత్తులో ఒక కథ కలదు. ఉపకోసలు డను పేరుగల బాలుడు గురుకులములో నుండెను. ఒక దినము ఆతడు భోజనము చేయలేదు. ఆతనికి గురువన్న భయము. అందుచే గురువు నొద్దకు వెళ్ళి ఆయనతో నేదేని చెప్పుటకు సాహసింప లేకుండెను. అప్పుడు గురుపత్ని "నీవు భోజన మెందుకు చేయలే"దని అడిగెను. పిల్లవాడు "మనుష్యునికి వేలువేలు కోరికలుండును. అవి తీరనంతవరకు వానికి భోజనముపై ఇచ్ఛ ఉండదు." అని చెప్పెను. పిమ్మట గురుపత్ని గురువుతో "ఆబాలునికి జ్ఞానమునందిచ్ఛ కలదు. కావున నాతనికి జ్ఞానదానము చేయుడని చెప్పెను. ఈవిధముగా గురుపత్ని గురువునొద్దకు శిష్యుని చేర్చునట్టి ఒక సాధనము. కావున శిక్షకులతోపాటు వారి భార్యలుకూడ ఉండుట ఆవశ్యకము. గురుపత్నికికూడ వేతన మిమ్మని నేను చెప్పుదును. ఆమెయు పిల్లలకు చదువు చెప్పును. వంటద్వారా చక్కని విజ్ఞానము నేర్పవచ్చును. ఇప్పుడు మీరు శిక్షకునికి నూరు రూపాయిలు వేతన మిచ్చుచో దానికి బదులు అతనికి 80 రూపాయిలిచ్చి అతని భార్యకు 40 రూపాయ లివ్వవచ్చును.

## గ్రామీణుల వ్యతిరేకత

నవీన విద్యాపాఠశాలలు గ్రామములలోనే తెరవబడుచున్నవని నేడు నవీన విద్యను వ్యతిరేకించుట జరుగు చున్నది. దీనివలన గ్రామీణులకు ఈ విద్య మనకొరకు మాత్రమే ప్రభుత్వమువారు "ప్రత్యేక దయ"తో ఏర్పాటుచేసినవను భావము కలుగుచున్నది. మద్రాసులో రాజాజీ ఏర్పాటుచేసిన విద్యాప్రణాళిక వ్యతిరేకింపబడుటకుకూడ అది పల్లెటూళ్ళకేగాని పట్టణములకు వర్తింవజేయబడలే దనియే. అక్కడ బ్రాహ్మణ బ్రాహ్మణేతర కలహము నడచుచున్నది. పట్టణములలో తరచు బ్రాహ్మణులు నివసింతురు. వారికి రకరకముల విద్య లభించుచుండును. కావున అచటి బ్రాహ్మణేతరులు "బ్రాహ్మణులకు మంచి విద్య లభించుచున్నది. మమ్ము ఈ నవీన విద్యద్వారా చదువులేనివారుగనే ఉంచుచున్నారు." అనుట సహజము.

## శిక్షకుని చేతిలో విప్లవ పతాక

పైనుండి వైషమ్యమంతయు పోగలదని అప్పుడు నవీనవిద్య సఫలము కాగలదని మన మనునెడల నవీనవిద్య యొక్క పునాదియే కూలిపోవును. మనము నవీన విద్యచేతనే వైషమ్యమును నశింపజేయవలెను. ప్రభుత్వము వైషమ్యమును పోగొట్టజాలదు. సమాజమందున్న వైషమ్యముయొక్క ప్రతిబింబమే ప్రభుత్వములో గాన్పించుచుండును. కావున సమాజము మారి అందు సమానత్వము స్థాపింపబడినప్పుడు ప్రభుత్వముకూడ తదనుసారముగా మారవలసి యుండును. నేను కోరున దేమన, మీ విద్యాశాఖలో పనిచేయువారి చేతులలో విప్లవపతాక ముండవలెను. మనము శిక్షకుల సైన్య మొకటి తయారు చేయవలెను. సేనను ఆధారముగా చేసికొని సేనాపతి రక్తపాతములేని తిరుగుబాటు (Coup-de - etat) చేసినట్లుగాను అచ్చటి శాసనసభకూడ అతనినేమీ చేయలేని

విధముగా మనము కూడ చేయవలెను. కాని అహింసావిధానముతో మనము (Non - violent Coup - de - etat) చేయవలెను. ఇట్లు చేయుశక్తి ఈ శిక్షకులలో కలదు. విద్యాశాఖ తన శిక్షకులలో నిట్టి భావములను కలిగించినచో వారిద్వారా విప్లవము (Coup) జరుగగలదు.



: 31 :

# నవీన విద్యయొక్క జీవన దర్శనము

1937 లో అనగా స్వరాజ్యము లభించుటకు పదిసంవత్సరములకు ముందు బాపూజీ నవీన విద్యావిదానమును దేశవాసులయెదుట పెట్టెను. స్వరాజ్యమనగా పరదేశీయుల అధికారము నిచ్చటనుండి తొలగించుట మాత్రమే కాదనియు, శోషణరహితమైన ఒక నవసమాజము నిర్మింపబడి అందు కేంద్ర పాలనాధికారము సాధ్యమైనంత తక్కువగా నుండవలెననియు ప్రతిఒక్కని అభివృద్ధికి సంపూర్ణావకాశ ముండవలెననియు బాపూజీ చెప్పుచుండిరి. ఇట్టి సమాజవ్యవస్థకు వారు "స్వరాజ్యమని" పేరిడిరి. ప్రతి ఒక్కనికి 'ఇది నారాజ్యము' అను అనుభవము ఎందు కల్గునో అదే స్వరాజ్యము. దీనినే వారు "రామరాజ్యము" అనికూడ పిల్చుచుండిరి.

## నవీన పురాతన విద్యలలోని భేదము

నవీనవిద్య అనగా క్రొత్తవిలువలను స్థాపించుట. పురాతనవిద్య దొంగతనము పాపమని తలచును. నవీనవిద్య దొంగతనమునేకాక ఎక్కువగా కూడబెట్టుటనుకూడ పాపమని తలచును. పురాతనవిద్య శారీరక మానసిక పరిశ్రమల విలువలలో భేదమును పాటించును. నవీనవిద్య రెండిటికిని సమానమగు విలువ నిచ్చును. ఇంతేకాదు; రెండిటిని సమన్వయపరచును. రెండిటికిని "సమవాయము"ను సాధించును. పురాతనవిద్య "సమర్థతను" గౌరవించును. నవీనవిద్య

"సమర్థత"ను 'సమత్వము' నకు దాసిగా తలంచును. పురాతనవిద్య లక్ష్మిని, శక్తిని, సరస్వతిని స్వతంత్ర దేవతారూపముగా పూజించును. నవీనవిద్య మానవత్వమును పూజించుచు, ఈ మూడిటిని వారిసేవకు సాధనములుగా గ్రహించును.

## అధికారవ్యాప్తి

స్వరాజ్యమనగా కేవలము శాసనాధికారమును మార్చుటయేకాదు, దానికి మనమిచ్చు అర్థము శాసనాధికారమును తొలగించి దానిస్థానమున సేవను స్థాపించుట, ఇప్పుడు కొందరు రెండిటిని కలుపవలెనని చెప్పుచున్నారు. నాయకులు "సేవకొరకు శాసనాధికారము" మా లక్ష్యమని చెప్పుచున్నారు. అనుచరులు "అధికారముకొరకు సేవ" అని తలంచుచున్నట్లు కనిపించుచున్నారు. నాయకులభాష అనుచరుల భాషలోనికి ఈ విధముగా తర్జుమా అగుచున్నది. దీని పరిణామమే నేడు దేశమందలి అన్ని రాజకీయ పక్షములందును శాసనాధికారమును చేపట్టవలెనను ఆ కృషి, ఇక సేవాభాగము "భారతసేవక సమాజము" నకు అప్పగింపబడినది.

## నవీన విద్యయొక్క 'వానరీకరణము'

నేడు నవీనవిద్యలోని గుణములు గ్రహించుట జరిగినను అది ఒకే అంశమున జరుగుచుండుటచే దాని నాధారపరచుకొని నవీనవిద్య నవలంబించుట ప్రమాదకరమని నేను కొన్నిసంవత్సరములనుండి అనుకొనుచున్నాను. నేడు నవీనవిద్యపై జరుగు వ్యాపకప్రయోగము లన్నియు చాలవరకు రాష్ట్రప్రభుత్వముల ద్వారా జరుగుచున్నవి. దాని పరిణామము అన్నిచోట్ల 'నవీనవిద్య'ను చేయబోయి 'కోతినిచేయుట' జరుగుచున్నది. నవీనవిద్యకు వెనుక ఒక జీవనదర్శనము కలదు. దానిని గ్రహింపక అందలి ఒక అంశమునుమాత్రమే గ్రహించి వికృ

తముగా అనుకరించునెడల నవీనవిద్యకు అపకీర్తి కలుగుటతప్ప ఇంకే ఫలితమును ఆశింపజాలము. నేడు జరుగుచున్న దిదియే. వేరువేరు రాష్ట్రములలో నేడు నవీనవిద్యపై ప్రభుత్వముద్వారా జరిగిన ప్రయోగము లన్నిటిలో బహుశః బీహారులోని ప్రయోగములు ఎక్కువ ప్రామాణికములుగా ఎంచబడవచ్చును. కాని అచ్చటి స్థితినికూడ చూచినమీదట నవీనవిద్యకు గోరీకట్ట ప్రయత్నము జరుగుచున్నదా అని భయపడవలసి వచ్చుచున్నది.

## సంఘముల ఏకీకరణమునుగూర్చి బాపూజీ అభిప్రాయము

కాని ఈ వికృతరూపముయొక్క బాధ్యత నవీనవిద్యను ప్రభుత్వమునకు ఆశ్రితురాలుగా నొనర్చినవారిపై కలదు. మనము నవీనవిద్యకు సంబంధించిన చక్కని నమూనాలను అచ్చటచ్చట స్థాపించుట జరిగించవలసి యుండెను. కాని మనము మన సంఘములన్నిటిని వేరువేరుగా పెట్టుకొనుటచే ఇది సాధ్యముకాలేదు. గాంధీజీ దృష్టిలో ఇది పడెను. ఈ సంఘములన్నిటిని ఒకటిగా చేయవలెననికూడ ఆయన ఆలోచించెను కాని ఆయన భక్తుల కా ఆలోచన ఇంకను పూర్తిగా తలకెక్కలేదు. ఇప్పుడు అనగా చరఖాసంఘము సర్వసేవాసంఘములో కలసిపోవుటకు సాహసించినపుడు ఇందుకు మార్గమేర్పడినది. నవీనవిద్య తన తేజశ్శాలియైన పరిశుద్ధరూపమును చూపవలెననిన తాలిమీసంఘము సర్వసేవాసంఘము ఒకటైపోవలెను. ఇది జరుగనంతవరకు సర్వసేవాసంఘము, తాలిమీసంఘము, రెండును నిర్జీవములుగనే యుండును. మొండెము, తల వేరుచేయుటచే శరీరమునకు కలుగుస్థితియే కలుగును.

## శోచనీయస్థితి

స్వరాజ్యము లభించినపిమ్మట నవీన విద్యయందలి ఆ ఏకదేశ గుణగ్రహణమైనను చేయవలెనను బుద్ధి ఆరుసంవత్సరములు గడచిన

తరువాత నాయకులకు కలిగినది. ఇంతకంటెను ఎక్కువగా నా కెందు కాశ్చర్యము కలుగుచున్నదన, నిరంతరము సమగ్రతనుగూర్చి చర్చించు చున్నప్పటికిని ఆ సమగ్రత మనకు కలుగుటలేదు. సర్వోదయవాదులు కాంగ్రెసులో పదవులను పొందగల్గుచున్నారు; అసెంబ్లీ సభ్యులు కాగలుగుచున్నారు; రాష్ట్రప్రభుత్వ మంత్రులు కాగలుగుచున్నారు; ప్రతికూల రాజకీయపక్షములను సంఘటితపర్చ గలుగుచున్నారు. కాని తమలోతాము మాత్రము ఏకము కాలేక పోవుచున్నారు. ఈ స్థితి శోచ నీయము.

## ఏకరూపత ఆవశ్యకము

ప్రభుత్వోద్యోగులద్వారా ఇంతవరకు జరిగిన ప్రయోగములు రెండు విధములుగా నున్నవి. ఒకటి బుద్ధపూర్వకముగా ప్రాతిపదిక విద్యను పనికిమాలిన దానినిగా నిరూపింపవలెనను ఉద్దేశ్యముతో అనగా అది ఎక్కువ ఖర్చుతో కూడునట్లుగను, జ్ఞానము తక్కువ లభించు నట్లుగను, అధికారులకు దీనిపై అసమ్మతి కల్గునట్లుగను, విద్యార్థులకు కూడ అసంతృప్తి కల్గునట్లుగను నడిపింపబడినది. ఇది ఒక మంచి వస్తువును దుర్వినియోగ పరచుట అను విషయము స్పష్టము. కావున దీనినిగూర్చి మన మాలోచింప నక్కర లేదు. రెండవ విధము సదుప యోగము. కాని అందుక్రొత్త విలువలను స్వీకరింపక పూర్వపు విలువలనే స్థిరముగానుంచి నవీన విద్యలో కొన్ని మంచిగుణము లున్నవి కావున స్వీకరించుట జరిగినది. ఇది మంచి పద్ధతియే అయినను నవీన విద్య యొక్క అసలు రూపము ఇందు కన్పించదు. కావున క్రొత్తవిలువలు అను పునాదిపై పరిశుద్ధమగు ప్రయోగములు చేయగలిగినవన్ని చేయుట మిక్కిలి ఆవశ్యకము. ఇందుకొరకు నవీనవిద్య, సర్వసేవాసంఘము, భూదానయజ్ఞము - ఈ మూడిటియొక్క ఏకరూపత సాగించుటకు ప్రయ త్నింపవలెను.

## ప్రభుత్వ సంబంధము లేని ప్రయోగములు

దేశము పరతంత్రముగా నున్నపుడు జాతీయభావము, స్వతంత్ర విద్యా పీఠములు బయలుదేరినవి. ఇప్పుడు స్వరాజ్యము వచ్చిన మీదట ప్రభుత్వ విద్యాపీఠము లన్నియు జాతీయ విద్యాపీఠములే అయిపోయిన వని ప్రజలుతలచుచున్నారు. "అయిపోయినవి" అని అన్నంతమాత్రమున అవి అయిపోవు. వానిని జాతీయములుగా చేయవలెను. అవి అట్లు చేయ బడునని ఆశించుచున్నాను. అయినప్పటికిని ప్రభుత్వముతో సంబంధము లేకుండు విద్యావిషయమయిన స్వతంత్ర ప్రయోగములు చేయవలసిన ఆవశ్యకత ఉండనే యుండును. ప్రతి గ్రామమునందును అచ్చటి పరిస్థితి ననుసరించి ప్రజలే తమతమ పాఠశాలలను నడుపుకొనవలెను. అట్లు కాక దేశము మొత్తముమీద విద్యావిధానమంతయు ప్రభుత్వ నియంత్ర ణలో పడిపోయినచో బాలురబుద్ధి ఒకే మూసలో కరిగిపోసిన విధముగా తయారగు ప్రమాదముగలదు. ఈ దృష్టిచేకూడ నవీనవిద్యకు ప్రభుత్వ సంబంధము లేకుండ ప్రయోగములు జరుగవలెను. ఈ విషయము ఆలోచింపవలసి యున్నది.

సర్వోదయ - డిశంబరు, 1953.

## : 32 : నవీన విద్య యొక్క నవీన బాధ్యత

నవీన విద్య ఎదుర్కొనవలసిన సమస్యలు నేడు చాల గలవు. "భూదాన యజ్ఞ మూలముగా గ్రామ పరిశ్రమలు ప్రధానముగా, అహింసా యుత విప్లవము" అను విశాలమును, గంభీరమును అయిన కార్యమును భగవంతుడు మన ద్వారా చేయించదలచుకొన్నాడు. ఇందుచే మన నిర్మాణ కార్యక్రమమంతయు నవీన విద్యతో కూడ స్వరూపములో మార్పును పొందవలసియున్నది. దాని కనుకూలముగా నవీన విద్య తయారుకాజాలనిచో అది 'నవీన విద్య' కాక పురాతనమే కాగలదు, కావున నవీన విద్య ఇప్పుడు 'నిత్య నవీన విద్య' కావలసియున్నది.

అయిదుకోట్ల ఎకరముల భూమిని సంపాదించుట, దానిని పంచుట, తరువాత చేయవలసిన నిర్మాణ కార్యక్రమము- నవీన విద్య సహాయము లేనిదే ఫలింపవు. ఆ కార్యము ఫలింపనిదే నవీన విద్య స్థిర పడదు.

భూమిని సంపాదించుటకు బుద్ధిమంతులు, వినయశీలురు, కార్య దక్షులు, నియమవంతులునగు సేవకులు కావలెను. ఇట్టి సేవకుల నెవరు తయారుచేయుదురు ? పంపకము చేయుటకు ప్రత్యేక శిక్షణ కావలెను, ఈ శిక్షణ నెవ రిచ్చెదరు ? జీవన దానముచేసిన సేవకులకు, వారి కుటుంబములకు సమగ్ర జీవన శిక్షణ ఎక్కడ నుండి లభించును ? గ్రామములకు గ్రామములే దానముగా లభించుచున్నవి. ఇక ముందుకూడ లభించును. ఆ గ్రామములకు సర్వోదయదీక్ష ఇచ్చువారెవరు? సర్వోదయ ప్రచారము సరియైన పద్ధతిలో ప్రతి పల్లెకు, ప్రతి ఇంటికి అందునట్లు

జరిగించు బాధ్యత వహించువా రెవరు? ఈ ప్రశ్నల కన్నిటికి సమాధానము ఇచ్చుటలో నవీన విద్య తప్పనిసరిగా చేరియేయున్నది.

నేడు ప్రభుత్వము కూడ నవీనవిద్యను గూర్చి గంభీరముగా ఆలోచించుచున్నది. వారికి తగిన విధముగా మార్గమును చూపించు బాధ్యత మనము వహింపవలెను. 'సర్వోదయ సమాజము శాసనముక్తము కావలెను' అను లక్ష్యము ననుసరించి దేశమునందలి శిక్షణ కూడ సాధ్యమయినంతవరకు శాసనముక్తము కావలెను. ఇందుకొరకు కూడ మనము దేశమును సిద్ధపరచవలెను. శాసనాధికార మున్నప్పటికిని, శాసనముక్తిఅనునది శిక్షణకు స్వయంసిద్ధమైన అధికారముగా తలచబడవలెను.

నేను సమ్మేళనమునకు వచ్చుట సాధ్యముకాదు. ఇది మీరందరెరిగినదే. కాని నవీన విద్యాసేవకులలో ఒకడుగా నేను నన్నెంచుకొనుచున్నాను. నే నెప్పుడును నవీన విద్యా ప్రచారమే చేయుచున్నాననియు, నేడు దానిని మరింత తీవ్రరూపముతో సాగించుచున్నాను అనియు నేను అందును.

నేను సమ్మేళనమునకు విజయమును కోరుచున్నాను. అది అందరు సేవకులకును చక్కని ప్రోత్సాహమీయగలదని ఆశించుచున్నాను.

నవంబరు, 1954 లో సణోసరాలో జరిగిన నవీన విద్యాసమ్మేళనమునకు పంపబడిన సందేశము

---

: 33 :

# నవీనవిద్య - జనసంపర్కము

(జగన్నాథపుర సమ్మేళనములో తాలిమీసంఘ సమావేశములో ఈయబడిన ఉపన్యాసము)

బలరామపురములో నవీన విద్యాకేంద్ర మొకటి కలదు. అచ్చట కస్తూర్‌బాకేంద్రము కూడ కలదు. బంగాళారాష్ట్రమందలి పదయాత్రలో అక్కడ మేము రెండుదినములు ఆగుట కవకాశము లభించెను. అచ్చట మేము ఒక ప్రక్కగ్రామములో తిరుగుటకు వెళ్ళితిమి. ఉదయము 5 గం॥ ల సమయమున, గ్రామమందలి చాలామంది స్త్రీలు దీపములతో స్వాగతమిచ్చుటకు వచ్చిరి.

## జనసంపర్కము లోటు

మేమాగ్రామస్థుల నడగగా భూదానమును గూర్చి వారికేమియు తెలియదనుసంగతి తెలిసినది. ఇచ్చట భూమిహీను లెందరున్నారు ? అని మేమడుగగా "ఇంచుమించందరును భూమిహీనులే. భూమికలవారిలో చాలమంది బయటగ్రామములలో నివసించుచున్నారు." అని చెప్పిరి. "ఆ భూమియజమానుల దగ్గరకు ఎప్పుడైన, ఎవరైన భూమి అడుగుటకు వెళ్ళిరా ?" అని అడుగగా "లేదని" సమాధానము వచ్చినది. "ఇక్కడ మన సంస్థలు రెండు పనిచేయుచున్నప్పటికిని దానికి మిక్కిలి సమీపముననే యున్న గ్రామములో ఇంత కటికచీకటి యేల ?" అని ఆలోచించితిని. గ్రామములో ఏమియు పనిచేయకుండగనే గ్రామస్థులను ఏమనగలము ? రెండుసంస్థలవారును అచ్చట హాజరుగానే యుండిరి. నేనిట్లంటిని. "మనసంస్థలు ఈ విధముగా సంస్థా కార్యక్రమములోనే బంధింపబడి చుట్టుప్రక్కలకున్న ప్రజలదగ్గరకు కూడ వెళ్ళనియెడల

వాని మూలోద్దేశ్యమే నశించుచున్నది. కాబట్టి సంస్థల నడవడికలో ఏమి లోపమున్నది కనిపెట్టవలసి యున్నది."

చాల సంవత్సరముల పరిశీలన ఫలితముగా నాకు కన్పించున దేమన 100-150 మంది కార్యకర్త లొకచోటనున్నచో అచట చాలా కార్యక్రమము తయారై అదితప్ప ఇంకొకపని చేయుట కవకాశము లేకపోవుట తటస్థించును. ఇంతేగాక ఇంత పెద్దసంఘము ధనాపేక్ష లేకుండ పనిచేయజాలదు. అది ధనముపైనే ఆధారపడియుండును. ఆ అధారము తీసివేసినచో ఆ సంఘము చుట్టుప్రక్కలనున్న జనులతో సంపర్కము పెట్టుకొనుట తప్పనిసరి కాగలదు. అప్పటినుండి అది మిథ్యాయోగమును ఆచరించుట మానగలదు.

ధనముపై ఆధారపడిన యోగమునకు నేను "మిథ్యాయోగ"మని పేరిడితిని. అది ధ్యానయోగమును కాదు; కర్మయోగమును కాదు; జ్ఞానయోగమునుకాదు. ఇట్టిచోట మనమెంతపనిచేసినను అది కేవలము ప్రదర్శనమువంటిదే యగును. హృదయమును స్పృశించునదికాదు. అది నాటకమువంటిదిగా తేలును. నాటకము చూచినమీదట మనకెట్టి యనుభవము కలుగునో ఇచ్చటను అట్టిదే కలుగును. యోగయుక్త జీవనమునకు గల ప్రభావము ఇటువంటి నాటకమునకు ఉండదు. కావున మనమిట్టిసంస్థలను నిర్మించునపుడు అక్కడ పదునైదు ఇరవైకంటె మించినసంఖ్య ఒకచోట చేరనట్లు చూడవలెను. కాని ధనముపై ఆధార పడుట మానినపక్షమున ఎక్కువమంది కలిసి పనిచేసినను నాకెట్టి అభ్యంతరమును లేదు. ఇంతేకాక ఇట్టిసంఘము తప్పక విప్లవమును తీసుకొనిరాగలదనికూడ నేను నమ్ముచున్నాను.

## వ్యవస్థయొక్క సమస్య

పెద్ద సంఘమును నిర్మించుటలో నా కింకొక దోషముకూడ కన్పించుచున్నది. పెద్ద సంఘమును పెట్టుకొనుటవలన పెద్ద ప్రయత్నము

కూడ చేయవలయును. అదికూడ చక్కని పద్ధతిపై చేయవలెను. అట్టి చక్కని ఏర్పాట్లలాభము మన నవీనవిద్య నేర్చుకొను బాలురకుకూడ లభించును. కాని ఇట్టి చక్కని ఏర్పాట్లలో విద్య పొందినమీదట ఈ విద్యార్థులు బయటి ప్రపంచములో ప్రవేశించినచో వారి స్థితి మిక్కిలి విచిత్రముగా తయారగుచున్నది. సంస్థలో ఉన్న విధముగా బయట చక్కని ఏర్పాట్లుండవు కదా! కావున ఈ విద్యార్థులు నిరుత్సాహపడుచున్నారు. ఈ హేతువుచే నవీనవిద్యను బోధించు పాఠశాలలను ఏర్పాటు చేయుటలో అందలి విద్యార్థులు ఎట్టికష్టమునైనను నిర్భయముగా ఎదుర్కొనగల్గునట్లును, ఆ పాఠశాలలలోనే వారి జీవనక్రమము నిర్మింపబడునట్లును ప్రణాళికను రచింపవలెను.

నవీనవిద్య బోధించు పాఠశాలలపై మన మింతవరకు చేసిన ప్రయోగములను చూచినమీదట మనము పనిచేయు పద్ధతి మంచిదేకాని దాని నింకను ఉత్తమ స్థితికి కొనిపోవుటకు చేయవలసినంత ఆలోచన మనము చేయుటలేదని తోచుచున్నది. 'రాజకుమారుల' కాలేజివలెనే మన పాఠశాలయు నడచుచున్నది. రాజకుమారుల కాలేజీలోవలె మన పాఠశాలలో భోగవిలాసములు లేకపోవుటచే ఉపమానము పూర్తిగా కుదరక పోయినను, చుట్టుప్రక్కల నున్న ప్రజలతో సంపర్కము లేక పోవుట విషయమున రెండును సమానములే. కాబట్టి మన ఏర్పాట్లలో ఎటుకావలెనన్న అటు వంగు గుణము అవశ్యకము. వేరువేరుచోట్ల వేరువేరు విధములుగా అనేక ప్రయోగములు జరుగవలెను. ఒకగంట మాత్రమే నడచు స్కూలునుగూర్చి నేను చెప్పిన విధానముకూడ అనుభవము లోనికి తేవలెను.

## గ్రామములలో విద్య సాగుచునేయున్నది

నవీనవిద్య బోధించు పాఠశాలకు అధికవ్యయము చాల ప్రతిబంధకముగా నున్నదనియు, నేటి ప్రభుత్వ పరిస్థితి ఇంత వ్యయసాధ్య

మయిన శిక్షణ నడుపగలదిగా లేదనియు కొందరు చెప్పుచున్నారు. నవీన విద్యా పాఠశాలపై ఇష్టములేనివారే ఇట్టి విమర్శ చేయుచున్నారు. నిజమునకు నవీనవిద్య అధికవ్యయము గలది కాదు. పైగా, అది ధనము నుండి ముక్తి పొందవలెనను ప్రయత్నములో నున్నది. ఇంకను ఆ ప్రయత్నము ఫలించలేదు. కనుక కొంచెము వ్యయ మగుచున్నది.

నేను నా వ్యాసములో ప్రతిగ్రామమును స్వావలంబకమే అను సూచన ఒకటి యిచ్చితిని. అచ్చటి వారందరు తమపని తాము చేసి కొనుచున్నారు. గ్రామములలో ఏదో ఒకటి ఉత్పత్తి అగుచునే యున్నది. ప్రతి ఇంట అన్నము తినుచునే యున్నారు. గ్రామజీవనము సంపూర్ణ ముగా సాగుచునే యున్నది. గ్రామమునకు బైటనుండి సహాయమేమియు లభించుటలేదు. అచ్చటి జీవనమే పురుషార్థయుత మైనది. నవీనవిద్యకు ఇట్టి క్షేత్రము మిక్కిలి మంచిది. గ్రామజీవనము పరాశ్రితము అనగా కృత్రిమము కాదు. కడుపులో ఆకలి వున్నది కావున పనిచేయుట, బుఱ్ఱలో బుద్ధి ఉన్నది కావున ఉపాయము తోచుట జరుగుచున్నది. గ్రామస్థులు తమ ఆచరణద్వారా నవీనవిద్యను నడుపుచునే యున్నారు. వారిలో కొన్ని మంచి సంస్కారములను జల్లుటయే మనము చేయ వలసిన పని. ఇంతేకాక మనము విద్యావంతులమను అహంకారమును విడిచి గ్రామములలోనికి వెళ్ళవలెను. మనము నేర్పనిచో, ప్రజలు అశిక్షితులుగా ఉండిపోరు!

ప్రతి గ్రామమందు పరిశ్రమలు నడుచుచున్నవి. నవీనవిద్య బోధించు శిక్షకులుగూడ విద్యార్థులతోబాటు అందు ప్రవేశించి వానిద్వారా ప్రజలకుగూడ ప్రబోధము కల్గింపవలెను.

## ఒక గవ్వకూడ ఖర్చు కాదు

గ్రామములో సాగుచున్న పరిశ్రమకు సంబంధములేని జ్ఞానమును వారి కీయక, సంబంధముగల జ్ఞానమునే ఇచ్చినచో పని జరుగును.

గ్రామములలో రాట్న పరిశ్రమలేనిచో, రాట్నమును తెచ్చి ఆ గ్రామముపై రుద్ది, దాని నాధారముగా చేసికొనియే విద్యను నేర్పవలసిన బాధ్యత శిక్షకులపై ఏల పెట్టవలెను ? నే నే గ్రామములోనికైన వెళ్లినచో నా కొక గవ్వకూడ అక్కరలేదు. నేను ప్రజలతో "నా దగ్గర జ్ఞానమున్నది, మీ దగ్గర అజ్ఞానమున్నది, నా పని నెఱవేరుట కది చాలును. మీ దగ్గర అజ్ఞానము లేకపోయినను పని జరుగదు. నాదగ్గర జ్ఞానము లేకపోయినను పని జరుగదు. కనుక మీ దగ్గర అజ్ఞానము, నా దగ్గర జ్ఞానము ఉన్నచో పని జరుగును" అని చెప్పుదును. వారు వ్యవసాయము చేయువారైన నేనును వ్యవసాయము చేయుదును. వారు గోసేవ చేయువారైన నేనును గోసేవ చేయుదును. నేను గోసేవతో బాటు వారికి ఉపనిషత్తులు కూడ నేర్పుదును. నవీన విద్యకు పుస్తకము లుండితీరవలెనని నియమములేదు. ఉన్నను సరియే. లేకపోయినను సరియే. మీ పాఠశాలలో కనీసము బ్లాకుబోర్డులు (నల్లబల్లలు) కావలెను, సీమసుద్ద కావలెను, పుస్తకము కావలెను. కాని నవీనవిద్యలో ఏమియు అక్కరలేదు. భగవంతుడు నాకు నోరిచ్చెను, ప్రజలకు వినుటకు చెవులిచ్చెను, ఇద్దరు కూర్చుండుటకు నేలను ఇచ్చెను. ఇంతకంటె పాఠశాలకు కావలసిన దేమున్నది ? మంచి శిక్షకులుమాత్రము కావలెను. వారు గ్రామజీవనముతో కలిసిపోయి విద్య నేర్పుదురు.

## అందఱకు సమాన వేతనము

"బేసిక్ విద్య ప్రచారము చేయవలెను" అని ప్రభుత్వ నిర్ణయము. కాంగ్రెసు నిర్ణయించినదన ప్రభుత్వము నిర్ణయించినదనుటయే. కావున ఇక ఆ విద్య సాగగలదు. కాని అందునిమిత్తము ఆధార పరిశ్రమను నిర్ణయించుట మొదలగు ఒక విధమైన తంత్రము (తంతు) జరుగవలెను. అది చూడగానే దానికేదైన మంత్రముకూడ కావలెనా ? మంత్రము లేకుండ వట్టి బైటితంత్రము మాత్రమే అయినచో ఆ తంత్రము వలన

నేమగును? నవీనవిద్య శరీర పరిశ్రమ నియమము గలది. సామ్య యోగము గలది అనుట మంత్రము. ఇక శిక్షకుల యోగ్యతలో భేదము గలదు. గావున వేతనములందుగూడ భేదముండవలెననుమాట చెల్లదు. ఒకరికి నలుబదిరూపాయలు, ఒకరికి ఎనుబది, ఇంకొకరికి వంద. ఈ ప్రకారముగా వేర్వేరు శ్రేణులు ఏర్పాటుచేసి, విద్యాశాఖలోని తరగతుల వంటివి ఇచ్చట నడపుట జరుగదు. నవీన విద్యలో అందరికి సమాన వేతనముండుట అవసరము. ధనమును మిగల్చవలెనను ఉద్దేశముతో నేనిది చెప్పుటలేదు. అందరికి సమానవేతనము నీయవలెనన్న అధిక వ్యయముకూడ కావచ్చును. ధనవ్యయము తగ్గించు ప్రణాళికకాదు నేను వేయుచున్నది. సామ్యయోగ ప్రణాళిక. ఇది లేకుండ నవీనవిద్య పురోగమింప జాలదు.

నవీన విద్యలో మేము శరీరముతో చేయు పనులకు బుద్ధితో చేయు పనులకు విలువలో తేడాను అంగీకరింపము. నాయకత్వము, వ్యవస్థాపనము మొదలైన వానికిగూడ వేతనములలో తేడా ఉండరాదని మా తలంపు. శిక్షకులు, మంత్రులు మొదలైన నాయకులందరి జీతములు సమానముగా నుండవలెను. లేనిచో, విద్యార్థుల మనస్సులో నవీన విద్యపై శ్రద్ధాభక్తు లెట్లు కలుగును? నిజమడిగినచో 'వేతన' శబ్దమే తప్పు. దానికిబదులు 'దక్షిణ' అనిన బాగుగా నుండును.

## అన్నిటికంటె గొప్ప పాపము 'అసత్యము'

మన సంఘమునందలి నైతిక మూల్యములలో కొన్ని మార్పులు చేయవలసియున్నది. సంఘమునందు అన్ని దుర్గుణములలోను అధిక హేతువైనది 'అసత్య'మను భావన దృఢపరచవలెను. తక్కిన దుర్గుణము లన్నియు దోషములు లేక వ్యాధులు. భారతీయ సంస్కృతిలో 'బంగారము దొంగిలించుట' మహా పాతకమని చెప్పబడినది. ఇట్లే 'కల్లుత్రాగుట' 'బ్రహ్మహత్య' కూడ మహాపాతకములుగా నెంచబడినవి.

కాని ఇంతకంటెను గొప్ప పాపము 'అసత్యము'. ఏలన అసత్యము వలననే మనుష్యునిలో దోషమును కప్పిపుచ్చు ప్రవృత్తి ఏర్పడుచున్నది. ఎవడైనా అమితముగా భుజించి అజీర్ణ వ్యాధిచే మరణించినచో అతనిపై ద్వేషమునుగాక జాలిని కల్గించవలెను. ఇట్లు సంఘ మంగీకరించు నెడల దోషములను కప్పిపెట్టు ప్రవృత్తి తగ్గగలదు. కాని ఈ కప్పిపెట్టు ప్రకృతి నశించుట ఎట్లు? ఇందుకు సంఘములో అసత్య మన్నిటికంటె పెద్ద దుర్గుణమను భావన స్థిరపడవలెను.

---

## : 34 : పరిశ్రమాలయము ద్వారా శిక్షణ

నవీన విద్యలో ఒకటి రెండు జీవనోపయోగకరములైన చేతి పనులకు ప్రాధాన్య మిచ్చి దాని వలన విద్యాలాభము నందవలెనని మన అభిప్రాయము. నేను చాలచోట్ల ఇట్టి ప్రయోగము చూచితిని. నాకు అవి అంతగా తృప్తి నిక్కడ జేయలేదని చెప్పవలసియున్నది. ఇందు ప్రయోగము చేయువారియం దంతగా దోష మారోపించుటకు వీలులేదు. ఎంతైనను, చివర కది యొక క్రొత్త వస్తువుకదా! ఎవరికి తోచినట్లు వారు చేయుచున్నారు. ఎక్కడనైన ఒక ప్రజ్ఞావంతుడున్న అతనికి విశేషముగా కార్య విధానము తోచును. అతడు దానిని పరిశోధించును. నూతన భావ మిట్లే పురోగమించుచుండును.

### విద్య అనుటకు బదులు నిత్యకృత్యము అను పేరు

బొత్తిగా చిన్నపిల్లల విద్యను నే నిప్పు డెత్తుకొనను. వయసు వచ్చిన బాలురకు విద్య నేర్పుట కింకొక విధానము నాకు స్ఫురించు చున్నది. నేను వారికి 'విద్య నేర్పుట' అను మాట విడిచి వారికి రోజు కూలి ఇప్పించు పని ఎందుకు చేయరాదు? ఇట్టి బాలురు నా దగ్గరకు వచ్చిననాటి నుండియే నేను వారికి కూలిపని అప్పగింతును, నిరుద్యోగు లకు పని చెప్పుటయే నా ప్రతిజ్ఞ. కాని పనిలో నుండి ఒకటి రెండు గంటలు తీరికచేసికొని వారికి జీవన సంబంధమైనట్టియు, చుట్టుప్రక్కల పరిస్థితులకు సంబంధించినట్టియు విషయములలో ఏవేవి స్ఫురించుచుం డునో అవి తెల్పుచుందును. వారి పని యెట్లు సాగుచున్నదో పరికించు

చుందును. వారి ఆరోగ్యమును గూర్చి శ్రద్ధవహింతును. మాటకు మాత్రము 'నే నొక పరిశ్రమాలయమును స్థాపించితి' ననియే అందురు గాని ఈ విధముగా నవీన విద్యాప్రచారము నేడు నడుచుచున్నదానికంటె ఉత్తమముగా నేను సాగింపగలను.

## పరిశ్రమాలయము ద్వారా విద్యానుభవము

ఇది నేను ఊహించి చెప్పినది కాదు. పవనార్‌లో నేను నడపిన కార్యక్రమములో 14-15 నుండి 18 ఏండ్ల వఱకు వయస్సు గల బాలురు 8 గంటలు పనిచేసి రోజుకూలి సంపాదించుకొనిరి. నూలువడకు కార్ఖానాయే అక్కడ నడచినదనుకొనుడు. నేను వారితో 1, 2 గంటలు కలిసి పనిచేసితిని. మొదట వారి కూలిపెంచుట ఎట్లని ఆలోచించితిని. బాలురు కుడిచేతితో దారముతీయుచుండిరి, మూడు నెలల వఱకు ఎడమచేతితో తీయించితిని. పిమ్మట రెండు చేతులు మార్చి తీయుట సాగినది.

వారి నూలు చిలపలు సమానమైన పుంజములో నుండెడివికావు. కొంత లావు, కొంత సన్నముగా నుండెడివి. కార్యాలయమువారు కూలి ఇచ్చునపుడు అన్నిటికంటె లావుగా నున్న చిలపను బట్టి మొత్తము చిలపల కన్నిటికి విలువ కట్టెడివారు. దీనివలన వారి కెన్ని చిలపలు నష్టమగుచున్నదో లెక్కవేసి చెప్పితిని. దారములు లెక్కించుటలో 640 పోగులుగల చిలపలో 40, 50 పోగులు తక్కువరాగా, సరిగా లెక్కించుట నేర్పితిని. వారిలో ఒక నియమము లేకుండెను. వడుకుచు మధ్య మధ్య కబుర్లుచెప్పుకొను అలవాటు కలదు. దీని వలన వారి కార్యశక్తి ఎట్లు తగ్గిపోవునో ప్రయోగముచేసి చూపించితిని. కొంచెముసేపు మౌనముతో పనిచేయుటకు ప్రోత్సహించితిని. పని ఎక్కువై కూలి అధికముగా లభించినది. దానిమీద 8 గంటలకు బదులు 7 గంటలు పనిచేసి ఒక గంట ఇంకొక విషయము చర్చించుటలో గడపసాగిరి. పిమ్మట నదిలో ఈదుట, ఆడుట, తిరుగుట, గీతాశ్లోకములు కంఠస్థము చేయుట,

పండుగలు మొదలైనవానికి సెలవిచ్చుటకు కారణము. వానికి సంబంధించిన జ్ఞానము కలిగించుట మొదలగు కార్యక్రమము నడచెను. ఈ విధముగా వాడు కూలియు అధికముగా సంపాదింపసాగిరి, రకరకముల శిక్షణను పొందసాగిరి. మొదట వారు బాలురు. ఇప్పుడు బాధ్యత గల పౌరులైరి. నూలు వడికి తమ బట్ట తాము తయారుచేసికొనుచున్నారు. గ్రామ పంచాయితీని బాధ్యతతో స్థాపించుకొనుచున్నారు. పవనార్‌లోని ప్రజాహిత కార్యములలో పాల్గొనుచున్నారు. ఇప్పుడు గ్రామ పారిశుద్ధ్యమును గూర్చి యోచించుచున్నారు. ఇదంతయు ఆ పరిశ్రమాలయము వలననే జరిగినది. పరిశ్రమాలయము చాలరోజులు నడువలేదు. ఏలన నేను జైలుకు పోవలసివచ్చెను. తరువాత అది మూసివేయబడెను. అది సాగియున్నచో, నవీన విద్య కొరక సఫల ప్రయోగము అక్కడ జరిగియుండెడిది. పేరు మాత్రము పరిశ్రమాలయమని మాత్రమే యుండెడిది.

## ప్రధాన పరిశ్రమ అను ఆట

పరిశ్రమలు ప్రవేశపెట్టబడిన చాలపాఠశాలలలో పని విషయమున అంత విశ్వాసముతో ప్రవర్తించుచున్నట్లు కానరాదు. కొంత ప్రదర్శనముకొరకు, కొంత అలంకారమునకు జరుగుచున్నది. అచ్చట కొంత పనితోబాటు కొంత జ్ఞానమును కలుపుచున్నారు. అది ఒక ఆట వలె కన్పించుచున్నది. దీనికంటె అదియే ఎక్కువ మంచిదికాదా ? పనివాంద్ర పనిలో గంభీరత కలదు. పని నేర్చుకొనని యెడల తమకు గడవదని పనివాంద్రకు తెలియును. కాని పాఠశాలలలోని వాతావరణములో ఒక విధమైన మిథ్యాత్వము కన్పించుచున్నది.

## శిక్షణశీలురగు వ్యవస్థాపకులు

ప్రస్తుతము ప్రభుత్వము నిర్వాసితుల పిల్లలకు విద్య చెప్పుపని తాలిమీసంఘమున కప్పగించ దలచుటచే ఈ అభిప్రాయము లిప్పుడు

వెల్లడింపవలసి వచ్చినది. వయసు వచ్చిన పిల్లలకు సంబంధించినంత వరకు పరిశ్రమాలయమని పేరుపెట్టి నవీన విద్యను బోధించుట మంచి దని నాకు తోచుచున్నది. దీనికి కావలసినది పరిశ్రమాలయమును నడుపు చక్కని శిక్షణశాస్త్రజ్ఞుడై యుండుటయే. అతని ఆత్మ శిక్షణతో నిండి యుండవలెను. అతడు స్వాభావిక రూపముననే అచ్చట పనిచేసి కార్ఖా నాకు ఉత్తమమయిన విద్యాలయము యొక్క రూపము నిచ్చును.

—'సర్వోదయ' సెప్టెంబరు 1949.

---

## : 35 : గంట బడి

ఈమధ్య నేను నా ఉపన్యాసములలో "గంటబడి"ని నడుపుటను గూర్చి తరచు చెప్పుచున్నాను. ప్రతి గ్రామమునందును ప్రభుత్వ పాఠశాలలుకాక గ్రామీణ పాఠశాలలు ప్రతిరోజు ఒక గంట మాత్రమే ఉదయపుపూట నడుపవలెను. నవీనవిద్య అనగా గంటబడి అని నేను ఇంచు మించు సమన్వయము చేసివేసితిని. ఇట్టి విచిత్రమయిన అభిప్రాయమును ప్రజలు స్వీకరింతురని నేనాశింపలేదు. కాని ఆశ్చర్యమేమనగా ప్రజలు దీని నంగీకరించుచున్నారు. ఇంతేకాదు. ఈ అభిప్రాయము వారికి చాలవరకు నచ్చినది. ఇప్పుడు దానిని వారు స్వీకరించుచున్నారు. ఇదే మన ప్రాతఃకాలపు ప్రాతిపదిక పాఠశాల.

### గంట కళాశాల

ఈ విధముగానే ఒక గంట మహావిద్యాలయము జరుగును. అది రాత్రిపూట నడుచును. పదునైదు సంవత్సరములకు తక్కువ వయస్సుగల బాలురు ఉదయపు బడికి వెళ్ళెదరు. పదునైదు నిండి పదునారవ సంవత్సరము వచ్చినవాడు మహా విద్యాలయములో జేరుట కధికారియగును. అతడు పాఠశాలలో చదివినను సరే. చదువకున్నను సరే. పాఠశాలలో వ్రాయుట, చదువుట, గణితము మొదలైనవి ఉండును. మహా విద్యాలయములో శ్రవణము, కీర్తనము, భజన మొదలయినవి ఉండును.

బాలబాలికలు పగలంతయు తల్లి దండ్రుల పనిలో సహాయపడుచుందురు. గురువుగారికినికూడ తమపని తాము చేసికొను స్వేచ్ఛ ఉండును. గురువుగారికి జీతముండదు. సంవత్సరాంతమున ప్రతిరైతు నుండి వారికి మూడునాలుగు సేర్ల ధాన్యము లభించును.

## గ్రామజీవనముతో సంబంధము

పాఠశాలలోగాని మహావిద్యాలయములోగాని చదువునది, చెప్పునది గ్రామపరిశ్రమలతో సంబంధించినవై యుండును. వంట. గృహకృత్యములు, పరిశుభ్రత, పండుగలు, ఆటలు, జనన మరణములు, జబ్బులు మున్నగునవికూడ గ్రామపరిశ్రమలలో లెక్కింపబడును.

గ్రామములలో నడుచుచున్న పరిశ్రమలను పెంపొందించుట, నూతన పరిశ్రమలను ప్రవేశపెట్టుట - వీరి బాధ్యత గ్రామ పంచాయితీ మీద నుండును. గ్రామపంచాయితీదార్లలో ఉపాధ్యాయుడుకూడ నుండును. పంచాయితీద్వారా ఆదర్శవ్యవసాయ క్షేత్రము, పరిశ్రమాలయము మొదలయినవి నడుపబడునెడల విద్యార్థులు, ఉపాధ్యాయులు అందు చేరవచ్చును. కాని మూడు గంటలకంటె ఎక్కువపని చేయరాదు. అందు విద్యార్థులకు, ఉపాధ్యాయులకు కూలి ఈయవలెను. అది ధనరూపముగా కాక వస్తురూపముగా ఈయవలెను. గ్రామ పంచాయితీకి అక్కరలేని పరిశ్రమలు తీసివేయవలసిన బాధ్యత స్కూలుపై ఉండరాదు. కాని కావలసిన దానిని తెలియజేయు పని మహా విద్యాలయము చేయవలయును. అట్టి ఆవశ్యకత తెలిసికొని పంచాయితీ దానికై కృషిచేయును. పిమ్మట అది స్కూలులో ప్రవేశపెట్టబడును. శిక్షణ నిమిత్తము ధనము ఆవశ్యకముకాదు. ధనమునుండి విడుదలపొందుట ఆవశ్యకము.

'సర్వోదయ' డిసెంబరు 1954

---

లోకులకు శిక్షణ యిచ్చు విషయములో వేరును విడిచి కొమ్మలను పట్టుకొను పద్ధతి పనికిరాదు. వయోజనవిద్య పూర్తిగా నడుపుటకు ఎంత ఖర్చగును ? అందేయే కష్టములున్నవి ? మొదలగు విషయములతో నొక ప్రభుత్వ నివేదిక వెల్వడినది. దానిని చదివిన మీదట నా యభిప్రాయములు మరింత బలపడుచున్నవి. వయోజన విద్యకు లోక శిక్షణ పేరు మాత్రము పెట్టబడుచున్నది. ఏలన అందమైన పేర్లు లేనిదే మనకు తృప్తి కలుగదు. కాని ఆ పేరుకంటె పని ప్రధానముగా చూచినచో నక్షరాస్యతా ప్రచారమే జరుగుచున్నదని అంగీకరింప వలయును.

"చిలుక పలుకులు"

అక్షరాస్యతా ప్రచారమును గూర్చి ఆలోచించినపుడెల్ల బాల్యమందలి విషయమొకటి నాకెప్పుడును జ్ఞప్తికి వచ్చుచుండును. బ్రాహ్మణ కుటుంబ సంప్రదాయము ననుసరించి నాకు బాల్యములోనే వైదిక సంధ్యావందనము నేర్పబడినది. అది నాకు ఒక వారములోపలనే కంఠస్థమైనది. నాతల్లి యితరులయొద్ద తరచు యీ సంగతిని ప్రశంసించు చుండెడిది. నేను రెండుమూడుసార్లిది వింటిని. బహూశః నా మనస్సునకది ప్రియముగాకుండా తోచియుండవచ్చును. కాని యొక దినమున నేను అమ్మతో "అమ్మా ? నేను సంధ్యావందనమును కంఠస్థము చేయుటలో చూపిన చమత్కారమును నీవందఱితో చెప్పుచున్నావు. గాని దానితోపాటే యింకొక చమత్కారము కూడ కలదు. అది నీవేమెరుగుదువు ?" అంటిని. ఆమె, "ఇంకొక చమత్కారమేమి ?" అని యడిగెను. నేనిట్లు జవాబిచ్చితిని. "విద్య వారమురోజులలోనే

సంధ్యావందనము నేర్చికొనెనుకాని అంతకంటె తక్కువ రోజులలోనే దానిని మఱచిపోయెను కూడ." 'వర్డ్స్వర్త్' చెప్పినట్లు "సంపాదించుచు ఖర్చుచేయుచు మనము మనశక్తిని క్షీణింపచేయుచున్నాము."

## క్రియాత్మక శ్రవణము

అక్షరాస్యతా ప్రచారము శక్తిని క్షీణింప చేయునదిగా కాకూడదని మనము కోరునెడల మన ధ్యానమును సార్థకత్వ ప్రచారముపై కేంద్రీకరింప వలెను. ఇందుకు క్రియాత్మకమగు శ్రవణమువంటి ఉపయోగకరమును, అల్పవ్యయమును అగు సాధన మింకొకటి లేదు.

## కల్పనా దారిద్ర్యము

మన పూర్వులు దీనిని గుర్తించిరి. ఉత్తమోత్తమములగు భావము లెప్పుడును వినుచుండవలెను, వినిపించుచుండవలెను. నవవిధభక్తిలోని మొదటి మూడు సాధనములు: "శ్రవణము, కీర్తనము, స్మరణము"- దీనికి కిరసనాయలుకూడ అక్కరలేదు. ప్రభుత్వ నివేదికలో కిరసనాయిలు ఇబ్బందికూడ చేర్పబడినది. మన బీదతన మెంత యెక్కువగా నున్నదో యెరుగుదుము. కాని దానితోపాటు మన కల్పనా దారిద్ర్యము కూడ ఎంతో పెరిగినది.

> విష్ణుకథ చెవులారగా వినని జనుని
> చెవులు పాముల పుట్ట లీభువిని నిజము.
> రామచంద్రుని గుణగాన రసము గొనని
> జిహ్వ యది చూడ మండూక జిహ్వ సుమ్మి.

## శ్రుతి, స్మృతి, కృతి

శ్రుతి. స్మృతి, కృతి - సూక్ష్మముగా నిదియే మన శిక్షణ శాస్త్రము. వేలకొలది సంవత్సరముల అనుభవముచే నిది స్థిరపడినది.

దేశమందలి ప్రతిపౌరుడు జ్ఞాని కావలెను. ఈ అభిప్రాయము ఈ దేశమునకు క్రొత్త గాదు. ఉపనిషత్తులో "అశ్వపతి" అను రాజు తన రాజ్యముయొక్క గొప్పతనమును తానే యిట్లు పొగడుచున్నాడు. "నా రాజ్యములో నెవ్వడును దొంగ లేడు; లోభిలేడు; త్రాగుబోతులేడు; ఒకడును అపండితుడు లేడు; సోమరి లేడు; దుర్మార్గుడగు పురుషుడే లేడన దుర్మార్గురాలగు స్త్రీనిగూర్చిన ప్రశ్న బయలుదేరుటకే వీలులేదు."

## శిక్షణ - మద్యనిషేధము

దొంగతనము, లోభము - అను విషయములను నేను వదలి వేయుచున్నాను. నేడవి యెంత విజృంభించి యున్నవో అందరు ఎరుంగుదురు. ప్రస్తుత మవి నా చర్చా విషయములు కావు. ఇక మద్యనిషేధ విషయమున ఆంగ్లేయులు మనతో "విద్య కావలెనన్న మద్యనిషేధము చేయుటకు వీలులే"దని చెప్పిరి. ఇంగ్లీషువారివలె స్పష్టముగా చెప్పజాలక పోయినను మనముకూడ యింకొక విధముగా నామాటనే చెప్పుచున్నాము. మద్యనిషేధము చేయవలెను. కాని మెల్ల మెల్లగా చేయవలెను. లేనిచో ఆదాయము అడ్డిపోవును. అని చెప్పుచున్నాము. ఆదాయ మాగినచో నన్నియు నాగవలసినదే; అనగా అక్షరాస్యతకూడ ఆగిపోవునని వేరుగా చెప్పనక్కరలేదు.

## నిరక్షరాస్యత పేర వ్యసనము క్తత

ఇప్పుడిది చూడుడు; లోక శిక్షణ పేరుపెట్టి అక్షరాస్యతా ప్రచారము చేయుట; మద్యనిషేధము పేరెత్తకపోవుట-దీని నేమన వలెను? నేను మాత్రము నాదేశము నిరక్షరాస్యమైనను సరే ఏమియును ఇబ్బంది లేదు; కాని అది వ్యసనమునుండి మాత్రము వెంటనే విడుదల చెందవలెనని చెప్పుదును.

## వ్యసన ప్రవీణులగు విద్యావంతులు

అశ్వపతి తన రాజ్యములో నవిద్వాంసుఁ డెవ్వడును లేడని చెప్పుట కర్థమేమి? ప్రతి పౌరుడును చౌర్యము, లోభము, త్రాగుబోతు తనము, సోమరితనము, దురాచారము చేయకూడదని చక్కగా తెలిసి కొన్నాడనియే గదా! దీని కక్షరజ్ఞానముతో నేమి సంబంధము కలదు? విద్యావంతులు ఈ దుర్గుణములలో ప్రవీణులుగా గూడ గాన్పించుచున్నారు! వారి శ్రేణిలోనే అందరను చేర్చవలెనా యేమి?

## జన శిక్షణ యొక్క ముఖ్యోద్దేశ్యము

చదువుకొనుట వలన నీ దుర్గుణములు కలుగుచున్నవని నా యభి ప్రాయము కాదు. కాని చదువు మీదనే మన మెక్కువ ఆసక్తిని చూపరా దనుటయే నా యభిప్రాయము. దాని ఖర్చునుగూర్చిన చింతలో పడరాదు. జన శిక్షణ యొక్క ముఖ్యోద్దేశ్యమును, కార్యక్రమమును బాగుగా గ్రహించవలెను. మన మీయదలచుకొనిన యక్షర సంస్కారము బాలుర కీయవలెను. దీనితో బాటు బాలుర ప్రాతిపదిక విద్యనుగూర్చి అన్నిటి కంటె యెక్కువ శ్రద్ధ వహింపవలెను.

---

## : 37 : అక్షరాస్యతా ప్రచారము

ప్రస్తుతము మైసూరులో విద్యాపరిషత్తు నడుచుచున్నది. వయోజన విద్యకు చేయవలసిన యేర్పాటు ఆ పరిషత్తులోని చర్చావిషయము. అనేక దేశముల శిక్షణ శాస్త్రపండితులు అచట సమావేశమైయున్నారు. ఇట్లు ఒకరి యభిప్రాయము నింకొకరు తెలిసికొనుటచే తప్పక కొంత లాభము కలుగునని మన మాశింపవచ్చును.

### శిక్షణకు సంబంధించిన కాల్పనిక భేదములు

విద్యా విషయమున ఆలోచించినపుడెల్ల మన మనవసరముగ నీ విషయమును జటిలముగా చేసివేసితిమని తరచుగా నాకనిపించుచుండును. మనము వేరును పట్టుకొన్నచో నీ ప్రశ్న పరిష్కారమగును. కొమ్మలను గూర్చి ఆలోచించుటచేత శక్తి క్షీణించుచున్నది.

ప్రజల నందరను పరిశ్రమశీలురుగను, ఆలోచనాపరులుగను చేయుటయే విద్య యొక్క ముఖ్యోద్దేశ్యము. కాని యీ ఒక్క విషయమునకే మన మనేక శాఖలు నిర్మించితిమి. పట్టణ విద్య, గ్రామీణ విద్య, వయోజన విద్య, చిన్నపిల్లల విద్య, తిరిగి ఆ చిన్నపిల్లలలో శిశువుల విద్య, ప్రాతిపదిక విద్య, స్త్రీ విద్య, పురుష విద్య, పారిశ్రామిక విద్య, బుద్ధిప్రధాన విద్య, ఇవన్నియు కాక అక్షరాస్యతా ప్రచారము !

### ఒకటి సాధించిన అన్నియు సాధింపబడును

ఇన్ని శాఖల నిర్మించి ఆలోచింపసాగిన మన మెప్పుడును ఆలోచించుచునే యుందుము. మన ధ్యానమును అన్నిటిపైన పంచి "కొంత ఖర్చు దీనికి, కొంత ఖర్చు దానికి" ఈ విధముగ దేనికిని

తృప్తిని కలిగింపజాలము. కాబట్టి మూలమును గ్రహించి, ఒకదానిలోనే అన్నియు సాధింపబడునట్లు ప్రయత్నము చేయవలెను. నా దృష్టిలో ప్రాతిపదిక శిక్షణయే ఆ మూలము. ఈ శిక్షణ 7 నుండి 14 సంవత్సరముల వరకును నీయబడవలెనని విశేషజ్ఞుల యభిప్రాయము. ఈ అవధిని యింకను పెంచవచ్చును. 6 నుండి ప్రారంభించి, 15 ఏండ్ల వరకు తీసికొని వెళ్లవచ్చును. అనగా పరిపూర్ణత సాధించుటకు అవధిని ఎంత వరకు అవసరమైన అంతవరకు పొడిగింపవచ్చును. అట్లు ఒక పనిని సర్వాంగ సుందరముగా నెరవేర్చి, అట్టిశిక్షణ దేశమంతటను అనివార్యము చేయవలెను. ఇందు పరిశ్రమ వచ్చును ; ఆలోచనశక్తి వికసించును ; అక్షరాస్యత కూడ కలుగును. ఇందు నేర్చుకొనిన విద్య ఎట్లు నిలబడు నను ప్రశ్న కూడ ఉదయించదు. ఏలన అది ఒక అనుభవయుక్తమగు జ్ఞానము ; కావున అది మరచిపోవుట కవకాశమే లేదు. పైగా ఒక విత్తనమును నాటిన ఎన్నో విత్తనములు బయలుదేరినట్లా విద్య వృద్ధి పొందుచునేయుండును. ఈ విధమైన విద్య పొందిన విద్యార్థి ముందు ముందు తన జ్ఞానమును నూరురెట్లు వృద్ధిపొందించుకొనును.

ఇన్ని శాఖలను గూర్చి వేరువేరుగ నాలోచించుట వలన పని యేమైనా తొందరగా జరుగుచున్నదా ? యన్న అదియునులేదు. ప్రాతి పదికవిద్య స్వీకరించినచో ఆ విద్యార్థులే ముందుముందు ప్రౌఢులైన పౌరులగుచున్నారు. వారే తమతమ యిండ్లలో పూర్వ ప్రాతిపదిక విద్యా ప్రణాళికను ఏర్పాటు చేసినచో శిశు విద్యను గురించిగాని, ప్రౌఢ విద్యనుగురించిగాని చింతింపవలసిన యవసరమే ఉండదు.

## పరిశ్రమద్వారా ప్రౌఢ విద్య

నేడు వయోజనులలో సాగుచున్న అక్షరాస్యతా ప్రచారము చూచిన ఆ పద్ధతివలన విశేష లాభము కన్పించుటలేదు. వయోజన విద్య

కూడ పరిశ్రమ ద్వారానే జరుగవలెను. దానివలన నిరుద్యోగులకు పని దొరకును ; వారి బుద్ధికూడ వికసించును.

రెండువేల జనసంఖ్య గల గ్రామమున్న దనుకొనుడు. ఇట్టి గ్రామములో 8 లేక 9 సంవత్సరముల సంపూర్ణ ప్రాతిపదిక విద్యావిధానము నడిపినచో నందు సుమారు 3 వందల మంది విద్యార్థు లుందురు. వారికి తరగతుల లెక్కను 8 లేక 10 మంది ఉపాధ్యాయులు అవసరమైనచో నింకను నిద్దర ముగ్గురను అధికముగా నిచ్చెదము. అందరును కలసి ప్రాతిపదిక విద్య నడిపించెదరు. దానితోబాటు వయోజనులకు కూడ వారు జీవనోపయోగకరమైన జ్ఞానవిజ్ఞానముల నీయగలుగుదురు. ఏలన, వారు స్వయముగ ననేక పరిశ్రమలలో నారితేరినవారై యుందురు. అందుచే రైతుకు కూడ వారు వ్యావహారిక జ్ఞానము నీయగలుగుదురు. ఇంతేగాక ప్రస్తుత ప్రపంచ పరిస్థితుల జ్ఞానము, భూగోళ జ్ఞానము, ఆరోగ్య జ్ఞానము, విజ్ఞానము మొదలైనవి గూడ బోధింపగలరు.

## అసమగ్ర శిక్షణ పనికిరాదు

ప్రభుత్వము ప్రాతిపదిక విద్యను ఇంకా పూర్తిగా నడుపలేకపోవుచున్నదనియు, దీనికి కారణము తగినంత ధనము లేకపోవుట యనియు చెప్పుచున్నారు. మీకున్న ధనమంతయు నిందులోనే పెట్టుడని నేను చెప్పుదును. నాలుగు సంవత్సరముల ప్రాతిపదిక పాఠశాల పెట్టుటచే విశేష ఫలిత మేదియును కలుగదు. సంపూర్ణమైన ప్రాతిపదిక పాఠశాల నడిపించినచో పరిపూర్ణమైన జ్ఞానమును కలుగును. అయిన ఖర్చును తిరిగి వచ్చును. కాని యిందు లోభము చూపబడుచున్నది. ప్రాతిపదిక శిక్షకులను తక్కువ సంఖ్యలో నియమించి, అటు వయోజన శిక్షణకు వేరుగా శిక్షకులను నియమించుచున్నారు. ఇంతకంటె ప్రాతిపదిక శిక్షణకు పూర్తి సంఖ్యలో శిక్షకులను నియమించుట మంచిది. ఇట్లు చేసినచో వారే వయోజన విద్య కూడ నిర్వహింపగలరు.

## ప్రాతిపదికవిద్య ఒక సముద్రము

ప్రాతిపదికవిద్య ఒక సముద్రము. అందు అన్ని రకములైన యభిప్రాయము లను నదులు వచ్చి చేరును. అందు స్త్రీ పురుషభేదము నశించును. పట్టణము పల్లె అను భేదముకూడ నుండదు. ఏలన, రెండిటికిని ఒకే మూల శిక్షణ కావలెను. ముందుకు వెళ్ళినకొలది కొంత భేద ముండవచ్చును కాని ప్రతికూలత మాత్రము ఎంత మాత్రము ఉండ జాలదు.

ఇదియే శిక్షణకు మూలము. కాని యీ విధముగ ఇది అవసరమైనంత తీవ్రతతోను, దూరదృష్టితోను చూడబడుట లేదనియు, చాల మట్టుకు శాఖాగ్రాహియగు పాండిత్యమే నడచుచున్నదనియు నాకు తోచుచున్నది. ఇందువలన సమస్యలు పెరుగునుగాని తరుగవు.

పరంధామ - పవనార్ 5-11-49.

## : 38 : మూల పరిశ్రమయందలి శిక్షణ దృష్టి

'సమవాయ పద్ధతి' పరిశ్రమ ద్వారా జ్ఞానము నిచ్చుట కుద్దేశింప బడినది. కావున సాధ్యమైనంత వఱకు వ్యాయామము కూడ అందే వచ్చి వేయును. అనగా పరిశ్రమచేయు సమయమున బాలురకు తగినంత శరీర వికాసము కలుగుచున్నదా, లేదా అని ఉపాధ్యాయుడు చూచుచుండవలెను. 5, 6 నిమిషముల పాటు వేగముగా విడువకుండ చేయు వ్యాయామము కంటె, పరిశ్రమలో సరియైన ధ్యానముంచినచో సావకాశముగను, నెమ్మదిగను జరుగు వ్యాయామము శరీరశాస్త్రదృష్టిలో తక్కువ విలువ గలది కాదు.

### వ్యాయామోపయోగము గల పరిశ్రమలు

కాని సరిగా శ్రద్ధ పట్టనిచో చక్కని వ్యాయామ మీయగల లాభ దాయక పరిశ్రమలు కూడ కష్టదాయకములుగా కనిపించును. ఉదాహరణ మునకు "పృష్ఠేవ తష్ఠ్యామయీ" అనగా వడ్రంగి వీపు నొప్పితో వంగును. ఋగ్వేద మందలి ఈ బాధను పదివేల సంవత్సరములైనను పోగొట్టజాలకపోతిమి. మన దేశములో ఎక్కువమంది వడ్రంగుల వీపులు వింటిబద్దల వలె కన్పించుచుండును. సామాన్యముగా వారి ఆయుర్దాయము కూడ తక్కువే. వడ్రంగము శరీరమునకు లాభదాయక మని తలచవలసినదే. కాని పగలంతయు నడుమువంచి పనిచేయు అలవాటు వలన మన కా లాభము కలుగుటలేదు. వడ్రంగి చేయు పనులు చాలమట్టుకు నిలుచుండి చేయవచ్చును అను సంగతి మన మాలోచింపనే లేదు.

## పనితో బాటు వ్యాయామము

కొంచెముసేపు కూర్చుండి పనిచేసిన పిమ్మట నిలుచుండి పని చేయవలెను. అప్పుడప్పుడు కూర్చుండుటలో కూడ మార్పురావలెను. ఒకటి మార్చి ఒకటి రెండు చేతులతోను పనిచేయవలెను. తరగతి గదిలో కొంతసేపు పనిచేసిన పిమ్మట బహిరంగ ప్రదేశములో వ్యాయామము, తోటపని మున్నగువానికి కొంతసమయ మీయవలెను. కొంచెము సేపు దగ్గరిచూపు పని చేసినచో కొంచెముసేపు దూరపుచూపు పని, కొంచెము సేపు సంగీతము పాడినచో కొంచెముసేపు కేవల మౌనము— ఇట్లుండ వలెను. ఈవిధముగా పరిశ్రమకు హానికలుగకుండగనే మనము పనిలో విభిన్నత తీసికొనిరావచ్చును. అట్లు తీసికొనిరావలెను అని సారాంశము. ఉదాహరణమునకు పిల్లలు అరగంట కూర్చుండి తకిలీ వడికినచో ఆసుపై దారము చుట్టుటకు పది పండ్రెండు నిమిషములు పట్టును. ఈ పని నిలుచుండి చేయవలెను.

నూలు వడుకు పాఠ్యక్రమములో ఈయబడిన సూచనలో కవాతు ద్వారా పరిశ్రమ నేర్పవలెనని కూడ ఒక సూచన కలదు. అది మొదటి సంవత్సరమునకే ఈయబడినను అన్ని పరిశ్రమలకు వర్తించును. వ్యాయామము చేయించుటయే ఈ సూచన యందలి ముఖ్యోద్దేశ్యము.

పరిశ్రమలో ఏ పనియైనను చేయించునప్పుడు గాని, లేదా ఇతర విషయ మేదైన చదివించునప్పుడు గాని విద్యార్థుల శరీర స్థితి చక్కగా నుండునట్లు ముఖ్యముగా ఉపాధ్యాయులు చూచుచుండవలెను.

## సాతత్యయోగముయొక్క అభ్యాసము

మిక్కిలి చిన్నపిల్లలచే పని చేయించునప్పుడు తఱచుగా వారు కూర్చుండు స్థితిలో మార్పు కలిగించుట ఒకపద్ధతి అయినట్లే, అదే పనిగా అనగా ఒకే విధముగా కూర్చుండి చాలసేపు పనిచేయు అభ్యాసము లేక దీక్ష విద్యార్థులలో కలిగించుట ఇంకొక పద్ధతి. దీనిని

"సాతత్యయోగము" అందుము. ఈ అభ్యాసము విద్యార్థులలో క్రమ క్రమముగా వృద్ధిపొందవలెను. తకిలీ వడుకు సమయమున మిక్కిలి చిన్నపిల్లలు 15 నిమిషముల కొకసారి చేయి మార్చవలయునని అను కొన్నచో, "సాతత్యయోగము" యొక్క అభ్యాసములో వారములో ఒక రోజుగాని, లేదా సాధ్యమైనచో ప్రతిరోజుగాని 30, 40 నిమిషములు ఒకే చేతితో లేక ఒకే విధముగా కూర్చుండబెట్టి వడికించవలెను.

సాతత్యము లేకుండ కర్మయోగము సిద్ధింపదు. నేడు మన విద్యా వంతులలో శ్రమ సాతత్యము అనగా అవిచ్ఛిన్నముగా పరిశ్రమ చేయు శక్తి లేనట్లే తోచుచున్నది. ఈ దోషమును మనము తొలగింపవలెను. పరిశ్రమలో చివరి పరీక్ష కొన్ని వారములపాటు రోజుకు ఎనిమిది గంటలచొప్పున పనిచేయుట. మనము విద్యార్థులను మెల్లమెల్లగా ఈ లక్ష్యమువైపు తీసికొని పోవలెను. ఏవిధముగ ఒక నది పర్వతమునుండి దుముకుచు, ఎగురుచు బయలుదేరి చివరకు సముద్ర సమీపమున స్థిర రూపమును ధరించునో ఆవిధముగనే పరిశ్రమ శిక్షణయొక్క ఆరంభము "తకిలీయొక్క వివిధాభ్యాసములు" అను ప్రకరణములో జెప్పినట్లు వైవిధ్యముతోనే యుండి, చివరకు సాతత్యము నందుకొనవలెను.

## తుక్కుయొక్క ఉపయోగము

పరిశ్రమలో సాధ్యమైనంత తక్కువ తుక్కు బయలుదేరు నట్లును, అదికూడ ఉపయోగ పడునట్లును చూడవలసిన అవసర మున్న దని గ్రహింపవలెను. ఈ ప్రపంచములో మన మందరికంటె దరిద్రు లము. కాని ఈవిషయములోకూడ అంత ఉదాసీనులము, అపవ్యయము (వ్యర్థమైన ఖర్చు) చేయువారము అయివున్నాము. మనము మలము ఎరువువంటి అమూల్యమైన ఎరువును నిర్లక్ష్యముగా పాఱవేయుచున్నాము. దానివలన రోగములు వ్యాపించుచున్నవి. చచ్చిన జంతువుల విషయము కూడ ఇట్లే ఉన్నది. మనము నిమ్మకాయను భుజింతుము, కాని దాని

విలువగల తొక్కను పారవేయుదుము. ఈ విధముగా మనముచేయు అపవ్యయములకు అసంఖ్యాకముగా ఉదాహరణము లీయవచ్చును. కావున ఈ విషయమున మనము సమగ్రముగాను, లోతుగాను శ్రద్ధవహింప వలసి యున్నది. ఉదాహరణమునకు ప్రత్తి శుభ్రము చేయునప్పుడు వెనుకవైపున పడిన దూదిని తీసికొని దానిగింజలు అనవసరముగా పార వేయరాదు. ఏకుడు చాపక్రింద ప్రోగైన దూదిని లావుదారము వడుకు టకుగాని, ఇంకేపనికైనాగాని ఉపయోగింపవచ్చును. రాట్నము నేర్పు నప్పుడు ప్రారంభములో తెగిపోవుదారముతో గుండుసూదులు గ్రుచ్చు కొను దిండ్లు (పిన్-కుషన్సు) తయారుచేయవచ్చును.

## సౌందర్యభావన

చిన్నపిల్లలు అందమైన చక్కని వస్తువు లెట్లు తయారుచేయగల రని తరచు జనులు ప్రశ్నింతురు. కాని సరియైన శ్రద్ధవహించినచో ఇట్టి శంకకు అవకాశముండదు. అనుభవముపలన పిల్లలు వడికిన నూలు ప్రశస్తముగను, పరిశుభ్రముగను ఉండగలదని తేలుచున్నది. పిల్లలలో అనుకరణ ప్రవృత్తి కలదు. కావున వారు సౌందర్యమునుగూడ అనుక రింప గలరు. పిల్ల లెప్పుడును తమ తండ్రి పళ్ళెములో మిఠాయి ఉండ ఉండగా తమపళ్ళెములో మిఠాయిముక్క మాత్రమే ఉండుటకు ఒప్పు కొనరు. వారు తమకుకూడ, చిన్నదైననుసరే పూర్తి మిఠాయి ఉండ కావలెనందురు. వ్యవహారజ్ఞుడైన మనుష్యుని ఉపయోగితావాదమును గ్రహించుట బాలుర కెంత కష్టమో, సౌందర్యము గ్రహించుట అంత కష్టము కాదు.

కాని సౌందర్యమునకు 10 మార్కులే యిచ్చుట, అందముగా లేనివస్తువు - తక్కిన గుణము లున్నను అందములేనిది 90 మార్కులు పొందుట అను అనుచిత పద్ధతి పోవలెను. అందముగాలేని వస్తువునకు శిక్షణలో ఏమియు విలువ ఉండరాదు.

ఏకులు నియమితమైన పొడుగుగలవై యుండవలెను. ఈ విష యము పిల్లల కెక్కినట్లు పెద్దల కెక్కదు. పెద్దవారైనచో 'పొడుగు కొంచెము ఎక్కువ తక్కువ అయినంతమాత్రమున ఏమి పోయినది? నియమితమైన పొడుగు ఉంచవలెనన్న అది ఒక ప్రత్యేకమగు పని. దానికి ఎక్కువ సమయముకూడ పట్టును. దీనివలన కలుగు లాభ మేమి?' అని ప్రశ్నింతురు. ఇట్టివారితో పడలేకనే బహుశః ధర్మశాస్త్ర కారులు "సమానమైన ఏకులవలన స్వర్గము వచ్చును" అని చెప్పి యుందురు. చిన్నపిల్లల కిచ్చు శిక్షణలో ఆభాసమాత్ర మగు ఉపయోగ వాదమునకు స్థాన మీయరాదు. పని తక్కువ జరిగినను ఇబ్బందిలేదు. కాని అది అందముగా నుండవలెను. అనగా సౌందర్యమువలన పని తక్కువ జరిగిన హాని లేదుగాని చురుకుదనము లేకపోవుటచే పని తక్కువ జరుగుట మంచిదికాదని అర్థము.

## పనిలో సామూహికభావన

విద్యార్థులలో సమిష్టిగా అందరును కలసి పనిచేయు భావన కలుగనియెడల మన ఉపాధ్యాయులవలన ఏమియు పని జరుగలేదని అర్థము. ఈ సమిష్టి భావన మనలో చాల తక్కువ. గొప్పగొప్ప విపత్తులు వచ్చినప్పుడుతప్ప మన చూపు ఇల్లుదాటి బయటకు వెళ్ళదు.

పనిద్వారా సమష్టి భావన కలిగించుట వృత్తివిద్యలోని ప్రధాన విషయముగా గ్రహింపవలెను. ఒక విద్యార్థి ఏకుటలో నసమర్థుడైనచో ఇంకొక విద్యార్థి సంతోషముతో అతనిపని చేసిపెట్టుటకు సిద్ధముగా నుండ వలెను. అతడు తన దూది ఎంత చక్కగా ఏకుకొననో అంతకంటె ఎక్కువ చక్కగా ఇతరుల దూదిని ఏకిపెట్టు ప్రవృత్తి అతనిలో నుండవలెను.

ప్రతి వాడును తనదగ్గర ప్రోగైన తుక్కును ఎత్తివేయవలెను. కాని ఒక రిద్దరు అట్లు చేయనియెడల తక్కినవారు ఆ రద్దును అచట నుండి తీసివేయవలసినభారము తమమీద నున్నట్లు గ్రహింపవలయును.

"నేను చురుకుగా పనిచేసినంతమాత్రమున సంతృప్తి పడరాదు. నా తరగతిలో మొత్తముమీద అందరును చురుకుగా పనిచేయువారు కావలెను" ఈ భావము ప్రతి విద్యార్థి మనస్సులోను బయలుదేరవలెను. ఇందుకొరకు వ్యక్తిగతమైన లెక్కలతోపాటు సమష్టి లెక్కలు కూడ నుంచి అందరు విద్యార్థుల దృష్టిని దానిమీది కాకర్షింపవలెను.

రాట్నపు త్రాడు పేనుట ప్రతియొకనికిని రావలెను. అందరును తమతమ త్రాడు తాము పేనుకొనవలెను. కాని మొత్తము తరగతి నిమిత్తముగాని తక్కిన విద్యార్థుల నిమిత్తముగాని త్రాళ్ళు పేను పని ఈయబడినచో దానిని మిక్కిలి సంతోషముతోను, ఎక్కువ జాగరూకత తోను చేయవలెను.

ప్రతి విద్యార్థి వడికిన దారము పురి తెలిసికొనుటకు వేరువేరుగా నేయించవలెను. దానితోపాటే మధ్యమధ్య తరగతి మొత్తము మీది నూలు తీసి వస్త్రము నేయించి పాఠశాలయొక్క ప్రదర్శనశాలలో నుంచ వలెను. "ఇది మా తరగతిలో వడికిన నూలుతో నేసినబట్ట" అను ప్రేమభావన, సమష్టి దృష్టి విద్యార్థులలో కలిగించవలెను. ఆ తానులోని గుణదోషములు తమ అందరి గుణదోషములును అనుసంగతి విద్యార్థు లందఱు తెలిసికొనవలెను.

"నీకింకను నూలువడుకుటలో చురుకుదనము రాలేదు. దీనిపై నీవు ధ్యానముంచుటలేదు. తక్కిన విద్యార్థులందరు ముందుకుపోవుచున్నారు. నీకు సిగ్గేలలేదు ?" ఈ విధముగా శిక్షకుడు ఎప్పుడును చీవాట్లుపెట్ట రాదు. అతడు విద్యార్థితో ఇట్లు చెప్పవలెను. "నీవింతవరకు నూలువడ కుటలో శ్రద్ధవహించుటలేదు. ఇట్లయినచో నీతరగతి అభివృద్ధి ఎట్లు కలుగును ? తరగతి అభివృద్ధి చెందవలెనన్న తరగతిలోని ప్రతివిద్యార్థి శక్తివంచనలేకుండ ప్రయత్నింపవలెను."

ఈ విధముగా అనేకములగు ఉపాయములచే విద్యార్థులలో సమష్టి భ్రాతృభావమును కల్గింపవలెను.

## సాధర్మ్య వైధర్మ్య ప్రక్రియ

పరిశ్రమలోని విభిన్నవ్యాపారములను గురించి, సాధనములను గురించి బోధించుసమయమున పరిశ్రమపరిధిలోనే ఉన్నప్పటికిని మన మందు బంధింపబడినట్లుండరాదు. పర్వతముపైకూర్చుండి నాలుగుపైపుల నున్న ప్రపంచమును చూచునట్లుగనే మనము పరిశ్రమలో కాలు నిలద్రొక్కుకొని దానిద్వారా మనచుట్టూనున్న ప్రపంచమును పరిశీలింప వలెను. ఈ విధముగా పరిశ్రమద్వారా ప్రపంచపరిశీలన చేయుపద్ధతిని సాధర్మ్య వైధర్మ్య ప్రక్రియ అందురు. దీనిసహాయముచే మనుష్యుడు పరిశ్రమలోనుండునుకాని అందు బద్ధుడుకాడు.

విద్యార్థులకు తకిలీని రాట్నమును ప్రదక్షిణ క్రమమున త్రిప్ప వలెనని బోధింపవలసియున్నది అనుకొనుడు. అపుడు ప్రదక్షిణ క్రమ మన నేమో వారికి తకిలీనిగాని, రాట్నమునుగాని ప్రత్యక్షముగా త్రిప్పి చూపి అది ఎటు తిరుగుచున్నదో గమనించునట్లు చేయవలసియుండును. ఇట్లు చేయునపుడు ప్రదక్షిణక్రమముగాను అప్రదక్షిణ క్రమముగాను తిరుగు వాని దృష్టాంతములను కొన్నిటిని అనగా 'సాధర్మ్య' దృష్టాన్తములను, 'వైధర్మ్య' దృష్టాంతములను పిల్లల యెదుట పెట్టవలెను. ఉదాహరణమునకు :

## సాధర్మ్యోదాహరణములు

1. గడియారపు ముండ్లు ఎట్లు తిరుగుచున్నవి?
2. నూతిలో బాల్చి వేయునపుడు గిలక యెట్లు తిరుగుచున్నది?
3. మరమేకు బిగించునపు డది యెట్లు తిరుగుచున్నది?
4. తాళము వేయునపుడు తాళపుచెవి యెట్లు తిరుగుచున్నది?
5. హారతి యెట్లు త్రిప్పుదురు?
6. దేవాలయమునకు ప్రదక్షిణము యెట్లు చేయుదురు?
7. ప్రత్తిగింజలు తీయుకడ్డీ యెట్లు త్రిప్పుదురు?

8. ప్రత్తిగింజలు తీయు చేతిరాట్నమెట్లు త్రిప్పుదురు ?
9. తెలికులవాని గానుగ యెట్లు తిరుగును ?
10. బొంగరము నెట్లు త్రిప్పుదురు ?

## వైధర్మ్యోదాహరణములు

1. నూతినుండి నీళ్ళు తోడునపుడు
2. మరమేకును విప్పివేయునపుడు
3. తాళము తెరచునపుడు
4. తిరగలితో పిండి విసరునపుడు
5. సప్తర్షి మండలము లేక ధ్రువమత్స్యమును చూచునపుడు మొదలైనవి.

ఈ సంగతులన్నియు విద్యార్థులకు ప్రత్యక్షముగా చూపవలెను. దీని కెంత సమయము పట్టినను నష్టము లేదు.

సాధర్మ్య వైధర్మ్య ప్రక్రియను వైజ్ఞానికు లొక అభిప్రాయము తోను కవు లింకొక అభిప్రాయముతోను ఉపయోగించుచున్నారు. మనము రెండభిప్రాయములతోను దాని నుపయోగింపవలెను. అనగా పరిశ్రమపై వెల్తురును ప్రసరింపజేసి మన జ్ఞానమును శుద్ధపరచుట; విశ్వ విహారముచే కలుగు ఆనందమును అనుభవింపజేయుట.

## వాక్కుద్వారా ప్రకటనము

ఒకనికి నూలు వడుకుట బాగుగా వచ్చును. కాని ఆ నూలు వడుకుట అతడు ఏవిధముగ చేయుచున్నాడో అది అతడుభాషద్వారా ప్రకటింపజాలడు. ఇట్టివాడు నూలువడుకు పద్ధతిని పూర్తిగ తెలిసికొనలేదని చెప్పవలసి యుండును. దీనిని మాట్లాడు శక్తిలో లోటుక్రింద నెంచరాదు. ఇక దీని కర్థ మేమన చేతితో చేయబడు పని ఎన్ని సూక్ష్మ క్రియల కలయికచే జరిగినదో అది అతని మనస్సున కెక్కలేదనవలెను.

లేదా పనిచేయుట వచ్చినదికాని ఆ పనిని విశ్లేషణ మొనర్చుట రాలేదని చెప్పవచ్చును.

మనదేశములో పనివారందరు ఇంచుమించు ఈ తరగతికిచెందిన వారే, మాకు పనినేర్పుమని వారినడిగినచో మేముచేయుచున్నది చూచి నేర్చుకొనుడని చెప్పుదురు. వారు చిత్రికపట్టుచు "ఈ విధముగా చిత్రిక పట్టవలెను" అని చెప్పుదురు. వారు చెప్పు "ఈ విధముగా" అనుదానికి అర్థమేమో మీరేగ్రహింపుడు.

మనమీస్థితిని మార్చవలెను. చేయి, బుద్ధి - రెంటిని కలుపునది వాక్కు-కావున పరిశ్రమలోచేయు పనులు, వాక్కు-ద్వారా దానిని వ్యక్తము చేయుశక్తి - ఈ రెండును విద్యార్థికి రానంతవరకు అతనికి ఆ పరిశ్రమ పట్టుపడినదని అనుకొనరాదు.

వాక్కు- అనగా "నిశ్చితము స్పష్టము అయిన వాక్కు"ని యర్థము. ఉదాహరణమునకు పెన్సిలును నిలువుగా ఉంచినపుడు చాలమంది దానిని "తిన్నగా"నున్నదందురు. దానినింకొకవిధముగాపెట్టినపుడు "వంకరగా" నున్నదందురు. నిజమునకు మొదట నిలువుగానున్నది, రెండవసారి అడ్డముగా నున్నది. కాని రెండుస్థితులలోను పెన్సిలు తిన్నగానేయున్నది. ఈ నడుమనే ఒక విద్యాశాఖద్వారా ప్రకటింపబడిన యొక పుస్తకములో "ఫలానా తరగతిబాలురకు కూడికలునేర్పుటలో సంఖ్యలు ఏబదికి మించరాదు." అని ఉపాధ్యాయులకు సూచన ఈయబడినది. కాని అసలు చెప్పవలసినది కూడికలకిచ్చుసంఖ్యలు కూడగావచ్చుసంఖ్య ఏబదికిమించ నట్లుండవలెను అని. ఈవిధముగా, చెప్పునదొకటి, దానియర్థము వేరొకటి అయినయెడల దానిని వాక్కు- అనరాదు.

ఈ విషయము మాతృభాషకు సంబంధించినది. కావున మాతృ నేర్పు తరగతిలో దీనినిగురించి విశేష శ్రద్ధ గైకొనవలెను. కాని నా ఉద్దేశ్యములో ఇది పరిశ్రమలోనే అంతర్భవించును. కేవలము

పరిశ్రమను నేర్పు పాఠశాలలోకూడ మనము దీనిని వదలివేయుటకు వీలులేదు.

## శాస్త్రీయబుద్ధి

పరిశ్రమద్వారా విద్యార్థులలో శాస్త్రీయబుద్ధి వికసించుచుండవలెను. శాస్త్రీయబుద్ధియందు ఈ క్రింది విషయములు కూడియుండును.

1. *పృథక్కరణము* : ఏదైన నొక విషయమునుగాని వస్తువునుగాని విశ్లేషణముచేయుట. అనగా అందలి విభిన్నభాగములను వేరు చేయుట.

2. *ఏకీకరణము* : పృథక్కరణమునకు వ్యతిరేకము. అనగా ఏదైన నొక విషయము లేక వస్తువుయొక్క విభిన్న భాగములను కలుపుట.

3. *వర్గీకరణము* : వేరువేరు తరగతులలో విభజించుట.

4. *అనుక్రమము* : ఒక క్రమము ననుసరించి పేర్చుట.

5. *సాహచర్యము* : ఏ విషయము లేక వస్తువు ఏవిషయము లేక వస్తువుతో కలియునో చూచుట.

6. *కార్యకారణభావము* : కార్యమునుండి పరిణామమును తెలిసికొనుట, పరిణామమునుబట్టి దాని కారణమును ఊహించుట.

7. *ఇంద్రియ ప్రామాణ్యము* : ఇంద్రియ జ్ఞానమువలన వస్తువుల ననుమానించుట.

8. *ఇంద్రియ భ్రమ* : ఇంద్రియముల భ్రమలో పడకుండుట. అనగా పై రూపమును చూచి పొరపడకుండుట.

9. *మహత్త్వగణన లేక తారతమ్యము* : వస్తువుల ఆకార ప్రకారములను పోల్చిచూచుట.

10. *సంశయము* : సందేహ నివారణము.

11. *నిశ్చయము* : నిశ్చిత పరిణామమునకు చేరుట.

వీని అన్నిటికి ఉదాహరణ లిచ్చినచో విషయము చాలపెరుగును. క్లుప్తముగా దీని సారాంశ మేమన పరిశ్రమద్వారా బుద్ధియందు పరిశీలన శక్తి కలుగవలెను. ఫలానా విషయము ఈవిధముగా చేయవలెను, లేదా చేయరాదు; కేవలము ఇట్టి విధినిషేధ జ్ఞానమువలన పరిశ్రమలో వాస్తవికతయు, సజీవతయు రాజాలవు, కావున నట్లు జరుగరాదు. ఏపని యైనను ఎందుకు చేయవలెను? ఎందుకు చేయరాదు? దీనికి కారణము తెలియక కేవలము కన్నులు మూసికొని విధినిషేధములను పాలించుటచే పరిశ్రమలో అభివృద్ధి కలుగదు.

ఏదైన విధిగాని నిషేధముగాని చెప్పునపుడు దాని కారణమును అప్పుడే చెప్పవలసిన అవసరము లేదు. కారణమునుగూర్చిన చర్చ ఆవశ్యకత ననుసరించి వెనుకముందులగాని, దానితోపాటేగాని చేయ వచ్చును. అదిమాత్రము తప్పకుండ జరుగవలెననియే నేను చెప్పునది. శిక్షణ పద్ధతి యెట్లుండవలెనన్న విద్యార్థి మనసులో ప్రశ్నలు బయలు దేరుచు వారు వానిని ఉపాధ్యాయులయెదుట పెట్టుచుండవలెను. అవసర మయినవుడు ఉపాధ్యాయుడుకూడ ప్రశ్నించి విద్యార్థులు దానిపై చర్చించు నట్లు చూడవలెను.

సాధారణముగా ఎవరును అడుగని ప్రశ్నలుకూడ అడుగుచుండ వలెను. ఉదాహరణమునకు రాట్నపు చక్రమునకు 4 ఆకులే యేల ఉండ రాదు? ఇట్టిప్రశ్న సాధారణముగా యెవ్వరును అడుగరు. ఒకవేళ యెవ రైన అడిగిన వానిని మూర్ఖుడనుకొందురు. కాని మేము అతనిని చతురు డనియే తలంతుము. ఇంతేకాదు, మేముకూడ స్వయముగా ఇట్టిప్రశ్నలు అడిగి వానికి శాస్త్రీయసమాధానములను ఊహద్వారా రప్పించెదము.

## పరిశ్రమనిష్ఠ

పరిశ్రమవేరు; పరిశ్రమనిష్ఠ. పరిశ్రమపై ఆదరాభిమానములు వేరు, ప్రపంచములో ఎక్కువమంది శరీరపరిశ్రమచేయువారే. కాని వారు

తరచు తప్పనిసరిఅయి పరిశ్రమచేయుచున్నారు. చాలమంది పరిశ్రమ చేయవలసిన పనులనుండి సాధ్యమైనచో తప్పించుకొనుటకే చూచు చుందురు. కొందరు శరీరపరిశ్రమనుండి తప్పుకొని అనగా దానిభారము నితరులపై వేసికూడ గౌరవింపబడుచునే యున్నారు. దీనినుండియే సామ్రాజ్యవాదము, ధనికవాదము, యుద్ధము, వైషమ్యము (చిన్నపెద్ద అను భేదము, ఎక్కువ - తక్కువ భేదములు మొదలైనవి) పుట్టినవి. వీనికన్నిటికి ఒకటేచికిత్స కలదు. అదివిద్యార్థులలో 'ఏమియు శరీర శ్రమచేయకుండ శరీరమునకన్నముపెట్టుట, తనయెడను, సమాజము నెడను కూడ అపరాధము చేయుటయే' అనుభావన కలిగింపవలెను.

మన విద్యాప్రణాళికద్వారా శిక్షణపొందిన విద్యావంతులలో ఇట్టి భావన బాగుగా పాతుకొనవలెను. మనదేశములో ప్రస్తుతమున్నస్థితి ఏమనగా బాలురను చదువుకొనుటకు స్కూలుకు పంపినమీదట వారు పేడయెత్తుపని వినిపించుకొనరు గాని పాలుత్రాగిగంతులువేయుచున్నారు. అసలు జరుగవలసినదేమన మన విద్యావిధానము ప్రకారము విద్యా వంతులైన బాలురు ఆవుపేడయెత్తుటలో సంతోషమును ప్రకటింపవలెను. పాలుత్రాగుటలో - అవి యితరులకు లభించుటలేదు కావున - సంకోచింప వలెను. కావున విద్యార్థులతోపాటే ఉపాధ్యాయుడుకూడ యథాశక్తిగా శరీరపరిశ్రమకు సంబంధించినపనులలో పాల్గొనుచుండవలెను. పాఠశాల నడచుసమయములో చేసినపని పాఠశాలదే అనుకొనవలెను. కాని శిక్ష కులును వారి యింటివారునుకూడ అవకాశమున్న సమయములోను, సెలవులలోను ఇతరగ్రామీణ కార్మికులవలెనే సంతోషముతో శరీరశ్రమ చేయుచున్నారను ఉదాహరణము విద్యార్థులయెదుట ఎల్లపుడును ఉండు నట్లు చూడవలెను.

గ్రామమునందలి అపరిశుభ్రతను తొలగించుట మొదలగు సార్వ జనిక కార్యములు శిక్షకులు, విద్యార్థులుకలసి అవసరమైనపుడు చేయు చునే యుండవలయును. ఇంతేకాక పాఠశాలను ఊడ్చుట, పాఠశాలాంగ

ణమును శుభ్రపరచుట, దానిని పేడతో అలుకుట మొదలగుపనులుకూడ విద్యార్థులతోపాటు శిక్షకులును చేయవలెనను నియమముకూడ ఉండవలెను. తుచ్ఛమని తలపబడు ఏపనియు కేవలము విద్యార్థులకప్పగింపరాదు. ఉపాధ్యాయుడు దానిని స్వయముగాచేయుచు పిల్లలచే చేయింపవలెను. ఈవిధముగా చేయనిదే బాలురలో పరిశ్రమనిష్ఠ బయలుదేరదు.

జాతీయ పతాకముపై నుంచబడిన రాట్నము శరీర పరిశ్రమకు, అనగా అహింసకు గుర్తు. దీని వివరణము పాఠశాలలోని పారిశ్రామిక వాతావరణముద్వారా జరుగవలెను.

'మూలపరిశ్రమ వడుకుటనుండి'

## : 39 : ఎకరముల మానము

పాఠశాలలో విద్యార్థులకు గణితము నిమిత్తము మానములు నేర్పవలసియున్నది. చిన్నతనములో గురువుగారు బట్టీ, బెత్తము అను రెండు ఆయుధముల బలముతో ఈ మానములను మాకు నూరిపోసిరి. కాని వానిలో చాలభాగము శరీరములో ప్రవేశింపలేదు. దీనికొక కారణము కలదు. ఈ రెండు ఆయుధములును, ఇంకను కొన్ని మానములును తఱచుగా ఉపయోగ శూన్యములు. నిజమునకీ మానములు జీవితమున కుపయోగించునవగునెడల జీవింపగోరువారి కివి నచ్చియే తీరును, అవి నచ్చువిధముగానే వానిని బోధింపవలెను. ఈ విషయములో దిఙ్మాత్రముగా ఒక యుదాహరణ మిచ్చుచున్నాను.

### "ఎకరము" అను శబ్దమునకు వ్యాఖ్య

జీవితమునకు ప్రధానమైన ఆధారము పొలము. అది ఎకరములచే కొలవబడుచున్నది కావున పిల్లలకు ఎకరముల మానము నేర్పుట ఆవశ్యకము. అది ఎట్లు నేర్పవలెనో ఆలోచింతము. దీనికి ముందు ఈ "ఎకరము" అను శబ్దము ఇంగ్లీషు భాషలోనిదని చెప్పవలసి యున్నది. ఇప్పుడది మన దేశములో ప్రచారములో నున్నదికనుక దానికి దేశీయ మైన అర్థము "ఎకర మనగా భూమిని కొల్చు ఒక సంఖ్య". హిందూ దేశములో సగటున ప్రతి మనిషికి ఒక ఎకరము భూమివచ్చును. కావున నేటి స్థితినిబట్టి హిందూదేశమందలి ఒక మనిషికి హక్కుగల భూమి ఒక "యెకరము". ఈ విధముగా ఇంకొక యుక్తిచే "ఏక" శబ్దముచే "ఎకరము" శబ్దమునకు వ్యాఖ్య చేయవలెను. దీనివలన ఆ శబ్దము పిల్లలకు తేలికగా నర్థమగును.

## 11×11 అడుగుల 360 ముక్కలు=1 ఎకరము

ఎకర మనగా 4840 చతురపు గజములని చెప్పుదురు. ఈ విల క్షణమైన సంఖ్య జ్ఞాపకముండుట యెట్లు? అందు నిమిత్తము దానిని రెండు పెద్ద సంఖ్యలుగా విభజింపవలెను. అవి 121×40 ఈ 121 చతురపు గజములకు 'కత్తా' అను పేరుపెట్టి 40 "కత్తాలు" ఒక యెక రము అని మానమేర్పరచబడినది. కాని మనము గజములకు బదులు అడుగులలెక్క స్వీకరించి ఈ కత్తాలకుకూడ ఉపవిభాగములు ఏర్పాటు చేయుదము. కత్తా అనగా 121 చతురపుగజములనేల అనగా 11 గజ ములు × 11 గజములు గల ఒక నలుచదరపు భూఖండము. దీనిని 11 అడుగులు పొడుగు 11 అడుగులు వెడల్పు గల 9 ముక్కలు చేయ వచ్చును. ఈ 121 చతురపు అడుగుల ముక్కలు కత్తాలో 9; ఎకరములో 360 ఉండును.

## 11 అడుగులు×11 అడుగులు=1 గంట

స్థూలముగా సంవత్సరమునకు 360 రోజులు. మనము రోజుకు 121 చతురపుఅడుగుల నేల త్రవ్వుటకు నిశ్చయించుకొనినచో ఒక సంవ త్సరములో ఒక యెకరమునేల త్రవ్వబడును. వర్షాకాలములో భూమిని త్రవ్వుటకు వీలుండదు అను సంగతిని మనము మరచిపోవుదుము. ఈమాత్రపుభూమిని ప్రతిరోజు త్రవ్వునెడల రోజుకెంతకాలముపట్టును? మనుష్యునిసామర్థ్యము, నేలతరహా, ఋతుమానము, పనిముట్లయోగ్యత. అను వానినిబట్టి ఈప్రశ్నకు వేరువేరు సమాధానములురావచ్చును. అయి నను అనుభవమునుబట్టి ఈపనికి 40 నుండి 80 నిమిషములవరకు పట్టును. స్థూలముగా ఒకగంట పట్టునని చెప్పవచ్చును. ఒకగంటలో ఈనేల త్రవ్వవచ్చునుగావున లక్షణావృత్తిప్రకారము అంతనేలను ఒక "గంట" అని పిలుచుదము. 'గంట' అనగా 11 అడుగులు×11 అడు గులు నేల. ఇది జ్ఞాపకముంచుకొనుట కష్టముకాదు. "ఒకటిప్రక్కన

ఒకటి వ్రాసిన 11." అనుసూత్రము పిల్లలకు తెలిసినదే. 11 అడుగుల పొడుగుగల కట్ట తయారుచేసి దానితో నలుచదరముగా నేలనుకొలిచి గీట్లుపెట్టి మనమనుకొన్న ఈ గంటభూమిని పిల్లలకు ప్రత్యక్షముగా చూపగలము. ఇక ఇట్టిగంటలు 360 కలసిన ఒక యెకరము, అను సరళమైనమానము తయారగును. (ఇచట గంట అనుదానికి అర్థము 11 అడుగులు × 11 అడుగులు గల నలుచదరపునేల అని కాక 121 చదరపుటడుగులనేల అన్న చాలును - అనువిషయము పిల్లలకు తెలియ జెప్పవలెను. 121 చదరపుటడుగులనేల అనేకవిధములుగా నుండవచ్చును. జ్ఞాపకముంచుకొనుటకు వీలుగా 11 అడుగులు × 11 అడుగులని చెప్పితిమి) వ్యవసాయమునకై పిల్లలకు భూమిపంచవలసినచో దానిని ఈ గంటల మానముతోనే పంచుదుము. ఒకరికి "ఒకగంట భూమియిచ్చిన" యింకొ కనికి "రెండుగంటలభూమి" యిచ్చెదము. దీనివలన బాలురు తాము పండించిన పంటనుబట్టి ఎకరమునకు పండుపంటను తేలికగా లెక్క కట్టగలరు.

## 1 ఫర్లాంగు × 1 ఫర్లాంగు = 10 ఎకరములు = ఆగర్

ఇంతవరకు ఎకరములోపు మానమును చూచితిమి. ఇక దానిపైది చూడవలెను. ఒకఫర్లాంగు నలుచదరముగల నేల 48,400 చతురపు గజము లుండును, అనగా 10 ఎకరములు. సాధారణముగా ఒక కమతము వ్యవసాయపు భూమి 10 ఎకరములుగా ఎంచబడుచున్నది. మధ్య ప్రదేశ ప్రభుత్వము 10 ఎకరములకంటె తక్కువభూమిగల రైతులకు రూపాయకు 2 అణాలు ముదరా ఇచ్చినసంగతి ఉపాధ్యాయులు బాలురకు చెప్పియేయున్నారు. ఇందు మూలముగా వారు సాధారణముగా వ్యవసాయపు భూమి 10 ఎకరము లుండునని పిల్లల మనసులో నాటుకొనునట్లు చేయవలెను. హిందూదేశములో మనిషి ఒక్కంటికి ఒక యెకరము వ్యవసాయపు భూమి వచ్చునని ఇంతకుముందే చెప్పబడినది.

5 గురు వ్యక్తులుగల కుటుంబమునకు 5 ఎకరములు పడెను. నేడు హిందూదేశములో నూటికి 75 మంది వ్యవసాయము చేయువారు. 40 సంవత్సరములక్రిందట 100 కి 70 మంది ఉండువారు. దేశములో చేతిపనులు నశించుటచే 40 సంవత్సరములలోను ఎక్కువమంది భారము వ్యవసాయముమీద పడి వ్యవసాయదారులసంఖ్య 100 కి 70 నుండి 75 వఱకు పెరిగినది. 100 కి 50 మంది వ్యవసాయముమీద ఆధారపడువా రున్నయెడల అది సరియైన స్థితి యని యెంచబడును. నేడు అట్టిస్థితి యున్నచో సగటున 10 ఎకరముల భూమి పడును. ఒక కాడియెద్లకు 20 ఎకరముల వ్యవసాయభూమి సరిపోవును. కాని కొంత వ్యవసాయభూమి, కొంత తోటభూమి గ్రహించినచో 10 యెకరముల భూమి ఒక కాడియెద్లకు తక్కువకాదు. మొత్తముమీద ఏవిధముగ జూచినను 10 ఎకరముల భూమి సర్వసాధారణ "కమతము"గా నిశ్చయింపబడుచున్నది. దీనిని మనము "ఆగర్" అందము. పిల్లలకు 10 ఎకరము లొక "ఆగర్" అని చెప్పుదము.

## 640 ఎకరములు = ఒక చదరపు మైలు

ఈ "ఆగర్" సరిగా నలుచదరముగా నున్నచో ఒక ఫర్లాంగు పొడుగు, ఒక ఫర్లాంగు వెడల్పు ఉండును. ఫర్లాంగు అను పదమునకు అసలర్థముకూడ అదియే, ఒక చదరపుమైలులో ఇట్టి ఆగర్లు ఎన్ని పట్టును? ఒకరూపాయికి ఎన్నిడబ్బులో అన్ని. అనగా 64. 10 ఎకరములు=ఒక ఆగర్. 64 ఆగర్లు=ఒక చదరపుమైలు. కావున 640 ఎకరములు=ఒక చదరపు మైలు. 640 అనుసంఖ్య నూలువడకు పిల్లలకు బాగుగా అలవాటైన సంఖ్య గనుక వారికీ మానము భారముగా కన్పింపదు. ఎకర మనగా గంటకు 360 రెట్లు. చదరపుమైలులో 640 వ వంతు.— ఇట్లు రెండు విధములుగా ఎకరమునుగూర్చిబోధింపవచ్చును.

ఒక చిలపలో 640 పోగు లుండుననియు, ఒక చదరపుమైలులో కూడ 640 ఎకరము లుండుననియు ఇచ్చట చెప్పుట అనవసరమయ్యెను ఆవశ్యకమయ్యెను. ఈ ఉపమానముద్వారా పిల్లలకు మనము బోధించుట మూల పరిశ్రమద్వారా సమవాయమును సాధించుట కాదు. మూల పరిశ్రమలో నుండియే ఎకరముల మానము అవసరమగుట సమవాయము. ఉపమానముద్వారా జ్ఞానమును బోధించుట విద్యాబోధనలో ఒక కళ. ఆ కళకు సమవాయముతో విరోధము లేకపోయినను, ఆ కళయే సమవాయ మని చెప్పరాదు.

## ఎకరముల మానములోని హెచ్చుతగ్గులు

121 చతురపు అడుగులు = 1 గంట
9 గంటలు = 1 కుంట
40 కుంటలు = 1 ఎకరము
360 గంటలు = 1 ఎకరము
10 ఎకరములు = 1 ఆగర్
64 ఆగర్లు = 1 చదరపుమైలు
640 ఎకరములు = 1 చదరపు మైలు

"గ్రామసేవావృత్త" సెప్టెంబరు, 1940

## : 40 : విషయమెట్లు బోధింపవలెను?

(ఒక స్వీయచర్చనుండి)

### హాస్యాస్పదమైన సమవాయము

నేనిప్పటికి రెండు మూడు సార్లు ఈ విద్యాలయమునందలి వేరు వేరు తరగతులను పరిశీలించివచ్చితిని. ఈతరగతులలో పరిశ్రమద్వారా విద్యబోధించుటకుచేయు ప్రయత్నము నాకుసంతృప్తిని కలిగించలేదు. ఇందు ఉపాధ్యాయుల దోషమంతగాలేదు. ఏలన ఈ ప్రయోగమంతయు అపూర్వమైనది.

ఒకతరగతిలో ఒక ఉపాధ్యాయుడు ఏదో ఒక కథనుచెప్పుచుండెను. అది ఐనపిమ్మట దానికి తకిలీతో సంబంధముకలపబడెను. తరువాత తకిలీపాట ప్రారంభమయ్యెను. దీనిలో నాకు కృతకత్వము గోచరించెను. తకిలీపాటలుపాడుట తకిలీద్వారా విద్య బోధించుటకాజాలదు. ఈవిధముగనే తకిలీద్వారా గణితమును బోధించుటకర్థము పిల్లలకు 10-15 ఏకులిచ్చి వానిని తగ్గించుట హెచ్చించుటద్వారా కూడికలు, తీసివేతలు నేర్పుటకాదు. ఇందువలన ఏకులు పాడగును. వానికిబదులు గులకరాళ్ళు ఇచ్చికూడ కూడికలు తీసివేతలు నేర్పవచ్చును. అసలు పరిశ్రమలో అవసరము గ్రహించి లెక్కలు నేర్పవలెను. ప్రతిపరిశ్రమయు లెక్కలతోనే నిండియున్నది.

### జ్ఞానము ప్రసంగానుసారముగా నుండవలెను

ఇచట చిన్నపిల్లల తరగతియొకటి నడచుచున్నది. మొత్తముమీద అది సరిగానే నడచుచున్నది. కాని దానివలన నాకు పూర్తిసంతోషము కలుగలేదు. ఉపాధ్యాయుడు పరిశ్రమద్వారా ఏమేమినేర్పెనో ఆవిషయ

ముల పట్టిక వ్రాయుచుండును. కాని ఇంతమాత్రముచే పనిజరుగదు. ఏవిషయమును, ఏప్రసంగమునను సరించి, లేదా ఏ అవసరమునుబట్టి నేర్పెనో అదికూడ వ్రాసియుంచవలెను. సాంఘికశాస్త్రములో ఫలానా ఫలానావిషయములు చెప్పబడెను అన్నంతమాత్రమున చాలదు. ఆవిషయములు ఏ అవసరమును పురస్కరించుకొని చెప్పబడెనో అదికూడ వివరముగా వ్రాసియుంచవలెను. ఏ విషయమును దానిప్రసంగమురానిదే తెల్పరాదు. ప్రసంగానుసారముగానే జ్ఞానబోధ జరుగవలయునను విషయము ఎప్పుడును మనసునందుంచుకొనవలెను.

## సమవాయమున కుదాహరణములు

సాంఘికశాస్త్ర విషయమున అన్నిసంగతులను పరిశ్రమద్వారానే బోధింపవలయునని యొక అభిప్రాయము స్థిరపడినట్లు కన్పించుచున్నది. కాని ఆ అభిప్రాయము సరిగాదు. తాళపుచెవితో తాళముతెరిచినట్లుగా పరిశ్రమద్వారా జీవితద్వారము తెరవవలసియున్నది.

వర్షముకురియు రోజనుకొనుడు. అపుడు తరగతిలోని పిల్లలను మీరీరోజున శౌచము, దంతధావనము చేసికొనివచ్చితిరాయని అడుగవలెను. ఈప్రశ్న నేడే ఎందుకు ? అనిన వర్షమువలన పిల్లలు బహిర్దేశమునకువెళ్ళుటకు బద్ధకింతురు.

పిల్లలకు కిటికీలను గుమ్మములనుగూర్చి బోధింపవలెనన్న నేను వారిని కిటికీల ఉపయోగమేమి ? అని అడుగుదును. వానివలన వెలుతురు, గాలి లోపలకు వచ్చును అని పిల్లలు చెప్పుదురు. తిరిగి పై కప్పులో కిటికీలు పెట్టుటవలన గాలి వెల్తురు వచ్చునుగదా, అంతమాత్రముచే పని జరుగునా అని అడుగుదును. జరుగదు ; బయట ప్రపంచము కూడ కన్పించవలెను ; అని వారు చెప్పుదురు. తిరిగి అటువంటి కిటికీలు పెట్టితి మనుకొనుడు. కాని వానిద్వారా బయటకు లోపలకు రాకపోకలకు అవకాశ ముండనిచో పని జరుగునా ? అని ప్రశ్నింతును,

జరుగదు, బయటకి లోపలికి రాకపోకలకు ఏర్పాటుండవలెను ; ఇందుకు గుమ్మములు కావలెను ; అని వారు చెప్పుదురు. ఈ విధముగా కిటికీల యొక్కయు ద్వారములయొక్కయు ఉపయోగము వారికి గోచరించిన వెంటనే ఇక మన శరీరములో ఇటువంటి కిటికీలు, గుమ్మములు ఏమేమి యున్నవో చెప్పుడు అని వారి నడుగుదును. కన్ను, చెవి, నోరు, ముక్కు మొదలైనవానికి సంస్కృతములో "ద్వారము"లని పేరు. గీతలో "సర్వద్వారాణి సంయమ్య"– అన్ని ద్వారములను కట్టుదిట్టము చేసి- అనగా అన్ని కిటికీల, గుమ్మములదగ్గర కాపలా ఉంచవలెననియు "నవ ద్వారే పురే దేహీ" తొమ్మిది ద్వారములుగల పట్టణములో ఈ ఆత్మ నివసించుచున్నదనియు చెప్పబడినది. మానవునికి కంటినిబట్టియే కిటికీ నిర్మాణము స్ఫురించియుండును. కాని మనుష్యుని కన్నులు చాల చిన్నవి. ఆవు కన్నులు పెద్దవి. కనుకనే మానవుడు ఆవుకన్నుల వలె కిటికీలు నిర్మించుట మొదలుపెట్టెను. సంస్కృతములో కిటికీని "గవాక్షము" అందురు. గవాక్ష మనగా ఆవు కన్ను. ఆ విధమైన కిటికీ వ్రాసి చూపుమని పిల్లల నడుగుదును. అటువంటి కన్ను వ్రాయనచో అది చిత్రలేఖన మయినది. పిమ్మట జనులు దానిలో ఏవిధముగ మార్పులు చేసిరో చెప్పుదును. అది చరిత్రమైనది. ఇక ఇట్టి కిటికీలు నే డెక్కడయినా కలవా ? ఈ సంగతి తెల్పుటకు వారిని నేను "లేప్‌లేండ్"వైపు తీసికొనివెళ్ళి ఆ సందర్భములో అచటి వారి జీవితవిధానము మొదలైనవి బోధింతును. సారాంశ మేమనగా ఇటువంటి ప్రసంగముల మూలము ననే దూరదేశస్థుల జీవిత విధానమును బోధింపవలెను.

మనదేశమువలెనే ప్రాచీనమైనది, ఎక్కువ జనసంఖ్య కలది చాలకాలమునుండి వ్యవసాయమే ప్రధానవృత్తిగాగల దేశము చీనా. కాని చీనా ఇంతసారవంతముగా ఎందుకున్నది ? భూమి సారము రక్షించుటకు ఏమి చేయవలెను ? అను విషయములను చెప్పుచు పిల్లలకుఎరువును గూర్చి బోధింతును. "స్వర్ణ ఎరువు" నుపయోగించు విధము

చీనావారినుండి ముఖ్యముగా నేర్చుకొనవలసి యున్నది. చీనాలో ఈ యెరువు బాగుగా వాడుదురు. దానివలన అచ్చటి భూమి ఎంతోకాలము నుండి దున్నబడుచున్నప్పటికిని సారవంతముగనే యున్నది- అను సంగతిని వారికి తెలియజెప్పుదును.

ఒక అమెరికా దేశస్థుడు "నాలుగువేల సంవత్సరముల రైతులు" అను పేరుతో ఒక పుస్తకము వ్రాసెను. అం దాత డిట్లు చెప్పెను. "మన అమెరికా దేశస్థులము అనవసర వ్యయము చేయుదుము. మనలో ప్రతి యొక్కకనికి 15, 20 యెకరముల భూమి కలదు. మనభూమి 400 సం॥ల నుండి మాత్రమే దున్నబడుచున్నది, అయినను పంట బాగుగా పండ వలెనని మనము రకరకములైన రసాయనిక యెరువులను వేసి భూమిని పాడుచేయుచున్నాము. 'స్వర్ణ-ఎరువు' వంటి శ్రేష్ఠమైన యెరువును మనము వ్యర్థముగా పాడుచేయుచున్నాము." ఈ పుస్తకము ఉపాధ్యాయులు తప్పక చదువవలెను. బాగుగా వర్షము వచ్చినరోజున పిల్లలకు సెలవు నిచ్చివేయవలెను. ఆ వర్షములో పిల్లలు ఎగురుచు, గంతులు వేయుచు ఆనందింతురు. వారితోపాటు ఉపాధ్యాయులుకూడ దుస్తులు తీసివేసి లంగోటీ కట్టుకొని వారిచే ఆటలాడించుచు, పరమాత్మునిదయయే ఈ వర్షమని వారికి తెలియజేయవలెను. మనదేశములో వర్షము కురిసిన నాడు సెలవుండును. కాని ఇంగ్లండులో ఎండకాసిననా డుండును. ఇది యేల ? ఎందుకనగా అక్కడ ఎప్పుడును 'దుర్దినమే'. అనగా ఆకాశము మబ్బుపట్టియే ఉండును. కనుకనే సూర్యుడు కనిపించినపుడు సెల వీయ బడును. ఆనాడు పిల్లలు సంతోషముతో ఆడుచు గంతులు వేయుదురు. ఈ విధముగా నేను పిల్లలకు ఇంగ్లండులోని శీతోష్ణ పరిస్థితినిగూర్చి బోధింతును.

## చరిత్ర, భూగోళము ఒకటే

సాంఘికశాస్త్రములో చరిత్ర, భూగోళము, సివిక్సు (నాగరిక శాస్త్రము) మొదలయినవి నేర్పుదురు. భూగోళము, చరిత్ర బోధించుట

అనగా పిల్లలకు దేశకాల జ్ఞానమును కలుగజేయుట అని అర్థము. దేశ కాలములు రెండును ఒకటే యని చెప్పవచ్చును. అన్నిభాషలయందును కాలవాచక శబ్దములు స్థలవాచకములుగాకూడ వాడబడుచున్నవి. "ఈ ప్రశ్నకు సమాధానము మీకు ముందు చెప్పెదను" అను వాక్యములో 'ముందు' శబ్దము కాలవాచకము. కాని "వాడు వానికి ముందు నడచు చుండెను" అను వాక్యములోని ముందు శబ్దము స్థలవాచకము.

చరిత్ర, భూగోళము నేర్పవలెననుటకు అర్థము ప్రాచీనకాల మందలి జనులయొక్కయు, దూరదేశస్థులైన వారియొక్కయు సంగతులు తెలుపుట. ఈ తెలియజెప్పుట మనసమీపముననే ఉండి పురాతనమైన వారినిగురించినచో 'చరిత్ర' అగును. ఇప్పటివారే అయిఉండి దూరదేశ ములందున్నవారిని గురించినచో 'భూగోళ'మగును.

## సాధర్మ్య వైధర్మ్య జ్ఞానము

చిన్నపిల్లలకు దూరదేశస్థులను గురించియు, పురాతనకాలపు జనులనుగూర్చియు బోధింపవలెనని ఒకపక్షమువారును, ఆధునికకాలము నుండియే ప్రారంభించి పిల్లలను క్రమముగా పురాతనకాలమువైపు తీసి కొని వెళ్ళవలెనని యింకొకపక్షమువారును చెప్పుచున్నారు.

పైనచెప్పిన రెండుమతములును పరస్పర విరుద్ధములుగా కన్పించు చున్నను నిజమున కవి అట్టివి కావు. ఒకరు అతిప్రాచీన విషయములను చెప్పుమనగా ఇంకొకరు అతిఅర్వాచీన విషయములను చెప్పుమను చున్నారు. కాని మధ్యకాలపు విషయములనుగురించి చెప్పుమని ఎవరును అనుటలేదు. అట్లనక పోవుట మంచిదే. జ్ఞానసంపాదనకు ఒకదానితో ఇంకొకదానినిపోల్చుట ఆవశ్యకము. అట్లుపోల్చుటకు మిక్కిలి సమీప మందున్న వస్తువైనను మంచిదే, లేదా, మిక్కిలి దూరవస్తువైనను మంచిదే. దూరస్థము, సమీపస్థము - ఈ రెంటిని తెలిసికొనుటయే "సాధర్మ్య వైధర్మ్య" జ్ఞానమనబడును. గాంధీగారి అహింసను సమాజ

వాదముతో (కమ్యూనిజముతో) పోల్చిచూచినట్లే ఇంకొక వైపున సామ్రాజ్యవాదముతోకూడ పోల్చిచూడవచ్చును.

కాని ఈ సాధర్మ్య వైధర్మ్య జ్ఞానము దానిప్రసంగము వచ్చినప్పుడే తప్ప చెప్పకూడదు. ఉపాధ్యాయుడు పాఠముచెప్పుటకు లేచి "లేప్‌లేండ్"ను గురించి బోధించుట ప్రారంభించినచో అది నిష్ప్రయోజనము. ఏదైన ప్రసంగమును తెచ్చి దాని ఆధారముపైనే ఏ జ్ఞానమైనను బోధింపవలయును. అట్టి ప్రసంగములు తెచ్చుట ఏమంత కష్టమైనపనికాదు.

: 41 :

# బాల కవిత

*(ఒక ఉత్తరమునుండి)*

బాలురకు బోధించుపద్యములకు ప్రతిపదార్థము అక్షరశః వారికి రావలెనని అపేక్షించుట సరికాదు. వానిభావార్థము వారికి అవగతమైన చాలును.

చిన్నపిల్లలకు బాలగేయములునేర్పు అలవాటుకలదు. కాని నాఅనుభవ మేమన. వారు ఆధ్యాత్మికవిద్య, సామ్యయోగము, భక్తిమార్గము మొదలగు రచనలను చక్కగా గ్రహింపగలరు. జ్ఞానేశ్వరి, జ్ఞానదేవుని అభంగములు, ఏకనాథుడు, నామదేవుడు, తుకారాం రచించినవానిలో ముఖ్యమగు అభంగములు, సమర్థ రామదాసు రచించిన మానసోపదేశ శ్లోకములు, దాసబోధయందలి ఉపదేశపాఠము, గీతమాయీ, వామన పండితుని నీతిశతకము*, మొదలైన అమూల్యసాహిత్యము బాలకులచే కంఠస్థముచేయింపవలెను.

బాలకులకు స్మరణశక్తి బాగుగనుండును. ఈ యవకాశమును తీసికొని ఉపయోగకరమైన ధర్మామృతము వారిచే త్రాగించవలెను. రస్కినుకు అయిదారు సంవత్సరముల వయస్సునందే బైబిలు కంఠస్థ మయ్యెను. నేను నా అనుభవమును ఇదివరకే చెప్పితిని.

---

* ఈ గ్రంథములన్నియు మహారాష్ట్రీ వాఙ్మయములోనివి.

## : 42 : లోతైన చదువునకు సూత్రములు

### చదువునకు ముఖ్య సూత్రము : ఏకాగ్రత :

చదువులో వైశాల్యమునకు విలువలేదు. లోతుకే విలువ. చాల సేపు గంటలకొలది రకరకములైన విషయములను చదువుచుండుట విశాలమైన చదువనియు, ఏకాగ్రత కలవాడై నిత్యము కొంచెముసేపు ఏదైన నొక నిశ్చితవిషయమును మానకుండ చదువుట లోతైన చదువనియు, నా అభిప్రాయము. పది, పండ్రెండు గంటలు నిద్రపోయినను ఇటునటు దొర్లుచు, కలలుగనుచు పొందిన నిద్రవలన విశ్రాంతి లభించదు. కాని ఐదారు గంటలే నిద్రపోయినను అది గాఢనిద్ర యైనచో దానివలన పూర్ణవిశ్రాంతి లభించును. చదువుసంగతికూడ ఇంతే. "ఏకాగ్రత" చదువునందలి ముఖ్య తత్త్వము.

### బుద్ధియందు నవనవోన్మేషము

ఏకాగ్రతతో కూడిన లోతైన చదువు లేనిదే జ్ఞానము రాదు. వైశాల్యముగల చదువు చాలవరకు వ్యర్థమే. అందు శక్తికూడ వృథాగా వ్యయమగును. అనేక విషయములను కట్టకట్టి చదువుటలో ఏమియు ప్రయోజనము లేదు. చదువువలన స్వతంత్ర ప్రజ్ఞ, ప్రతిభావంతమగు బుద్ధి కలుగవలెను. ప్రతిభ అనగా నవనవోన్మేషమగు బుద్ధి. నూతన కల్పన, నూతనోత్సాహము, నూతనాన్వేషణ, నూతన స్ఫూర్తి ఇవి యన్నియు ప్రతిభా లక్షణములు. విశాలమగు చదువుక్రింద ఈ ప్రతిభ అణగి నశించును.

## కర్మయోగమునకు స్థానము

ప్రస్తుత జీవితములో అవశ్యకమైన కర్మయోగమునకు స్థానమిచ్చియే చదువంతయు సాగించవలెను. లేనిచో భావిజీవితమందలి ఆశచే వర్తమాన జీవితము మృతప్రాయమగును. ఈశరీరముయొక్క యునికినిగూర్చి మన కెంతనమ్మకము కలదో అది ప్రతివ్యక్తికిని అనుభవ సిద్ధమే. మనలో ఏదో ఒక లోటు భగవంతుడు పెట్టియేయున్నాడు. ఇది ఆయనకు మనయందు గల దయయే యని చెప్పవలెను. ఆలోటు తెలిసికొని మనము జాగ్రత్తలో ఉండవలెననియే ఆయన యుద్దేశము.

## జీవితమునకు రెండు బిందువులు

రెండు బిందువులచే రేఖ నిశ్చితమగును. జీవిత మార్గముకూడ రెండుబిందువులతోనే నిశ్చితమగును. మన మెక్కడ నున్నాము ? అనునది మొదటి బిందువు. మన మెక్కడికి పోవలెను ? అనునది రెండవ బిందువు. ఈరెండు బిందువులను నిశ్చయించుకొనుటయే జీవితమార్గమును నిశ్చయించుకొనుట. దీనిపై లక్ష్యము పెట్టక ఇటునటు తిరుగుటచే మార్గము నిశ్చితము కాదు.

సారాంశ మేమనగా లోతైన చదువునకు సూత్రము కొద్దిపాటిది, ఎడతెగనిది, ఏకాగ్రత కర్మావకాశము, నిశ్చితమార్గము కలది.

'జీవనదృష్టి' నుండి

'డ్రాయింగు అనగా చిత్రలేఖనము' ప్రాతిపదిక విద్యా విధానములో ఒక విషయము. దీనికందు విశేష స్థానముకూడ నీయబడినది. పేలవ పరిశ్రమతో దీనికి దగ్గర సంబంధముకలదు. కాని ఈ చిత్రలేఖనమునకు కావలసిన సాధనముల జాబితా చూచి నేను హడలిపోయితిని. రంగుడబ్బాలు, కుంచె, డ్రాయింగు పేపరు, మొదలయిన క్షయరోగుల సామాను ప్రతి విద్యార్థికి కావలెనన్న ఎవరుకొందురు? విద్యార్థులు కొనవలెనన్న గ్రామీణులగు బీదబాలుర కది సాధ్యము కాదు; ప్రభుత్వము కొనవలెనన్న ప్రణాళిక వ్యయము పెరుగును. ఇక చేయవలసిన దేమి?

చివరకు ఇట్టి సామాను నెవరును కొననక్కరలేదు. ప్రభుత్వము కొనరాదు, విద్యార్థులును కొనరాదని నేను స్పష్టముగా చెప్పవలసి వచ్చెను. అట్లయిన చిత్రలేఖన పాఠ్యక్రమ ప్రణాళిక ఎట్లు పూర్తి కాగలదు? అని ప్రశ్న.

## కర్మయోగముతో కూడిన చిత్రలేఖనము

ఈ విషయము బాగుగా తెలిసికొనవలెను. చిత్రకళ రెండు విధములు. ఒకటి అందమునకు చెందినది. రెండవది పరిశ్రమకు సంబంధించినది. లేదా ఇంకను ఆలంకారిక భాషలో చెప్పవలెనన్న ఒకటి భక్తియోగమునకు చెందినది. రెండవది కర్మయోగమునకు చెందినది. పాఠ్యక్రమములో రెండును కలిసియున్నవి. కాని అందుకూడ నాదృష్టిలో తారతమ్యము కలదు. జీవితమునందును, శిక్షణయందును కర్మయోగము ప్రధానమని మఱవరాదు. భక్తి ఆ కర్మమునకు శోభ; జ్ఞానము దాని

ప్రభ. సాధారణముగా మూలపరిశ్రమలోని ఉద్దేశ మిదియే. చిత్రలేఖన మునకుకూడ అది అన్వయించును.

నూలు వడకుట, నేత, వద్రము మొదలైన అన్ని పరిశ్రమలు, వ్రాయుట మొదలయిన కళలు, వీనికి సహాయపడు చిత్రలేఖనము ముఖ్యముగ కర్మయోగ చిత్రలేఖన మగును. దీనిలో రకరకములైన చిత్రములు తయారుచేయుట, ఒక చిత్రమునుబట్టి కొన్ని రెట్ల ఆకారముగల చిత్రమును తయారుచేయుట, ఏదైన క్రొత్త నమూనా చూచినపుడు దానిని చూచుచుగాని. చూచిన జ్ఞప్తినిబట్టిగాని, చిత్రీకరించుట. లేదా దానికి సంబంధించి ఏదైన నవీన కల్పన స్ఫురించినచో దానిని చిత్రమునవ్రాసి చూపుట మొదలైన లిఖితములు, రేఖాకితములు, దృష్టములు, స్మృతములు కల్పితములునైన అన్ని చిత్రలేఖనములను అంతర్భవించును.

## పలక, బలపము ప్రధాన సాధనములు

ఈ కర్మయోగ చిత్రలేఖమునకు విశేష సాధనము లక్కఱలేదు. చాలమట్టుకు సామాన్యమైన పలక, బలపములతోనే పని జరుగును. కొన్నిటికి కాగితము కావలసినచో దానిని సాధ్యమైనంత తక్కువగ నుపయోగించవచ్చును. డ్రాయింగ్ పేపరు అనుదాని ఆవశ్యకత ఎంత మాత్రములేదు. రబ్బరు ఉపయోగించుటవంటి పాడుపని యింకొకటి లేదు. దానిని పూర్తిగ మానవలెను. మొదట పలకపై చేయి తిరిగిన పిమ్మటనే అత్యావశ్యకమైనప్పుడు కాగితమును గ్రహింపవలెను. రూళ్ళు కల కాగితము రేఖాచిత్రములకును, ఇతరమగు డ్రాయింగ్ పేపరు చిత్రకళకును కావలెను. వానినికూడ తిన్నగ బజారునుండి తయారయిన వానిని కొనక, విద్యార్థుల చేతనే రూళ్ళు వేయించవలెను. ఇదికూడ చిత్రలేఖనములో ఒకభాగముగ గ్రహింపవలెను. దీనివలన పరిశ్రమ, కళ, జ్ఞానము, అనందము, స్వావలంబనము ఒకేసారి సమకూరును. సాధనముల జంజాటములో పడనక్కఱలేదు.

## అందమునకు సంబంధించిన చిత్రలేఖనము

కర్మయోగ చిత్రలేఖనము ముఖ్యమనిపించినను అదే క్రమములో సౌందర్య చిత్రలేఖనముకూడ నావశ్యకమే. కర్మయోగమునకు శోభా కరముగాన నది యావశ్యకము. దీనికి రకరకములయిన సాధనములు కావలయునుగదా ! వీనికొఱ కేమిచేయవలెననుప్రశ్న మిగిలియేయున్నది. ఔను, ఆ ప్రశ్నకు సమాధానముగనే ఈ వ్యాసము వ్రాయబడినది. దానిని గురించియే ఇకముం దాలోచింతము. నడుమ కొంచెము తారతమ్యము పరిశీలింపబడినది.

## రంగపంచమి దృష్టాంతము

ఇతర గ్రామములందువలెనే మా పవనార్‌లోకూడ రంగపంచమి యుత్సవము జరుపబడినది. మా పరిశ్రమాలయ బాలురుకూడ ఊరి రివాజు ననుసరించి యందు పాల్గొనిరి. బజారునుండి రంగుకొని ఒకరి బట్టలొకరు పాడుచేసుకొనిరి. తరువాత సబ్బుతో—ఆసబ్బుకూడ బజారు నుండి కొన్నదే—ఆ బట్ట లుతుకుకొనవలసివచ్చెను. అయినను ఆరంగు పోనేలేదు. తక్కిన గ్రామస్థులకు బట్ట లుతుకుకొను గొడవయేలేదు. ఏలన పరిశ్రమాలయ బాలురకు కలిగిన పరిశుభ్రతాదృష్టి వారికి కలుగ లేదు. నేనాబాలురతో నిట్లు చెప్పితిని. "వసంతము లాడుకొనుటలో కాలము వ్యయించుటగూర్చి నేనేమియు అనను. కాని రంగునకు, సబ్బుకు సొమ్ము పాడుచేయనేల ? ఇంత చేసినను లభించినదేమి ? నిజ మైన ఆనందము లభింపనేలేదు. కేవలము "ఊరకే వచ్చిన గంధము అరగదీయవోయి అబ్బాయి !" అన్నట్టు అయ్యెను. దీనికి బదులు పని పూర్తియైన పిమ్మట సాయంకాలము నదియొద్దుననే రెండుమైళ్ళు నడచి వెళ్ళినచో మీకోసమే పూచినవా యన్నట్లు మోదుగచెట్లు కన్పించును. ఆ పూవులతో మీరు రంగు తయారుజేసుకొనవచ్చును. ఆ రంగు బజా రులో అమ్ము బుక్కా-రంగుకంటె ఎన్నోరెట్లు సౌమ్యము, ఆహ్లాదదాయ

కము. దానిని కడిగివేసికొనుటకుగూడ ఇంత బాధ యక్కరలేదు. ఇప్పుడు చెప్పుడు, నేను చెప్పిన పని ఎక్కువ ఆనందదాయకమా ! మీరు చేసిన పనియా ?" పిల్లలు ఏకకంఠముతో నా సూచనయే బాగున్నదనిరి.

## ఆనంద ప్రాప్తి - ఆనంద శుద్ధి

ఈ రంగ పంచమి కథలో సౌందర్య చిత్రణ ప్రశ్నకు సమాధానము లభించును. విద్యార్థులకు నలువైపుల ప్రకృతి నిల్చియున్నది. ఆ ప్రకృతిలో ఏకత్వమును జెంది దానిద్వారా ఆనందప్రాప్తిని, ఆనంద శుద్ధిని సాధించుటయే సౌందర్య చిత్ర లేఖనముయొక్క ఉద్దేశము. విద్యార్థులకు చుట్టును ఉండి, ఈ సౌందర్య చిత్రణమునకు కావలసిన విషయముల సమకూర్చు ఈ ప్రకృతి వారికి కావలసిన సాధనముల సమకూర్చజాలక పోయిన ఇక ఈశ్వరుని కళలోని విశేషమేమి ? పిల్లల కడుపులో ఆకలి వేయగనే తల్లియొద్ద చనుబాలు సిద్ధముగా నుంచునట్టి యాయన ప్రణాళిక మన కెందునకు గుర్తునకు రాదు ? చుట్టుప్రక్కలనున్న వృక్షములు మనకు చక్కని కుంచెలను, మంచి రంగులను సమకూర్చగలవు. దానితోపాటే చిత్రలేఖన విషయముకూడ వానియందు కావలసినంత యున్నది. ప్రకృతి కామధేనువు వంటిది. అది పాలను ఇచ్చును. అవి పాత్రను ఇచ్చును. కేవలము అడుగుటయే తరువాయి !

"ఆనందప్రాప్తి, ఆనందశుద్ధి" ఈ ఉద్దేశ్యద్వయము దృష్టియందుంచుకొనదగినది. ఆనందము ప్రతిప్రాణికిని లభించునదే. ఇంతయేల ? అది ఆత్మ స్వరూపమే ! ఇక ఆ ఆనందమును విశుద్ధ మొనర్చుటయే ప్రధాన విషయము.

## బాల్యమందలి దివ్య దీపావళి

నా బాల్యము కొంకణ దేశమున కొండలచే చుట్టబడిన ఒకగ్రామములో గడచెను. ఆ గ్రామములో మేము దీపావళినాడు దీపము లెట్లు

వెలిగించెడివారమో ఇంచుమించు ప్రతి దీపావళికి నాకు జ్ఞాపకము వచ్చు చుండును. దానికొఱకు అడవికి వెళ్ళి సహజముగా గుండ్రమైన కోరాంటీ పండ్లు ఏరి తెచ్చి వానిని మధ్యకుకోసి లోపలి గుంజు తీసిపారవేసిన చక్కని ప్రమిద తయారయ్యేదిది. కాని అది మారువాడీ చెంబువలె మట్టులేనిదిగా ఉండెడిది. మారువాడీ చెంబునకు మారువాడ దేశమందలి ఇసుకతో పీఠము తయారుచేయవలసియుండును. దానిమీద దీపములు వెలుగుచుండగ వానిలో కొంకణదేశమందలి శుద్ధ స్వదేశీ కొబ్బరినూనె నింపబడెడిది. కొంకణములో దూది దుర్లభమైనపుడు దేవపత్తి మాకు వత్తులకు పనికి వచ్చెడిది. ఈ విధముగ మాదీపములు తయారయ్యెడివి. పిమ్మట వానిని చతుష్కోణములుగను త్రికోణములుగను గుండ్రముగను అందమైన పంక్తులలో అమర్చెడువారము. అంతే మా దీపావళి! దీపావళి అనగా నాలుగు నెలల వర్షాకాలము పిమ్మట మబ్బులేని మొదటి అమావాస్య! తన దివ్యవైభవముతో సంపూర్ణముగా ప్రకటమైన రజనీదేవి! చంద్రుని సామ్రాజ్యమును నశింపజేసి పరస్పర సహకారముతో సౌందర్య నిర్మాణము నిమిత్తము అలంకృతమైన సూక్ష్మస్థూల స్వతంత్ర తారకలును వాని ఆకృతులును! మనము మన మనస్సును ఇట్టి దీపములతో అలంకరించినచో అమావాస్య స్వరాజ్యము ఇంకను మనోహరముగా నుండును. కాని ఈ ఊహ అపుడు తోచలేదు, కావున ఆలోటు అట్లే ఉండిపోయెను.

## ధూమావళితోకూడిన దీపావళి

ఇది 40 సంవత్సరములనాటి పురాతన గ్రామీణసంస్మరణము. ఇక ఇంకొక నవీన సుసంస్కృత గ్రామీణ దీపావళీ సంస్కరణము వినుడు. ఖాదీపని చూచుటకు నే నొకనాడు సావలీ వెళ్ళితిని. అది దీపావళి రోజు. సావలీ యందలి పిల్లలు తగరపురేకుతో తయారుచేసిన గొట్టములలో కిరసనాయిలు దీపములు పెట్టి వానిని వరుసగా అమర్చి

దీపావళి పండుగ చేసిరి. మిల్లుగొట్టమునుండి, లేదా సిగరెట్టు కాల్చువారి నోటినుండి వచ్చినవిధముగా వానినుండి ధూమరాశి బయలు వెడల సాగెను. పాప మా పిల్లలకు అదియే దీపావళి ఆనందమయ్యెను. ఇందు వారిదోష మేమున్నది ? ఇంగ్లీషు నాగరికతారసాయనము సామాన్యమా? "కాల్బరికాయలో నీకు దేవుని ప్రభావమైన పంపులో నీరు ఇంగ్లీషువారి ప్రభావము."

## నిజమైన సమన్వయము

అయితే శిక్షకు లిట్లు చెప్పుదురు : "ఆనందశుద్ధినిగూర్చిన మీ వివరణ బాగుగనే యున్నది. కాని మీరు చెప్పిన విధముగా కుంచెలు తయారుచేయుట, పుష్పములనుండి, ఆకులనుండి రంగులు తయారు చేయుట అనగా పని ఇంకను పెరుగుటగదా. ఇక ఇతర విషయజ్ఞానము ఎట్లు సాధ్యమగును ?" ఈ ఆక్షేపము సమవాయపద్ధతియొక్క సరియైన స్వరూపము తెలియకపోవుటచే కలిగినది. ఈ ప్రశ్న ఎట్లున్నదనగా ధాన్యము చాలినంత పండినచో ఆకలి ఏమగును ? అన్నట్లున్నది. ఇది సమాధానము ఇవ్వనక్కరలేనంత సరళప్రశ్న. అయినను ప్రత్యక్షముగ అట్టి పాఠశాలను నడిపి చూపవలసినంత కఠినప్రశ్నకూడ అయి ఉన్నది.

ఇచ్చట ప్రాతిపదిక విద్యాక్రమమందలి రెండు ఉద్దేశ్యములు— "ఉద్యోగసిద్ధ", "ఆనందశుద్ధి" చెప్పదలచుకొంటిని. కాని అవి సాధనములనుగూర్చి వివరించుటలో వచ్చివేసినవి.

"సింహావలోకము" నుండి

---

# : 44 : చిత్రకళ యందలి దృష్టి

## సంగీత చిత్రకళల ఉద్దేశ్యములు

కొన్ని దినములకుముందు బాలకోబా "సంగీత చిత్రకళల ఉద్దేశ్య మేమి?" అని నన్నడిగెను. నే నాతనికిట్లు జవాబిచ్చితిని. ఈ ప్రపంచములో భగవంతుని నామరూపము లను రెండు గుణములు మాత్రమే ప్రకటితములైనవి. తక్కిన ఈశ్వరుడు అవ్యక్తముగనే యున్నాడు. సంగీతము ద్వారా అతని నామసంకీర్తనము, చిత్రకళద్వారా అతని రూపచిత్రణము జరుగుట వాని ఉద్దేశ్యము.

## ప్రతిపనిలోను సౌందర్యము

మన విద్యావిధానములో మొదటి తరగతినుండియే చిత్రకళకు స్థానమీయబడినది. పరిశ్రమద్వారా విద్య నేర్పవలెనను మా విధానములో చిత్రకళ లేకుండా పనియే జరుగదుకాని చిత్రకళలోను, చిత్రకళా దృష్టిలోను భేదమున్నది. చిత్రకళా దృష్టిగల మనుష్యుడు వ్యావహారిక జీవనములో అర్థరహితముగా వ్యవహరింపడు. విద్యార్థులలో చిత్రకళను గూర్చి ఇట్టి దృష్టి ఏర్పడవలెను. చిత్రకళవలన పిల్లల ప్రేళ్ళకు నేర్పు కలుగుటయేకాదు. వారి నేత్రములు కూడ చిత్రకళలో ప్రావీణ్యముకలవి కావలెను. విద్యార్థులు శరీరము, నడుము వంగకుండా కూర్చున్నారా, లేదా? కవాతులో సమానాంతరముగా నిలుచున్నారా, లేదా? భోజన పంక్తిలో తిన్నగా కూర్చున్నారా, లేదా? ఈ విషయము లన్నిటిలోను చిత్రకళ కలదు.

## నిమ్మకాయ కోయుటలో నేర్పు

నిమ్మకాయ ఎట్లు కోయవలెను? అనునదికూడ చిత్రకళలోని విషయమే. నిమ్మకాయి సరిగా అడ్డముగా కోయవలెను. ఎందుకనగా దానివలన గింజలు, రసము తేలికగా తీయవచ్చును. ఇట్లే కమలా ఫలము లెట్లు తినవలెను? దాని తొక్కను సరిగా రెండు దొన్నెలవలెచేసి వానిలో, పండు తినినపెమ్మట మిగిలినపిప్పి పారవేయవచ్చును. బొప్పాయి పండు నిలువుగాకాక అడ్డముగా కోయవలెను. అట్లుకోసిన అదికూడ రెండు చొప్పలవలె తయారగును. అరటిపండు కూడ పూర్తిగా ఒలవక కొంచెము ఒలచుకొని తినవలెను. తొక్కంతయు తీసివేసిన యెడల చేతులు పాడగును. ఇట్టి యుదాహరణ లింకను ఈయవచ్చును. చక్కని వ్యవస్థ, సౌందర్య దృష్టి అనునవి చిత్రకళకు విషయములు.

## రంగులు - భావనాద్యోతకములు

ఇప్పుడు కొంతమంది నెత్తిమీద నల్లనిటోపీ ధరించి కన్పించు చున్నారు. కాని హిందూదేశపు ప్రజలు సహజముగనే నలుపు. వారి ముఖము నలుపు, జుట్టు నలుపు, టోపీకూడ నలుపే. అనగా మనుష్యుడు పూర్తిగా కాకివలె తయారగును. సౌందర్య ప్రకటనమునకు రకరకము లైన రంగుల మిశ్రణ మవసరము. వేరువేరు రంగులవలన వేరు వేరు భావములు ప్రకటింపబడుచుండును.

పరిశుభ్రమైన తెల్లని రంగు పవిత్రతను తెలియ జేయును. ఎఱ్ఱ గులాబిరంగు ప్రేమను సూచించును. గులాబిరంగుగల ఉష పరమేశ్వరుని ప్రేమయే. ప్రాతఃకాలమందలి ఉష ఉదయమున పిల్లలను మేల్కొలుపు తల్లియొక్క ప్రేమమయము, ఉద్బోధకము నైన స్వరూపము. ఉషో దర్శనము చేయకుండ ఏ కవిగాని చిత్రకారుడుగాని పనిచేయలేడు.

## ఆకాశ దర్శనము

ఇక ఆకాశ దర్శనము, ఆహా! చిత్రకళ దీనినెట్లు మరువగలదు! రాత్రి సమయమున ఆ గురు శుక్రు లెంత మెరయుచు కన్పింతురు! వారిని చూచి మనస్సులో ఎంత పవిత్రభావము ఉత్పన్నమగును! శుక్ర శబ్దము కూడ శుచిశబ్దము నుండి పుట్టినదే. ఈ నక్షత్రముల ముందు మనము ఊపిరి బిగపట్టి సముద్రములో మునిగి పైకితెచ్చుకొను ముత్యములు మొదలైనవికూడ తుచ్ఛములుగా కన్పించును. తులసీదాసు రామరాజ్యమును వర్ణించుచు రామరాజ్యములో సముద్రుడు స్వయముగనే ముత్యములను ఒడ్డుపైకి విసిరివేయుచుండెనని వ్రాసెను. కాని ఆయన ఇంకొక చౌపాయి వ్రాసియుండవలసినదని, అందు ఒడ్డున లంభించిన ముత్యములను బాలురు ఆడుకొనుటకు తీసికొనిపోయి వానిని తిరిగి ఆడుచు ఆడుచు సముద్రములోనికే విసిరివేయుచుండిరని వ్రాసిన బాగుండుననియు నా అభిప్రాయము. దీనివలన ముత్యములకు తగిన విలువ చూపించినట్లగును. నేడు చక్కని జాతిముత్యము ఉన్నచో దాని విలువను ధనముతో కట్టుచున్నాము. ధనముతో సౌందర్యమును తూచుట వట్టి అనాగరకమైనపని.

చిత్రకళలో ప్రకృతి దర్శన మనివార్యము. మనుస్మృతిలో ఉదయము నిద్రలేచిన వెంటనే ముఖము కన్నులు కడుగుకొనకుండ నక్షత్రములను చూడరాదని చెప్పబడినది. ఇంత పవిత్రమైన నక్షత్ర సౌందర్యము ఇట్టి అమంగళ నేత్రములతో చూచుట యెట్లు?

## ఆకాశము ననుకరించుట

రంగవల్లులు పెట్టుట అను ఆలోచనకూడ మనుష్యుడు నక్షత్రములనుండి గ్రహించెను. రంగవల్లులు పెట్టుటకు మొదట చుక్కలుపెట్టి పిమ్మట ఒకదానితో ఒకటి కలిపి ఇష్టమైన ఆకారము తయారుచేయవలె

నని నీమము. ఈ ఊహ ఆకాశమందలి నక్షత్రములనుండియే ఊహింప బడినదనుట స్పష్టము. మనము దానికి ఊహచేత ఆకార మిచ్చు చున్నాము. దీపావళి ఉద్దేశ్యము మాత్ర మేమి ? ఆకాశమందలి చిత్రకళను క్రింద భూమిపైకూడ అంకిత మొనర్చుటయే. దీపావళి అనగా ఆకాశము నిర్మలమైన పిమ్మట అమావాస్య. శారదపూర్ణిమ అనగా ఆకాశము నిర్మలమైన పిమ్మటి మొదటి పూర్ణిమ, ఈ రెండు ఉత్సవములును చేసి కొనుటలో ఉద్దేశ్యము ప్రజలదృష్టిని ఆకాశముపైపు ఆకర్షించుటయే. కనుక దీపావళినాడు దీపములు వెలిగించవలెనన్న నక్షత్రముల ఆకార ములో చిన్నవి, పెద్దవి, రకరకములైన కాంతులుగల దీపములు పెట్ట వలెను.

## వ్యావర్తకమైన చిత్రకళ

ఏ వస్తువునందైనను ఉన్న సామాన్య ధర్మములు, విశేష ధర్మ ములు చిత్రకళద్వారా ప్రకటితములు కావలెను. సామాన్య విశేషము లను వానియందే గౌణముఖ్య భేదముకూడ అంతర్భవించును. మనుష్యుని ముఖము చిత్రించినంతమాత్రమున ఆతడు గుర్తింపబడగలడు. ఏను గును సూచింపవలెనన్న కేవలము తొండము వ్రాసినను పని జరుగును. దీనినే శాస్త్రములో 'వ్యావర్తకవ్యాఖ్య' అందురు. వ్యావర్తకమనుమాట కర్థము 'ఇతర వస్తువులనుండి ఆ వస్తువును వేరుచేయునది. వారు వృషభమునకు 'విషాణకుకుభ్యాం'—కొమ్ములు మూపురము కలది-అని వ్యాఖ్య చేసిరి. మీరు ప్రపంచమంతయు వెదకి చూచినను కొమ్ములు, మూపురముగల జంతువు ఎద్దుతప్ప ఇంకొకటి కన్పింపదు.

## స్మృతియొక్క ఆధారముపై చిత్రకళ

ఇంకొక విషయము 'మెమరీ డ్రాయింగ్'. ఎక్కడైన ఒక వస్తువు చూచిన తరువాత దానిని సరిగా చిత్రించుట రావలెను. చూచిన

యంత్రములను, చూచిన రట్టడములను లేక లభించిన వస్తువును చిత్రించుట రావలెను.

సృష్టిలో అచ్చటచ్చట దృష్టికి భ్రమ కల్గుచుండును. అదికూడ చిత్రములో ఉన్నదున్నట్లు వ్రాసి చూపించవలెను. రైలుబద్దెల చిత్రము వ్రాయవలెనన్న కేవలము సమానాంతరమైన పొడుగైన తిన్ననిగీతలు రెండు గీసిన చాలదు. అవి మన కెట్లు కన్పించుచున్నవో అట్లే చిత్రింపవలెను. దూరము వెళ్ళినకొలది రెండును దగ్గరకువచ్చి కలుసుకొన్నట్లుగా చూపవలెను. ఇట్లే రెండు నక్షత్రముల మధ్య ఎడము అవి ఉదయించుచున్నపుడు ఎక్కువ అవి మన నెత్తిమీదకు వచ్చినపుడు తక్కువ కన్పించును. సూర్యుని విషయమునకూడ ఇంతే. సూర్యుడు ఉదయించునపుడు పెద్దగను, పిమ్మట చిన్నగను కన్పించును. అస్తమించు సమయమునకూడ పెద్దగ కన్పించును. ఇట్టి చమత్కారము లన్నియు సృష్టిలో కన్పించుచుండును. ఇవన్నియు చిత్రములో ప్రకటింపబడవలెను.

## సాంకేతిక చిత్రకళ

విద్యార్థులకు సాంకేతిక చిత్రకళ కూడ రావలెను. మన మొక తోటలోనికి వెళ్ళితిమనుకొనుడు. అచటి చెట్లన్నియు ఒక క్రమపద్ధతిని నాటబడినట్లు కన్పించును. వాని కొమ్మలు మొదలైనవి కత్తిరింపబడియుండును. వానిని చూచిన మన కానందముకల్గును. అట్లే అడవిలోనికి పోయినచో అచట రకరకములైన చెట్లు పెద్దవి, చిన్నవి, ఒక క్రమము లేకుండియు శోభించుచుండును. అచ్చటి సహజ సౌందర్యముచే గూడ మన కానందము కల్గును. ఇది యెట్లు ? అని ప్రశ్న బయలుదేరును. తీర్చిదిద్దిన ఉద్యాన శోభను తిలకించినను ఆనందమే, ఇష్టము వచ్చినట్లు పెరిగిన వనలక్ష్మిని వీక్షించినను ఆనందమే! రెండిటివలనను ఆనందమే! రెండిటి వలనను ఆనందమే ఏల కలుగవలెను ? ఏలన ఉద్యానములో ఈశ్వరుని వ్యవస్థాగుణము వ్యక్తమగుచుండగా, వనమునందు ఈశ్వరుని

స్వచ్ఛతాగుణము వ్యక్తమగుచున్నది. చిత్రకారు డీ విషయము దృష్టియం దుంచుకొనవలెను.

## న్యాయ దేవత యొక్క చిత్రము

పాశ్చాత్యులు న్యాయదేవత యొక్క సాంకేతిక చిత్రమును ఒక అంధురాలగు స్త్రీ తులాదండమును పట్టుకొని కూర్చున్నట్లు వ్రాసి చూపిరి. న్యాయదేవత అంధురాలుగనే ఉండవలెనా ? న్యాయాధిపతిని స్త్రీగా ఎందుకు చేసితివి ? పురుషుడుగా చేసిన పని జరుగదా ? తులాదండము మొదటనే తిన్నగా నున్నట్లు చూపబడినది గదా, ఇక న్యాయాధిపతి ఆవశ్యకత ఏమి కలదు ? అని ప్రశ్నింపవచ్చును. న్యాయదేవతను అంధురాలుగా చూపుటలోని సంకేతము అంధుడు అల్పుడు, అధికుడు అను భేదమును చూడజాలడు. కావున అతనిలో పక్షపాతముండదు. ఇక్కడ అంధత్వమునకు అర్థము పక్షపాతము లేకపోవుట. న్యాయదేవతకు స్త్రీ రూప మిచ్చుటలోని సంకేతము స్త్రీలు స్వాభావికముగా దయాళువులు కావున, న్యాయము చెప్పుటలో కూడ దయ ఉండవలెను. తులాదండము తిన్నగా పట్టుకొనుటలోని సంకేతము న్యాయము చెప్పుటలో నిర్మోగ మాటముగా నుండవలెనని. ఈ విధముగా ఈ సాంకేతిక చిత్రమున న్యాయమున కవసరమగు మూడు సూత్రములు : (1) నిష్పాక్షికత్వము, (2) దయాళుత్వము, (3) నిర్మలత్వము చూపబడినవి.

## దత్తాత్రేయుని మూడు ముఖములు

దత్తాత్రేయునికి మూడు ముఖములు కలవు. మూడు ముఖములను ఒకే రూపముతో చూపుట అలవాటైయున్నది. కాని వానిలో నడుమ నున్న ముఖము సాత్త్వికము, అనగా పూర్తిగా పరిశుద్ధము, సుందరము, స్వచ్ఛము ; రెండవది తామసము. అనగా మలినము, మాంద్యయుక్తము ; మూడవది ఉత్సాహము, ఆవేశము, పరాక్రమముతో నిండిన రజోగుణ

యుక్తమును అయిఉండవలెను. అప్పుడే అది ఆయన నిజమైన చిత్ర మగును. ఈ మూడు ముఖములును త్రిగుణములకు సంకేతముగా తెల్ల మగును. హిందువుల విగ్రహారాధనలో సాంకేతిక చిత్రకళ కావలసినంత యున్నది.

## పూర్ణ కలశము

ఎచ్చటనైనను ఉత్సవాదులు జరుగునపుడు స్వాగత చిహ్నముగా ఒక కుండను నీటితో నింపి పెట్టుదురు. దానిని పూర్ణకుంభమందురు. అది ఎందుకు ? ఎందుకనగా స్వాగత మిచ్చుటలో హృదయము ప్రేమతో నింపెయున్నదని అందలి సంకేతము. కుండ మట్టిదైనను కావచ్చును, బంగారుదైనను కావచ్చును, ఇంకొక పదార్థముతో చేసినది కారాదు. బంగారు కలశముచే వైభవము వ్యక్తమగును. అనగా స్వాగతములో మన వైరాగ్యముగాని, వైభవముగాని వ్యక్తము కావలెనని యర్థము. ఇదే ఆ పూర్ణకుంభము యొక్క సంకేతము.

## భావనాసూచకములగు సంకేతములు

ఇంగ్లీషువారు ఎవరైనను వచ్చినపుడు టోపీ తీసివేయుదురు. మనదేశమున టోపీ పెట్టుకొందురు. ఈ భేదమేల ? వారిది శీతలదేశము కావున అక్కడ టోపీతీసివేయుట ద్వారా అతిథికొఱకు కొంత కష్టమును సహించుటకు తాను సిద్ధముగానున్నట్లు సూచన. మనది ఉష్ణదేశము. ఇక్కడ టోపీపెట్టుకొని మనము అతిథికొఱకు కష్టము సహించుటకు సిద్ధముగానున్నట్లు సూచించుచున్నాము. తులసీదాసు భరతరామ సమాగమ ప్రసంగములో ఆ సమయమున రాముడు ధనుర్బాణములు మొదలైనవి తీసికొనకుండ అట్లే లేచి నిల్చుండెను— అని చెప్పెను.—"వస్త్ర మెక్కడ ? అంబులపొది యెక్కడ ? ధనుర్బాణము లెక్కడ ?" అన్నట్టు వర్ణించుటలో రాముడు భరతుని కలిసికొనుటలో పొందిన ఆతురత చూపబడినది.

## సూక్ష్మములైనట్టియు, విషమములైనట్టియు వస్తువుల చిత్రణ

ప్రపంచములో కొన్ని వస్తువులు సూక్ష్మముగను, కొన్ని విషమముగను ఉండును. వానిని సరిగా చూపుటకూడ చిత్రకళలోని ఒక భాగమే, సూక్ష్మమువైపు ప్రత్యేక దృష్టితో అనగా మధ్యభాగమువైపు విశేష ధ్యానముపెట్టి చూడవలసి యుండును. నూలుచుట్టు సాధనము రెండు వైపులను సమానము. అనగా రెండు వైపులనుండియు సూక్ష్మము. చతురస్రము నాలుగు వైపులనుంచి సూక్ష్మము. వృత్తము అన్నివైపులనుండి సూక్ష్మము, ఏలన అన్ని వైపులనుంచి దానిని సమభాగము చేయవచ్చును. వస్తు సూక్ష్మతలోని భేదములను చిత్రములలో చూపుట పిల్లలకు రావలెను. నేడు బాలు రేదైన సూక్ష్మ చిత్రమును తయారు చేయవలెనన్న దాని సగభాగమును చూచి వ్రాసి తక్కినది దానినిబట్టి వ్రాయుచున్నారు. సాధారణముగా కుడిభాగమున చూచి దానిని బట్టి ఎడమ భాగమును వ్రాయుచున్నారు. కాని దీనికి వ్యతిరేకముగా ఎడమవైపు చూచి కుడివైపు వ్రాయుటకూడ రావలెను. కుడిచేతితో చిత్రములు వ్రాయుట నేర్పినట్లుగనే ఎడమ చేతితోకూడ వ్రాయుట పిల్లలకు నేర్పవలెను.

"మహిళాశ్రమములోని ఉపాధ్యాయుల ఎదుట ఇచ్చిన ఉపన్యాసము"

---

•

## : 45 : ఒక బేసిక్ ట్రైనింగ్ కాలేజీలో

(చర్చల ఆధారముపై)

వినోబా నేదొక కాలేజీని చూచిరి. నూలు వడకుట, దూది యేకుట, ఏకులుచేయుట సాగుచుండెను. వినోబా వడుకుటకు కూర్చుండిరి. ఉపన్యాస మిచ్చుటకంటె ఇటువంటి ప్రత్యక్ష కార్యమునందే ఆయన కెక్కువరుచి. కాని ఆయన బయలుదేరగనే అచటివారు ఉపన్యాస మిమ్మని కోరిరి. వినోబా మీరు మీ తరగతిని సాగింపుడు, చూచెదనని చెప్పిరి. అది ట్రెయినింగ్ నిమిత్తము విద్యార్థులుగా వచ్చిన ఉపాధ్యాయుల తరగతి.

వినోబా ఆ తరగతిని పరిశీలించిరి. అందు ఏకులతో లెక్కలు నేర్పు పద్ధతి 'అనుబంధము'గా చెప్పబడెను. సాధారణముగా శిక్షకు లిట్లే చేయుచున్నారు. "మీరు ఏకులతో లెక్కలు నేర్పునెడల గులక రాళ్ళనే ఏల ఉపయోగింపరాదు? దీనివలన ఏకులు పాడైపోవును. ఇట్టి అనుబంధము హాస్యాస్పదముగా తయారగును. ప్రతి విషయమును నేర్పుట కవకాశ మిచ్చుటయే పరిశ్రమ చేయుపని. తక్కిన శిక్షణ ఆ యా పద్ధతులపైననే జరుగవలెను. నూలు వడుకు సమయమున తమ తమ యేకులు లెక్కపెట్టుకొని వడుకుటకు కూర్చుండుటయే స్వాభావిక మయిన అనుబంధము."

పాఠ్యపుస్తకముల విషయములో వారు పొందుచున్న ఇబ్బందులను గురించిచెప్పిరి, కాని అడిగినమీదట సోదరుడు కృష్ణదాస్‌భాయీ రచించిన "కతాయీగణితము" అను పుస్తకముసంగతియే వీరెరుగరని తెలిసినది. అంతట వినోబా యిట్లు చెప్పిరి. మీరు తొందర తొందరగా హిందీ నేర్చుకొని ఈ పుస్తకములు హిందీలో చదివినను సరే, లేదా

వీని ననువదింపజేసికొన్ననుసరే. కాని ప్రాతిపదిక వాఙ్మయ పరిచయము లేకుండ ప్రాతిపదిక విద్యాబోధన కార్యమును మీ రెట్లు చేయగలరు ?"

[ దీనితరువాత కాలేజీ ఉపాధ్యాయులతో చర్చ జరిగెను. వారు తమకుగల సందేహములను, ఇబ్బందులను వినోబాయెదుట పెట్టిరి. ]

ప్రశ్న : అనుబంధ పద్ధతిని తెల్పు పుస్తకము లేమియు లేవు. అది నేర్పుట యెట్లు ?

వినోబా : మంచిప్రశ్న అడిగితిరి. పుస్తకములు అనుభవముమీద తయారగును. కాని తయారయి ఉన్నవానినికూడ మీరు చదువుటలేదు అనుబంధపద్ధతిలోని ప్రధాన తత్వము, పరిశ్రమతోబాటు ఏ జ్ఞానము కలుగజేయుట కవకాశము లేదో దానిమీది ఆశ వదలుకొనుటయేనని ప్రస్తుతము తెలిసికొనుడు.

ప్రశ్న : అయితే యిందు విజ్ఞానబోధ యెట్లు జరుగును ?

జవాబు : తప్పక జరుగును. బాలుడు వ్యవసాయము చేయును, వస్త్రము నేయును, అన్నము తినును, జబ్బు పడును. ఇవన్నియు అతనికి సాధనములు. వానితో విజ్ఞానమంతయు వచ్చివేయును.

ప్రశ్న : ప్రాతిపదిక విద్యావిధానము డాల్టన్, కిండర్‌గార్టన్ మాంటిసోరి, విధానముల పరిష్కృత రూపమా ? కాక స్వతంత్ర విధానమా ?

జవాబు : ప్రాతిపదిక విద్యావిధానము ఏ విధానముయొక్క పరిష్కృత రూపమూ కాదు. అదిస్వతంత్రము, విశిష్టమునయిన ఒకపద్ధతి. తక్కిన పద్ధతులు బాలురకు ఉత్పత్తి సాధకమగు విద్యను దేనిని బోధింపవు. నవీనవిద్య దేశమునందలి ఉత్పత్తిని పెంచును. విద్యార్థిని స్వావలంబకునిగా చేయును. జ్ఞానముకూడ నొసంగును. ఈ పద్ధతి మనకు హిందూదేశ పరిస్థితులనుండియే సహజముగా స్ఫురించినది. పరిశ్రమద్వారా విద్యనొసంగు ఆలోచనగురించియు, తక్కిన పద్ధతులు

ఆజీవికను సంపాదించుకొనుటద్వారా విద్యనేర్చుకొనుట అను దానిని చేసి చూపలేకపోయిన వనుమాట స్పష్టమే.

ప్రశ్న : శిక్షకులకు పురాతన పద్ధతుల జ్ఞానము కల్గించుట ఆవశ్యకమా ?

జవాబు : ఆవశ్యకము కాదుగాని ఉపయుక్తము కావచ్చును. గణితము నేర్చుటకు నేడు మనము భాస్కరాచార్యుని లీలావతి చదివించుచున్నామా ? కాని లీలావతి చదువుటచే శిక్షకునకు చారిత్రకదృష్టి ఏర్పడగలదు.

ప్రశ్న : చరిత్రబోధనలో కాలక్రమ సిద్ధాంతమును మీ రంగీకరింతురా ?

జవాబు : కాలక్రమము తరువాత రాగలదు. మొదట పిల్లలకు సమస్త విచారధారలకు సంబంధించిన సామాన్య జ్ఞానము కలుగవలెను. ప్రాతిపదిక విద్యలోను ప్రస్తుతము నడచుపద్ధతిలోను ఒక మూలభూతమైన భేదము కలదు. మనము దాని నర్థము చేసుకొనవలెను. మనము పిల్లలకు చరిత్ర, వ్యాకరణము, గణితము కాదు బోధింపవలసినది. మనము వారికి జీవితమును బోధింపవలెను. వారిని కార్యదక్షులుగా చేయవలెను. శివాజీ ఏవ్యాకరణములుచదివెను? శంకరాచార్యులవారు చరిత్ర గ్రంథములను పఠించిరా ? మనము బాలురను పురుషార్థ పరులుగా చేయవలెను. దాని వెనుకవెనుకనే తక్కిన విషయములన్నియు క్రమక్రమముగా రాగలవు.

ప్రశ్న : పెద్దవారైనన పిమ్మట పిల్లలు నేర్చుకొన్న చేతిపనులు పనికివచ్చునా ? దేశము యంత్రమయమైనచో ఎట్లు ?

జవాబు : మీ ప్రశ్న విద్యకు సంబంధించినదికాదు. అది ఆర్థిక విషయము. దీనినిగురించి ఎక్కువ ఆలోచింపవలసిన అవసరములేదు. రష్యాలో యంత్ర విధానముకలదు. అయినను ప్రాథమిక పాఠశాలలలో చిన్న చిన్న పరిశ్రమలద్వారా విద్య నేర్పబడుచున్నది. పిల్లవాని శక్తి

వికాసము కొఱకు అతనిశక్తి ననుసరించి శిక్షణ ఈయబడును. అట్టి దృష్టిలో ఏ పరిస్థితియందైనను చేతిపనులు ఆమోదింపవలసినవే!

ప్రశ్న : తరగతులవారీగా శిక్షణ క్రమము మీ కిష్టమేనా ?

జవాబు : మొదట స్థూల జ్ఞానము, పిమ్మట సూక్ష్మజ్ఞానము - ఈ క్రమము నాకిష్టము. మొదట ఈ భాగము, పిమ్మట ఆభాగము - ఈ విధముగా బోధించుట నాకిష్టముకాదు. మీ పాఠ్య క్రమములో మూడవ తరగతియందు మద్రాసు ప్రాంతముయొక్కయు, నాల్గవ తరగతిలో భారతదేశము యొక్కయు భూగోళము పెట్టబడినది. కాని ఈ లోపుగనే బీహార్‌లో భూకంపము వచ్చినచో మూడవ తరగతి బాలురకు బీహారు ఎక్కడనున్నదో చెప్పక మదరాసును గురించి మాత్రమే చెప్పుచుందురా ?

ప్రశ్న : అవునుగాని పాప మీ ఉపాధ్యాయుల కివన్నియు ఎట్లు తోచును ?

జవాబు : తోచనియెడల ఉపాధ్యాయు లెందుకైరి ?

ప్రశ్న : నవీన విద్యలో కవిత్వమునకు స్థానముండునా ? ఉండదా ?

జవాబు : అవసరమునుబట్టి యుండును. గాంధీ జయంతి సందర్భములో 'వైష్ణవజన' అను పాటవచ్చును. ప్రహ్లాద చరిత్ర యంతయు కవిత్వములోనే నేర్పవచ్చును.

ప్రశ్న : నవీనవిద్య మాతృభాష ద్వారా బోధింపవలెనా ? దేశ భాషద్వారానా ?

జవాబు : దీనిలో రెండింటి జ్ఞానము తప్పక కావలసినదే కాని బోధనా భాషమాత్రము ప్రాంతీయ భాషయే కావలెను.

ప్రశ్న : మీరు ప్రతి విషయమునకు ప్రసంగము అవసరమని చెప్పుచున్నారు. కాని ఏదైన నొక ప్రసంగమునకు ఒక విద్యార్థి హాజరు కానిచో అతని కాశిక్షణ లభింపక పోవలసినదేనా ?

జవాబు : ఏడెనిమిది సంవత్సరముల కాలములో పునరావృత్తము గాని ప్రసంగమేముండును ?

[కొమరువోలు ఆశ్రమములో హిందీ బొత్తిగా తెలియని చిన్న చిన్న బాలికలు చూచుటకు వచ్చినపుడు వినోబా ఒక అరగంట వారితో మాటలాడిరి. ఆవ్యవధిలో వారికి హిందీలో పదివఱకు అంకెలు లెక్క పెట్టుట, తమపేరు చెప్పుట, ఇతరుల పేరు అడుగుట నేర్పగలిగిరి.]

## ఈ ప్రయోగ మెట్లు సఫలమగును ?

వీరవరములో వినోబాను "నవీనవిద్య ప్రస్తుతము నడచు నడకతో ప్రళయకాలమునాటి కైనను లక్ష్యము చేరగలదని మీ రనుకొనుచున్నారా" అని అడిగిరి.

వినోబా ఇట్లు జవాబిచ్చెను. ఈ ప్రశ్న వెనుక ఒక మనోభావన కలదు. అది ప్రభుత్వము ద్వారానే ఏ పెద్దపని యైనను కాగలదని. ప్రభుత్వము ద్వారా ఎక్కువ పని కాగలదని నే నంగీకరింతును. కాని మొత్తము విద్యాబోధన అంతయు ప్రభుత్వమున కప్పగించుటకు నేను సిద్ధముగా లేను. అప్పుడు ప్రభుత్వ పాఠశాల ఒక నమూనా అయి పోవును. స్వతంత్రమైన ప్రాతిపదిక పాఠశాలలు నడుపు ప్రయోగములు జరుగవలెను. నా ఊహకు సరిపోయిన బేసిక్‌స్కూలు ఒకటి కూడ నే నింతవఱకు చూడలేదని మీకు వినయపూర్వకముగా చెప్పవలసియున్నది. నేను నవీన విద్యాశాస్త్రమును బాగుగా ఎరుగుదును. అయినను నేను అట్టి స్కూలు నడుపుటలేదు, సంచారము చేయుచున్నాను. ఇతరుల స్థితియు ఇదే. ఇక నీ పని ఎట్లు జరుగును ? ఈ పని బాగుగా తెలిసినవారు దీనినే పట్టుకొని కూర్చుండి ఆదర్శమైన బేసిక్‌పాఠశాల నడిపినపుడే నిజమైన నవీన విద్యాదర్శనము కలుగగలదు. నాకు సంబంధించినంతవరకు నేను చెప్పున దేమన, నేను దీనిపై కొంత ప్రయోగముచేసితిని. దానికి తృప్తి కరమైన ఫలితము కూడ కన్పించినది. కాని ఆ ప్రయోగము చిన్నపిల్లల

ప్రాతిపదిక విద్యకు సంబంధించినదికాదు, అది పై చదువుకు సంబంధించిన ప్రయోగమని చెప్పవచ్చును. అందు తయారైన విద్యార్థులే నేడు నా వెంట పనిచేయుచున్నారు.

ఈసారి జైలునుండి విడుదలయినప్పుడు ఇక నేను చేయవలసినది ప్రాతిపదిక విద్యా కార్యక్రమ మొక్కటేనని అనుకొంటిని. కాని భగవంతుని ఇచ్ఛ వేరుగానుండెను. అయినను తిరిగి ఎప్పుడయినను స్థిరముగా నుండు యోగము పట్టినచో నేను తప్పక ఈ ప్రాతిపదిక విద్యా కార్యములోనే నిమగ్నుడను కాగోరుచున్నాను. ఈ మధ్య నేను కొమరువోలు వెళ్ళినపుడు అరగంటసేపు బాలికలకు చదువు చెప్పితిని. నే నందు ఎంత తన్మయుడనయితిననగా నాకు కాలాతిక్రమణముకూడ తెలియలేదు. అచ్చటివా రింకొక పనికి నన్ను తీసికొనిపోవుటచే ఆ తరగతి ముగింపవలసివచ్చెను.

మీలో ఎవరైన శిక్షణను ప్రేమించు వారున్నయెడల వారు తమ జీవితము నీ పని కీయవచ్చును. ప్రాతిపదిక పాఠశాల కనీసపు సహాయముతో నడవగలదని మనము రుజువు చేయవలసియున్నది. నేను బేసిక్ స్కూలు నడుపునెడల కట్టడములు, సాధనములు తప్ప తక్కిన సొమ్మంతయు వాపసుచేయుదును. మా స్కూలులోని పిల్లలు తక్కిన స్కూళ్ళలోని పిల్లలకంటె ఎక్కువ జ్ఞానసంపన్నులు, ఎక్కువ శక్తి సంపన్నులుగా తయారగుదురు. ఇట్టిది ఒక్క స్కూలైనను మనము నడిపి చూపగలిగినచో దానిని చూచుటకు ప్రపంచమంతటినుండియు జను లచ్చటికి వత్తురు. శిక్షణపై ప్రయోగములు చేసినవారు 5 మొదలు 50 వరకు మాత్రమే విద్యార్థులను గ్రహించి ప్రయోగముచేసిరి. ప్రపంచము వారి పద్ధతిని స్వీకరించినది.



## : 46 : పూర్వ-ప్రాతిపదిక విద్యపై చర్చ

(బొంబాయిలోని శిశు-విహార-గృహమునకు చెందిన కొందఱు శిక్షకులు, విద్యార్థులు ప్రతిసంవత్సరము సంచారమునకు వెళ్ళుచుందురు. ఈమారు వారు వర్ధా, సేవాగ్రామము, పవనారు చూచుటకు వచ్చిరి. శిశుగృహములనుగూర్చి వారితో ఈ క్రింది చర్చ జరిగెను.)

ప్రశ్న : సేవాగ్రామములో నేడు మేముచూచిన శిక్షణ పద్ధతి పల్లెటూళ్ళకు బాగుగనే యున్నది. బస్తీపిల్లలకు మీ రం దేమి మార్పు సూచింతురు ?

వినోబా : మీ కెట్టిమార్పు అవసరమని తోచుచున్నది ? బస్తీకి పల్లెకు భేదమేమి ? రెండుచోట్లను ఆ సూర్య చంద్రులే, కుటుంబ వాతావరణముకూడ ఒకటే. ఒకచోట నూనెదీపమున్న, ఇంకొకచోట విద్యుద్దీపమున్నది. ఇంతకంటె వేఱుభేద మేమున్నది ?

### బస్తీకి పల్లెకు భేదమేమి ?

ప్రశ్న : బస్తీలో యంత్ర వాతావరణ మున్నదిగదా ?

వినోబా : అందుమాత్రము భేద మేమున్నది ? ఒక కుఱ్ఱవాడు మోటారులో కూర్చుండిన, ఒకడు ఎద్దులబండిలో కూర్చుండును. ఒకడు పెట్రోలు, ఇంజనునుగూర్చి తెలిసికొనిన, ఇంకొకడు చక్రము, ఎద్దును గూర్చి తెలిసికొనును. చివరకు ముఖ్యవిషయ మేమనగా చుట్టుపట్లనున్న వాతావరణముద్వారా ఆ బాలురకు వికాసము కలుగును, అంతేకాక పల్లెకుపల్లెకు నడుమకూడ భేద ముండియేతీరును. ఇచ్చటి బాలుడు జొన్న చేను చూచిన, కొంకణదేశమందలి బాలుడు వరిచేను చూచును. ఈవిధంగానే బస్తీకి, పల్లెకుగల భేదమునుగూడ గ్రహింపవలెను.

ప్రశ్న : పల్లెటూరి పిల్లవాడు స్వావలంబకుడగును. బస్తీవాడు కాడు.

వినోబా : ఎందుకుకాడు ? బస్తీలో ఒకహోటలున్న దనుకొనుడు. అచ్చట వంటద్వారా బాలునికి శిక్షణ ఈయబడుచున్నది. చుట్టుప్రక్కల వాతావరణమునుండి జ్ఞానమును నేర్చుటయేగదా మన సిద్ధాంతము. బస్తీకి, పల్లెకుగూడ ఈ సిద్ధాంతము సమానముగనే వర్తించును. పల్లెలో అన్నము కట్టెలతో ఉడికిన, బస్తీలో బొగ్గులపై ఉడుకును. దీనివలన విద్యలో భేద మెందుకు వచ్చును ?

ప్రశ్న : మిక్కిలి చిన్నపిల్లలకు బస్తీలలో పను లెట్లు మొదలు పెట్టవలెను ?

వినోబా : ఇందులో మీ కేమియు కష్టము కన్పించుట లేదు. రెండుచోట్లను నీరు, గాలి, వెలుగు కలవు. ఇంద్రియ సంబంధముకూడ ఒకటే. ఎక్కుట, దిగుట రెండుచోట్ల సమానమే. ఒకచోట కుఱ్ఱవాడు కొండమీది కెక్కినచో, ఇంకొకచోట నాలుగవ అంతస్తుమీది కెక్కును ఇంతేగదా భేదము ?

ప్రశ్న : రెంటిటి భూమిక ఒకటే అని అంగీకరించుట ఎట్లు ?

వినోబా ? మీరు ఇద్దరికీ మంచితనమే నేర్పిననాడు బస్తీకి, పల్లెకు భూమిక ఒకటే. ఆ విషయములో రెండును కలియును. ఆకలిగా ఉన్నవానికి అన్నము పెట్టవలెనను శిక్షణ రెండుచోట్ల సమానముగా లభింపవలెను. అట్లుకాక పల్లెటూరివాడు శ్రమకు విలువ నిచ్చువాడను, బస్తీవాడు దానిని నిర్లక్ష్యము చేయువాడును అగు విద్య నేర్పినచో ఇద్దఱి మార్గములు భిన్నము లగునని తెలిసికొనవలెను.

ప్రశ్న : మీరు గ్రామస్థులను రాట్నము వడకవలసినదిగా చెప్పు చున్నారు. అది బస్తీవారి చెవి కెక్కుటలేదు.

వినోబా : అట్లయిన నేను బస్తీవారి కెందుకు చెప్పుదును ? గ్రామ స్థులు బట్ట కట్టుకొనవలెను గనుక వడకుమని చెప్పుచున్నాను.

ప్రశ్న : బట్ట మేము కట్టుకొనవలెనుగదా ?

వినోబా : అయితే మీరును వడకవలెను.

## విభిన్న పద్ధతులు

ప్రశ్న : బాలశిక్షణలో నేడు భిన్నభిన్న పద్ధతులు నడుచుచున్నవి. అందు మీరేది మంచిదందురు ?

వినోబా : మీరేయే పద్ధతు లెరుగుదురు ?

ప్రశ్న : సేవాగ్రామములో నవీనవిద్య నడుచుచున్నది. బొంబాయిలో మాంటెసోరీ పద్ధతి నడుచుచున్నది. అక్కడక్కడ కిండర్‌గార్టన్ కూడ సాగుచున్నది.

వినోబా : వీనిలోని భేదముల తెలియజెప్పుడు.

ప్రశ్న : మీ కన్నియు తెలియును.

వినోబా : ఒకటి సేవాగ్రామపద్ధతి, ఒకటి పవనార్ పద్ధతి. ఒకటి వార్ధా పద్ధతి. ఒకటి నాగపుర పద్ధతి ఈ మొదలయినవి మాత్రమే మే మెరుగుదుము.

ప్రశ్న : మా పద్ధతిలో ప్రశ్న వేయుటయే పనికిరాదు. కాని మీరు ప్రార్థనలో బాలుర ననేక ప్రశ్నలువేసి వారికి తేలికగా జ్ఞానము లభించునట్లు చేసినారు.

వినోబా : అయితే మీకు ప్రశ్న వేయుపద్ధతి అనున దింకొకటి తెలిసినదన్నమాట. ప్రశ్న అడిగే పద్ధతికూడ ఒకటి ఉన్నదనియు, అందులోకూడ ఒక విశిష్టత ఉన్నదనియు మీరు గమనించితిరి గదా !

ప్రశ్న : కిండర్ గార్టన్ పద్ధతి కలవారు పిల్లల కనేకములగు ఆకర్షణలు కల్పింతురు.

వినోబా : మీరు మాత్రము ఆకర్షణ కల్పింపలేరా ?

## కృత్రిమత్వము-శాస్త్రీయత

ప్రశ్న : కాని వారు కృత్రిమమైన ఆకర్షణలు తెచ్చిపెట్టుచున్నారు.

వినోబా: ఇప్పుడు 'కృత్రిమము' అను శబ్దము వచ్చినది: మంచిది చెప్పండి, మీరు పిల్లలకు మిఠాయి పంచి పెట్టుదురా, లేదా ?

ప్రశ్న : ఆ, పంచిపెట్టుదుము. కాని మేము శిక్షణకొరకు మిఠాయి పంచము.

వినోబా : ఎందుకు పంచరు ? ఎదుటనున్న వస్తువుద్వారా శిక్షణ ఇవ్వవలెనుగదా ?

ప్రశ్న : మా ఉద్దేశ్య మేమనగా మేము పిల్లలకు ఎట్టి ప్రలోభనము చూపము.

వినోబా : ఇది బుద్ధి కౌశలమునకు సంబంధించిన విషయము. శిక్షణ పద్ధతిలో సాధారణముగా విశేషభేదముండదు. పరిస్థితి భేదమును బట్టి వస్తుప్రదర్శనములో భేదము కలుగుచుండును. ప్రలోభనముకొఱకు ఒకవిధమైన వాతావరణమును నిర్మించుటగాని, ఏదైన వస్తువు నిచ్చుటగాని వారును చెప్పరు.

ప్రశ్న : మా సంస్థయందు, సేవాగ్రామమందును ఉన్న బాలురు స్వేచ్ఛగా తమ వికాసమును తాము సాధించుకొనునట్లు కన్పించుచున్నారు. కాని కిండర్ గార్టన్ పద్ధతిలో అట్లు కన్పించుట లేదు.

వినోబా : కాని మీరు కిండర్‌గార్టన్ పద్ధతివారిని అడిగినచో, వారు దీనిని ఒప్పుకొనరు.

ప్రశ్న : మా సంస్థలోని ఇంద్రియ వికాసవిధానము (సెన్స్-డెవలెప్‌మెంటు) కంటే సేవాగ్రామ విధానము కొంచెము భిన్నముగా నున్నది. మాకు మా సంస్థలోని విధానము ఎక్కువ శాస్త్రీయముగా కన్పించుచున్నది. సాధనము లెంత వ్యవస్థితములై యుండునో

వికాసమంత చక్కగానుండును. కాని ఇట్టి శాస్త్రీయ సాధనములను విదేశీ అని పేరుపెట్టి నిషేధించుచున్నారు.

వినోబా : అయితే చిన్నపిల్లల శిక్షణకు విదేశీ సాధనము లవసరమా ?

ప్రశ్న . సాధనములు విదేశీవికావు, కాని విధానము విదేశీది.

వినోబా : విధానమునకు విదేశీ-స్వదేశీ అనియుండునా ? చుట్టు ప్రక్కలనే సహజముగా కొన్ని సాధనములు లభించుచున్నప్పుడు శాస్త్రీయుత పేరుతో కృత్రిమ సాధనము లావశ్యకములని తలంపరాదు. ఈ విషయము మనము జ్ఞాపక ముంచుకొనవలెను. ఒక గ్రామముయొద్ద నది యున్నచో అక్కడ ఈతద్వారా బాలురకు వికాసము నేలకలిగింపరాదు ? ఇంద్రియ వికాసమునకు పల్లెటూళ్ళ ప్రాకృతిక వాతావరణము అనుకూలము కావా ? పేడ ప్రోగుచేయుట, రేగుపండ్లు ఏరుట మొదలైనవి సాధనములుగా ఒప్పుకొనరా ? ఈ పనులద్వారా జ్ఞానము కలిగింప జాలమా ?

ప్రశ్న : వీనికి మేము వ్యతిరేకము కాము. కాని గొన్ని సాధనములు తప్పక కావలెనని మా అభిప్రాయము. అవి ప్రధానముగా ఉపయోగించుటచే బాలురు ముందుముందు ప్రపంచములో ఎక్కువ సమర్థులు కాగలరు.

వినోబా : నేను మిమ్మొక ప్రశ్న అడిగెదను. ఏ సాధనములు లేని గ్రామములోనికి మిమ్ము పంపినచో మీరు పనిచేయగలరా ? లేదా ?

ఒక సోదరి : ఆఁ చేయగలము.

వినోబా : అయితే నేను చెప్పవలసిన దేమియులేదు. అన్ని రకములయిన జ్ఞానములు నేడే కలిగింపవలసిన ఆవశ్యకత ఏమియు లేదు. మన కోరికనుబట్టి పిల్లలకు జ్ఞానము నేర్పించుటలేదు, అది వారి కవసరముగనుక నేర్పించుచున్నాము. పిల్లల కంటికి వెలుగు, నాలుకకు

రుచి, చెవికి స్వరము అవసరము. ఈ విధముగా అవసరములనుబట్టి ఉపయుక్తమగు జ్ఞానము నేర్పవచ్చును.

ప్రశ్న : కాని సూక్ష్మజ్ఞానమునకు, శాస్త్రీయ సాధనములు ప్రయోజనకరములు.

వినోబా : నిజమే. కాని శాస్త్రీయ సాధనముల పేరుతో కృత్రిమత్వము ప్రవేశించకుండునట్లు చూడవలెను. హార్మోనియమువలన స్వరంయొక్క సూక్ష్మ జ్ఞానము కలుగునని ఎవరును చెప్పజాలరు. అయినను హార్మోనియము నడుచుచునేయున్నది. పంచదార వేయని పాలు త్రాగు అలవాటు లేనివాడు పాలయొక్క నిజమైన రుచి ఎట్లు తెలిసికొనగలడు? కనుక రుచి తెలిసికొనవలెనన్న పదార్థములను వాని అసలు స్వరూపములోనే లభింపవలెను. ఈ విధముగా ఆలోచించినచో అన్ని సమస్యలు పరిష్కార మగును.

## అభిరుచిని పరిశుద్ధ మొనర్చుట

ఇంద్రియ వికాసము జంతువులకుగూడ కలుగుచున్నది. వానికెవరైనా మాంటేసోరీ నేర్పుచున్నారా? సింహమున కొక విశిష్టమయిన ఇంద్రియ వికాసము కలుగుచుండును. ఇతర జంతువులలో అది తక్కువగా కలుగును. సింహముయొక్క ఘ్రాణేంద్రియము మిక్కిలి చురుకుగా నుండును. పరిస్థితి ఎంత విషమముగానున్న, ఇంద్రియ వికాసమంత ఎక్కువగా నుండునని మీకు తెలియును. కావున ఇంద్రియ వికాసశక్తి అనునది ఏమంత పెద్ద విషయము కాదు. నైసర్గిక జీవనమందే దానిని తేలికగా సాధించవచ్చును. శిక్షణ దృష్టిలో ఆవశ్యకమైన పెద్ద విషయము ఇంద్రియముల అభిరుచి పరిశుద్ధ మొనర్చుట. కృత్రిమ జీవనమువలన ఇంద్రియములు పరిశుద్ధములు కాజాలవు. పైగా చెడిపోవును. ఈ చెడిపోవుట అనునది బస్తీ. పల్లె-రెండుచోట్లను సాగు

చున్నది. భోజనపదార్థములలో మసాలా ద్రవ్యములు కలుపుట రెండు చోట్లను జరుగుచున్నది. ఇట్టి ఉదాహరణము లింకను ఈయవచ్చును.

ప్రశ్న : మసాలా ద్రవ్యములుకూడ ప్రకృతిలో తయారైనవేగదా!

వినోబా : ప్రకృతిలో పేడకూడ తయారయినది. కాని ఎవరును పేడ తినరుగదా! అట్లే ఏ పిల్లవాడును తనకుతానుగా మిరపకాయ తినడు, కాని మధురఫలమును సహజముగనే భక్షించును.

యోగ్యతా యోగ్యతలు, ఇంద్రియశక్తి వికాసము అనునవి విభిన్న విషయములుకావు.

---

## : 47 : నవీనవిద్య - స్వావలంబనము

(ఉత్తరములనుండి)

వేడఛీనుండి శ్రీ నారాయణదేశాయి ఇట్లు వ్రాయుచున్నారు ;

"నేను పవనారు వచ్చినప్పుడు తమతో ప్రసక్తానుప్రసక్తముగా స్వావలంబనమునుగూర్చి మాటలాడుట జరిగినది. స్వావలంబనము, సాధన సంశోధనము, సమవాయము, నవీన విద్యలోని జీవనదృష్టి అను విషయములపై నిత్యము ఆలోచన సాగుచునే యున్నది. తాము వేడఛీ వచ్చినప్పుకూడ కొన్ని విషయములు మాట్లాడితిమి.

"బాపూజీ ఉద్దేశము ప్రస్తుతము విద్యనిమిత్తము రూపాయలు, అణాలు, పైసలలో అగుచున్న ఖర్చు విద్యార్థుల సంపాదనలోనుండి పూడపలెనన్నట్లు కన్పించుచున్నది. నేటి ఆర్థిక విధానము శరీర శ్రమకు తక్కువ విలువకట్టి, విలాస సామగ్రికి అవసరమైన దానికంటె ఎక్కువ ధనము కేటాయించుచున్నది. అయినను నేటి స్థితిలోకూడ మన పరి శ్రమలోనుండియే విద్యకగు వ్యయము భరింప గలిగిననాడే మనము నిలబడగలము. లేనిచో నిలబడజాలమని స్పష్టముగా కన్పించుచున్నది.

"అనేక విధములుగా లెక్కలు కట్టినమీదట ప్రతి ముప్పదిమంది విద్యార్థులకు ఒక శిక్షకు డుండవలెనని తేలినది. అతనికి సామాన్య శిక్షకున కిచ్చు జీతమే ఈయవలెను, ప్రతి విద్యార్థి 3 గంటలు పని చేయును. మీరు 'జాకిర్ హుసేన్ సమితి'లో 3 గంటల 20 నిమిష ములు నిర్ణయించిరి. చిన్న పిల్లల విషయమున ఈ కాలమెక్కువ అని నా అనుభవము. కావున పెద్ద పిల్లలకు కొంచె మెక్కువ సమయము, చిన్న పిల్లలకు తక్కువ బాగుండునని యెంచి సగటున 3 గంటలు నిర్ణ యింపబడినది. మామూలు స్కూళ్ళలో ఉండు సగటు హాజరే ఇక్క

డను ఉండవలెను (సంవత్సరములో పనిచేయు దినములు 240. సగటు హాజరు 75% ఈ లెక్కప్రకారము ప్రత్యక్షముగా పనిచేయు రోజులు 180 మాత్రమే అగును.) అన్న పక్షమున వస్త్రవిద్యతో పూర్ణ స్వావలంబనము సాధించుటలో ఈ క్రింది అడ్డంకులు కలుగుచున్నవి.

"(1) ఏకులు తయారు చేయుటకు చాల సమయము పట్టుచున్నది. తునాయీ పద్ధతిని ఏకులు చేయవలెనన్న ఇంకను ఎక్కువ సమయము పట్టును.

"(2) జములు నూలు తయారు చేయుటకును ఎక్కువ సమయము పట్టుచున్నది. వడుకుటతోబాటే జములు వేయుట అనుపద్ధతి ఇంకను సరిగా నడుచుటలేదు. చిన్నపిల్లలు దానిని నిర్వహింపలేరు. కనుక వడికిన పిమ్మట నూలు ప్రత్యేకముగా జములు చేయవలసి వచ్చుచున్నది.

"(3) ఖాదీ అమ్మకము సమస్య. ఈ సమస్యపై 'జాకిర్ హుసేన్ సమితి' వారు ఆలోచించిరి. ప్రభుత్వమే దానిని కొనవలెనని వారి అభిప్రాయము. మా ఖాదీ ఏమియు పాడుగానుండదు. చాల చక్కగనే తయారగును, కాని క్రొత్తగా నేతనేయువారు జములునూలు, వెడల్పు తక్కువవస్త్రము మాత్రమే నేయగలరు. కనుక రకరకముల ఖాదీ తయారుకాదు. ఒకే రకము తయారగును. ఇందుచేత దానిని ప్రభుత్వమునకు తప్ప ఇతరులకు అమ్ముట కష్టము.

"మేము మాత్రము ఖాదీ పిల్లలకే ఇచ్చివేయుచున్నాము. అందుచేత మాకు మొదటి రెండు ప్రశ్నలే ఎక్కువ ముఖ్యము.

అవి (1) దూదియేకు పద్ధతి ప్రవేశపెట్టవలెనా ?

(2) చాల చుట్టులుగల జములునూలు యంత్రము ప్రవేశపెట్ట వలెనా ? - అనునవి.

"రూపాయలు, అణాలు, పైసలలో వ్యవసాయము మొదలైన ఇతర వృత్తులవలన తగినంత శ్రమ ఫలము లభించునుగాని అట్టి వృత్తులు పల్లెటూళ్ళలో అందరు పిల్లలకు అన్నిరోజులు లభించవు."

## ఉత్తరమునకు జవాబు

మీ ఉత్తర మందినది. మొదటి మీ ప్రశ్నలకు జవాబు లిచ్చుచున్నాను.

చాల చుట్టలుగల జములునూలు యంత్రమును ఉపయోగించవచ్చును. కాని తునాయీ పద్ధతి విడిచి దూది యేకు పద్ధతి ప్రవేశపెట్టరాదు.

రూపాయలు, అణాలు, పైసల లెక్కలో మనము పడరాదు. డబ్బు ఎంత దుర్మార్గమైనదో ఒక దృష్టాంతము ఈ నెల 'సర్వోదయ దృష్టి'* లో ఈయబడినది. నవీన విద్యా పాఠశాలలో వడికిన నూలు అచ్చటి శిక్షకులకు విద్యార్థులకు వస్త్రములు తయారగుట అపేక్షణీయము. భోజనమునకు ఆధారము అచ్చటి భూమి. నూతినుండి నీరు లభించును. నూతినుండి వస్త్రము, వడుకుటనుండి భోజనము, వ్యవసాయమునుండి నీరు అపేక్షింపరాదు. నేను నవీన విద్యాబోధకుని 'సర్వతంత్ర స్వతంత్రుని' గనే చేసి వైచితిని. ఎవరో తయారుచేసిన పాఠ్యక్రమము నాతడంగీకరింపవలసిన పనిలేదు.

సంవత్సరములో మూడు వందల అరువది రోజులు భగవంతుడు నాకు పనిచేయుట కిచ్చి యున్నాడు. ఎన్ని దినములు తిందునో, అన్ని దినములు పనిచేయవలెనను సూత్రముకూడ తప్పే. ఏలన మునము భోజనమైనను మానవచ్చును. కాని శరీరధారికి కర్మయోగము విడిచిపెట్టు ప్రసక్తియే లేదు. పని చేయుచునే 100 సంవత్సరములు జీవించవలపి

---

*సెప్టెంబరు 1950 'సర్వోదయ'లో ప్రకటింపబడిన 'సర్వోదయ దృష్టి' అను శీర్షికక్రింద 'డబ్బుచేసే చమత్కారము' పుట - 111.

యున్నది. పనినుండియే వ్యాయామము, పనినుండియే జ్ఞానము, పని నుండియే ఆనందము, పనియే ఈ సర్వము. పనియే ఆట. ఇది సమవాయము.

స్కూలు పగలు, రాత్రి, ఉషఃకాలమున, సాయంకాలమున, అన్ని వేళల నడవవలెను. అప్పుడు స్వావలంబనముతో గూడిన శిక్షణ పద్ధతి ఎట్లుండునో అనుభవమునకు వచ్చును. నాయొద్ద నేర్చుకున్న విద్యార్థు లిట్లే నేర్చుకొనిరి. నేనుకూడ గత 34 సంవత్సరములనుండి ఇట్లే నేర్చుకొనుచున్నాను. ఒక రోజుకూడ కర్మశూన్యముగా గడపలేదు. ప్రతిరోజు జ్ఞానము క్రొత్త క్రొత్త చిగుళ్లు పెట్టుచునే యున్నది.

---

## : 48 : నవీన విద్యకు ఊపిరి తిత్తులు

(ఒక ఉత్తరము నుండి)

శిక్షకులకు విద్యార్థులమీదను, విద్యార్థులకు శిక్షకులమీదను, ఇద్దఱకు జ్ఞానముమీదను, జ్ఞానమునకు సేవమీదను ఆస్థఉండుటయే మన పాఠశాల ప్రణాళిక-మనము క్రొత్త సమాజమును నిర్మించు శిక్షణ నీయ వలెను. ప్రస్తుత పద్ధతిలో శిక్షణ నిచ్చుటకు ఇతర పాఠశాల లనేకములు సమర్థతకలవై యున్నవి.

మనకు మనపిల్లలు, వారివంటి ఇతరులు, ఇదే మన కార్యరంగము మన పిల్లలతోసహా మనము స్వావలంబుల మగుచునే యున్నాము. నాకు స్వావలంబన సమస్య ఎప్పుడును కష్టమనిపించలేదు. సమాన వేతనము సర్వోదయ సమాజమునకు పునాదియేగదా!

పాశ్చాత్య దేశముల శిక్షణ విధానములో పురుషకార హీనత అను దోషములేదు. కాని అంతమాత్రము చేతనే అది నవీనవిద్య అయి పోదు. బందిపోటు దొంగకూడ పురుషకారపరుడే. సామ్యయోగము, స్వావలంబనము అనురెండు గుణములు మన విద్యలో లేనియెడల మన విద్యకు రెండు ఊపిరితిత్తులు చెడిపోయినవని తెలిసికొనుడు.

---

## : 49 : పాఠశాల ఖద్దరు

### జాజూజీ సందేహము

శ్రీ జాజూజీ ఇట్లు వ్రాయుచున్నారు. "ది 30-1-49 నుండి 11-2-49 వరకు సేవాగ్రామములోని విద్యార్థులు పగలంతయు ఎడతెగకుండ నూలు వడకు, నేతపని చేసిరి. దానిఫలిత మీ క్రింది విధముగా వచ్చెను. 2410 గంటలు పని చేయుటచే 80 చతురపు గజముల బట్ట తయారయినది. దానివిలువ, రు. 141-13-3 అయ్యెను. అందుండి ముడిపదార్థముల ఖర్చు రు. 43-14-0 తీసివేసినచో పనిచేసిన ఆదాయము 97-15-3 అయినది. అనగా ఒక గంటకు 8 పైసల ఆదాయము పడినది. పనిలోని రద్దుకు కొంత తీసివేసినను ఒక గంటకు ఆదాయము కనీసము 6 పైసలు చొప్పున లెక్కించవలెను. ఏ పాఠశాలలో నైనను 100 మంది బాలురు ప్రతిరోజు 2 గంటలు నూలు వడకు నేతపని చేసినచో రోజుకు ఆదాయము రు 6-4-0 అగును. నెలలో పనిచేయు రోజులు 24 అయినచో నెలసరి ఆదాయము 150 రూపాయలగును. దీనివలన పైమూడు తరగతుల యొక్క ముగ్గురు శిక్షకుల వేతనమునకగు వ్యయము పూడగలదు.

పైలెక్కలో నూలు వడుకుకు, నేతకు కూలి చరఖా సంఘము ద్వారా నిర్ణయింపబడినవే ఉంచబడినది. ఖాదీ దృష్టిలో ఇది మంచిదే కాని మామూలు వస్త్రమునకుగల బజారు ధరతో అది సరిపోదు. పై లెక్కలో 80 చతురపు గజముల ఖద్దరు విలువ రు. 141-13-3 వేయబడినది. కాని అదే మిల్లుగుడ్డ అయినచో దాని విలువ సుమారు 40, 50 రూపాయలే ఉండును. ముడిపదార్థపు విలువ రు. 43-15-0 తీసివేసినచో ఆదాయము నామమాత్రముగ నుండును. లేదా నష్టముకూడ నుండ

వచ్చును. కావున ఇప్పుడాలోచింపవలసిన దేమనగా ప్రస్తుతపు ఆర్థిక వ్యవస్థలో ఉపాధ్యాయుల జీతము రొక్కరూపముగా ఇవ్వవలసిన స్థితిలో ఖద్దరుకు ఎక్కువ ధర కట్టివేసిన లెక్కలు సరియగునా ? ఈ ఖద్దరు విద్యార్థులకు ఉపాధ్యాయులకు వస్త్రము క్రింద వినియోగించినచో దాని వలన పాఠశాల నడుపుటకగు ఖర్చునకు సహాయమెట్లు లభించును ?

ప్రాతిపదిక విద్యాలయములు ఇప్పటికిని చాల తక్కువే. వానిలో తయారయిన ఖద్దరు అమ్ముడుపోవుట ప్రస్తుతము కష్టముకాదు. కాని ఈ ప్రాతిపదిక శిక్షణ వ్యాపకమై లక్షలకొలది పాఠశాలలలో నడవవలసి యున్నది. అప్పుడీ ఖద్దరంతయు ఎట్లు అమ్ముడు పోగలదు ? నేటి ఆర్థిక వ్యవస్థ గ్రామపరిశ్రమల కనుకూలమైనచో ఇబ్బంది లేకపోవును. కాని అది అట్లు కానిచో ఎట్లు ?

ప్రాతిపదిక విద్యాలయములలో తయారయిన ఖద్దరు ప్రభుత్వ విద్యాశాఖవారు కొన్నచో వస్త్రముమీద ప్రభుత్వము పెట్టు ఖర్చు పెరుగును. ప్రభుత్వము దానిని బజారులో అమ్మినచో అది బజారుధరకే అమ్ముడుపోయి ప్రభుత్వమునకు నష్టము కలుగుచుండును. ఒకవైపున స్కూళ్ళ కాతాలో ఆదాయము కన్పించును. రెండవ వైపున ప్రభుత్వపు కాతాలో అంతయెక్కువ ఖర్చు కన్పించును.

కావున నాకు తోచిన దేమనగా పాఠశాలలలో నూలు వడుకు, నేత ముఖ్యపరిశ్రమలుగా నుండవలెనన్న మనము దాని ఆదాయమును రూపాయిలలో లెక్కకట్టక ఎన్ని గజములనూలు, ఎంత ఖద్దరు తయారయినది- అని చూచుకొని సంతోషించుట మంచిది"

## పురుషకారమువలన కాల్పనికము వాస్తవికముగా మారును

శ్రీ జాజూజీ ఉత్తరము సుదీర్ఘముగా నున్నది. అందలి ముఖ్య విషయములన్నియు ఇచ్చట తెలుపబడినవి. భావస్పష్టతను దృష్టిలో

నుంచుకొని ఆయన దీనిని వ్రాసిరి. మనమును ఆ దృష్టితోనే దీనిని గ్రహింపవలెను. కాని నా కందు క్రొత్తవిషయ మేమియు కన్పించలేదు. "నూలు వడకుట, నేతవలన పాఠశాలకగు ఖర్చును పూడ్చవలెనను విషయము ఖాదీధర ఎక్కువగుటపై ఆధారపడి యున్నది. కావున అది కాల్పనికము," అను ఆక్షేపము ఇప్పటికి 12 సం. ల క్రితము నవీన విద్యాప్రణాళిక తయారగు రోజులలో ప్రొఫెసర్ కె. టి. షా చేసి యుండెను. ఆ ఆక్షేపమునకు సమాధానముకూడ నీయబడెను. ఇచ్చట కాల్పనిక వాస్తవికముల మధ్యగల భేదము కేవలము పురుషకారమే. అనగా నేడు కాల్పనికముగా కన్పించువస్తువే పురుషకారముచే రేపు వాస్తవిక దృష్టిలోనికి రావచ్చును. అట్టి పురుషకారము కొంత చరఖా సంఘము చేయుట చేతనే ఖాదీకి ఒక బజారు ఏర్పడినది. అది ఇంకను ఎందుకు వ్యాపకము కాలేదనగా పురుషకారము వ్యాపకము కాలేదు కనుక. ఈ సంకోచితమైన దానిని వ్యాపకమైనదానినిగా మార్చుపని నవీన విద్యద్వారా జరుగవలసి యున్నది.

## చైతన్య విషయముగాని చింతా విషయము కాదు

నవీనవిద్య మనకొక మేకువంటిదైన అహింస అనగా స్వరాజ్య శక్తి సుత్తి వంటిది. ఈ రెంటిని కలుపుటచే ప్రస్తుతమున్న అనర్థకారక మగు అవ్యవస్థ నశించి తగిన ఆర్థిక వ్యవస్థ ఏర్పడగలదు. లక్షలాది స్కూళ్ళు ఖాదీ ఉత్పత్తిచేసినచో ఆ ఖాదీ అంతయు ఏమగునని చింతింప నవసరములేదు. ఎందుకనగా అప్పటికి క్రాంతికూడ జరిగియే యుండును. ఇట్టి క్రాంతినే మనము జరుపవలసి యున్నది. కావున మనకిది చింతా విషయము కాదు. చైతన్య విషయము.

## నిలకడలేని రూపాయివలన భ్రాంతి

మనము చరఖా సంఘములోని ఖద్దరు ధరలనుబట్టి ప్రాతిపదిక పాఠశాలలోని ఉత్పత్తికి లెక్కలు కట్టుచున్నాము. ఇది అందరికిని

తెలిసినదే. కనుక ఇందు భ్రాంతి చెందవలసిన కారణమేమియు లేదు. ఆ విధముగా ఉత్పత్తిని రూపాయలలో చెప్పుట వ్యర్థము. దీనికి కారణము ఖద్దరు ధరలకు నిలకడలేకపోవుటకాదు. రూపాయికి నిలకడలేకపోవుట అనునది యిప్పుడందరికి తెలిసినవిషయమే కాన ఎక్కువ వివరించవలసిన ఆవశ్యకత లేదు. అయినను భ్రాంతితో నున్న ప్రపంచమునకు భ్రాంతియే ఆధారమగు చున్నది. స్వప్నములో వ్యాధి వచ్చినచో స్వప్నములోనే దానికి చికిత్సకూడ జరుగును. మేల్కొన్న పిమ్మట వ్యాధియు లేదు. చికిత్సయు లేదు.

## విద్యాశాఖయొక్క ఆదాయము

పాఠశాలలో ఉత్పత్తి అయిన సరుకును ప్రభుత్వము తన అవసరముల కుపయోగించుకొన్నచో విద్యాశాఖలో ఆదాయము, తక్కిన శాఖలలో వ్యయము కన్పించునని చెప్పుచున్నాను. అట్లే జరుగవలెనని నేనందును. విద్యాశాఖ ధనము సంపాదింప గలిగినప్పుడు అది దాని పేరుమీద కన్పించవలసినదే. ప్రజలమీద భారరూపముగానున్న తక్కిన శాఖలుకూడ ఆ విధముగ స్పష్టముగా కన్పించవలసినదే. ఎవరి బాధ్యతలను వారు నిర్వహించవలెను. అప్పుడే సత్యము రక్షింపబడును.

—"సర్వోదయ" అక్టోబరు 1949.

## : 50 :  ధర్మశిక్షణకు వ్యాఖ్యానము

### ఒక ప్రశ్న

శ్రీ ఆప్టే గురుజీ ఇట్లు వ్రాయుచున్నారు, "చిన్ని పిల్లలకు పాఠశాలలో ధార్మిక శిక్షణ ఏవిధముగా ఈయవలెను? అను ప్రశ్న తఱచు అడుగుచున్నారు. చాలమందికి దీనినిగురించి ఉపయుక్తమగు ఆలోచనలేదు. మహాత్ముల వచనములు కంఠస్థము చేయింపవలెను అను విషయమున అందఱును ఏకీభవింతురు. కాని ప్రాథమిక పాఠశాలలో ధార్మిక శిక్షణ ఎట్లుండవలెనను విషయమున స్పష్టీకరణము జరుగవలెను. అది సూత్ర రూపముగా నున్నను పని జరుగును."

### ధర్మశిక్షణకు నా ప్రణాళిక - మంచి ప్రవర్తనగల శిక్షకులు

ధార్మిక శిక్షణ మనోహరమైన విషయమనుట నిస్సందేహము. కాని నేడు 'ధర్మ' శబ్దముయొక్క అర్థము మిక్కిలి సంకుచితము, సంఘములో విభాగములు తెచ్చునది అయినది. ఈ హేతువుచేతనే బుద్ధిమంతులు పాఠశాలలలో ధర్మశిక్షణ పనికిరాదను పక్షమును సమర్థించుచున్నారు. నా దృష్టిలో నిజమైన ధర్మశిక్షణ చదువునకు సంబంధించినది కాదు, సత్ప్రవర్తన, దైవభక్తి, దేహాత్మ వివేకము, ఇదే ధర్మముయొక్క సారము. ఇది సత్పురుషుల సాంగత్యము వలననే లభించును. కావున సత్ప్రవర్తనగల శిక్షకులను కూర్చుటయే నేనిచ్చు ధర్మ శిక్షణకు గల ప్రణాళిక.

## ఆర్షవాఙ్మయము విరుద్ధమైన వాఙ్మయము

మహాత్ముల వాక్యములను కంఠస్థము చేయుట లాభదాయకమే కాని దానిని నేను ధర్మశిక్షణ అని పిలువను. దానిని విశుద్ధవాఙ్మయ శిక్షణ అందును. అందుకూడ వాక్యముల నెన్నుకొనునప్పుడు వ్యాపక దృష్టి అవసరము. "ప్రార్థనకు సంబంధించిన వివేకము"ను గూర్చి నేను వెనుక చెప్పియుంటిని. ఇక్కడకూడ అదియే వర్తించును.

## చరిత్రను, సంఘమును అధ్యయనము చేయుట

'సర్వధర్మ సమభావము' అను దాని ఆధారముపై ఆయా మతములలోని మహాత్ముల చరితములు, వ్రతములు, ఉత్సవములు మొదలయిన చిత్తశుద్ధిని కలిగించు పద్ధతులనుగూర్చి తెలియజెప్ప వచ్చును. కాని దీనినికూడ నేను ధర్మశిక్షణ అనను. దీనిని చరిత్రయొక్కయు, సంఘముయొక్కయు అధ్యయన మనవచ్చును.

## అనుభవపూర్ణమగు శిక్షణ

చిత్తశుద్ధి నేమాత్రము లెక్కచేయక కొన్ని తాంత్రికాచారములతోను, క్రియాకలాపములతోను, ఒక్కసారిగా పుణ్యమును సంపాదించు ఊహలు అన్ని మతములలోను నిరూఢములై యున్నవి. అవి నశించిపోవలెను. ప్రతి విషయమును అనుభవమను గీటురాతిపై ఒరసిచూచు అలవాటు పిల్లలలో ప్రవేశపెట్టవలెను. ఇది సాధింపగల్గినచో ధర్మశిక్షణ అంతయు లభించినట్లే నేనెంచెదను.

"మరాఠీ హరిజన్", 9 మార్చి 1947.

## : 51 : శేషుని శక్తి

బాపూజీ నిర్మాణకార్యక్రమ మంతటిలో రాట్నమును సూర్యుని తోను, తక్కిన కార్యక్రమమంతయు ఇతర గ్రహములతోను పోల్చెను. ఈ రూపకములో నవీనవిద్యకు స్థాన మెచ్చట ? అని నా ఆలోచన. నవీనవిద్యను ఒక గ్రహమని చెప్పు ఆలోచన నాకు నచ్చలేదు. ఏ కారణముచే సూర్యునివెంట గ్రహపంక్తి తిరుగుచున్నదో, ఏ కారణముచే సూర్యుడు గ్రహమాలతో కలిసి తిరుగుచున్నాడో ఆ కారణమైన ఆకర్షణ శక్తియే మన ఈ రూపకాలంకారములో నవీనవిద్య కాగలదు. మన పనులన్నిటిలోను పరస్పరసంబంధమును కలిపి ఉంచు ఆకర్షణశక్తి వంటిదే ఇది. దీనినే మనము మనపౌరాణికభాషలో ఆదిశేషువని చెప్పు చున్నాము. సమస్త భూమికి, సృష్టికి శేషుడు ఆధారమని అంగీకరించు చున్నాము. దీని తాత్పర్యమిది. సృష్టికి ఆధారమును చెప్పుటకు మనము శబ్దము నెచ్చోటనుండి తేగలము ? శబ్దములుకూడ సృష్టిలోనివే కదా ! కావున సృష్టికాధారము శేషుడేనని చెప్పబడినది. అనగా "ఏదైతే మిగిలి యున్నదో" అది సృష్టికాధారము. శేషశబ్దమున కర్థము మిగిలియున్న వస్తువు. ఆయనకు వేయిముఖము లున్నట్లు ఎంచబడుచున్నది. ఎందు కన ప్రపంచములోని అన్ని పదార్థములును ఒకదాని నొకటి ఆకర్షించు కొనునట్లు చేయు ఈ శక్తి వేలకొలది దిక్కులలో పనిచేయుచున్నది. మన కార్యక్రమములో నవీనవిద్యయే ఆదిశేషువు. అనగా మన కార్య కర్తలందఱు తమతమ పరిశ్రమలలో ప్రవీణులగుటయే కాక నవీన విద్యాదృష్టిని అర్థముచేసికొనినచో వారు సేవాకార్యములో సఫలులు కాగలరు. ప్రతిచోట ప్రవేశమును పొందగలరు.

## అంతట ప్రవేశించుటకు సాధనము

ఇది ఎటువంటి సాధనమన, దీనిని మనము ప్రతిచోట ప్రవేశపెట్ట వచ్చును. దీని ఆధారముపై మన పని ప్రతిచోట పెరుగగలదు. నవీన విద్యద్వారా మన ఇతర కార్యక్రమముకూడ అన్నిచోట్ల ప్రవేశమును పొందగలదు. మన ఇతర కార్యక్రమముల నంగీకరింపనివారుకూడ నవీనవిద్య నంగీకరించుచున్నారు. అంత సులభము. అందరకు తేలికగా గ్రహించుటకు వీలయినది ఈ సాధనము.

## విధినిషేధములను తెలుపు హద్దులు

ప్రతి ఒకడును శిక్షకుడు కావలెనని, లేక కాగలడని నేను చెప్పుట లేదు. ఎందుకన దానికొక విశేషమైన యోగ్యత కావలెను. అయినను దాని వెనుకగల దృష్టి అందరికిని తెలియుట అవసరము. మన జీవిత ముతో సంబంధించిన జ్ఞానమును విడువరాదు. దానితో సంబంధించని జ్ఞానములో పడరాదు, అనునదే ఈ దృష్టి. ఈ విధినిషేధాత్మకమైన హద్దులు మనకొరకే. ఈ రెండు హద్దులును అనగా ఏది విడువరాదు. దేనియందు పడరాదు - అనునవి సాధింపబడినచో ఏపనిచేసినను దాని ద్వారానే మనము మనజీవితమును, పనిని పరిపూర్ణము చేయగల్గుదుము. లేనిచో మనము జడులమైనను అయిపోవుదుము. అనగా ఒకచోట స్థిర పడి పోవుదుము. లేదా నాలుగు వైపులా పరుగెత్తుచుందుము. కాని మన పని పరుగెత్తుటయు కాదు. జడుల మగుటయు కాదు. ఒక నిశ్చితమైన మార్గమున నిశ్చితమైన ప్రయాణము చేయుటయే మనపని. ఇది నవీన విద్యవలన జరుగగలదు.

## సమాధానము-సామంజస్యము-ఆనందము

నవీన విద్యద్వారా ప్రతిపనికి ఇతర కార్యములన్నిటితో సంబం ధము, అన్ని పనులకు మన జీవితముతో సంబంధము కలుగవలెను.

అపుడు మన జీవితము ఆనందమయమగును. అందు సామంజస్యము, సమాధానముకూడ నుండును. లేనిచో జీవితము ఏకాంగియై సమాధానము లేని దగును.

కార్యకర్తలు కొంతకాలము పనిచేసిన మీదట వారికాపని సరిపడక పోవుట చూచుచున్నాము. పిమ్మటవారు ఇతర సేవారంగములను వెదకుట ప్రారంభించుచున్నారు. ఒక సోదరుడు 20 సం. లు రాట్నపరిశ్రమలో గడపి నేడు గోసేవను చేపట్టుట కాలోచించుచున్నాడు. ఎందుకనగా రాట్నపరిశ్రమలో అతనికి సమాధానము కలుగలేదు. అతడు నన్ను సలహా అడిగెను. నేనిట్లు చెప్పితిని. ఈ ఆలోచన మంచిదికాదు. ఎందుకనగా నేటివరకు ఒక పనిద్వారా జ్ఞానము సంపాదించి దానిని విడిచి క్రొత్తజ్ఞానము సంపాదింప గోరుటచే అనగా ఏపనిలో నేటివరకు తపస్సు చేసితినో అది వదలి ఇంకొక తపస్సు ప్రారంభించుటచే జీవితము వ్యర్థముగ గడచిపోవును. కాని నవీన విద్యాదృష్టి కార్యకర్తకు ఉన్నచో తాను చేయుపనితోనే తక్కిన పనులనుకూడ జోడించవచ్చునని అతడు తెలిసికొన గలుగును. అపు డిక సమాధానము లేకపోవుటకు కారణ ముండదు.

సేవక్, జనవరి, 1949.

---

## : 52 :

# చరఖా యొక్క శాస్త్రోక్తమైన అభ్యాసము

నూలు వడకు పరిశ్రమ జాతీయమహత్త్వము కలదని అంగీకరించి చాలమంది స్కూళ్ళలో రాట్నము కూడ నేర్పవలెనను సూచనను ఆమోదించిరి. కావున స్కూళ్ళలో నూలువడుకు నేర్పించబడుచున్నది. కాని రాట్నము యొక్క అభ్యాసము శాస్త్రోక్తముగా జరుగవలెను. ఆ సమయమునకు ఏదో ఒక విధముగా కూర్చుండి నూలు తీసిన చాలదు. ఏ పనియైనను శాస్త్రోక్తముగా చేసినప్పుడే దాని ఉపయోగము; లేనిచో దానికేమియు ఫలముండదు. కర్మయొక్క విచిత్రగతి యిదే. స్కూలులో చరఖా అభ్యాసము శిక్షణ దృష్టితో జరుగవలెను. ఆ అభ్యాసములో ఈ క్రింది ముఖ్యవిషయములు ఆవశ్యకము :—

1. *పనియొక్క జ్ఞానము :* అనగా గింజలు తీయుట, ఏకుట, ఏకులు చేయుట, వడుకుట. ఈ అన్నిటిలోను సాధ్యమైనంత ఎక్కువ చురుకుగాను, చక్కగాను పనిచేయుట రావలెను. (ఈ నాలుగు విషయములు వడుకుటలో చేర్చబడవలెను.)

2. *కళా జ్ఞానము :* మిక్కిలి సన్నని నూలు తీయుట, ఒక్కొక్క చేతితో నూలువడుకుట, తిన్నని కదురుపై వడుకుట, అన్ని ఏళలు సమాంతరముగా నుండునట్లు ఏకుట, ఏకుచేయకుండగనే వడుకుట మొదలైనవి.

3. *ఉపాంగముల జ్ఞానము :* ప్రత్తి రాట్నము, దూదేకు సాధనము, రాట్నము, కదురు— వీనిని సరిచేయుటకు అవసరమైనంత వడ్రము, కమ్మరము మున్నగువాని జ్ఞానము.

4. *యంత్రశాస్త్రజ్ఞానము :* ప్రత్తి రాట్నము, దూదేకు సాధనము, రాట్నము—వీని అవయవములను తెలిసికొనుపాటి యంత్రశాస్త్రజ్ఞానము. ఒరపిడి యననేమి ? దాని నాపుట యెట్లు ? చక్రమునకు, కదురునకు ఏమి సంబంధము ? కదురెందుకు కదులును ? మొదలైనవి.

5. *రాట్నమును గూర్చిన అర్థశాస్త్రజ్ఞానము :* గ్రామనిర్మాణము, సంపత్తి విభాగము, నిరుద్యోగసమస్య, విదేశీ వస్త్రబహిష్కారము, ప్రత్తి పండు దేశములలో భారతదేశస్థానము, స్వావలంబనము, స్వరాజ్యము మొదలైనవానిని బట్టి నూలు వడుకు ఉపయోగమును పరిశీలించుట.

6. *నూలు వడుకు చరిత్రజ్ఞానము :* నూలు వడుకు కళపుట్టుక, వికాసము ఎట్లు జరిగెను ? హిందూదేశములో ఈ కళ ఏ విధముగా లుప్తప్రాయమైనది ? మొదలైనవి.

7. *మతదృష్టితో తెలియవలసినది :* నూలు వడుకు విషయములో హిందూ బౌద్ధ మహమ్మదీయ క్రైస్తవాది మతముల వృత్తి. స్వదేశ ధర్మము, విరోధరహిత జీవనము, నిరాడంబరత్వము, బీదలపై ప్రేమ, శ్రమ గౌరవము, అస్పృశ్యతానివారణము, నారీ గౌరవము మొదలైనవి.

ఇవి కొన్ని అంశములు. ఈ విషయము లన్నిటిని గురించి సంపూర్ణజ్ఞానము కలుగవలెను. నూలువడుకుకు ఒకవైపున వ్యవసాయము తోను, ఇంకొకవైపున నేతతోను సంబంధముకలదు. కనుక నూలు వడుకు జ్ఞానములో వ్యవసాయము (ప్రత్తిపంట మొదలైనవి), నేత-వీని సామాన్యజ్ఞానము కూడ చేరునట్లు చూడవలెను.

'మధుకలీ' నుండి

---

## : 53 : గ్రామీణవిద్య-నాగరికవిద్య

నేడు విద్యనుగూర్చి ప్రజలలో చాల చర్చ జరుగుచున్నది. ఆలోచనాశీలురు ఆలోచనలో పడిరి. కాని ఈ విషయము మిక్కిలి సరళమైనది. మన ప్రజలలో చాలమంది పల్లెటూళ్ళలో నున్నారు. కావున ప్రజాసామాన్యమునకు గ్రామీణపద్ధతిలోనే విద్య నేర్పవలెను. దానివలన గ్రామములు బాగుపడును. పట్టణములలో ఉండువారి దృష్టికూడ గ్రామములవైపు మళ్ళి వారికిని గ్రామములకును నడుమ చక్కని సహయోగమును పెంపొందించు విద్య నగరవాసులకు లభింపవలెను. అట్లుకాక నగరవాసులవిద్య ఒకపద్ధతిని, గ్రామవాసులవిద్య ఇంకొక పద్ధతిని నడిచి ఇద్దరిలో విరోధమేర్పడినచో అది దేశమునకు ప్రమాదకరము.

### జీవనమునకు మూలభూతమైన సమానత్వము

గ్రామజీవితమైనను పట్టణ జీవితమైనను మొత్తముమీద చాల విషయములలో సమానత్వమే కన్పించును. పంచభూతముల పరిణామము గ్రామవాసులపై కల్గినట్లే పట్టణవాసులపైనను కలుగును. అందేమియు భేదముండదు. పరిశుద్ధవాయువుయొక్క ఆవశ్యకత పట్టణవాసులకు ఇద్దరకు సమానముగనే ఉండును; ఉండవలెను. ఇద్దరికి సృష్టితో సంపర్కము లాభదాయకమే. పట్టణవాసులకు ఈ విషయము కొంత కష్టమైనను వారికొరకు ఏర్పాటు జరుగవలెను. ఆరోగ్యశాస్త్రావశ్యకత ఇద్దరికిని సమానము. నగరవాసులకొరకు ఆరోగ్యదృష్టిలో ఒక విధమైన ఏర్పాటు, గ్రామవాసులకు ఇంకొకవిధమైన ఏర్పాటు ఉండవచ్చునుగాని ఆరోగ్యముమాత్రము ఇద్దరికిని సమానముగనే అవసరము. పరస్పర సహకారము, ప్రేమ, త్యాగభావన-ఇట్టి ధర్మచింత ఇద్దరికిని సమానముగనే వర్తించును. ఇక భేదమేమన, గ్రామములో జీవితమునకు కావలసిన

మూలవస్తువులు తయారగును. కావున గ్రామీణబాలుర విద్య మిక్కిలి సహజముగనే సాగును. నగరములలో మూలపదార్థములు తయారుకావు. అప్రధానవస్తువులు తయారగును. కావున అచ్చటి విద్య ఆపదార్థముల పైన ఆధారపడవలసి యుండును. కనుక ఆ విద్యలో కొంత అప్రధానత ఏర్పడును. నాగరికవిద్యలో ఏర్పడిన ఈ అప్రధానత అచ్చటి జీవితము లోనే ఉన్నదగుటచే వానినికూడ గ్రామములవంటివిగా మార్చునంత వరకు తొలగింపజాలము.

## సృష్టినిపూజించు గ్రామములు, గ్రామములను పూజించు నగరములు

పట్టణవిద్యలో కొంత అప్రధానత ఉండితీరునని అంగీకరింతుము, కాని రెండు విషయములున్నచో ఆ అప్రధానత తీరగలదు. ఒకటి నగర వాసులు గ్రామముల కభిముఖులుగా నుండవలెను. రెండవది విదేశము లనుగూర్చి వారు బాగుగా తెలిసికొనవలెను. పట్ణణవాసులు విదేశభాష లతో కొంత పరిచయము కలవారై యుందురని విశ్వసింపబడుచున్నది. ఇందుచేత ఆభాషలతో బయలుదేరిన క్రొత్తక్రొత్త విషయములను వారు వాఙ్మయములోనికి తీసికొని రాగలరని ఆశించుట సహజము. అట్టివారి దృష్టి గ్రామాభిముఖముగా నున్నచో గ్రామీణులకు సేవచేయుట వారు తమ ధర్మముగా ఎంచుకొనగలరు. గ్రామీణులు సృష్టిపూజకులు అనగా పరమేశ్వరసేవకులు కావలెననియు, నగరవాసులు గ్రామసేవకులు కావలె ననియు నేనొక సూత్రమునే నిర్మించితిని. ఈ దృష్టి ఏర్పడినచో ఒకరి పరిపూర్ణత కింకొకరు సహాయపడుచు రెండుస్థానములకు వికాసము సాధింపవచ్చును.

## ప్రతి గ్రామములోను విద్యాపీఠము

ప్రతి గ్రామములోను పరిపూర్ణమైన విద్య లభింపవలెనని నా కాంక్ష. మనము యూనివర్సిటీలనియు, విద్యాపీఠములనియు పిల్చునట్టివి

ప్రతి గ్రామములోను ఉండవలెను. ఎందుకనగా ప్రతి గ్రామము, అది ఎంత చిన్నదైనను, ప్రపంచమునకంతటికి ప్రతినిధి. మొత్తము ప్రపంచ మంతయు సూక్ష్మరూపములో అచ్చటనున్నదన్నమాట. కనుక పూర్ణవిద్య అచ్చట లభింపవలెను. ప్రతి గ్రామమునకు సృష్టితో ప్రత్యక్షసంబంధము కలదు. కనుక మనుష్యునికి అన్నివిధములైన సృష్టి విజ్ఞానము అచ్చట లభింపగలదు. లెక్కలేనన్ని పశుపక్ష్యాది ప్రాణులతో సంపర్కముండును కావున మానవునికి కావలసిన ప్రాణిశాస్త్రపూరకజ్ఞానము అచ్చట లభించును. అచ్చట వ్యవసాయము జరుగును. వస్త్రములు తయారగును, రస్తాలు వీర్పడును, గ్రామపరిశ్రమలు నడుచును కావున ఆ వస్తువు లన్నింటి ద్వారా ఆ వస్తువుల కొరకు ఈ జ్ఞాన మవసరమగుచున్నది. ఆ జ్ఞానమంతయు గ్రామములోనే లభింపవలెను, అట్లు లభింపగలదు కూడ. గ్రామములో ప్రాచీనకాలమునుండియు మానవసమాజము నివసించుచు వచ్చినది కావున అచ్చట చరిత్రయు కలదు. సాంఘిక విజ్ఞానమును కలదు. గ్రామాలలో, పట్టణములలోకంటె ఎక్కువగా ఒకరితో నొకరికి సంపర్కమెక్కువ. కావున అచ్చట నీతిశాస్త్రము, ధర్మశాస్త్రము ఎక్కువ వికసింపగలవు. ఆత్మయొక్క వ్యాపకత్వము, పరస్పర సహకారప్రవృత్తి, సత్యనిష్ఠ మొదలగు నీతులు, ధర్మములు గ్రామములో బాగుగా కన్పించుచుండును. గ్రహములు, నక్షత్రములు, చుక్కలు ఆకాశములో చక్కగా కన్పించును. బహుశా పట్టణములలో వాని కాంతి అంత చక్కగా ప్రసరింపకపోవచ్చును. కావున గ్రామములలో కావ్యసాహిత్యము వికసించినంతగా పట్టణములలో వికసించుట కష్టము.

## సత్పురుషులు గ్రామదీక్షను వహింపవలెను.

మనము వ్యాస వాల్మీకి ఋషులను గూర్చి నేటి పట్టణ వాతావరణములో ఊహింపనైనజాలము. గ్రామములోను, గ్రామ పరిసరములలోను మాత్రమే వారి ఉనికిని ఊహింపగలము. శూరులు, త్యాగులు, అడవి

జంతువులతో పోరాడగలవారు గ్రామములలోనే ఉందురు కావున పరాక్రమవంతుల సేవకూడ గ్రామములనుండియే లభింపగలదు. దేశరక్షణ సైన్యములోనికి సైనికులు గ్రామములనుండియే లభించుచువచ్చిరి. ఇక ప్రశ్న యేమనగా ఇంత జరుగుచున్నప్పుడు గ్రామములో విద్యనేర్పుటకు కావలసిన సామగ్రినంతటిని మాత్రము మనము గ్రామములో తయారు చేసికొనలేమా? దీనికి సమాధానము, గ్రామములో లభించు వస్తువులలో నుండి కొంత సామగ్రిని మనము తప్పక గ్రామములో తయారు చేసికొనగలము. అయితే సామగ్రి అవసరము ఎక్కువ ఉండదు. పరిశీలన, పరిశోధన ఎక్కువ అవసరము. కనుక అప్పుడప్పుడు గ్రామీణ బాలురు పట్టణములోని యూనివర్సిటీకి వెళ్ళి అచ్చటి విషయములను కొన్నిటిని చూచుట కవకాశము కల్పించుకొనవలెను. అట్లే నగరవాసులు కూడ గ్రామములలోనికి వెళ్ళి అచ్చటి విషయములు కొన్ని నేర్చుకొను సమయము వచ్చును. కాని వీని యన్నిటికి నా దృష్టిలో ముఖ్యమైన విషయము సజ్జనులు, విద్వాంసులు అయినవారు గ్రామవాసమున కిష్టపడవలెను. సత్పురుషులలో గ్రామదీక్ష పెరిగినచో అగుపని ఇంకేవిధముగను కాదు. యూనివర్సిటీకి అవసరమైన విషయమేమనగా గ్రామగ్రామమునందు కొందఱు సజ్జనులు ఆలోచనాపరులైనవారుండవలెను. కనీసమొక్కొక్క సత్పురుష డొక్కొక్క గ్రామములో ఉండుట ప్రారంభించిన ఆ గ్రామమునకు విద్యాసౌకర్యము కలిగించుట ఏ విధముగను కష్టమైన పనికాదు.

## సన్యాసి-నడుచుచున్న విద్యాపీఠము

ఇంతేకాక గ్రామమునందలి ఏ వ్యక్తికి, ఏ సజ్జనునికి లభింపని రకరకములయిన జ్ఞానము గ్రామమునకు లభించు ఏర్పాటు మన పూర్వులు చేసియుండిరి. అది మనము కొనసాగించవలెను. అది పరివ్రాజక సన్యాసాశ్రమము. సన్యాసి ప్రతిగ్రామము తిరుగును. మూడు నాలుగు నెలలొకేచోట ఉండును. కావున గ్రామము లాలాభమును పూర్తిగా పొంద

వచ్చును. ఆతడు సర్వప్రపంచజ్ఞానమును, ఆత్మజ్ఞానమును అందరకు బోధించుచుండును. సన్యాసి అనగా 'వాకింగు యూనివర్సిటీ'- తిరుగుచున్న విద్యాపీఠము. ఆతడు అన్నిగ్రామములకును స్వేచ్ఛగా పోవును. విద్యార్థుల యొద్దకు స్వయముగా వెళ్ళి అందరకు ఉచితముగా విద్యాదానము చేయును. గ్రామస్థులు ఆతనికి సాత్త్వికము, స్వచ్ఛము, నిర్మలమునైన ఆహారము పెట్టెదరు. ఇంతకంటె ఆతనికేమియు అక్కరలేదు. అతనివలన పొందగలిగిన జ్ఞానమును గ్రామస్థులు పొందుదురు. జ్ఞానసంపాదనమునకు ఒక పైసయైనను వ్యయపరచవలసి యుండునెడల అంతకంటె దుఃఖకరమైన విషయమింకొకటి యుండదు. జ్ఞానము కలవాడు ఇతరులకు తాను బోధించుటకు మిక్కిలి ఆతురతతో నుండును. అది యితరులకు నేర్పువరకును అతనికి నిద్రపట్టదు. తల్లిదగ్గర పాలు త్రాగవలెనని బిడ్డకెంత కోరిక యుండునో, బిడ్డకు పాలివ్వవలెనుకోరిక తల్లికికూడ అంతగా నుండును. ఏలన ఆమె పాలిండ్లలో భగవంతుడు పాలు నింపియున్నాడు. ఒకవేళ రేపు బిడ్డలవద్దనుండి ఫీజు తీసికొననిదే తల్లులు పాలివ్వనియెడల ప్రపంచ మేమగును ?

## వానప్రస్థులయిన శిక్షకులు

ఉన్నత విద్యకొరకు పట్టణమునందున్న యూనివర్సిటీకి వెళ్ళవలసి యుండును. అక్కడ వంద రెండువందల రూపాయలు ఖర్చుపెట్టనిదే ఏమియు జరుగదు. ఈ విధముగా డబ్బు ఖర్చుపెట్టి పొందిన జ్ఞానము జ్ఞానము కాదని తెలిసికొనవలెను. డబ్బుపెట్టి కొన్న జ్ఞానము అజ్ఞానమే యగును. ప్రేమనిచ్చి సేవనిచ్చి మాత్రమే జ్ఞానము పొందబడును. డబ్బు ఖర్చుపెట్టి జ్ఞానమును పొందుటకే వీలులేదు. కనుక గ్రామముల వెంట తిరుగు జ్ఞానులను ఆయాగ్రామములోనివారు ప్రేమపూర్వకముగా మూడు నాలుగు రోజులు ఆపుచేసి, వారిని పూజించి, వారి యొద్దనున్న జ్ఞానమును పొందవలెను. ఈ పద్ధతియే సాధ్యమయినది.

ఏ విధముగా, నది తనంతటతానే ప్రజాసేవనిమిత్తము ప్రతి గ్రామము నకు పరుగెత్తివచ్చునో. ఏవిధముగా అడవులలో మేసి తమతమ పొదుగులలో పాలు నింపుకొని ఆవులు దూడలకు త్రాగించుటకై తమంతట తామే పరుగెత్తి వచ్చునో. అట్లే జ్ఞానవంతులుకూడ ప్రతిగ్రామమునకు జ్ఞానమును తీసికొని పరుగెత్తివత్తురు. ఇట్టి 'పరివ్రాజక' సంస్థ తిరిగి స్థాపింపబడవలెను. ఈ విధముగా ప్రతి గ్రామములోను యూనివర్సిటీ తయారై ప్రపంచమందలి జ్ఞానమంతయు ప్రతిగ్రామమునకు చేరగలదు. వానప్రస్థాశ్రమ మను సంస్థనుకూడ తిరిగి దృఢపరచవలెను. దానివలన ప్రతిగ్రామమందు నిలుకడగల శిక్షకులు లభింతురు. వారికై ఎక్కువ ఖర్చుపెట్ట నక్కరలేదు. ప్రతి గృహస్థుని యిల్లు ఒక స్కూలు. అతని పొలమే ప్రయోగశాల. ప్రతి వానప్రస్థుడు శిక్షకుడు. ప్రతి పరివ్రాజక సన్యాసి 'యూనివర్శిటీ'. నేర్చుకొనుటయందాసక్తిగల నేటి బాలురందరు విద్యార్థులు. ప్రతి గ్రామమందును ఒకటిరెండు గంటలు నేర్చుకొని తక్కిన రోజంతయు పనిచేయుచు గడపువా రున్నారు. ఈ విధముగా నాలుగు ఆశ్రమముల ప్రణాళిక ఏర్పడు చున్నది. ఈ సంపూర్ణప్రణాళిక బాల్యమునుండియు మరణము వరకు కావలసిన విద్యయొక్క ప్రణాళిక యని మా అభిప్రాయము.

## కృష్ణ కుచేలుల ప్రతీకము

గ్రామమంతయు తన సమస్త జీవనసమస్యలను తానే పరిష్కరించుకొనవలెను అనునది సర్వోదయ దృష్టి. ఇందు నిమిత్తము గ్రామములోని ఆస్తియంతయు ఏ ఒక వ్యక్తిదికాక గ్రామమునకు చెందినది కావలెను. అప్పుడే గ్రామములోని బిడ్డల కందరకు సమానముగా విద్య నిచ్చు ప్రణాళిక తయారు కాగలదు. ప్రతియొకనికి సమానమైన పౌష్టిక సాత్వికాహారము మనమివ్వజాలనిచో సమానముగా విద్యనుమాత్ర మెట్లివ్వ గలము ? కుచేలుడు బీదబ్రాహ్మణబాలుడు. కృష్ణుడు రాజకుమారుడు.

ఇద్దరు గురుకులమున చేరిరి. ఇద్దరకు సమానభోజనమే లభించెను. ఇద్దరికి సమాన శ్రమగల పనియే లభించెను. ఇద్దరికి సమానమైన విద్యయే నేర్పబడెను. ఏదయిన గ్రామములో మన విద్యాలయము ప్రారంభించినచో అందు ఒక పేదబాలుఁడు చిరుగుల గుడ్డలతోను, మరియొకడు మంచిగుడ్డలతోను వచ్చుట, ఒకబాలుడు ప్రొద్దుటే ఏమియు తినుటకు లభింపనివాడు, ఇంకొకడు తినికూర్చుండి సోమరియైనవాడు అయినచో మన స్కూలు నడచుటెట్లు? కావున అందరికిని సరియైన పద్ధతిలో విద్య లభింపవలెనని మనము కోరినచో గ్రామజీవితమంతయు ఒక కుటుంబజీవితమువంటిదగుట, గ్రామములోని సంపత్తియు బుద్ధియంతయు అందరికి ఉపయోగపడుట-ఇదియేమందు.

మనము నవీనవిద్యయని చెప్పునది భూదాన గ్రామపరిశ్రమలద్వారా సర్వత్ర ప్రకాశింపగల అహింసలో అంతర్భవించి యున్నది. ఇట్టి ప్రేమ, జ్ఞానము, వాత్సల్యము అను గుణములతో నిండిన గురువులు మన హిందూస్థానములోని ప్రతి గ్రామమునకు లభించునట్లు పరమేశ్వరుడనుగ్రహించుగాక!

అసురేశ్వర్ (ఒరిస్సా) 6 మార్చి 1955.

: 54 :

# నవీన విద్యవలన నవీన సంఘము

నవీన విద్యవలన మనమపేక్షించిన పనులు నెరవేరుటలేదని నేను కనిపెట్టితిని, దీనివలన శిక్షకులలోను విద్యార్థులలోను కొంత అసంతృప్తి కూడ కలదు. ఆవడి కాంగ్రెస్‌లో నవీన విద్యను గురించి తీర్మానము జరిగెను. నెహ్రూ పండితుడు స్వయముగా ఆ తీర్మానమును ప్రవేశపెట్టెను. 10 సం. ల తరువాత నవీన విద్యయే ప్రభుత్వవిద్య కాగలదు అని చెప్పబడెను. ఇందుచేత నేడు నవీనవిద్యను నేర్పు పాఠశాలలు నమూనాలు కావలెను, అప్పుడు వానినుండి మనమపేక్షించినది నెరవేరి హిందూదేశమంతటా వాని ననుకరించుట జరుగును. లేనిచో చెప్పునదొకటి, జరుగునదొకటి కాగలదు. నేడు "బేసిక్‌వాయిష్ట్ స్కూలు" లని చెప్పబడునవి ఎట్లొనర్చుచున్నవనగా వానిని నరసింహావతారములని చెప్పవచ్చును. పూర్తిగా మానవుడునుకాదు; పూర్తిగా పశువునుకాదు. కావున మచ్చుకు కొన్ని విద్యాలయములు నడుపుట చాల అవసరము. కాని దీనినిగురించి మాత్రము మనస్సులో స్పష్టమైనభావము లుండవలెను.

## దోషయుక్తభావనలు

బాలురకు కొంత పనిచెప్పుట, కొంచెము రాట్నము వడికించుట— ఇదే నవీనవిద్యయని చాలమంది అభిప్రాయము. జ్ఞానము విషయమై ఎక్కువ శ్రద్ధవహింపకపోవుటయే నవీనవిద్యయని కొందరు తలచుచున్నారు. జ్ఞానకర్మల సముచ్చయమే నవీనవిద్యయని మరికొందరి తలంపు, ఆ సముచ్చయము సహజముగా కుదిరినదా, లేదా ? అనికూడ ఆలోచింపనక్కరలేదు. ఈ మూడు భావములును దోషయుక్తములే !

## పనిలో ప్రావీణ్యము

నవీనవిద్య నేర్చుకొను విద్యార్థులకు ఏదో కొంచెము పని ఇచ్చి నంతమాత్రమున పని జరగదు. నవీనవిద్య నేర్చుకొను బాలురు, పనిలో చాల ప్రవీణులై యుందురు. చేప నీటిలో ఈదినట్లు వారు పనిచేయుదురు. నాలుగు గంటలు పనిచేసి తమ పొట్టకు సరిపడ సంపాదించుకొను ధైర్యము మన బిడ్డలలో కలుగవలెను. మచ్చుకు కొంచెము నూలు వడకుట నేయుట మాత్రము నేర్చుకొనిన పని జరగదు. మేము పనిలో ప్రవీణులము కావలసిన అవసర మేమున్నది? మేము స్కూలులో పాఠములు చెప్పువారముకదా, అని కొందరనవచ్చును. తల్లి చిన్నబిడ్డకు అన్న మెట్లుతినవలెనో నేర్పును. వారు నేర్చుకొనినపిదప అన్నము తిను విద్య వారికి వచ్చివేసినది కనుక ఇక వారు తినవలసిన అవసరము లేదని మనము చెప్పము. తినుట తెలిసినంతమాత్రమున పని పూర్తి కాదు. మనుష్యునికి ప్రతిరోజు భోజనము లభింపవలెను. మనుష్యునికి భోజన మెట్లు నిత్యావసరమో, అట్లే నవీన విద్యాశిక్షకులకును, విద్యార్థులకును నిత్యము నాలుగుగంటలు శరీర పరిశ్రమ అవసరము. వానికి పనిలో ఎంత ప్రావీణ్యము కలుగవలెనన్న గ్రామములోని వడ్రంగులు, రైతులు వారిదగ్గర నేర్చుకొనుటకు రావలెను. పనిముట్లు బాగుచేయు నేర్పుకూడ వారు సంపాదింపవలెను. వారు కృషికాచార్యులు కావలెను. నేడు గ్రామపరిశ్రమలు నశించినవి. కనుక నవీనవిద్యద్వారా పరిశ్రమలను తిరిగి నిలబెట్టవలెను.

## ఉంటే పదహారణాల జ్ఞానము, లేకపోతే అసలు లేదు

నవీనవిద్యలో పుస్తకములకు ప్రాధాన్యము లేదు. అట్లని జ్ఞానము నుపేక్షింపరాదు. ఇందు సహజముగా ఎంతజ్ఞానము లభించిన అంతే చాలునని తఱచుగా అభిప్రాయ పడుచుందురు. కాని ఈ అభిప్రాయము

తప్పు. నవీనవిద్యలో జీవితమునకు మూలభూతములగు సమస్త వస్తువులను గూర్చియు సంపూర్ణ జ్ఞాన మవసరము. సుదీర్ఘమైన చరిత్ర, నిష్ప్రయోజకులయిన రాజుల పేర్లు జ్ఞాపక ముంచుకొనవలసిన పనిలేదు. దీని వలన విద్యార్థుల నెత్తిపయిన అనవసరముగా బరువుపెట్టిన ట్లగును. కాని జీవితమునకు మూలభూతములును, జీవన వికాసహేతువులు నగు విషయములను తప్పక తెలిసికొనవలెను. తత్త్వజ్ఞానము, ధర్మచింత, నీతిబోధ మొదలయినవన్నియు తెలిసికొనవలసినవే. మన సమాజములోని విశేషము లేమి, ఇతర సమాజములోని విశేషము లేమి అను జ్ఞానముకూడ అవసరమే. విజ్ఞాన శాస్త్రములోని మూలసిద్ధాంతములు బాలురకు తెలియవలెను. వారికి ఆరోగ్యశాస్త్రము, ఆహారశాస్త్రము, పారిశుద్ధ్యము, పాకశాస్త్రము మొదలయిన వానిలో మంచి జ్ఞాన ముండవలెను. ఈ విధముగా నవీనవిద్యలో జ్ఞాన విషయమున ఎట్టి లోటును ఉండరాదు. చక్కని భాషాజ్ఞానముకూడ నుండవలెను. తన భావములను చక్కగా వ్యక్తీకరింపగల నేర్పుకూడ నుండవలెను. దస్తూరీ అందముగా నుండవలెను. సాహిత్యజ్ఞానము కలుగవలెను. ఈ విధముగా మన విద్యలో జ్ఞానమునకు లోటుండదు. అయితే వ్యర్థమైన జ్ఞానము ఉండదు.

నేటి విశ్వవిద్యాలయములలో విద్యార్థుల నెత్తిపై వ్యర్థమైన జ్ఞాన భారమును మోపి నూటికి 33 మార్కులు వచ్చిన ఉత్తీర్ణు లగుదురని చెప్పుచున్నారు. దీనికి అర్థము నూటికి 67 వంతులు మఱచిపోవుట కవకాశ మిచ్చుచున్నారన్నమాట. నిజమైన జ్ఞానమైనచో నూటికి నూరు పాళ్ళు రావలసినదే. నూటికి 80 పాళ్ళు బాగుగా వంటచేయగల వానినెవరయినా పెట్టుకొందురా ? అట్లే విద్యయందును అపరిపూర్ణత పనికిరాదు. జ్ఞానము ఉండుట, లేకపోవుట, అనగా ఉంటే పూర్ణముగా నుండుట, లేనిచో అసలే లేకపోవుట అన్నట్లుండవలెను. ఏ మనుష్యుడైనను నూటికి 80 పాళ్లు బ్రతికియుండి 20 పాళ్లు మరణింపగలడా ? బ్రతికియున్నచో పూర్తిగా బ్రతికియున్నట్లును, చచ్చినచో పూర్తిగా చచ్చినట్లును

లెక్క. నూటికింత అను లెక్క జ్ఞానములో పనికిరాదు. జ్ఞానము పూర్ణము, నిశ్చితమునైయుండవలెను. సంశయముతోకూడినది కారాదు. కాని మన విశ్వవిద్యాలయములలో నూటికి 67 పాళ్లు మఱచిపోవు అవకాశ మీయ బడినది. ఏలయన ఈ నేర్పబడునది పనికిమాలినదని వారికి తెలియును. నవీనవిద్యలో ఈ రీతిగా మఱచిపోవుట కవకాశముండదు. నేర్పబడిన దంతయు జ్ఞాపకముంచుకొనదగినదిగనే యుండును. ఆ జ్ఞానము జీవిత ములో ఉపయోగించునది కావున విద్యార్థి కూడ దానిని జ్ఞాపకముంచు కొనును. నిజమునకు విద్యను మనుష్యుడు మఱవనేమఱవడు; మఱచి నచో అది విద్యయేకాదు. ఈ విధముగా నవీనవిద్యలో మనము మఱపు దాని విద్యను నేర్పెదము. ఈ నవీనవిద్య నేర్చుకొన్నవారిలోనుండి మహాజ్ఞానులు బయలుదేరవలెను.

## జ్ఞానకర్మ సమవాయము

ఇక జ్ఞానమును, పనిని సమన్వయపరచు విషయము తీసికొందము. మేము 'సమవాయ' శబ్దమును సృష్టించితిమి. మట్టి, కుండవలె ఈ రెండును ఒకదానితో నొకటి ఎంతగా కలసియున్నవనగా రెంటిని విడ దీసి చూపుటకును వీలులేదు, రెండును ఒకటికావు. ఈ విధముగా ద్వైతాద్వైతనిర్ణయము చేయుటకు వీలులేనిసంబంధమును 'సమవాయ' మందురు. ఏ విద్యాపద్ధతిలో విజ్ఞానమునకు, పనికి సమవాయముండునో, ఆ విధముగనే ఇప్పుడు జ్ఞానబోధ జరుగుచున్నదా, కర్మాచరణ జరుగు చున్నదా అన్న ఫలానా అని చెప్పజాలని విధముగాను మనపద్ధతి ఉండును. జ్ఞానకర్మలలో భేదము పాటింపబడదు. జ్ఞానకాండ నడుచు చున్నప్పుడు కర్మకాండయు నడుచుచుండును, కర్మకాండ నడుచుచున్న ప్పుడు జ్ఞానకాండయు నడుచుచుండును. కర్మ, జ్ఞానము పడుగుపేకవలె ఒకదానితోనొకటి పెనవేసికొనియుండును కావున వానిని వేరే సమన్వయ పఱచవలసిన పనియేయుండదు. బైటినుండి జ్ఞానమును సంపాదించు

ప్రసక్తియుండదు. పనిద్వారానే జ్ఞానమునకు వికాసము, జ్ఞానముద్వారానే పనికి వికాసము కలుగుచుండును. ఇదే మన పద్ధతి. జ్ఞానకర్మలను కలిపి అతుకువైచిన పద్ధతికాదు మనది. మన పద్ధతిలో జ్ఞానకర్మలు ఒకదానితో ఒకటి పడుగుపేకవలె అల్లుకొనియుండును.

## నవసమాజనిర్మాణమే లక్ష్యము

నవీన విద్యా విషయములో గల భ్రమలను గూర్చి నేనిప్పుడు వివరించితిని. ఇప్పుడొక ముఖ్యవిషయమును గూర్చి ముచ్చటించెదను. నేటి సమాజనిర్మాణము నట్లే ఉంచి నవీనవిద్య బోధించుటకు వీలులేదు. నేటి సమాజనిర్మాణమునకు, నవీనవిద్యకు పూర్తిగా విరోధము, ఎవరైనను నవీనవిద్య విద్యావిధానములో ఒకపద్ధతి అనియు, పరిశ్రమద్వారా విద్య నేర్పు పద్ధతి అనియు చెప్పినచో అది తప్పు. నవీనవిద్య నవసమాజ నిర్మాణముచేయు విద్య. నేటి సమాజనిర్మాణములోనే నవీనవిద్యను ఇరికించి శిక్షకుల జీవితములలోని హెచ్చుతగ్గులు, డిగ్రీనిబట్టి వేతనములు అట్లే ఉంచినచో అది సాగదు. నవీనవిద్యలోనే శిక్షకుల జీవితములలో భేదమున్నచో 'స్టేటు' లో మార్పెట్లు రాగలదు? నేటి పరిపాలన (స్టేటు) యంత్రములో యోగ్యతనుబట్టి జీవితములు, తరగతులు ఏర్పడియున్నవి. నవీనవిద్య వీనికి స్వస్తి చెప్పును. నవీనవిద్య వానిని విరోధింపకపోయి నను, వానికి స్వస్తిచెప్పకపోయినను, అది నవీనవిద్యయే కాదు. నవీన విద్యలో శరీర మానసిక పరిశ్రమల నైతికార్థికయోగ్యతలు సమానములు గనే ఎంచబడును. అనగా నేటి ఆర్థికవ్యవస్థనంతటిని మార్చివేయవలెనని దీని అభిప్రాయము. దానిని మార్చుటయే నవీనవిద్య పని.

రాజసునాఖలా, పూరీ (ఒరిస్సా)
17 ఏప్రిలు 1955

## : 55 : బ్రహ్మవిద్య - పని

నేడు విద్య నేర్పువాడు కుర్చీమీద కూర్చుండుట, నేర్చుకొను వాడు బల్లమీద కూర్చుండుట, పుస్తకముద్వారా పాఠము చదివించుట జరుగుచున్నది. ఈ విధముగా విద్య నేర్చుకొనువాడు ఏ పని చేయుటకును అసమర్థుడుగా తయారగును. నేటి విద్యార్థులలో ఎవరికిని వంట చేయుట తెలియదు. ఇది నీచకృత్య మని, ఈ పని స్త్రీలదేకాని మనది కాదనియు, మనపని తినుటయే యనియు, కావుననే మనము గొప్పవారమనియు వారు తలచుచున్నారు. విద్యార్థులకు వంటచేయుటకూడ తెలియునట్టి విద్య నేర్పవలెనని మా ఉద్దేశ్యము. ప్రస్తుతము పాఠశాలలకు వేసవికాలములో సెలవు లీయబడుచున్నవి. ఎందుకనగా వారు ఎండలు సహింపలేరు. ఎండ, వాన సహింపలేనివారు పొలములో పని ఏమిచేయుదురు ?

### శ్రీ కృష్ణభగవానుని ఆదర్శము

కృష్ణభగవానుడు పనిచేయుచనే ఏ విధముగా విద్య సంపాదించెనో మన పిల్లలును అట్లే సంపాదింపవలెను. కృష్ణభగవానుడు గోవులను మేపెను, పాలు పితికెను, ఇల్లు అలికెను, శరీర పరిశ్రమ చేసెను. గురుకులములో కట్టెలుకొట్టు పని చేసెను, అర్జున సారథిగా గుఱ్ఱములకు మాలీసు చేసెను. రాజసూయ యాగము జరుగునపుడు ఆయన యుధిష్ఠిర మహారాజును నా కేదైన పని చెప్పుమని అడిగెను. యుధిష్ఠిరుడు మీకు చెప్పదగిన పని మా యొద్ద లేదని సమాధాన మిచ్చెను. కాని భగవానుడు నే నూరక కూర్చుండ దలచలేదని చెప్పగా యుధిష్ఠిరుడు మీకు కావలసిన పని మీరే వెదకుకొను డనెను. భగవాను డంతట

ఇట్లనెను- నేను ఎంగిలి ఆకులు ఎత్తి పారవేయుట, పేడనీళ్లపెట్టి అలుకుట అను పని ఎన్నుకొనుచున్నాను. నే నా పనికి తగుదును. చిన్నప్పటినుండియు ఆ పని చేసియున్నాను. నే నా పనిలో ఎం. ఏ. ను. ఈ విధముగా ఆయన ఎంగిలి విస్తళ్ల ఎత్తివేయుపని చేసినట్లు భాగవతములో శుకుడు, మహాభారతములో వ్యాసభగవానుడును వర్ణించిరి. ఆ కృష్ణభగవానుడే అవసరము వచ్చినపుడు అర్జునునికి బ్రహ్మవిద్యను కూడ ఉపదేశించెను.

## నేటి భోగైశ్వర్యపరాయణ విద్య

మన దేశమందలి విద్యార్థులు ఇట్లు తయారుకావలెను. ఇటు బ్రహ్మవిద్య గానము చేయుచుండవలెను; అటు చీపురుతో ఊడ్చుట, పేడతో అలుకుట, పొలములో పని చేయవలెను. నేటి విద్యలో ఇటు బ్రహ్మవిద్య పేరైనను లేదు. అటు ఏ పనియు చేతకాదు. బ్రహ్మవిద్య లేకపోవుటకు ఫలము మనమందరము విషయ భోగపరాయణుల మైతిమి; ఇంద్రియములకు దాసుల మైతిమి. చదువుకొన్నవా రందరు సుఖాభిలాషు లగుచున్నారు. వారి మనస్సులో భోగైశ్వర్యములపై ఎడతెగని ఆసక్తి స్థిరపడి యున్నది. విద్యలో పని ప్రవేశపెట్టబడని హేతువుచే చేతులు వృథా అయిపోవుచున్నవి. ఈ విధముగా ఆత్మజ్ఞానము లేకపోవుటచే బుద్ధి, పని లేకపోవుటచే చేతులు నిరుపయోగములు. ఇక విద్యావంతులు పది వ్రేళ్లతో పనిచేయుటకు బదులు చేతితో కలము పట్టుకొని మూడు వ్రేళ్లతో పనిచేయుచున్నారు. ఇట్టి విద్య అందరికి వచ్చిననాడు దేశ మేమి తినును ?

## బ్రహ్మవిద్య—పని

కనుక నేటివిద్య మారవలెను. ఇందు బ్రహ్మవిద్య, పని ఈ రెండు విషయములును కలిసియుండవలెను. బ్రహ్మవిద్యవలన ఆత్మజ్ఞానము

కలుగును. శరీరము, మనస్సు, ఇంద్రియములు వశములోనుండును. సర్వప్రపంచమును ప్రేమించు ప్రవృత్తి ఏర్పడును. స్వపరభేదము నశించును. ఈ చిన్న ఇల్లు నాది, ఈ పొలము నాది ఇట్టి భావములన్నియు నశించును. బ్రహ్మవిద్య సంపాదించినవాడు "నాది-నాది" అనడు. అతడు ఈ ఇల్లు, ఈ పొలము, ఈ సంపత్తి 'అందరిది' అనును. కాని బ్రహ్మవిద్య సంపాదించినవారు మాత్రము ఇది అంతయు 'నాది' అందురు.

మనము నేర్పు విద్యలో ప్రతి విద్యార్థి రెండు చేతులతో పనిచేసి స్వావలంబకుడగును. ప్రతి విద్యార్థి చక్కని వంట చేయగలవాడగును. విద్యార్థులందఱు పొలములో పరిశ్రమ చేయుదురు. నేడు దేశములో సోమరితనము పెచ్చుపెరిగి పరిశ్రమలన్నియు నశించినవి. మనకు చక్కగా పనిచేయువారు కావలెను. మంచి వడ్రంగులు కావలెను. నేత పనివారు కావలెను. ఇంజనీర్లు కావలెను. కమ్మర్లు కావలెను. చర్మకారులు కావలెను. సైనికులు. సేనాధిపతులు కావలెను. వ్యాపారముచేసి ప్రజలను రక్షించునట్టియు ఎవరినీ మోసగింపనట్టియు వర్తకులు కావలెను. ఏ వృత్తియు ఎక్కువకాదు; ఏ వృత్తియు నీచమైనది కాదు. అది హీన వృత్తి కనుక నేనాపనిని చేయను అని ఎవడును అనడు.

'నౌరంగపుర్' కోరాపుట్ (ఒరిస్సా)
5 జూలై 1955

---

## : 56 : నవీన విద్యయొక్క ఆదర్శము

విద్యార్థులకు గురువు దైవము. గురువుకు శిష్యులు దైవము. విద్యార్థులకు గురువువలన లభించు జ్ఞానమే సర్వస్వము అయిఉండును. వారికి సర్వస్వము గురుసేవయే. శిక్షకులకు సర్వస్వము విద్యార్థులకు జ్ఞానప్రదానము, వారి క్షేమచింత. వారికి సేవచేయుటవలన నా కింకొక ప్రయోజనము నెరవేరుచున్నదని గురువు తలంపరాదు. అట్లే గురుసేవ చేయుటవలన మా కింకొక ప్రయోజనము నెరవేరుచున్నదని విద్యార్థులును తలంపరాదు. అనగా విద్యార్థులకు గురుసేవ, గురువులకు విద్యార్థిసేవ అనునవి సంపూర్ణలక్ష్యము, ఏకమాత్రలక్ష్యము, అనన్యలక్ష్యముగానుండవలెను. ఇద్దరును కలసి పరమేశ్వరసేవచేయుచున్నట్లు అనుభూతి కలుగవలెను.

### సామూహిక జీవనము

దీనికి కొన్ని విషయములు మిక్కిలి లాభదాయకములు కాగలవు. ఉదాహరణమునకు ఇద్దరును కలసి వ్యవసాయము, బట్టలనేత, పారిశుధ్యము మొదలైన ఏదో ఒక ఉత్పాదనకార్యమునుచేయునెడల, ఇద్దఱకు సామూహిక జీవనము ఏర్పడునెడల అది చాల లాభదాయకమగు విషయము కాగలదు. అట్లే ఇద్దరునుకలసి అధ్యయనము, అధ్యాపనము చేయునెడల అదికూడ ఒక స్వతంత్రలక్ష్యమునకే. దీనిద్వారా మేము సంఘమునకు ఒకవిధమైన సేవచేయుచున్నామను అనుభూతి కలుగవలెను. ఇట్టి అనుభవము చదువు చెప్పుటలోను, పనిలోను కలిగిననాడు నేటి పుస్తకముల సమస్య ఉత్పన్నముకాదు. అనగా పై రెండువిధములైన అనుభవములవలనను ఆవశ్యకములైన పుస్తకములు అచ్చటనే తయారుకాగలవు.

## శాంకరభాష్య దృష్టాన్తము

మన వాఙ్మయములోగల ఉత్తమములైన భాష్యగ్రంథములన్నియు నిట్లే ప్రత్యక్షముగా జరిగిన అధ్యాపనకార్యములోనుండి బయలుదేరినవి. ఉదాహరణమునకు శంకరభగవత్పాదులు బ్రహ్మసూత్రములపై ఒక సాటిలేని భాష్యమును వ్రాసియున్నారు. అది సాధకులలో చాల ప్రసిద్ధమై యున్నది. తత్వజ్ఞానముపై ఇంత లోతైన గ్రంథము తరచు మనకు కన్పడదు. అయినను అది ఎంత ప్రసన్న సరళభాషలో వ్రాయబడిన దనగా జనసామాన్యము కొఱకు ఏ సాహిత్యవేత్త అయినను వ్రాసెనా ! అనిపించును. ఆయనవలెనే ఇతర ప్రపంచములో బయలుదేరిన గ్రీన్, కేంట్ మొదలైన తత్వజ్ఞానుల గ్రంథములు మిక్కిలి జటిలములు కాని శంకరాచార్యులవారి గ్రంథము ఎంత తేలిక అనగా నేను బాలుడకు సంస్కృతము నేర్చునపుడు మిక్కిలి ఆనందముతో దీనిని చదివించితిని. వారికి కూడ దీనిని తమ మాతృభాషలో చదువుచున్నట్లు అనిపించినది. దీనికి కారణము శంకరాచార్యులవారు తమ శిష్యులకు బ్రహ్మసూత్రములు బోధించి, పిమ్మట ఆ అనుభవముపై గ్రంథము వ్రాసిరి. వారు బోధించు సమయమున ఒక్కొక్క సూత్రముపై విస్తారమైన వివరణము చేసి యుందురు. దాని నోట్సు తీసికొని పిమ్మట సంక్షిప్తరూపమైన గ్రంథముగా వ్రాసియుందురు. ఇందుచేతనే ఆ భాష్యశైలి ఒక సంవాదము లేక చర్చ జరుగుచున్నదా అన్నట్లుండును. ఆ పుస్తకము చదువుచున్నప్పుడు రచయిత గ్రంథమును రచించెననియు, మనము దానిని చదువుచున్నామనియు అనిపించదు, ఒకానొక గురువు చెప్పుచున్నట్లును, దానిని మనము వినుచున్నట్లును కన్పించును.

## నా రచనలు

ఈ విధముగా అధ్యయనాధ్యాపనములు, పని, ఒక సాంఘిక సేవా దృష్టిలో జరిగినచో అందుండి పుస్తకములు తయారగును. నేను

నూలు వడకునుగూర్చి ఒక చిన్న పుస్తకమును ప్రత్యక్షానుభవముతో వ్రాసితిని. విద్యార్థులకు నేర్పుచు, పనిచేయుచు ఆ పుస్తకము వ్రాసితిని. "గీతా ప్రవచనములు" సాక్షాత్తు జైలులో కొందరు జైలువాసులయెదుట ఈయబడిన ఉపన్యాసములే. నాలో సేవ అను ఉద్దేశమే లేనిచో, ఈ విధమైన స్వాభావిక కార్యము గడవనిచో స్వతంత్రభావములతో నే నిట్టి పుస్తకమును వ్రాయజాలకపోదును. మనము ప్రతిదినము సాయంకాల ప్రార్థనలో స్థితప్రజ్ఞ లక్షణమును పఠించుచున్నాము. జైలులో ఒకనాడు వానినిగూర్చి కొంచె ముపన్యాసమిచ్చి దాని సారము బోధపర్చవలసిన దని నన్నడిగిరి. అప్పుడు కొందరు సోదరులయెదుట నేనా శ్లోకములను వివరించితిని. అదే 'స్థితప్రజ్ఞ దర్శనము' అను పుస్తకమయ్యెను. జైలులో నేను వ్రాసిన 'స్వరాజ్యశాస్త్రము' అను పుస్తకముకూడ ఇట్లే వ్రాయబడెను. ఒక సోదరుడు కొన్ని ప్రశ్నలు వేయగా అతనికి నేను చెప్పిన సమాధానములే ఆ పుస్తకముగా రూపొందెను.

ఈ విధముగా శిక్షకులు, విద్యార్థులు కలసి సమాజసేవ చేయు నుద్దేశ్యముతో అధ్యయనము, అధ్యాపనము, పని చేయునెడల వారి అనుభవము అక్కడితోనే ఆగదు. దాని లాభము ప్రపంచమున కంతటి కిని కలుగగలదు. ఈ విధముగా తయారగు గ్రంథములకు ఒక సాంప్ర దాయ మేర్పడి వాని పఠన పాఠనములు ఎడతెగకుండ సాగును.

## విచార మంథనము - ప్రయోగైక్యము

నవీన విద్యను బోధించు పాఠశాలలో విషయములను తరచి తెలిసికొనుట, వానిని ఆచరించుట - రెండును జరుగవలెనని మనమెల్లప్పు డును ఆశించుచున్నాము. గురుశిష్యు లిద్దరునుకలసి చేయు అట్టిచింతనము, మననము అనగా కలిసి చింతనముచేయుట, కలిసి పనిచేయుట వీనివలన ప్రపంచమునకు అనుభవయుక్తమైన జ్ఞానము లభించును. విచారమంథ నము, ప్రయోగము— ఈ రెండును ఒక్కటిగా కలిసిమెలిసిపోయినదానిని

'నవీనవిద్య' అందుము. కొంత విచారమంథనము మాత్రము సాగుచు, దాని ఆచరణకు ఆధారము లభింపనిచోట పురాతనవిద్యయే సాగుచున్న దని చెప్పవలెను. ఇప్పుడంతటను నడచుచున్నదిదే. ప్రత్యక్షమైన ఆచరణ సాగుచు ఆ ఆచరణకు సంబంధించిన ప్రయోగములు సాగుచు విచారమంథనము, చర్చ మొదలగునవి జరుగనిచో అది కర్మయోగ మగును. నేడు లెక్కలేనంతమంది కృషికులు శ్రద్ధతో చేయుచున్నదిదే. ఈ విధముగా ఇటుపైపున ఉన్న కృషికులును, అటుపైపున ఉన్న తత్వ జ్ఞానులును ఇద్దరును కలియగా ఏర్పడువారే నవీనవిద్యా శిక్షకులు, విద్యార్థులు.

## గోపాలకృష్ణుడు

ఈ సందర్భంలో నేను శ్రీకృష్ణభగవానుని ఉదాహరణ ఎందు కిచ్చితిననగా ఆయన తత్వజ్ఞానములో కేవలము తన పూర్వులనే అనుస రింపక దానిపై ఇంకను అభివృద్ధిచేసెను. ఆయనకుముందు జ్ఞానయోగము నడచుచుండెను, కర్మయోగము నడచుచుండెను, భక్తియోగము నడచు చుండెను; ధ్యానయోగము కూడా నడచుచుండెను. గుణవికాసప్రక్రియను కూడ సాంఖ్యులు వేరుగా ప్రచారముచేసిరి. వీనినన్నిటిని సమన్వయ పరచి కృష్ణభగవానుడు ప్రపంచము నెదుట ఒక క్రొత్తవస్తువు పెట్టెను. కావుననే మనము శ్రీకృష్ణుని జగద్గురువని పిలుచుచున్నాము. ఆయన ప్రపంచమున కొక క్రొత్తవస్తువు నిచ్చెను. ఆయన కర్మయోగము చేయు టలో పూర్వపు కర్షకకార్మికులనే కేవలమనుసరింపలేదు. దానిలోనింకను అభివృద్ధిచేసెను. ఆయన ప్రజలచే ఇంద్రపూజ మాన్పించి వారికి పర్వత పూజ నేర్పెను. ఆయన గోవుల కెంత ప్రతిష్ఠను కలుగచేసెననగా హిందూదేశములో ఆయనపేరు నేటికిని గోసేవతో సంబంధించియున్నది. ఏకనాథులవారు ఈ విషయము నతిభక్తితో ఇట్లు ప్రస్తావించిరి. రామచంద్ర ప్రభుని అవతారము అన్నివిధముల పూర్ణావతారమే. కాని ఒక్కలోటు

మాత్ర ముండిపోయెను. దానిని పూర్తి చేసికొనుటకు ఆయన కృష్ణావతార మెత్తెను. ఆ లోటేమనగా రామావతారములో గోసేవ కవకాశము లేక పోయెను. కనుక ఆయన కృష్ణావతారమెత్తెను. సమాజమందలి కర్మ యోగములో గోసేవారూపమైన వృద్ధిని ఆయన కలిగించెను.

## గోపాలకృష్ణుని కానుక

కృష్ణభగవానుడు తత్వజ్ఞానమందును, సాంఘిక రంగమందును, కర్మాచరణమందును అభివృద్ధిని కలిగించెను. ఆయన సమాజమునకొక నూతన తత్వజ్ఞానము, నూతన కర్మజ్ఞానమును ఇచ్చెను. అనగా ఆయన తత్వజ్ఞానమునకు పురాతనాధారము లేదనియు ఆయన అపూర్వవస్తువును ప్రపంచమున కిచ్చెననియు అర్థముకాదు. పురాతనాధారము ఉండనే యున్నది. కాని క్రొత్త పిండివంటను ప్రపంచమునకు చేసిపెట్టెను. ఆయనకు పూర్వము నేయి ఉండెను, బెల్లముండెను, గోధుమలుండెను. కాని ఆయన వానితో ఒక క్రొత్త మిఠాయి తయారుచేసెను. మిఠాయి తయారగుట అనగా నెయ్యి, బెల్లము, గోధుమలతో ఒక స్వతంత్ర వస్తువు తయారగుట. ఆయనకు పూర్వమున్న తత్వజ్ఞానమునకు సంబంధించిన మూలభూతములగు సిద్ధాంతములను కలిపి ఆయన తత్వజ్ఞానమను మిఠాయి తయారుజేసెను. ఆయనకు పూర్వము గోసేవాభావమే లేదని అర్థముకాదు. కాని ఆయన గోపూజకు స్వతంత్ర స్థానమిచ్చెను. గోసేవకు ఉపాసనారూపమునిచ్చెను. హిందూదేశమందలి సామాజిక క్షేత్రములో ఇది ఆయన ఇచ్చిన ప్రత్యేకమగు కానుక. ఇచ్చట నేను కృష్ణచరిత్ర చెప్పుటకు కూర్చుండలేదు. కాని ఉదాహరణముగా సామాజిక కార్యమంతయు ఆధ్యాత్మిక దృష్టితో చేయుచు తనజీవితములో జ్ఞానకర్మ ప్రవాహముల రెండింటిని సమ్మేళనము చేసికొనిన ఒక వ్యక్తిని చూపియున్నాను.

## ఆదర్శ శిక్షకుడు

ప్రాతిపదికవిద్యాబోధకుడీ ఆదర్శమునే ఎదుట పెట్టుకొనవలెను. ప్రాతిపదికవిద్యాబోధకుడే రైతుకంటె, ఏ నేతవానికంటె, ఏ వడ్రంగి కంటె తక్కువనేర్పరిగా నుండడు, సరిగదా ఎక్కువనేర్పరిగా నుండగలడు. రైతు, వడ్రంగి మొదలైనవారికి స్ఫురింపని విషయములు ఈతనికి స్ఫురించుచుండును. రైతు, వడ్రంగి మొదలైనవారు తమ పనిలో సాధింపజాలని గతిని వీరు సాధింపగలరు. పనిముట్లు బాగుచేయుటలో వారికి తోచని ఆలోచనలు వీరికి తోచుచుండును. రైతుకు తన భోజనము సంపాదించుకొనుటకు ఎనిమిది గంటలు పట్టిన, ప్రాతిపదిక విద్యాబోధకు డాపనిని నాలుగు గంటలలోనే చేయవచ్చునని చెప్పును. ఇంత అభివృద్ధి ఆతడు సాధింపవలెను. ఈ నడుమ నేనుచూచిన ప్రాతిపదిక విద్యా కేంద్రము లన్నిటిలోను ఉన్న శిక్షకులు కొన్ని పనులు తెలిసినవారే గాని అవి వారికి లాంఛనప్రాయముగా మాత్రమే తెలియును. చేప నీటిలో ఈదుచు ఆడినట్లు, ఆ శిక్షకులు తాముచేయు పనిలో ఈదుట అనగా ఆడుటలేదు. ఆ కృష్ణభగవానుడు యుద్ధవీరుడనగా ఆడుచుపాడుచు యుద్ధముచేయు వీరుడు; అట్లే సమర్థుడై ఆరితేరిన గోసేవకుడును. ఇట్టి కర్మయోగప్రయోగములు మన యీ విద్యాలయములలో జరుగవలెను.

## సహజ శిక్షణ

అట్లే మన విద్యాలయములలో జరుగు తత్త్వజ్ఞానచర్చయు ప్రతిభావంతమైనదై అందు నిత్యనూతన భావములు స్ఫురించుచుండును. సామాజిక తత్త్వజ్ఞానమం దెట్టిసంస్కరణలు చేయవలెను అను విషయమున ఆలోచనలు జరుగును.

నేడు ప్రపంచంలో సామ్యవాద చర్చ జరుగుచున్నది. సమాజవాదమునకు జెందిన అనేక పద్ధతులుకూడ ప్రపంచములో నడచుచున్నవి. మన ప్రభుత్వమును ఒక విధానమును అవలంబించు చున్నది. దానిని

వారు సమాజవాదమునకు సంబంధించినదని చెప్పుచున్నారు. సర్వోదయముకూడ ఒక విధానమే. ఇది మన ప్రాచీనస్మృతికారులు నిర్మించిన పద్ధతి. ఈప్రాచీనార్వాచీన జీవనపద్ధతులన్నియు అర్థము చేసికొనుట ఇక్కడ జరుగవలెను.

నవీనవిద్యవలన జ్ఞానప్రమాణము తగ్గి కర్మప్రమాణము హెచ్చునని కొందరి యభిప్రాయము. కాని వారి యభిప్రాయము తప్పు. ఇతర విద్యాలయములలో నేర్పబడు జ్ఞానము గుల్లవలె నిస్సారమనియు, ఇందలి జ్ఞానము సారవంతమైనదనియు వారు తెలిసికొనుట లేదు. ఈ రెంటింటి మధ్యను ఇంత పెద్ద భేదము కలదు. కారణము ఇందలి జ్ఞానము అనుభవజన్యము. అందది తర్కజన్యము. కావున ఆజ్ఞానములో సంశయ ముండును. ఈ జ్ఞానములో నిశ్చయ ముండును. అక్కడ తయారగు జ్ఞానవంతులకంటె తక్కువరకము జ్ఞానవంతులు ఇక్కడ తయారగుదురనుకొనుట పొరపాటు.

ఎచ్చట జ్ఞానకర్మల భేదమే నశించునో అచ్చట నవీనవిద్య యబ్బును. మా ఆశ్రమములో మేము భోజనమునకు కూర్చున్నపుడు భోజనముతోబాటు తెలిసికొనవలసిన విషయములపై చింతనమును, మంతనమును సాగుచునే యుండెను. వంటచేయుచున్నప్పుడు దానికి సంబంధించిన లెక్కలు సరిగ వ్రాసితిమి, భోజనమైన పిమ్మట మేమందరము ధాన్యము బాగుచేయుటకు కూర్చుంటిమి. ఆపని చేయుచునే చర్చయు సాగించితిమి. దానికి "చర్చామండలి" యని పేరు బెట్టితిమి. భోజనమైన పిమ్మట మనుష్యునికి కొంచెము విశ్రాంతి యవసరము. కావున, మేమాపనిని విశ్రాంతిగనే భావించి పనిలోని వేగమువైపు దృష్టిపెట్టక నిదానముగ పనిచేయుచుంటిమి. దానితోపాటే ప్రపంచమందలి సమస్త విషయములపైన చర్చసాగినది. కాని దానిని క్రమశిక్షణ యని పిలువలేదు. ఈ విధముగ శిక్షణ యీయబడినను అచ్చట విద్య

నేర్చుకొనుచున్నామను భావములేదు. అంత సహజముగ విద్యాబోధ జరిగెడిది.

## గురుశిష్యులు

విశ్వామిత్రుడు దశరథునియొద్దనుండి రామలక్ష్మణులను కోరినపుడు యజ్ఞరక్షకొరకు ఆ బాలురను పంపవలసినదియే కోరెను. రామలక్ష్మణులు ఆయనవెంట వెళ్ళునపుడు మన మీగురువునుండి జ్ఞానమును పొందవలసియున్నదను కోరికతో వెళ్ళలేదు. జ్ఞానార్జనయందలి కోరిక కూడ సకామభావనయే. కావుననే విద్యార్థులు గురుసేవయే సర్వస్వముగ తలపవలెనని మొదటనే, చెప్పితిని. జ్ఞానము సంపాదించుటకు గురుసేవ చేయవలెనను భావన పనికిరాదు. రామలక్ష్మణులు ఒక సేవాకార్యమునకై విశ్వామిత్రునివెంట వెళ్ళిరి.

## విశ్వామిత్రుని విశ్వవిద్యాలయము

సాయంకాలముకాగానే "ఇది సంధ్యాసమయము, మీరు సంధ్యావందనమునకు సిద్ధపడుడు" అని విశ్వామిత్రుడు చెప్పెను. సంధ్యావందనమైన పిమ్మట కొంత జ్ఞానచర్చకూడ జరిగెను. పిమ్మట విశ్వామిత్రుడు రామలక్ష్మణులకొరకు పర్ణశయ్యను తయారుచేయగా వారిద్దరును దానిపై నిద్రించిరి. రామలక్ష్మణులు రాజపుత్రులు. వారికి 16 సం. నిండలేదు. కనుక తండ్రికి ఎక్కువ ప్రేమపాత్రులు, అనుచిత్రమును దృష్టిలో పెట్టుకొని వారెట్టి శయ్యపై నిద్రించు అలవాటుకలవారో ఆలోచింపుడు. గడ్డిపరపుపై నిద్రించుటతో వారి విశ్వవిద్యాలయపు కోర్సు ప్రారంభమైనదన్నమాట.

మరునాడు తెల్లవారెను. నాలుగు గంటలై యుండును. సూర్యుడుదయించుట కింకను చాల వ్యవధియుండెను. అయినను విశ్వామిత్రుడు వారిని మేల్కొల్పెను.

కఠినమైన పని ! ఆ రాజపుత్రులను మేల్కొల్పుట యెంత కఠినమైన పని ! ఆ రాజపుత్రులను మేల్కొల్పుటకు వందిమాగధులు "ఇపుడే సూర్యుడుదయించుచున్నాడు. మధుపములు మధురగుంజనము నొనర్చు చున్నవి, కావున నో రామచంద్రా ! లెమ్ము" అని పాటలుపాడుచుందురు. కాని ఇచట సూర్యోదయమే కాలేదు. ప్రపంచమంతయు నిద్రలోనే యున్నది. ఇట్టి సమయమున విశ్వామిత్రుడు వారిద్దరిని మధురవాక్కులతో నిద్రలేపెను. ఆ సమయమున విశ్వామిత్రుని మనస్సులో "నేను నాబిడ్డల కమృతమును త్రాగించుచున్నానను భావన పనిజేయుచుండెను. ఈ బ్రాహ్మ ముహూర్తములో ఈ యమృతసమయమున వారు నిద్రించు చున్నచో వారి కమృతము త్రాగించుట యెట్లు ?" అని ఆలోచించి ఆయన వారిని మేల్కొల్పెను.

పిమ్మట ప్రయాణములో ఒక పాడైన ప్రదేశము కనబడగా ఇది పూర్వమొక పెద్ద ప్రదేశమనియు, కాని నేడు దానికీదశ యీ కారణముచే కలిగినదనియు విశ్వామిత్రుడు చెప్పనారంభించెను. ఈ విధముగ చరిత్ర పాఠము జరిగెను. చివరకాయన వారికి ధనుర్విద్య బోధించెను, ఇవన్నియుచేసి వారిచే యజ్ఞరక్ష చేయించెను.

రామలక్ష్మణులు తామొక విశ్వవిద్యాలయములో ప్రవేశించి విద్య సంపాదించుచున్నామని అనుకొనలేదు. వారు సేవచేయుటకు కర్మయోగ రంగమున నడుగుపెట్టిరి. అయినను సేవచేయుచుండగనే వారికి ఉత్తమ జ్ఞానము నేర్పబడెను. కాని మేము జ్ఞానదానము చేయుచున్నామను భావము జ్ఞానబోధచేయువారికిని లేదు; మనము జ్ఞానగ్రహణ చేయుచున్నామను భావము స్వీకరించువారియందును లేదు. అయినను చక్కని విద్య నేర్పబడినది, నేర్చుకొనబడినది. ఇదియే నవీనవిద్య కాదర్శము.

మిరగాణాగుడా, కోరాపుట్టి (ఒరిస్సా)
16 జూలై 1955

## :57 : విద్యకు మూడు అంగములు

ప్రస్తుతము విద్యాలయములందు నేర్పబడు విద్యలో విద్యార్థుల కేదో కొంత జ్ఞానము లభించుచున్నను స్వతంత్రముగా జ్ఞానమును సంపాదింపవలయునను విషయము నేర్పబడుటలేదు.

విద్యలో స్వావలంబనమునకు చాల మహత్త్వముకలదని అనేకులందురు. దీని విషయమున నా మనస్సులో చాల గంభీరమైన భావము గలదు. విద్యలో కొన్ని పనులు, శరీరశ్రమ నేర్పినచో బాలుడు స్వావలంబకుడు కాగలడు గనుక నేర్పవలెను అనుటయే నా భావము కాదు. శరీరశ్రమ యెట్లునుచేయవలసినదే. ప్రతిఒకనికి తనచేతితో పనిచేయుట నేర్పవలసినదే. అందఱును తమ చేతులతో ఏదోయొక పరిశ్రమ చేయుట ప్రారంభించినచో దేశములో వర్గభేదము లుండవు. దేశము సుఖవంతమగును. ఉత్పత్తియు, ఆరోగ్యముకూడ పెరుగును. ఈ విధముగ పరిశ్రమలవలన చాల లాభము కలుగును. కనుక కనీసము ఈ దృష్టితోనైనను విద్యలో స్వావలంబనమునకు స్థానముండియే తీరవలెను. ఇది అందరికిని తెలిసినదే. కాని నా ఉద్దేశ్య మంతేకాదు.

### స్వతంత్రప్రజ్ఞ కలుగవలెను

విద్యలో బాలురప్రజ్ఞ స్వయం వికసితమై వారు స్వతంత్రాలోచన కలవారుగా తయారగు పద్ధతి ప్రవేశపెట్టవలెనని నా మతము. విద్యలో ఇదే ప్రధానదృష్టిగా పెట్టుకొన్నచో మొత్తము విద్యాస్వరూపమే మారిపోవును. ప్రస్తుతము విద్యాలయములలో అనేకభాషలు, అనేక విషయములు బోధింపబడుచున్నవి. ప్రతి విషయములోను విద్యార్థికి సంవత్సరముల తరబడి ఉపాధ్యాయుల సహాయము అవసరమని తోచుచున్నది.

ఇట్లుకాక విద్యార్థులు ముందుకు వెళ్ళినకొలది స్వయముగనే జ్ఞానమును సంపాదించుకొను విధముగ విద్యాబోధ గరపవలెను. ప్రపంచములో జ్ఞాన మనంతము. జీవితమునకు ఆ అనంతజ్ఞాన మవసరము కాకపోయి నను చాలినంతజ్ఞాన మవసరము, కాని జీవనమున కుపయోగించు జ్ఞానము ఏ స్కూలునందైన లభించుననుకొనుట తప్పు. జీవనమున కుపయోగించు జ్ఞానము జీవనము నుండియే లభించును. విద్యార్థులలో ఆ జ్ఞానసంపా దక శక్తిని జాగరిత మొనర్చుటయే విద్యాలయములపని.

## స్వావలంబనమే ముక్తి

విద్యార్థుల తల్లిదండ్రులు అతనిని స్కూలువిద్య పూర్తిచేయుటకు ప్రోత్సహించుటలోని ఉద్దేశ్యము అతడు చదువుకొనిన ఉద్యోగము లభించుననియు దానితో అతని జీవితము చక్కగా సాగుననియు. విద్యను ఈ దృష్టితో చూచుట చాలపొరపాటు. విద్య జీవితమందలి యొక ప్రధానవస్తువు. విద్య ముక్తికొరకని చెప్పబడినది. ఈ ముక్తినే నేడు మేము స్వావలంబనమనుచున్నాము. ఇతరాలంబనములనుండి సమస్తమగు ఇతరాధారములనుండి విడుదల పొందుటనే స్వావలంబన మని చెప్పవచ్చును. నిజమైన విద్య లభించినవాడు నిజమైన అర్థములో ముక్తుడు, స్వతంత్రుడు కాగలడు. కనుక శరీరము నిమిత్తము కొంత విద్య అవసరము. దానికై కొన్ని పరిశ్రమలు నేర్పవలెను. అది స్వావ లంబనమునకు కనీసమగు అంగము. నూతనజ్ఞానమును సాధించుశక్తిని పొందుట అందలి మిక్కిలి మహత్వపూర్ణమైన యంశము.

## వికారవశత్వములో స్వావలంబనము లేదు

ముక్తికి అవసరమైన దింకొక మూడవ విషయముకూడ కలదు. అదియును శిక్షణ కొక అంగము. ముక్తికి పరాధీనత యెట్లు తగదో అట్లే వికారవశత్వమును తగదు. తన ఇంద్రియములకు దాసుడై వికార

ములను నిగ్రహింపలేనివాఁడు స్వావలంబకుడు లేదా ముక్తుడుకాజాలడు. కావున ఇది విద్యకు మూడవయంగము. దీని కొరకు విద్యలో సంయమము, దీక్ష, సేవ, మొదలయినవి చేర్చవలసి యుండును.

## స్వావలంబనమునకు మూడర్థములు

ఈవిధముగ స్వావలంబనమునకు మూడర్థములు గలవు. తన ఉదరపోషణమునకు ఇతరులపై ఆధారపడకుండుట - ఇది మొదటి యర్థము. స్వతంత్రముగ జ్ఞానమును సంపాదించుకొను శక్తి - రెండవ అర్థము. తనను తాను నిగ్రహించుకొనుశక్తి, ఇంద్రియములను, మనస్సును వశపరచుకొనుశక్తి కలుగవలెననుట - మూడవ యర్థము. శరీరము పరాధీనమగుట తప్పు. మనస్సు పరాధీనమగుట తప్పు. శరీరము పొట్టకొరకు పరాధీనమగుచుండును. కనుక మనుష్యుడు తన ఆ జీవికను సంపాదించుకొను జ్ఞానము పరిశ్రమద్వారా పొందవలెను. మనుష్యుని బుద్ధి స్వతంత్రముగ ఆలోచింపజాలని యెడల అతడు పరాధీనుడగును. కనుక అతనికి స్వతంత్రాలోచన శక్తి కలుగవలెను. మనస్సునకు ఇంద్రియములకు లోబడకపోవుటకూడ విద్యవలననే ప్రాప్తింపవలయును.

తల్లిదండ్రులు తమ బిడ్డల విద్యనుగూర్చి ఆలోచించునపుడు ఈ మూడు విషయములను ఎదుట నుంచుకొన్నచో వారి కెంతో సౌఖ్యము కలుగును. వారిబిడ్డలు సుఖవంతులు, సమర్థులునై ప్రజలలో వారికి గౌరవము కలుగుటయే తల్లిదండ్రులకు సంతోషదాయకమైన విషయము. కేవలము బిడ్డలకు ఉద్యోగము లభించుట, వివాహాదులకు ఏర్పాటు జరుగుట అయినంతమాత్రమున వారి విషయములో మన బాధ్యత అంతయు తీరిపోయినదని అనుకొనుట సరికాదు.

తెరువలి - కోరాపుట్టి (ఒరిస్సా) 20 ఆగస్టు 1955.

# : 58 : ఇరువదినాలుగుగంటలు ఆనందము

## విద్యయొక్క లయము

విద్యాలయమను మాటకు రెండర్థములు కలవు. ఒక అర్థము విద్యయొక్క లయమగుచోటు. అనగా విద్య లోపించినచోటు. రెండవ అర్థము విద్యయొక్క స్థానము, గృహములేక నివాసము అయిన చోటు.

మొదటి అర్థముగల విద్యాలయములు మనదేశములో వేలకొలది గలవు. విద్యార్థులు స్వయముగా చదువుచున్నారు, పరీక్షలిచ్చుచున్నారు. భేదిమందు పుచ్చుకొన్నారా అన్నట్టుగా జ్ఞానమంతయు బయటకుపోయి నశించుచున్నది. పరీక్షలో నూటికి ఎనుబది మార్కులు వచ్చినవానిని పదునైదుదినముల పిమ్మట కొన్నిప్రశ్నలడుగగా అతడు ఫేలయ్యెను. నేనే అతనిని పరీక్షించితిని. అతడు మాతో "పదునైదు దినములు గడచుటచే చాలమట్టుకు మరచిపోయితి" నని చెప్పెను. పరీక్షకొరకే చాల వరకు సిద్ధముచేసిపెట్టుకొందురు. పరీక్ష తేదీ పదునెనిమిది అయిఉండి పరీక్ష పదునేడవతేదీనేజరిగినపక్షమున కూడ పది, పదునేను మార్కులు తక్కువయే వచ్చును. మన విద్యాలయములో విద్యకు లయమే జరుగుచున్నదని శిక్షకులందరును ఎరుగుదురు. అయినను వారు "మేము నూరు రూపాయల విద్యను బోధించినపుడు అందు ముప్పదిరూపాయల విద్య శిష్యునకంటినదన్న అది ఎక్కువయే. కనుక మేము అతనిని ప్యాసుచేయుచున్నాము" అని చెప్పుదురు,

## కార్యక్రమమంతయు ఆనందముకొరకే

విద్యాలయ కార్యక్రమ మెట్లుండవలెనని ప్రశ్న. దానికి మా సూచన ఇది :

విద్యాలయములో పరమేశ్వరుని ఆనందస్వరూపము ప్రకటితము కావలెను. ఈశ్వరునిరూపము లనంతములైనను, అందు మూడు రూపములు ఎక్కువ ప్రసిద్ధములు. 1. సత్యము, 2. చిత్తు అనగా జ్ఞానము, 3. ఆనందము. కర్మయోగమునందును, ప్రపంచమందును, జీవితమందును సత్యము ప్రధానము; జ్ఞానులుండు గుహాలలోను, విద్వాంసుల పుస్తకాలయములోను జ్ఞానము ప్రధానము; భక్తిమార్గములో ఆనందము ప్రధానము. విద్యాలయమనగా భక్తిమార్గము. అనగా ఇచ్చట చేయబడు ప్రతిపనియు ఆనందముకొరకే చేయబడును.

## వంటచేయుటలోని ఆనందము

భక్తిమార్గమునకు వెలుపలనున్నవారు కూడ భోజనముచేయుటలో గల ఆనందమును అనుభవింపగలరు. కాని వంటచేయుటలోని ఆనందమును అనుభవింపజాలరు. పాఠశాల బాలురు మాత్రము ఆనందముకొరకే వంటచేయుదురు. అందు వారికి బాగుగా ఆనందము కల్గును. రొట్టె ఉబుకుట చూచి వారు చాల ఆనందింతురు. కట్టెలు మండుట, పాలు పొంగుట చూచుటలో వారికెంతో వినోదము కల్గును. అప్పడాల కట్టను గుండ్రముగా త్రిప్పుటచే రొట్టె గుండ్రముగా తయారగుట బియ్యము ఉడుకునపుడు అవి గిన్నెలో చేయు నాట్యము, ఇదంతయు చూచుట పిల్లలకు చాల సరదాగానుండును. ఈ ఆనందము నంతటిని అనుభవించుటకు వారు వంటచేయుదురు. దానిని ఆనందముకొరకే భుజింతురు. ఆనందముకొరకే లెక్కప్రకారము భుజింతురు. కూరలో ఉప్పు లెక్కప్రకారము వేయక ఎక్కువ పడవేసినచో ఆనందమెట్లు లభించును ? లెక్కప్రకారము ఉప్పు వేసినపుడే కూర రుచిగానుండును. భోజనమును పొట్టలోనికి కూరి మెక్కించినపుడు ఆనందము లభింపదు. కడుపునొప్పితో ఏడ్చుట, డాక్టరునుపిల్చుట అవసరమగును. ఈ కష్టము లన్నియు మనము పడదలచుకొనలేదు. మనము భుజించుట ఆనందము

కొరకే. ఇతరులు భుజించినమీదట పడు బాధవంటి బాధను మేము పడము. భోజనమైన పిమ్మట మేమెంతో ఆనందముతో పాత్రల శుభ్ర పరచెదము.

## అన్నిటికంటె శ్రేష్ఠమైన సాంస్కృతిక కార్యక్రమము

సోమరులు రాత్రి పది, పదకొండు కొట్టువరకు మేల్కొని సినీమాలు చూచుచు కష్టపడుచుందురు. మేమట్లు కష్టపడము. మేము సరిగా ఎనిమిదిగంటలకు ప్రకృతిమాత ఒడిలో ఆనందముగా నిద్రింతుము. దురదృష్టవంతులు రాత్రి ఆలస్యముగా నిద్రింతురు. తరువాత రాక్షసుడు వచ్చి గుండెలపై కూర్చున్నట్లు కలలుకందురు. మేము మాత్రము స్వప్నరహితమైన సుఖనిద్రను పొందుదుము. దానివలన చాల ఆనందము కల్గును, మా కార్యక్రమమే ఆనందపూర్ణము, ఎనిమిదిన్నర గంటలకు గంట మ్రోగగనే మేము నిద్రింతుము.

బోధగయలో సర్వోదయ సమ్మేళనము జరిగెను. అచ్చట పగలంతయు గొప్ప జ్ఞానవినోదము సాగెను. రాత్రి ఆనంద కార్యక్రమము తలపెట్టబడెను. సాంస్కృతికకార్యక్రమము జరుగునని చెప్పిరి. ఎప్పటినుంచి జరుగునని అడిగితిని. ఎనిమిది గంటలకు ప్రారంభమై రెండు గంటలు జరుగునని చెప్పిరి. మేము దానికి రాజాలమని చెప్పితిమి. మాకు రెండుగంటల సాంస్కృతిక కార్యక్రమము చాలదు, మా సాంస్కృతిక కార్యక్రమము ఎనిమిది గంటలకు ప్రారంభమయి మూడు గంటల వరకు జరుగును. ఏడుగంటల వరకు మేము అవిచ్ఛిన్నముగా నిద్రపోయెదము. అన్నిటికంటెశ్రేష్ఠమగు సాంస్కృతికకార్యక్రమమిది. నిద్రవలన కలుగు ఆనందమును పోగొట్టుకొనరాదు.

## బ్రాహ్మముహూర్తమందలి ఆనందము

ఉదయమున నాలుగు గంటలకు లేచుట అను కార్యక్రమము ఎంత ఆనందప్రదము. చలిలో లేచి పరుగెత్తెదము. అంతట చలికూడ పరు

గెత్తును. మనము నిద్రించుచున్నచో చలికూడ మనతోపాటు నిద్రించును. శరీరము గజగజ వణకుచుండును. మనము కూర్చున్నచో చలి కూడ మన ప్రక్కన కూర్చుండును. మనము పరుగెత్త నారంభించినచో చలి కూడ పరుగెత్తిపోవును. ఉదయమే లేచి పరుగెత్తుటలో ఉత్సాహము కల్గును. కనుక తెల్లవారుజామున లేచుటలో గల ఆనందము, పిమ్మట పరుగెత్తుటలో గల ఆనందము మేము విడువజాలము.

## ప్రాతఃకాల భోజనములోని ఆనందము

సూర్యోదయమైన పిమ్మట శరీరమును శుభ్రపరచుకొందుము, కన్నులు, చెవులు, ముక్కు కడుగుకొందుము. నగరవాసులు ముఖము కడుగుకొనుటకు ముందే టీ త్రాగుదురు. నిన్నటి పాత్ర తోమకుండ ఉంచినచో దానితోనే వంటచేయుట ఎట్లు జరుగును? మన ముఖము కూడ ఒక పాత్రయే. ఇట్టి మురికి నోటితో టీ త్రాగుటవలన దంతములు చెడిపోయి చీముపట్టి అవి భోజనముతోపాటు కడుపులో ప్రవేశించును. చక్కని పంచివంటలతో పాడు చీము కూడ లోపలకు ప్రవేశించును. దానితో రోగములు వచ్చును. అప్పుడు పండ్లు పీకించవలసిన పరిస్థితి ఏర్పడును. కనుక ఉదయమే లేచి శరీరమును శుభ్రపరచుకొందుము. దానికిముందేమియు తినము. పరిశుద్ధులమై కొంచెమల్పాహారము తీసికొందుము. ఏబది వస్తువులు పొట్టలో పడవేయము. ఏబదిరకములు పడవేసినచో జఠరమునకు ఏమిచేయవలెనో తెలియని పరిస్థితి ఏర్పడును. ఒకే వంటపాత్రలో కూర, పప్పు, బియ్యము ఉంచినచో ఎట్లు ఉడుకును? ఒకటి రెండుగంటలలో ఉడుకును. ఇంకొకటి నాలుగు గంటలలో ఉడుకును. మరియొకటి ఉడుకుటకు ఆరు గంటలు పట్టును. అట్లే అన్నము, పప్పు తిన్న నాలుగు గంటలలో అరుగును. పాలు రెండు గంటలలో అరుగును. ప్రతి వస్తువు అరుగుటకు వేరువేరుగా నియతసమయము పట్టును. అన్ని వస్తువులు కలిపి ఒక్కసారి పొట్టలో పడవేసిన చాల

గందరగోళము జరుగును. కావున ప్రాతఃకాల భోజనము కొంచెము తేలికగా తినవలెను.

## సేద్యములోని ఆనందము

భోజనమైన పిమ్మట మేము త్రవ్వుగోల తీసికొని ఆనందముతో పొలమునకు పోవుదుము. చక్కగా వ్యవసాయపు పనిచేయుదుము. పొలముపని చాల సరదాగా నుండును. విత్తనములు చల్లుట, మొక్క లున్నచో నీరు పెట్టుట, అక్కడక్కడ కత్తిరించుట, ఒకచోట మట్టి తీసి ఇంకొకచోట పోయుట ఈ మొదలయిన పనులుండును. పొలములో ఒకచోట దిబ్బ, ఒకచోట గోయి ఉన్నచో ఎట్లు పని జరుగును? దిబ్బను పడగొట్టి అంతయు సమానము చేయవలసి యుండును. బాల్యములోనే బాలుర వ్యవసాయములోని ఆనందమును అభ్యసించినచో పెద్దవారైన పిదప ఇతరానందములుకూడ వారికి లభించును.

## చదువులోని ఆనందము

పిమ్మట కొంత చదువుటవలన ఆనందము కల్గును; వ్రాయుట వలన ఆనందము కల్గును. కొంత భాగము వర్ణించుటవలన ఆనందము కల్గును. సంగీతము పాడుటవలన ఆనందము కల్గును. చిత్రకళవలన ఆనందము కల్గును. ఈ విధముగా మొత్త మిరువదినాలుగు గంటలును ఆనందమయ కార్యక్రమమే జరుగును. దీనిని భక్తిమార్గమందురు. ఇదే విద్యాలయమందలి కార్యక్రమముగా నుండును.

## అలసట ఉండదు, అలసతయు ఉండదు

నేడు బాలురను ఎనిమిదేసి గంటలసేపు మిల్లులలో క్రుక్కి, గను లలో దింపి పనిచేయించుచున్నారు. అనగా ఉదయము ఎనిమిది గంటల నుండి సాయంకాలము నాలుగు గంటలవరకు దుఃఖమయమైన కార్య

క్రమము. ఇదియైన తరువాత ఒక గంటసేపు ఆనందముగా వినోదింపుమని చెప్పుదురు. అట్లే స్కూలులో చేతికిని పనిలేదు. కాలికిని పనిలేదు. అదేపనిగా కూర్చుందురు. అయిదేసిగంటలు కూర్చుండుటచే పాపము పిల్లలకు కష్టము కల్గును. ఆరు దినములు స్కూలున్నచో ఒకరోజు సెలవు ఇవ్వవలెనని ఆలోచించిరి. అనగా ఆరురోజులు అలసట. ఒక రోజు అలసత, మా స్కూలుపద్ధతి ఇట్లుండదు. మా స్కూలులో సెలవులుండవు. ఎందు కనగా మా స్కూలులో ఎట్టి కష్టము ఉండదు. ఈవిధముగా మా జీవనములో అంతయు ఆనందమయ కార్యక్రమమే ఉండును.

కుజేంద్రీ (కోరాపుట్టి) ఒరిస్సా 29 సెప్టెంబరు 1955.

---

## : 59 : ఒక గంటచొప్పున నడచు విద్యాప్రణాళిక

### పఠనవర్గము, శ్రవణవర్గము

నేడు అయిదేసి సంవత్సరముల పిల్లల కొరకు నడుపబడు పాఠశాలలలో సమయము సద్వినియోగ మగుటలేదు. బాలురు అయిదేసి గంట లెడతెగకుండ వ్రాత, చదువు నేర్చుకొనుటవలన వారి కది తగని భార మగుచున్నది. ఆ స్కూళ్ళలోనికి పేదవారి బిడ్డలు వెళ్ళుటకు వీలు లేకుండ నున్నవి. అక్కడ లభించువిద్య నిరుపయోగము. కనుక మేము ఒక గంటమాత్రమే స్కూలు నడుపవలెనని సూచించితిమి. ఆ ఒక గంట ప్రాతఃకాలమున సూర్యోదయ సమయమై ఉండును. దీనివలన పిల్లలకు పగలంతయు పనిపాటలు చేసికొనుటకు అవకాశముండును. ఈ గంట స్కూలులో గ్రామములోని పిల్లలందరు, బీదవారిపిల్లలుకూడ, రాగల్గుదురు. ఇది ప్రాతఃకాలమందలి పఠనవర్గము. ఇట్లే సాయంకాలమున ఒక గంట వయోజనులకొరకు శ్రవణవర్గమునడచును. అనగా అందు చదువు, వ్రాత నేర్పబడదు. రామాయణము, భాగవతమువంటి గ్రంథములు చదివి వినిపింతురు. సత్పురుషుల చరిత్రములు, గాథలు కూడ విన్పింపబడును. గ్రామసమస్య లాలోచింపబడును. వ్యవసాయము మున్నగువానిని గురించి నూతన విషయములు తెలుపబడుచుండును. భజనలు, సంగీతము మొదలైనవి జరుగుచుండును. ఈ విధముగా ఒక గంట శ్రవణవర్గము నడచును. మానవజీవనమునకు కావలసిన జ్ఞానమంతయు దాని ప్రణాళికలో చేర్చబడును. విద్యార్థిదశలో నున్న పిల్లలందరు ఉదయపుస్కూలులోనికి పోవుదురు. పిమ్మట రెండవదశలో

సాయంకాలపు శ్రవణవర్గములోనికి పోవుదురు. రెండు తరగతులకును సెలవులు అవసరముండదు. ఏలన స్కూలు ఒక గంటమాత్రమే నడచును. నేడయిదేసి గంటలు నడచు స్కూళ్ళన్నిటిలో ఆరేసి నెలలు సెలవు లీయబడుచున్నవి. కనుక అవి రెండున్నర గంటల స్కూళ్ళే అన్నమాట. మాది ప్రతిరోజును ఉండు స్కూలు గావున మరచిపోవుట కవకాశము లేదు. అంతేకాక ప్రతిదినము తినుటవలన శరీరమునకు పుష్టి లభించినట్లును, ప్రతిదినము స్నానము చేయుటవలన శరీరము శుద్ధమైనట్లును, ప్రతిదినము కొంచెముకొంచెము చదువుటవలన మనస్సుకు సంతోషము కలుగుననుట అనుభవసిద్ధము. కనుక జ్ఞానాత్మకభోజనమునకు సెలవు అవసర మెంతమాత్రము ఉండదు. కాని అయిదేసిగంటలు స్కూలు పెట్టుటవలన సెలవు లవరసరమగు చున్నవి. ఈ విధముగా ఒక గంట నడచు స్కూళ్లు ఎక్కువ ఖర్చులేకుండ హిందూదేశమంతటా ఒక్క సంవత్సరములో స్థాపించవచ్చును.

ఈ గంట స్కూళ్ళలో పనిచేయు ఉపాధ్యాయులు కూడ పగలంతయు తమ పని చేసికొందురు. కనుక వారికి అంత ఎక్కువ జీతమివ్వవలసిన అవసరముండదు. వారు గ్రామమునకు ఒక గంట సేవ చేయుదురు కనుక గ్రామస్థులు వారికి సంవత్సరమున కొకసారి తమ పంటలో ఒకభాగ మివ్వవచ్చును. ఈ విధముగా ఇంచుమించు ఉచితముగనే ఆ స్కూలు నడువగలదని ఎంచవచ్చును. ఆ గంట స్కూలులో చెప్పబడు చదువు వ్యవసాయము, గృహపరిశ్రమలు మొదలైన గ్రామీణ జీవితమునకు సంబంధించినవై యుండును. ప్రతి యింట వంట తయారగుచున్నది; భోజనము జరుగుచున్నది. అదికూడ విద్యకొక సాధనముగనే ఎంచబడును. ఆహారశాస్త్రము మొదలగు విషయము లనేకములు దాని ద్వారా బోధింపబడును. గ్రామపారిశుద్ధ్యమను గ్రామవాసుల కర్తవ్యము కూడ విద్యాదానమునకొక ప్రధాన సాధనముగా గ్రహింపబడును. గ్రామములో ఏదైనవ్యాధి వ్యాపించినపుడు జరుగు రోగనివారణ కార్యక్రమము

కూడ జ్ఞానప్రాప్తికొక సాధనమగును. గ్రామములో నెవడైన మరణించి నచో అతని మృత్యువు కూడ జ్ఞానసాధనము కాగలదు. ఎచ్చటనైన అతివృష్టివలన పంట తగ్గినచో అదికూడ జ్ఞానసాధనమగును. గ్రామమునజరుగు ఉత్సవములు, పెండ్లిండ్లుకూడ జ్ఞానప్రాప్తికి సాధనమగును. గ్రామములో ఎవరినైన నొక పిచ్చికుక్క కరచినను, ఏదైన తగాదా జరిగినను, అవికూడ జ్ఞానప్రాప్తికి సాధనములగును. ఈ విధముగా గ్రామములోని ప్రతి సంఘటన, ప్రతి విషయము జ్ఞానప్రాప్తికి సాధనము కాగలదు.

ఇదంతయు ఒక గంటలో ఎట్లు జరుగునని మీరనుకొనరాదు. ఒకగంట ఉదయము, ఒకగంట సాయంకాలము ఈ విధముగా రెండు గంటలు జరుగు శ్రవణపఠనవర్గములలో చాల జ్ఞానము లభింపగలదు. ఇది నేను నా అనుభవముమీద చెప్పుచున్నాను. మేము చాలమంది పిల్లలకు చాల సంవత్సరములు విద్య నేర్పియున్నాము. అందు చాల మందికి ఒక గంటకంటె ఎక్కువ నేర్పలేదు. వారికి చక్కని జ్ఞానము లభించినది. వారు నేడు సమాజసేవలో నిమగ్నులయియున్నారు. సాయంకాలము జరుగు శ్రవణవర్గములో వృద్ధులు చేరుదురు. కాని పిల్లలు రాకూడదను నిషేధములేదు. కనుక పిల్లలకు ఉదయపు పఠన వర్గము, సాయంకాలపు శ్రవణవర్గము రెండిటి లాభమును కలుగును. ప్రతిరోజు రెండుగంటలు విద్యను గూర్చి వినుట, చదువుట, వ్రాయుట అనునవి లభించును. గ్రామాభ్యుదయ సమితి పక్షమున గ్రామములో గ్రామ పరిశ్రమలను గురించిన మంచి ఏర్పాటున్నచో తక్కిన సమయ మును ఆ పిల్లలు గ్రామపరిశ్రమలను నేర్చుకొనుటకు వినియోగింతురు. వారు తమతమ పొలములలో తమతమ పనులు చూచుకొనుచుందురు. ఈ పరిశ్రమల నన్నిటిని ఏర్పాటుచేయు పని స్కూలుది కాదు. ఇది గ్రామపంచాయతీ చేయవలసియుండును. గ్రామపంచాయతీనే మేము గ్రామాభ్యుదయసమితి అని పిల్చుచున్నాము. కనుక ఈ పనుల నిమిత్తము

అగు ఖర్చుయొక్క భారము స్కూలుపై పడక ఆ గ్రామమందలి గ్రామాభ్యుదయ సమితిపై పడును. ఇట్టి స్కూలులో డబ్బుయొక్క ఉపయోగము చాల తక్కువగా నుండును. అందలి పిల్లలు పనిలో కౌశలము కలవారగుదురు.

## సంధ్యాసమయము యొక్క మహత్త్వము

ప్రాతఃకాలమున ఒకగంటసేపు మనస్సు మిక్కిలి ప్రసన్నముగా నుండును. ఆ స్థితిలో విద్యార్థి ఏకాగ్రతతో విద్యనభ్యసింపగలడు. సాయంకాలము జరుగు శ్రవణవర్గములో మనోవినోదము, కథలు, భాగవతము, సంగీతము మొదలైనవి యుండును. దానిద్వారా ఏ విధమైన శ్రమ లేకుండ జ్ఞానము లభించును. శ్రవణవర్గములో కథలు మొదలైనవి వినిపించిన పిమ్మట చివర ఒక చక్కని భజన పాడబడును. దానికర్థము కూడ చెప్పబడును. దానినే మనస్సులోపెట్టుకొని పిల్లలు, పెద్దలు ఇంటికి వెళ్ళి నిద్రింతురు. జీవితావసానమున మనుష్యుడు ఈశ్వరుని భజించుచు చనిపోయినచో అతనికి శాశ్వతశాంతిలభించునని శాస్త్రకారుల వచనము. అంతకాలమున కింత మహత్త్వము కలదు. అవసానకాలమున ఆడుట, పాడుట, నవ్వుట మొదలైనవి పనికిరాదు. హృదయము భగవత్ప్రేమతో నిండి, మనశ్శాంతితో కూడిన స్థితిలో అవసానకాలము రావలెను. అప్పుడే ఉత్తర జన్మ ఉత్తమమైనది లభించును. పరమశాంతి కలుగును. జీవితావసానమునకువర్తించినసూత్రమేదినావసానమునకును వర్తించును. దినావసానమున రాత్రివేళ మనము నిద్రింపబోవుదుము. ఒకవిధముగా నిదికూడ మనకు దైనికమృత్యువు. మరుసటిరోజున భగవంతుడు మేల్కొల్పినచో మేల్కొందుము, మేల్కొల్పనిచో అదే మన సమాధి యగును. కనుక నిద్ర దైనికమృత్యువు. నిద్రించుటకుముందు భగవద్భక్తిలో బాగుగా తన్మయుడై మనుష్యుడు నిద్రించినచో దాని కెంతో ఫలము కలదు. స్వప్నరహితమగునిద్ర లభించును. శాంతి, ఉత్సాహము

కలుగును. కావున చివరి సమయమును అనగా నిద్రకుముందు సమయ మును మేము చాల ముఖ్యమని యెంచెదము. ఇందుకోసమే సాయం కాలపు శ్రవణవర్గములో ఒక చక్కని భజన జరుగును; దాని ధ్యాననాద ములో మగ్నులై పిల్లలు, పెద్దలు, స్త్రీలు అందరు భగవానుని ఒడిలో నిద్రపోవుదురు. ఇట్టి విద్యాప్రణాళిక మన మాచరింపగలిగిన దీనికంత ఖర్చు కాదు. ఈ జ్ఞానవిధానము వ్యాపకమై ప్రతి గ్రామములోను తొంద రలో పనిచేయగలదు.

ఉదయము, సాయంకాలము నడచు తరగతులలో ఒక్కొక్క గంట పనిచేయు శిక్షకులకు లేక ప్రబంధకులకు గ్రామస్థులు కొంత ధాన్యము సంవత్సరమున కొకసారి యిచ్చుచుందురు. కాని యిదికూడ ఇవ్వవలసిన అవసరము లేకపోవచ్చును. ఏలన మనము సంపత్తిదాన ముగా ఆదాయములో భాగము గ్రహించుచున్నట్లే, రోజుకొక గంట ప్రజలకు ప్రేమతో బోధించుట రూపముగా బుద్ధిదానమును గ్రహిం తుము. అప్పుడు శిక్షకు డేమియు అడుగడు. కాని ఆతని కవసరమై, గ్రామస్థులు సంవత్సరము మొత్తముమీద అతని కేదైన ఇచ్చినచో దాని నాతడు ప్రసాదమని తలచి స్వీకరించును. ఇట్టి పాఠశాలలకు పుస్తక ములు మున్నగునవి ప్రభుత్వ మివ్వదలచుకొన్నచో తప్పక ఈయ వచ్చును. అది వారి కర్తవ్యముకూడ. అందు చదువుకొను గ్రామస్థులు కూడ చదువు పూర్తి అయిన పిమ్మట తమ పుస్తకములు పాఠశాలకే సమర్పింతురు. ఈ విధముగా తమ శ్రవణపఠనముల తరగతులను అన్ని విధముల అలంకరించుకొనుట ప్రజలు తమ అదృష్టమనియే భావించుకొందురు.

సర్వోదయపురము (కాంచీపురము) 31 మే 1956.

## ప్రశ్నోత్తరములు

ప్రశ్న : గ్రామములో ప్రతిదినము ఒకగంట పాఠశాల చాలునని మీరు చెప్పితిరి. ఈమాత్రము సమయములో బాలురకు సంపూర్ణజ్ఞానము లభింపగలదా ? శారీరికదృష్టిచే గ్రామస్థులు సగమాకలితో నున్నట్లే (underfed) ఈ గంట చదువువలన మానసికముగాకూడ సగమాకలిగా నుండిపోరా ?

వినోబా : నిత్యము ఒకగంట బుద్ధిపరిశ్రమగల తరగతి బాలుర శిక్షణకు చాలును. శిక్షకులుకూడ తక్కిన గ్రామస్థులవలెనే స్వయముగా ఒకపని చేసికొని తను పొట్టపోసికొనువారై యుందురు కావున తక్కిన సమయమందుకూడ వారియొక్కయు, గ్రామస్థులయొక్కయు జీవితముతో సంపర్కముండి దానివలన బాలురేదో యొకటి నేర్చుకొనుచునే యుందురు. ఇది వదలివేసినప్పటికిని ఒకగంట నియతముగా జరుగు 'పాఠము' పిల్లలకు చాలును. తినుటకు అనగా అన్నమును శరీరములోనికి పంపించుటకు పట్టునంత సమయము. విద్యకును, అనగా, బుద్ధికిని, మనస్సునకు ఆహారము నందించుటకు చాలునని నేనొక సిద్ధాంతమునే స్థాపించితిని. తక్కిన సమయము భుజించిన దానిని అరిగించుకొనుపనికి ఉపయోగపడును. రోజుకు మనము మూడుసార్లు భుజించినను మొత్తముమీద భుజించుటకు మనకు గంటన్నరకంటె ఎక్కువ పట్టదు. అట్లే బుద్ధికి ఆహారము నందించుటకుకూడ ఇంతకంటె ఎక్కువసమయము పట్టకూడదు. ఒక గంటసేపటిలో బాగుగా నేర్పినచో బాలురకు ఎంతో జ్ఞానమును బోధించవచ్చును. దానినరిగించుకొనుటకు, అనగా దానిని మననముచేయుటకు వారికి చాల సమయము కావలసియుండును. విద్యయొక్క ప్రయోజనము నేడు చాలమంది అనుకొనుచున్నట్లు జ్ఞానదానము చేయుట కాదని మనము తెలిసికొనవలెను. విద్యయొక్క ఉద్దేశ్యము బాలురలో జ్ఞానము సంపాదించు

కొను శక్తిని పుట్టించుట, ఇది నెరవేరిన మీదట, అనగా జ్ఞానతృష్ణ కలిగినమీదట, తక్కినపని తేలికయే. అది విద్యార్థి స్వయముగా చేసి కొనును. కావున ఒక గంట సమయము ఈ పనికి చాలునని తెలిసికొన వలెను.

ఇంకొక విషయము కూడ మనము గమనింపవలెను. నేడు అయిదేసిగంటలు నడచు స్కూళ్ళలోకూడ సంవత్సరమున కయిదు నెలలు సెలవులు. కనుక అయిదు సగటుచేసినచో రెండున్నరగంటలే గ్రహింపవలసియుండును. ఇక మధ్యమధ్య సెలవు లున్నచో గ్రహించు టలో బాలునికి సమయ మెక్కువ పట్టును. మా 'పాఠశాల' నిత్యము ఒక గంట నడచును. అందలి శిక్షకులు కూడ నేటి ప్రాథమిక పాఠశాల లలో ఉపాధ్యాయులకంటె ఎక్కువ సమర్థులై యుందురు. నేటి విద్యా విధానములో ఇది విపరీతముగ నడచుచున్నది. ఉత్తమోత్తము లగు ఉపాధ్యాయులు కావలసిన ప్రాథమిక పాఠశాలలలో కనీసపు యోగ్యతల వారిని పెట్టుచున్నారు. కావున మొత్తముమీద మే మిచ్చు ఒక గంట శిక్షణ తక్కువగా నుండదు.

ప్రశ్న : మీరు చెప్పునది సామాన్య శిక్షణకు సరిపోవును. కాని ఒక గంట శిక్షణ 'ఉన్నత విద్య' కు తయారుచేయుటకు కూడ సరిపోవునా ?

వినోబా : నేను బాలురకు మొట్టమొదట ఉపనిషత్తే నేర్పితిని. ఇట్లు నిత్యము ఒక గంట బోధించుటవలన ఉత్తమోత్తమమైన జ్ఞాన మును కల్గింపవచ్చును. మేము చేసిన ఒక గంట పాఠశాలకు సంబం ధించిన సూచన ప్రాథమిక విద్యకొరకే. దానిని నేడు నాలుగైదు గంటల సేపు బోధించు ప్రైమరీ విద్యతోనే పోల్చిచూడవలెను, నేటి స్కూళ్ళలో బాలుర కెంత విద్య నేర్పబడుచున్నదో అంతయు మా గంట పాఠశాలలో వచ్చుచున్నదా, లేదా అని చూడవలెను. ఇంతేకాక ప్రతి గ్రామమందును 'యూనివర్శిటీ' యుండవలెనని నేను చెప్పియే యుంటిని. ఈ గంట

పాఠశాల అనునది సర్వసామాన్య విద్యకే చెప్పబడినది. కాని గ్రామములలో ఇంతమాత్రం చేతనే నాకు తృప్తి కలుగదు. ప్రతి గ్రామములోను ఆజన్మ మరణము జనులు నివసించుచు అన్నిపనులు జరుగుచున్నప్పుడు శిక్షణవ్యవస్థకూడ సంపూర్ణముగా నుండవలసినదే. సాధారణ విద్య గ్రామములోను, అంతకంటె ఉన్నతవిద్య జిల్లాలోను, అంతకంటె ఉన్నతవిద్య నగరములోను, అంతకంటె ఉన్నతవిద్య ఇంకెచ్చటనో అను ఈవిధానమే తప్పు. జననము మొదలు మరణమువరకు అన్నిపనులు గ్రామములోనే జరుగుచున్నప్పుడు అన్ని రకములయిన శిక్షణ సాధనములు అచ్చటనున్నవన్న మాటయే. కావుననే ప్రతిగ్రామమందును "విశ్వవిద్యాలయము" అనగా సాధ్యమైనంత ఉన్నత విద్యకు ఏర్పాటు ఉండవలెనని నా ఉద్దేశ్యమును ప్రకటించుచున్నాను.

*ప్రశ్న :* మీరు చెప్పినట్లు అత్యున్నతమైన తత్వజ్ఞానమునుగాని. సమాజశాస్త్రమునుగాని బోధించుటకు ప్రతిగ్రామమందును ఏర్పాట్లు చేయవచ్చును. కాని విజ్ఞానశాస్త్రమునకును, ఉన్నత సాంకేతికవిద్యకును, పరిశోధనకును కావలసిన యేర్పాట్లు ప్రతి గ్రామమందును ఎట్లు సాధ్యము ? దానికి కావలసిన సాధనసామగ్రి ప్రతిగ్రామమునకును ఎక్కడనుండి వచ్చును ?

*వినోబా :* ప్రతిగ్రామమందును యూనివర్శిటీ ఉండవలెనని చెప్పటలో నా అభిప్రాయము ప్రతిగ్రామమందును . ప్రతివిషయమునుగురించి సంపూర్ణజ్ఞానమును సంపాదించు ఏర్పాటుండవలెనని కాదు. నేడు యూనివర్శిటీలలోకూడ ఇట్లెక్కడ జరుగుచున్నది ? ప్రతి యూనివర్శిటీలోను ప్రతి 'ఫేకల్టీ' అనగా ప్రతివిషయమునందును ఉన్నతవిద్యకు పరిశోధనకు ఏర్పాట్లు లేవు. రెండుచోట్ల అటువంటి సమానమగు ఏర్పాటు ఉన్నప్పటికిని విద్యార్థులు ఆ విషయమున ఎక్కువ యోగ్యత కల గురువు లెక్కడ నున్నారో అక్కడికే పోవుదురు. ఇట్లే గ్రామ విశ్వవిద్యాలయములందును జరుగును. సామాన్యముగా అన్నిచోట్లను

అత్యున్నత విద్య కేర్పాట్లుండును. కాని అదవులెక్కువగా నున్నచోట్ల అటవీశాస్త్రము లేక దారుశాస్త్రము లేక ఓషధి విజ్ఞానమునకు సంబంధించిన 'ఫేకల్టీ' ఉండును. అది అన్నిచోట్లను ఉండుటకు వీలులేదు. ఉన్నతవిద్య అంతయు చాల మట్టుకు భౌతికసాధనములమీదనే ఆధారపడిలేదనికూడ మనము తెలిసికొనవలెను. ఉదాహరణమునకు జ్యోతిషశాస్త్ర జ్ఞానముకావలెనన్న ప్రతిరోజు దుర్భిణితో చూడవలసిన పనిలేదు. అప్పుడప్పుడు దానితో చూచుచుండిన చాలును. కనుక దుర్భిణి యంత్రమును ప్రతి గ్రామములోను స్థాపించుటకు వీలులేకపోయినను జ్యోతిశ్శాస్త్రమును ప్రతిగ్రామమందును నేర్పవచ్చును. దుర్భిణియంత్రము నొక కేంద్రస్థానమున స్థాపించి అవసరమైనపు డచటికివెళ్ళి ఉపయోగించుకొనవచ్చును.

పరిశోధనకు మూడు విషయము లవసరము. దార్శనిక వృత్తి, చేతితో పనిచేయు అభ్యాసము, కౌశలము, భౌతికసాధనములు. గ్రామములలో దార్శనికవృత్తి ఏర్పడుట కెట్టి యాటంకములును లేవు, అను సంగతి మనము చూచినదే. కార్యకౌశలమునకుకూడ అచ్చట కావలసినంత అవకాశము కలదు. ఎందుకనగా, అచ్చట ప్రతి పనివారు స్వయముగా చేతులతో చేయుదురు. భౌతిక సాధనములుకూడ ఎక్కువ భాగమచ్చట లభించును. ఎందు కనగా సృష్టియంతయు అచట తెరపిగా కన్పడును. అన్నిచోట్లను లభింపని సాధనములనుగూర్చి మేము పైననే చర్చించితిమి.

ఈ ప్రకారముగా ప్రతిగ్రామమందును సంపూర్ణమైన అనగా ఉన్నతోన్నతమైన విద్యకు పరిశోధనకు అవకాశముకలదు. ప్రతి గ్రామమందును దానికి ఏర్పాట్లు జరుగవలెను. దీనికి ప్రారంభము మొదటి మెట్టుగా గ్రామమునందును "గంటపాఠశాలలద్వారా" జరుగవలెను. నేడు విద్య సంకుచితమై యున్నది. విద్యను వ్యాపకమొనర్పవలెనన్నను అందరికిని జ్ఞానద్వారములు తెరవవలెనన్నను ఇట్లుచేసిననే అది సాధ్యమగును.

## :60: ప్రభుత్వ ప్రసక్తిలేని శిక్షణ

ఇప్పుడే మనమొక మధురమైన భజనకీర్తన వింటిమి. అందు భక్తుడు భగవంతునితో నీవు నా వెంట నున్నావుగనుకను, నేను నిన్నాశ్రయించితిని గనుక నేనెవరికిని భయపడవలసిన పనిలేదని చెప్పుచున్నాడు. కాని నేటి ప్రపంచపరిస్థితి ఎట్లున్నదనగా ప్రపంచమందలి చాల దేశములలో భయము వ్యాపించి యున్నది. దీనికి కారణమేమి? మనకు ఈశ్వరునిపై విశ్వాసములేక బలముమీద విశ్వాసముండుటయే కారణము. కనుకనే పెద్దపెద్దదేశములు శస్త్రాస్త్రసామగ్రిని పెంచుకొనుటలో తత్పరమై యున్నవి. రావణునిదగ్గరకూడ చాల శస్త్రాస్త్రములుండెను. కాని అతడు నిర్భయుడు కాడు. రామాయణములో అతడెక్కువగా వర్ణింపబడెను. వానరసేన సముద్రముదగ్గరకు రాగానే రావణుని హృదయమొక్కసారిగా భయముతో జలదరించెను. అతడు గొప్ప పరాక్రమవంతుడు. అతని సైన్యముకూడ శస్త్రబాహుళ్యముకలది. నేటి ప్రపంచపుస్థితియు ఇదే. ఎక్కువ శస్త్రములు కలవారును భయపడుచున్నారు. తక్కువ శస్త్రములుకలవారును భయపడుచున్నారు. తక్కువ ఆయుధములు కలవారు ఆయుధములను పెంచుకొన గోరుచున్నారు. మొదటినుండియు ఎక్కువ ఆయుధములు కలవారు ఇంకను ఆయుధములను పెంచుకొనుట ఎట్లో తెలియని స్థితిలో నున్నారు. ఈ విధముగా మొత్తము ప్రపంచమంతయు భయగ్రస్తమై యున్నది.

### ప్రభుత్వములు భయమును కలుగజేయుచున్నవి

ఈ భయమంతయు ప్రభుత్వములు కలుగజేయుచున్నవి. అవి ప్రజలను రక్షింపవలసినవిగా ఏర్పడుచున్నవి. ప్రజలను స్వావలంబ

కులుగా చేయుటకు బదులు ప్రభుత్వావలంబకులుగా చేయుచున్నవి. ప్రజలు వానివలన రక్షణ నపేక్షించుచున్నారు. ప్రభుత్వములు కూడ తాము రక్షకులమని అనుకొనుచున్నవి. హిందూదేశమందలి స్థితి ఇదే. పాకిస్తానమందలి స్థితి ఇదే. రష్యా అమెరికాలలోని స్థితి ఇదే. అమెరికాలో చాల పెద్దపెద్ద బాంబులు తయారగు చున్నవి. ఆమధ్య రష్యాలోకూడ తయారగుచున్నవి. మొన్ననే అమెరికా హైడ్రోజన్ బాంబును ప్రయోగించి చూచినది. రష్యాకూడ రెండుమూడు నెలలకుపూర్వము ప్రయోగము చేసినది. ఈ విధముగా ప్రయోగములు చేయుచు ఇవి లేకుండ దేశమును రక్షింపజాలమని ప్రజలకు నచ్చజెప్పుచున్నారు. ఇంత భయంకరమైన ఆయుధము లున్నవి కనుకనే ప్రపంచములో శాంతి యున్నదనియు, లేనిచో ప్రపంచములో శాంతి యుండనేరదనియు చెప్పుచున్నారు. శాంతి కూడ రక్షణకోరు వస్తువే అన్నమాట. అనగా శాంతికి ఎట్టి శక్తియు లేనపుడు అది రక్షితశాంతి యగును. అమెరికా ప్రజలలో దయ, కరుణ లేదని కాదు. అయినను అచ్చటి బాలురకు, ఈబాంబులవలననే ప్రపంచములో శాంతి యున్నదనియు, ఆయుధములు కారుణ్యముననే పనిచేయుచున్నవనియు నేర్పుచున్నారు.

## శాసన విముక్తి లేనిదే శాంతిలేదు

పిల్లలు మనమేది నేర్పిన అది నేర్చుకొందురు. ప్రస్తుతము ప్రపంచములో విద్యాశాఖ ప్రభుత్వ హస్తములలో నున్నది. ప్రతిచోట ప్రభుత్వమే స్కూలులో శిక్షణ ఇచ్చుచున్నది. దీనివలన ప్రజాభిప్రాయము ఏర్పడజాలదు. అనగా స్వతంత్రమైన ప్రజాభిప్రాయము ఏర్పడదు. ఫలతః ప్రజాస్వామ్యమని చెప్పబడునది నామమాత్రముగనే ఉండిపోవును. ప్రతి ఒక్కనికి "వోటు" వేయు నధికారము కలదు. ఈ అధికారము హిందూదేశము, పాకిస్తాన్, రష్యా, అమెరికా మొదలైన అన్నిచోట్ల ఉన్నది. అయినను ప్రభుత్వాధికారము మాత్రము కొద్ది

మంది చేతులలోనే యున్నది. వారు చేసినదెల్ల సరియేయని యెంచబడు చున్నది. వారే ప్రజాభిప్రాయమును నిర్మించుచున్నారు. వారే ప్రజలను ఆధారముగాను గ్రహించుచున్నారు. కనుక దీనినుండి విడుదల పొందు వరకు ప్రపంచములో శాంతి కలుగజాలదు. ఇందు కొఱకే భూదాన విధానం బయలుదేరినది. ప్రజల సమస్యలు ప్రజాశక్తిచే ప్రజలే పరిష్కరించుకొనవలెనను నది దీని సిద్ధాంతము. ఇందలి విశిష్టత ఇదే.

## ప్రభుత్వమే పరమేశ్వరుడు

నేడు ప్రయాణములో ఒక సోదరుడు ప్రభుత్వ మిది చేయుట లేదు, అది చేయుటలేదు, అని చెప్పుచుండెను. ఆతడు గ్రామప్రాంతము లలో సేవచేయుచున్నాడు. భక్తులేది మాట్లాడినను అందు భగవన్నామము వచ్చియే తీరును. ఏ విషయ మెత్తుకొన్నను భగవంతునిపేరు తలపెట్టుదురు. ఇదేస్థితి కార్యకర్తలలో కన్పించుచున్నది. ప్రతి విషయములోను ప్రభుత్వము పేరెత్తనిదే వారికి పని జరుగదు. ప్రభుత్వము పేరెత్తకుండ మాట్లాడుమని నీమము పెట్టినచో వారు మాట్లాడనే లేరు. వివాహ విషయము ప్రస్తావించినను ప్రభుత్వము పేరెత్తవలసినదే. జననమరణ ప్రసంగము వచ్చినను ప్రభుత్వమును తలపెట్టవలసినదే. వివాహశాసనములు, వారసత్వపు హక్కులు, సంఘసంస్కరణ విషయములు, భూమి పంపకసమస్యలు, రక్షణసమస్య ఇవన్నియు ప్రభుత్వము చేయుచునే యున్నది. ఇంతేకాక ఔషధవిషయముకూడ ఏర్పాటు చేయుచున్నది. వారేది పెట్టిన ప్రజ లది తినవలసినదే. వారేది నేర్పిన ప్రజ లది నేర్చుకొనవలసినదే. ప్రభుత్వము విద్య అను పేరుపెట్టినదానినే విద్య అని అంగీకరింపవలసినదే. అవిద్య అని పేరుపెట్టినదానిని అవిద్య అని ఒప్పుకొనవలసినదే. మనము కేవలము 'వోటు' వేయవలసినవారము. పిమ్మట మనము చేయవలసినదేమియు లేదు. ప్రతి గ్రామమునకు ప్రణాళిక ప్రభుత్వమే తయారు చేయును. మేము చెప్పదలచుకొనిన దేమనగా

ఇది చాల భయంకరమైన స్థితి. నేడు శాసనాధికారము కలవారు సజ్జనులు. ఇది మంచిదే. కాని సజ్జనులైనప్పటికిని సమస్తప్రజకు కావలసిన ఏర్పాటు కొద్దిమందిచేతులలో నుండరాదు. సజ్జనులు సలహా ఇచ్చువారుగనే యుండవలెను గాని పనిచేయించువారుగా నుండరాదు. నేటి ప్రభుత్వములు ప్రపంచమంతట తల్లిదండ్రులస్థానము నాక్రమించుచున్నారు. అన్ని దేశములలోను ఇదే జరుగుచున్నది. ఇట్లు జరిగినంతకాలము ప్రపంచములో శాంతిని ఆశింపజాలమని మా అభిప్రాయము. మాతో కలిసియుండువారుకూడ మా అభిప్రాయములను పూర్తిగా తెలిసికొనజాల కున్నారు. మేము సత్యమని తలచిన దానిని చెప్పక ఉండజాలము. నేడు ప్రజలు దాని నంగీకరించుట లేదని మేము చింతింపము. కాని నేడు మేము చెప్పినదానిని వారు విందురు. పిమ్మట కొన్ని సంవత్సరముల తరువాత బాబా ఈవిధముగా చెప్పెడివారని అనుకొందురు.

## చింతన వ్యాపకముగ నుండవలెను, ప్రభుత్వాధికారము పరితముగా నుండవలెను

హిందూదేశములో విద్య తక్కువని చెప్పరాదు. నిజమునకు అన్నిటికంటె మొదట హిందూదేశములో విద్య ప్రారంభమయ్యెను. కాని విద్యమీద ఎప్పుడును రాజుల కధికారములేదు. విద్య ఎట్లు బోధింపవలెనను విషయము గురువులు నిశ్చయించుచుండిరి. రాజులు వారికి సహాయము చేయుచుండిరి, రాజపుత్రులుకూడ వారి దగ్గరకు వచ్చుచుండిరి. గురువులు రాజపుత్రులను సామాన్య ప్రజల పిల్లలతోపాటు కలిపి ఉంచెడివారు. సామాన్య విద్యార్థులు భిక్షాటనమునకు వెళ్ళినపుడు రాజపుత్రులనుకూడ భిక్షాటనమునకు పంపెడివారు. ఆశ్రమము నడచుటకు రాజులు సహాయము చేయుచుండిరి కాని రాజపుత్రులకు విశేష సౌకర్యములు కోరెడివారు కారు. ఈవిధముగా హిందూదేశములో విద్య మిక్కిలి స్వతంత్రముగా నుండెడిది. సంస్కృత భాషాజ్ఞానము కలవా

రెల్లరును హిందూ మతములో ఎంత భావస్వాతంత్ర్యము కలదో ఎరుగుదురు. పరస్పర విరోధభావములుగల మత మింకొకటి యున్నట్లు మాకు తెలియదు. ఇతర మతములలో ఒకేభావము కలదు. కాని హిందూ మతములో కపిలుఁడు, కణాదుఁడు, జైమిని మొదలగు వారి సిద్ధాంతములు పరస్పర విరుద్ధములు. అయినను అవి హిందూమతమునకు విరుద్ధములని ఎవరును అనరు. నేడు తమిళనాడులో ఈశ్వరుని అంగీరింపనివారు కొందరున్నారు. కాని ఈ హేతువుచే వారిని ధర్మహీనులనుట తప్పు. ఇంత భావస్వాతంత్ర్య మిచ్చుటకలదు. దీనికి కారణము విద్య స్వతంత్రముగా నుండుట. విద్యపై అధికారాంకుశములేదు. నేడు సైన్యము ప్రభుత్వము చేతిలో నున్నట్లే విద్యకూడ ప్రభుత్వము చేతిలో నున్నది. ప్రభుత్వ మింతగా వ్యాపించియున్నది. ప్రభుత్వము వ్యాపకమైన ఆలోచన చేయుట మంచిదే. పూర్వప్రభుత్వములు వ్యాపకముగా ఆలోచించెడివికావు. అది మంచిదికాదు. కాని అధికారము వ్యాపకముగా నుండరాదు. పూర్వము ఆలోచనవ్యాపకముగా లేకుండెను. నేడు అధికారము వ్యాపకముగా నున్నది. ఆలోచన వ్యాపకమై అధికారము పరిమితము కావలెను. పూర్వము అధికారమును పరిమితమే, ఆలోచనయు పరిమితమే. మేము కోరునదేమన ప్రభుత్వముయొక్క ఆలోచన విశాలముగ నుండవలెను. వారి అధికారము పరిమితముగా నుండవలెను.

ప్రాతఃప్రవచనము, మకాము తెన్నేరి (చెంగల్పట్టు)
25 మే 1956.

---

# : 61 : నవీనవిద్యయొక్క సిద్ధాంతము

నవీనవిద్యయే నే నీ దేశమున కిచ్చు సర్వోత్తమమైన చివరి కానుక యని బాపు చెప్పుచుండువాడు. ఏ విషయమునయినను అతిశయోక్తిగ చెప్పుట బాపూజీకి అలవాటు లేదు. బాపూజీ తప్ప తనమాటలను చక్కగ తూచినట్లు ప్రయోగించు మనుష్యు డింకొక డున్నట్లు మాకు గుర్తులేదు. కావున ఆయన యేది చెప్పినను ఆయనదృష్టిలో సంపూర్ణముగా అది యథార్థ మన్నమాట. బాపూలో ఉన్న అన్నిటికంటె శ్రేష్ఠమైన గుణము ప్రతిభ. అనగా తర్కశక్తిపలనగాక స్వయంప్రజ్ఞ వలన ఆయన ఆవశ్యకతను గుర్తించెడివాడు. స్వరాజ్యము వచ్చినపిమ్మట ఏవేవి అత్యంతావసరములో వానినన్నిటిని ఆయన ప్రారంభించియుండెరి. రాజ్యము మారుటతోపాటు జెండా మారినట్లుగనే. రాజ్యము మారుటతో పాటు విద్యకూడా క్రొత్తది ప్రారంభము కావలెనని ఆయన అభిప్రాయము.

## "నవీనవిద్య" యను పేరేల ?

బాపూ దీనికి "నవీనవిద్య" అనుపే రేల పెట్టెను ? విద్యకు ముందు "నవీన" అను విశేషణము చేర్చుటలో ఉద్దేశ్య మేమి ? శిక్షణకు, జ్ఞానమునకు సంబంధించిన మూలభూతసిద్ధాంతము అనాదిసిద్ధమే కాని క్రొత్తదికాదు. కాని మధ్యమధ్య ఆ భావములు మందగించును. నవీనకాలముతోపాటు దానిని నవీన రూపములో ప్రకాశింప జేయవలసి యుండును. అప్పుడది నవీన వస్తువగుచుండును.

సత్యకామజాబాలుడు గురువుదగ్గరకు వెళ్ళినపుడు గురు వతనికి నేర్పిన మంత్రము మన మెరుగుదుము. 'గోసేవ చేయుము' అని ఆ

మంత్రము. అతనికి గోవులదయవలన జ్ఞానము లభించెను. తదుపాత నతనికి వృషభమువలన పక్షివలన జ్ఞానము లభించినది. ఈ మొదలైన కథ ఉపనిషత్తులో కలదు. గురు వతనిని నీ ముఖముపై జ్ఞాన తేజస్సు ప్రకాశించుచున్నది. నీ కీ విద్య ఎచ్చటనుండి లభించెనని అడుగగా అతడు "అన్యేమనుష్యేభ్యః" మనుష్యేతరులయిన గురువులు లభించిరి. అని చెప్పెను. మనకు మనుష్యులద్వారానే జ్ఞానము లభించునను అహంకారము కూడ పనికిరాదు. అంతేకాక మనుష్యునివలన మనకు లభించు జ్ఞానము ఒక అంశమాత్రమే.

## అనివార్య శిక్షణ

అనివార్య రూపముగను ఉచితముగను విద్యాదానము చేయుటెట్లని ఆలోచన జరుగుచున్నది. నేను చాలాసార్లు వినోదముగా ఇట్లనుచుందును: దీనినిగురించి మన మాలోచింప వలసిన పనిలేదు. భగవంతుడే ఆ ఏర్పాటు చేసియున్నాడు. అది చాలా గొప్ప ఏర్పాటు. దాని నాధారము చేసికొనియే మానవుడు నిలుచున్నాడు. అట్టి విద్యా ప్రణాళికను ఏర్పాటుచేయకయే భగవంతుడు మానవుని పుట్టించుట సంభవము కాదు. ఏదో ఒక ప్రభుత్వమ తయారై ప్రణాళిక వేసి అందరికి నిర్బంధముగ ఉచితవిద్య నేర్పగలదని భావించి పరమేశ్వరు డీ భారమును ప్రభుత్వముపై ఉంచియున్నచో ప్రపంచము నశించియే యుండును. కాని భగవంతుడు మనుష్యుని తలలో వివేకము, కడుపులో ఆకలి, హృదయములో అందరియెడల సహానుభూతి పెట్టియున్నాడు. అనగా ఈ సహానుభూతిగల హృదయము, వివేకముగల బుద్ధి, ఆకలిగల పొట్ట ఈమూడును జ్ఞానప్రాప్తికి సాధనములుగా లభించినవన్నమాట. ఈ ఆకలిని తీర్చుకొనుటకు సహానుభూతితో బుద్ధిపూర్వకముగ పనిప్రారంభింపవలెను. పని చేయుటకు వెళ్ళినపుడు అతనికి అనేకవిధములయిన జ్ఞానము కలుగును. పొట్టలోని ఆకలి యను దివ్యదానము భగవంతునినుండి లభింపక పోయి

నచో ఏ తాలిమి సంఘముగాని, ప్రభుత్వముగాని జ్ఞానము నీయజాలదు. దానిని మేము "నిర్బంధ విద్య" అందుము. ఈ విద్యను మనముపొంద నిచో మన ఆకలి తీరదు. హృదయములో సహానుభూతి ఉండదు; బుద్ధికి ప్రసన్నత కలుగదు.

## ఉచితవిద్య

పిల్లలు మాతృగర్భమునుండి జన్మింపవలెనని ఏర్పాటు. తల్లి బిడ్డకు మాతృభాష నేర్పును. దీనికై ప్రభుత్వ మొక గవ్వకూడ ఖర్చు చేయనక్కరలేదు. దానిని మేము ఉచిత విద్యావిధానమందుము. ఈ రెండువిధములయిన ఏర్పాట్లు భగవంతుడు చేసియున్నాడు. ఇక మనము చేయవలసినది గణితములో చెప్పబడు సున్న వంటిదే యని తెలుసు కొనవలయును. కావుననే నేను చాలాసార్లు "మనము విద్యాదాతల మని ఎవరయిన అనుకొన్నచో వా రింకను విద్య నేర్చుకొనవలసియున్నారని తెలిసికొనవలెను" అని చెప్పుచుందును.

## "నేర్పుట" అనుమాట తప్పు

ఒక శబ్దము శోధింపబడినది. దానినుండి భారతీయ మనోవృత్తి ద్యోతకమగుచున్నది. భారతరాజ్యాంగములో నిర్దేశింపబడిన మొత్తము పదునాలుగు భాషలలోను "నేర్పుట" అనుట కొక మాటయు లేదు. "నేర్చుట" అనుదానికి మాటలు కలవు. "నేర్పుట" అనగా నేర్చుకొను టలో సహాయపడుట. ఇది కృతకముగా తయారుచేయబడిన శబ్దము. ఇంగ్లీషులో ఉన్న "టీచ్" వంటి మాట మనభాషలో లేదు. మనము నేర్చుకొనగలము. నేర్చుకొనుటలో సహాయపడగలము. కాని "టీచ్" చేయజాలము. ఇంగ్లీషులో 'లెరన్' అని ఒకమాట 'టీచ్' అనిఇంకొక మాట కలవు. అనగా 'లెరన్' ఒక స్వతంత్రక్రియ. 'టీచ్' ఒక స్వతంత్ర క్రియ. ఇది అధ్యాపకుని అహంకారమునకు గుర్తు. ఈ

అహంకార మున్నంతవరకు మనకు విద్యయందలి తత్వము బోధ పడదు. కనుక ప్రారంభములోనే మనము ప్రపంచములో విద్యా విహీను డగు మనుష్యుడు లేనేలేడని తెలిసికొనవలెను.

## విద్యావిహీను డెవ్వడు ?

నేడు జరుగున దేమన మామూలు మెట్రిక్ ప్యాసయిన కుర్ర వాడు మంచి నేర్పుగల వడ్రపు పనివానినికూడ మూర్ఖుడని తలచు చున్నాడు. ఆ కుర్రవా డాతని ఇంటికి వెళ్ళి "మాయింటిలో పనియున్నది నీ కూలి ఎంత ?" అని అడుగును. అప్పుడు అతనిని 'నీ' కూలి అనునుగాని 'మీ' కూ లెంతండీ అని అనడు. అంత నేర్పుగల పని వానిని ప్రాజ్ఞతతో అనుభవముతో దేశసేవ చేయుచున్నవానిని, కేవలము ఆతనికి చదువుట వ్రాయుట తెలియదను కారణముచే 'నీవు' అనిపిల్చుట జరుగుచున్నది.

## భగవద్దర్శనము

మహమ్మద్ ప్రవక్తనుగురించి ఒక కథకలదు. ఒకసారి ఆయన ధ్యానసమాధిలో నిమగ్నుడయి యుండెను. ఆయన ఈశ్వరదర్శనమును కోరగా ఈశ్వరుడాయనకు ఒక కాగితము వ్రాసి ఇచ్చెను. మహమ్మదు ప్రవక్తకు చదువురాదు. కావున ఆయన నేను చదువురానిరాడను. కావున నాకు తమ దర్శనమే కావలెనని పరమేశ్వరుని ప్రార్థించెను. అప్పు డీశ్వరుడు స్వయముగా వచ్చి ఆయనకు దర్శన మిచ్చెను. తరువాత మహమ్మద్ ప్రవక్త ప్రజల కీకథ చెప్పి నేను చదువుకొన్నవాడనై యున్నచో నా కీశ్వర దర్శనము లభింపక ఈశ్వరుని ఉత్తరము మాత్రమే లభించియుండెడిది. నేను చదువుకొనలేదు కనుకనే నా కీశ్వ రుని దర్శన మయ్యెనని చెప్పెను. ఒక రైతులసభలో నే నొక ప్రశ్న అడిగితిని. మీరు పొలములలో స్వయముగా పనిచేయుచుందురు. చక్కగా

నాగలితో దున్ని పొలములు సిద్ధపరచుచుందురు. దానిపై సూర్యుని ఎండ పడుచుండును. తరువాత మీరు పరమేశ్వర దర్శనమునకు ఎదురుచూచు చుందురు. మీలో ఈశ్వరదర్శనముచేసిన వారందరు చేతులెత్తండి. అన గానే మొత్తము రైతులందరును చేతులెత్తిరి. నాకు ఈశ్వరదర్శన మయ్యెనా, లేదా? యని సంశయము కల్గిన రైతొక్కడును లేడు. వారికి దర్శనమయియేతీరును, వర్షము పడినపుడు సాక్షాత్తూ భగవంతుడు దర్శన మిచ్చుటకే కాక స్పర్శ ఇచ్చుటకుకూడ వచ్చినాడా - అనునట్లు వారికి తోచును. కాని ఈ దర్శనము లభింపనివారు మాత్రమే విద్యా వంతులని పిలువబడుచున్నారు. ఇట్టి విద్యావంతులనుండి భగవంతుడు మనలను రక్షించుగాక!

## నిరహంకారవృత్తి అవసరము

విద్యాదాన మను పని అహంకారములో చేయదగినదికాదు. దానికి నిరహంకారవృత్తి యెక్కుడి అవసరము. విద్యార్థికి సేవచేయుటకు శిక్షకు డెప్పుడును సిద్ధముగా నుండును. అతడు నమ్రుడై విద్యార్థికి సేవ చేయును. విద్యార్థియు నమ్రుడై గురువునుండి జ్ఞానము పొందును. వారు పరస్పరము సహచరులుగా నెంచుకొందురు. కనుకనే ప్రాచీన కాలమున ఇద్దరును కలసి భగవత్ప్రార్థన చేసెడివారు. ఇద్దరును కలసి "తేజస్వినావధీత మస్తు"- మాయిద్దరి చదువు తేజస్వంతమగు గాక - అని పల్కుచుండెడివారు. ఇందలి 'నౌ' అను శబ్దము ద్వివచనము, అనగా గురువు 'నేను బోధించుచున్నాను' అని తలపక 'నేనుకూడ చదువుకొనుచున్నా'నని అనుకొనుచున్నాడు, విద్యార్థి చదువుకొను చుండుట స్పష్టమే. అనగా మనమిద్దరమును కలసి జీవించుచు, కలసి చదువుకొనుచున్నామని అర్థము. విద్యార్థి, గురువు తనకు సహాయము చేయుచున్నాడని, ఆయనయెడ ఉపకారబుద్ధితో నుండును. గురువుకూడ విద్యార్థి తనకు సహాయము చేయుచున్నాడని అతనియెడ నుపకార

బుద్ధితో నుండును. పరస్పరము ఉపకారబుద్ధికల ఇద్దరు సహచరుల మధ్య విద్య సాగును కనుక నవీన విద్యలో పుస్తకముల స్థానము అప్రధానము. పుస్తకములపై ఆధారపడుటతగ్గి పోయినచో జ్ఞానసాధనములు తగ్గిపోయినట్లుగా ఎంచి జనులు కంగారు పడుచుందురు. జ్ఞాన ప్రాప్తికి కొంతవరకు పుస్తకము లవసరమే యనుట నిస్సందేహము. కాని వాని సహాయమంత ముఖ్యముకాదు. విద్యార్థులును, గురువును కలసి జీవితమును గడపుటయే ప్రధానవిషయము. అనగా గురువు విద్య నేర్పుచున్నాడనియు, విద్యార్థి నేర్చుకొను చున్నాడనియు చెప్పబడు భేదము పోవలెను. ఇది దీనికి మొదటిమెట్టు.

నవీన విద్యలోని రెండవ సిద్ధాంత మేమనగా, దీనిలో జ్ఞాన కర్మలకుగల 'భేదము' 'విరోధము' 'వాదము' నశించును. ఈ మూడు శబ్దములను ఎందుకు ప్రయోగించితి ననగా నేడు ప్రపంచములో ఎన్ని సిద్ధాంతము లున్నవో అవి అన్నియు ఈమూడు విషయములపైనే ఏర్పడి యున్నవి. కొందరు జ్ఞానకర్మల భేదమును పాటించిన, కొందరు వానిలో విరోధమును అంగీకరించుచున్నారు, ఈవిధముగా సిద్ధాంతభేదములు బయలుదేరుచున్నవి.

## శిక్షణ ప్రయోగములు

జ్ఞానకర్మలు రెండును ఓకే వస్తువు యొక్క రెండు రూపములని నవీన విద్యయొక్క విశ్వాసము. కనుక జ్ఞానకార్యము నడచుచున్నదా? కర్మయోగము సాగుచున్నదా? అనుసంగతియే తెలియబడదు, ఒక దృష్టితో చూచిన జ్ఞానకార్యము నడచుచున్నట్లు కన్పించును. ఇంకొక దృష్టితో చూచిన కర్మయోగము నడచుచున్నట్లు కన్పించును. ఇట్లు ఏ ప్రయోగములలో కన్పించునో దానిపేరే శిక్షణప్రయోగము. కేవలము జ్ఞానకార్యమే నడచుచున్నట్లు కన్పించినచో అది శిక్షణప్రయోగముకాదు. అట్లే కర్మయోగము నడచుచున్నట్లు కన్పించినచో అది శిక్షణ కార్య

క్రమము కాదు. రెండిటిలో ఏది నడచుచున్నదో, తెలియబడని చోట ఉన్నదానిపేరే శిక్షణప్రయోగము. నేడు ప్రాతిపదిక విద్యలో ఒక పెద్ద తమాషా జరుగుచున్నది. జ్ఞానకర్మలసమ్మేళనము జరుగవలెననిచెప్పుచు, అందుకొరకు తకిలీత్రిప్పుచు, దానితోపాటు తకిలీపాటలు పాడుచున్నారు. తకిలీతో పాటు తకిలీ పాటలు పాడుటవలన ఏకత్వము సిద్ధింపదు. ఇది మిక్కిలి సూక్ష్మమైన విషయము. జ్ఞానకర్మలలో ఎంతవరకు విరోధము కలదు? భేదము కలదు? ఏకత్వముకలదు? అని ప్రశ్న. జ్ఞానకర్మలకు అభేదమనియు, కర్మవలన జ్ఞానము లభించుననియు, జ్ఞానమువలన కర్మకు ఉద్దీపన కలుగుననియు రెండిటివలన జీవితము సార్థకమగు ననియు నమ్మటపై నవీనవిద్య ఆధారపడియున్నది. దీనిలోని విధాన మిట్టిది.

దీనిలో పిల్లలచే కొంత పని చేయించబడుచున్నదని కూడ కొంద రాక్షేపించుచున్నారు. మనమనేకవిధములైన వ్యాయామములు చేయుదుము కాని ఉత్పాదకపరిశ్రమను మాత్రము చేయకూడదని మన నిశ్చయము. ఇది కొంచెమాలోచించవలసిన విషయము. స్కూలులో పిల్లలు పగ లంతయు వ్రాయుట, చదువుట సరిపోవును. అదేపనిగా కూర్చుండుటచే వారికాకలివేయదు. కనుక వ్యాయామపద్ధతి ఏర్పాటుచేయబడినది. ఆ పిల్లలందరు ఒకచోట ప్రోగై డ్రిల్లు చేయుదురు. ఎవడైన రైతు అక్క డకు వచ్చి చూచినచో వీరికేమియు పనిలేదా? నిరుద్యోగులా? అని ప్రశ్నించును. దానికి సమాధానము "ఇది ఆకలివేయుటకు సాధన" మని చెప్పుదురు. "ఆకలి వేయుటకు సాధనము పొలములోనున్నది; చేతితో పారపట్టుకొనివచ్చినచో వెంటనే ఆకలివేయగల"దని ఆ రైతు చెప్పును. కాని చేతిలో పారపట్టుకొని పరిశ్రమ చేసినచో దానిని 'కూలిపని' యందురు. పార పట్టుకొనకుండ పరిశ్రమ చేసినచో దానిని 'వ్యాయామ' మందురు. ఇట్టి భేదము ఎక్కువగుచున్నది.

## ఆనందమునకు మార్గము

మనము ఇరువదినాలుగు గంటలు జ్ఞానమును సంపాదింతుము. ఇరువదినాలుగుగంటలు పనిచేయుదుము. ఇరువదినాలుగుగంటలుఆనంద మనుభవింతుము- అని మా విశ్వాసము. మా కిందు నిమిత్తము డెబ్బది రెండుగంటల కార్యక్రమ ముండదు. ఇరువదినాలుగుగంటల కార్య క్రమమే యుండును. కాబట్టి ఆనందముకూడ శ్రమకంటెను, జ్ఞానము కంటెను భిన్నముగా నుండరాదు. ఇది ఒక్కమాటలో చెప్పవలెనన్న మా శిక్షణమంత్రం 'సచ్చిదానందము'. అని నేను చెప్పగలను. 'సత్' అనగా కర్మయోగము. అదిలేనిదే జీవితమునకు నిలుకడలేదు. 'చిత్' అనగా జ్ఞానయోగము. అదిలేనిదే జీవితము జడమగును. ఇక 'ఆనం దము' లేనిదే జీవితమునం దెట్టి రసమును ఉండదు. కనుక ఏ శిక్షణలో సత్, చిత్, ఆనందము - ఈ మూడును కలిసియుండునో అది నిజమైన శిక్షణ. దానిని మీరు నవీనవిద్య యని పిలిచినసుసరే, పురాణవిద్య యని పిలిచినను సరే.

## విద్యార్థులు-క్రమశిక్షణ రాహిత్యము

మేము చెప్పదలచుకొనిన విషయ మింకొకటి ఏమనగా విద్యా విషయములో ఆజ్ఞ అనునది పనికిరాదు. ఇంకే విషయమున నయినను ఆజ్ఞయు నుండవచ్చును, ఆజ్ఞా పాలనమును ఉండవచ్చును. ఏదైన నొక గుండ్రని వస్తువున్నచో దానిని ముక్కోణాకారమని ఎంచవలసినదిగా ఆజ్ఞాపింపజాలము. అందు మన ఆజ్ఞ ఏమియు పనిచేయదు. గుండ్రని వస్తువును గుండ్రముగా నున్నదను జ్ఞానమునే ఇచ్చును. కావున జ్ఞాన విషయమున ఆజ్ఞ పనిచేయదని తెలిసికొనవలెను. నవీనవిద్య క్రమశిక్షణ అమలు జరుపదు. అది విద్యార్థికి పూర్తి స్వేచ్ఛ నిచ్చును. శాసన ముక్త సమాజ ప్రణాళిక ప్రపంచములో ఎప్పుడు వచ్చినను పరవాలేదు. కాని

విద్యార్థులకుమాత్ర మది ఇప్పుడే అవసరము. విద్యార్థికి అన్నిటికంటె ముఖ్యమయిన హక్కేదయిన ఉన్నచో నది స్వేచ్ఛను పొందుటయే. కనుకనే మన గురువర్యులు విద్యార్థులకు "యాని అస్మాకం సుచరితాని తాని త్వయోపాస్యాని. నో ఇతరాణి"— మేము చేసినవానిలో మంచి పనులనే నీ వాచరింపుము. మంచివి కానివి అచరింపకుము, అని ఉపదేశించు చుండిరి.

ఇట్టిస్థితిలో స్వయముగా క్రమశిక్షణలో మెలగవలెనను భావన విద్యార్థిలో రాగలదని మనము తప్పక ఆశించవచ్చును. అంతేకాని ఏవిధమయిన కృత్రిమ క్రమశిక్షణలోను నవీనవిద్య నేర్చుకొను విద్యార్థి ఉండుటకు మే మంగీకరింపము. నేటి సమాజ రచన కృత్రిమము. అది వైషమ్యముపై నాధారపడియున్నది. కనుక నవీనవిద్యలో తయారయిన విద్యార్థి సమాజముపై తిరుగుబాటు చేయువాడగును. గాంధీజీ చెప్పిన విధముగా అతడు దాని నెదిరించును. కాని ఆ ఎదిరించుట వినయముతో కూడియుండుననుటలో సందేహము లేదు. ఎదిరించుటమాత్రముతప్పదు. 'వినయముతోకూడిన' అనుమాట అనగనే నా కింకొక విషయము జ్ఞాపకము వచ్చుచున్నది. మన ప్రాచీన గ్రంథములలో 'విద్య'కుకూడ 'వినయము' అనుపేరు పెట్టబడినది. సంస్కృతములో శిక్షణకు వినయమని పేరు. ఫలానా విద్యార్థి శిక్షణ నొందెనని చెప్పుటకు అతడు 'వినీతు'డయ్యెనని చెప్పుదురు. కనుక ఆదర్శ శిక్షణ వినయ రూపముగా తప్పక పరిణమింపవలెను. కాని ఆ వినయము బానిసతనము కారాదు. అది సమాజములోని మూఢవిశ్వాసముల నెదిరించుటకునడుము కట్టుకొని యుండవలెను.

(నవీనవిద్యనుగూర్చిన సమ్మేళనములో ప్రారంభోపన్యాసము.)
సర్వోదయపురం (కాంచీపురం) 30, మే 1956.

## : 62 : నవీనవిద్య విద్రోహదీక్ష నిచ్చుటకు వచ్చినదే!

మనము 'నవీనవిద్య' అనుటవలన ఒక విశిష్టమగు విద్యనుద్దేశించుచున్నాము. దీని అర్థ మేమనగా పూర్వమునుండి వచ్చుచున్న తప్పుత్రోవ యొకటున్నది. కనుక మేమొక మంచిత్రోవను చూపదలచుకొని దానిని 'మంచివిద్య' అనుటకుబదులు 'నవీనవిద్య' అని పిలుచుచున్నాము. పురాతన విద్య అనగా అతి పురాతనవిద్య అని కాక మధ్యకాలములో ఆంగ్లేయులరాజ్య మిచ్చటికి వచ్చినపిదప ప్రారంభమైన విద్య యని అర్థము. ఆ విద్యలోని ముఖ్యదోషమేమి? అందు చాల దోషములు కలవు. ఎవరికి దేనియం దెక్కువ ఆసక్తియున్నదో వారాదోషమును చెప్పుచుందురు. అందులోనే కొన్ని చిన్నచిన్న దోషములు, కొన్ని పెద్ద దోషములు కూడ కలవు. వానినిక్కడ నేను వర్ణింపను. కాని ఒక్క విషయము మాత్రము చెప్పెదను. అది నిజమునకు విద్యయేకాదు. ఎందుకనగా అది ఏ సమాజమును పురస్కరించుకొని నిర్మితమైనది కాదు. సమాజదృష్టిలేకుండ నిర్మింపబడిన విద్యకు ఏదైన ప్రత్యేకోపయోగముండవచ్చును. కాని అది 'విద్య' అని పిలువబడుటకు తగదు. ఆంగ్లేయులు హిందూదేశమునకు వచ్చునాడున్న పరిస్థితిని మార్చివేసి క్రొత్తగా కల్పించిన పరిస్థితిలో ఇచ్చట 'సమాజ'మనునదే లేదు. ఒకటొకటిగా గ్రామములలో సమాజము విచ్ఛిన్నమై ముక్కలగుచుండెను. కొన్ని ఐపోయెనుకూడ. స్పృశ్యాస్పృశ్యభేదము మొదలైనవి కూడ ఉన్నచోట గ్రామసమాజము ఏర్పడుటకే వీలులేదు. వేరువేరుజాతులున్న చోట్ల ఒకే సమాజమేర్పడుట సంభవముకాదు. మనుష్యులలో ఉచ్చనీచ

భావములు అసలులోనున్నచోట్ల కూడ ఏకసమాజము ఏర్పడజాలదు. ఈ విషయము మాకు గ్రామదానోద్యమములో తిరుగునప్పుడు కానవచ్చుచున్నది. ఏ గ్రామములలో ఒకేజాతి జనులు నివసించుచుందురో లేక రెండుమూడు జాతుల జనులు మాత్రమే ఉందురో, ఇంచుమించు సమానజాతులవారు నివసింతురో అచ్చటనే తరచుగా గ్రామదానములు లభించుచున్నవి.

## ఏకీభావముగల సమాజము కావలెను

గ్రామమంతయు ఒకే కుటుంబముగా భావింపవలెననునది గ్రామదానమునందలి మూలసిద్ధాంతము. అట్టిచో అనేక జాతులను ఒక కుటుంబముగా నెంచుటయే అధర్మమని తలచువారు మామాట నెట్లంగీకరింతురు? కాని గ్రామమంతయు ఒక కుటుంబముగా ఎంచుట కిష్టపడుచు తమ స్వార్థపరత్వమువలన వేరువేరుగా విడిపోయియున్న వారికి "మీరు స్వార్థవశమున విడిపోయి యున్నారుగాని మీరందరు ఒక కుటుంబముగా ఏర్పడుటలోనే మీ నిజమైన స్వార్థము సాధింపబడగల"దని నచ్చజెప్పవచ్చును. ఇక గ్రామమంతయు ఒక కుటుంబముగా నగుట అధర్మమని భావించువారికి ఆర్థిక సిద్ధాంతములను బోధించుటకు ముందు వారు పాటించు జాతిభేదము తప్పని నచ్చజెప్పవలసి యుండును, ఎక్కడ సమాజ మేర్పడి యుండునో అక్కడనే గ్రామదానము లభించును. వేరు వేరు జాతులక్రింద విడిపోయియున్నది సమూహము కావచ్చును కాని సమాజముకాదు. సమూహము, సమాజము అను వానిలో భేదముకలదు. సమాజమే లేనిచోట విద్య కవకాశమేలేదు. అనగా మేము "లోకవిద్య" యని చెప్పునట్టిది. ఏదైన వ్యాకరణ పాఠశాలలో వ్యాకరణము నేర్పబడవచ్చును. అది వేరువిషయము, కాని మేము దేనినైతే 'లోకవిద్య' యని పిలుచుచున్నామో దేనియందు మన జీవితమునకు సంబంధించిన అనేక విషయములను చేర్చి యున్నామో ఏది జీవనవిద్యయనికూడ

పిలువదగి యున్నదో అట్టి విద్య ఏకరస సమాజ మున్నచోటనే సంభవము.

## భేదము, ఛేదము పోవలెను

ఇటువంటి సమాజము ఈ రెండుమూడు వందల సంవత్సరముల కాలములో హిందూదేశములో లేనేలేదు. కనుక నిజమైన విద్యను దేనిని ప్రారంభించినను అది 'నవీనము' గనే ఎంచబడును. అనగా విద్యా ప్రారంభము క్రొత్తగా జరుగుచున్నదని యర్థము. కనుకనే నవీనవిద్య ప్రారంభింపబడిన ప్రతిగ్రామమందును, దాని నేకరసభావముకలదానినిగా తయారుచేయుట కూడ నవీనవిద్యలక్ష్యములలో ఒకటని నేను చెప్పితిని. కావున ఇట్టి సమాజమును నిర్మించుట నవీనవిద్యయొక్క ఉద్దేశ్యమని గ్రహింపవలయును. నేడు గ్రామములందెన్నివిధములైన భేదములున్నవి? ఎన్నివిధములుండుట కవకాశముకలవో అన్నియునున్నవి. అనగా అన్నియు భేదములే. ధనికులు, నిర్ధనులు ఉన్నారు. యజమానులు, కూలి వారు ఉన్నారు. బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులు ఉన్నారు. హరిజనులు, హరిజనేతరులు ఉన్నారు. ఎన్నిరకములైన సెక్షన్స్-క్రాసు సెక్షన్స్ (అడ్డుకోతలు, నిలువుకోతలు) చేయుటకు వీలున్నదో అన్ని భేదములు, ఛేదములు కలవు. ఇవన్నియు నశింపజేయుటయే నవీనవిద్య లక్ష్యము. అనగా నవీనవిద్య ఎంతమందినైనను శత్రువులను తయారుచేసికొనుట కవకాశము కలదన్నమాట! అయినను ఆశ్చర్యకరమైన విషయమేమన దీనిని గురించి మాట్లాడుటకు లేచిన ప్రతివాడును దీనికనుకూలముగనే మాట్లాడుచున్నాడు. ప్రజలు దీని విషయములో పొరపాటుపడుచున్నారా? అని మాకిప్పుడు సందేహము కల్గుచున్నది. వైషమ్యము యొక్క అధికారమింక పనికిరాదు. మనము బాలురకు "ఏ మనుష్యుని జీవితమున కును అతని యోగ్యతతో సంబంధముండరాదు. మీ ఆకలినిబట్టి, మీ అవశ్యకతనుబట్టి మీ జీతము, మీ కూలి సంబంధించియుండును. ఆవశ్య

కతలలో అంత ఎక్కువ భేదములుండవు కావున మనుష్యుల జీతముల లోను కూలిలోను అంత ఎక్కువ భేదముండకూడదు" అని బోధించి నచో బాలుడు హెడ్మాష్టరు జీతమెంత? తక్కిన మాష్టర్ల జీతమెంత? అని ప్రశ్నించును. అప్పుడు మన నోరు మూతపడిపోవును. కనుక అందరి జీతము ఇంచుమించు సమానముగనే యుండవలెను. అప్పుడు బాలురు "ప్రభుత్వోద్యోగములలో 'గ్రేడులు' అనునవి ఉండుట సరియా?" అని ప్రశ్నింతురు. అది సరికాదని మనము చెప్పుదుము. అయితే అది ఎందుకు నడచుచున్నదని ప్రశ్న. ఇక వేరుమార్గములేక అట్లు నడచు చున్నదని సమాధానము. ఇవన్నియు మనము తెలియజెప్పుదుము. అయి నప్పటికిని వైషమ్యమును పాటించువారి రాజ్యము మాత్రము మనమీద సాగదని ఆ బాలు రర్థము చేసికొనగలరు. వైషమ్యమును మనము సహింపవచ్చును అది వేరు విషయము. కాని వైషమ్యమే రాజ్యము చేయుట పనికిరాదు. ఈ నిశ్చయమునకు బాలురు రాగలరు. అప్పుడు వారు తిరుగుబాటు చేయువారు కాక ఇంకేమగుదురు? వైషమ్యముపై ఆధారపడియున్న ప్రభుత్వమునకీ ప్రమాదము కలదు. అయినను ప్రభుత్వ మా విద్యనే కోరుచున్నది. నేడున్న దోషము పోవలెననియు, దానిని పోగొట్టుటకు మనమీవిద్య ప్రారంభింపవలెననియు ప్రభుత్వము గుర్తించి నపుడే ఇది రాణించును. ఇట్టి సామ్యయోగప్రధానమగు విధాన మంగీక రించనివారిని ఈ విద్య గట్టిగా ఎదిరించవలసివచ్చేయుండును.

## మొదట వైషమ్యమునకు సంబంధించిన గణితము పోవలెను

ఇక నీ బాలురకు "ఏదోకొంత శరీరపరిశ్రమ చేయనిదే లేదా పొలములో పనిచేయనిదే భుజించుట పూర్తిగా తప్పు" అని బోధింప వలెను. అట్టిచో కొన్ని జాతులవారు చేతితో పనిచేయుటయే అధర్మమని

భావించునెడల వారి కీ విద్యతో ఎట్లు సరిపడును? వారు దీనిని ఎదుర్కొనవలసియుండునా? లేదా? అందరికి భూమి లభింపవలెను. అందరకు భూమిపై వ్యవసాయముచేయు హక్కు కలదని బాలురకు బోధింతుము. కాని గ్రామములో కొందరు భూస్వాములున్నారు. కొందరు భూమిహీనులున్నారు. ఇదికూడ తప్పే. అనగా నేటి సమాజవ్యవస్థ యంతయు తప్పేయని అర్థము. ఈ విధముగా ఈ ప్రసంగము నవీన విద్యలో రాగలదు. కనుక నేటి సమాజము నవీనవిద్యకు సమ్మతించిన దనగా ఎరిగియుండియే తన ఆత్మహత్యకు సమ్మతించినదని గ్రహింప వలెను. విద్యార్థులకు గురుదేవునితో సమానమైనశక్తి ఈ ప్రపంచకములో ఇంకొకటిలేదు. ఆ గురుదేవుడే గ్రామములో వైషమ్యముండుట పూర్తిగా తప్పని చెప్పినపుడు వారాయన నిట్లడుగుదురు. "మీరు మేము కలసి ఆ వైషమ్యమును పోగొట్టు ప్రయత్నమేల చేయరాదు? మీరు మాకనవసర ముగా గణితము, గిణితము బోధించుచున్నారు. మొదట ఈ వైషమ్య మనుగణితము పోవలెను. పిమ్మట ఇంకొకగణితము నేర్చుకొందుము." దీని భావమేమన నవీనవిద్యాశిక్షకులు గ్రామములోని వైషమ్యమును పోగొట్టు కార్యక్రమమును తమ విద్యలో ఒక భాగముగా నంగీకరింప వలెను. ప్రపంచ దేశచరిత్రప్రకారము ఆ దేశములలో జరిగిన రాజకీయ విప్లవము లన్నియు శిక్షకులద్వారా జరిగెను. కనుక గ్రామములో ఆర్థిక సాంఘిక సమత్వమును స్థాపించుట అనగా నేడున్న స్థితిని మార్చుట— దీనినే మేము "క్రాంతి" అని పిల్చుచున్నాము— ఇది నవీనవిద్యకు ప్రయోజనమును, దాని కొక అంగమును అగుచున్నది. కనుకనే గ్రామ పరిశ్రమలు, భూమిని సమానముగా పంచుట, జాతిభేదములు, మత భేద ములు నశింపజేయుట, జీవితముద్వారా బాలురకు శిక్షణ ఇచ్చుట— దీనినే నవీనవిద్య అందుము. ఈ చతుర్విధ కార్యక్రమమంతయు పర స్పర సంబద్ధ కార్యక్రమమని మేముచెప్పియుంటిమి. ఈ నాలుగు విభా గములను విషయము నర్థము చేసికొనుటకును, ఇతరులకు తెలియ

జెప్పుటకును కల్పించుకొనవచ్చునుగాని ప్రత్యక్షకార్యక్రమములో ఇవి విభజింపబడజాలవు.

## ప్రభుత్వశాసనమును ఛేదించు విద్య

నిన్న కాకాసాహెబ్ ఇట్లు చెప్పియున్నారు. "ప్రభుత్వశాసనమును బద్దలు కొట్టుటయే వినోబావని. అందు కీనవీనవిద్యయను సాధనము నుపయోగించును" ఆయన మీ యెదుట ఆవిషయము నొక విచిత్రమైన భాషలో ప్రస్తావించెను. కాని అందు నవీనవిద్య యథార్థరూపములో వర్ణింపబడినది. "తదుత్థం తమేవ ఖాదతి"- కర్రలో పుట్టినపురుగు కట్టెనే తినునని బుద్ధభగవానుడు చెప్పియున్నాడు. ఏది దేనినుండి పుట్టునో అది దానినే తినును. అట్లే నేడు నడచుచున్న ప్రభుత్వశాసనము నవీన విద్యను సృష్టించినచో ఆ నవీనవిద్య ప్రభుత్వశాసనమును ఛేదించును. ఇది మీ యెదుటనున్న చాల పెద్ద కార్యక్రమము. మీకు జన్మ నిచ్చిన వారినే మీరు అంతమొందించుటయందే సమాజమునకు మేలు కలదు. ఇది శాసనకర్తలు తెలిసికొని దీనికి సమ్మతించినచో ఇది చాల ఆనందకరమగు విషయము. ఇట్లర్థము చేసికొనియే సమ్మతించిరని నే ననుకొనుచున్నాను. ఎందుకనగా ఇది నేటి ప్రభుత్వము మాత్రమే చేయదలచుకొనలేదు. దీనినిగూర్చి కాంగ్రెసు తీర్మానముకూడ కలదు. కాంగ్రెస్ తీర్మానమునకు ఒక విశేషమైన విలువ గలదు. ప్రభుత్వము వారి తీర్మానమునకుగల విలువ వేరు. కాంగ్రెస్ చేయు తీర్మానము మొత్తము సమాజవ్యవస్థను మార్చవలెనను దృష్టితో జరుగుచుండును. కనుక "మీరు మిమ్ములను త్యజించవలెననియే మేము మీకు జన్మ నిచ్చుచున్నాము" అను సూత్రమును అర్థము చేసికొనియే ఏర్పాటు జరిగినదని మేమనుకొనుచున్నాము. ఈ ప్రోగ్రామ్ మనము మనస్సులో పెట్టుకొన్నచో మన దృష్టియంతయు మారిపోగలదు. పనిద్వారా మనము జ్ఞానమును బోధింపగోరుచున్నామన్నంత మాత్రమున నవీనవిద్య కాజా

లదు. పూర్తిగా నవసమాజ నిర్మాణము చేయదలచుకొన్నది కనుకనే ఇది నవీనవిద్యయని పిలువబడుచున్నది. ఒకసారి అట్టి సమాజము నిర్మితమైన పిదపనుండి నవీనవిద్యలో అనేక విధములగు అనుభవములు సంస్కారణలు జరుగుచునే యుండును. ఆ పిమ్మట సంస్కారణలు జరిగినపుడు అది మంచి విద్యయని పిలువబడును. ఈవిధముగా విద్య యొక్క మంచితనము క్రమక్రమముగా పెరుగుచు సంస్కారణ ప్రక్రియ సాగుచుండును. కనుక మేము చెప్పదలచుకొన్న దేమనగా పూర్వపు విద్యను సంస్కారించి ఈ విద్య తయారుచేయబడినదని మాత్రము అను కొనవద్దు. ఇది నవసమాజ నిర్మాణముచేయు విద్య. దీనియందు అనంత కాలమువరకు సంస్కారణ కవకాశము కలదు. కాబట్టి నవీనవిద్య నేర్పు పాఠశాలలో భూదానము, సంపత్తిదానము, మొదలగు విషయములు సర్వోదయసిద్ధాంతములు, సామ్యయోగము మొదలైన సిద్ధాంతములు, ఆర్థిక సాంఘిక విషయములు వీనినిగూర్చి చింతనము, మననము, అధ్యయనము, అధ్యాపనము అను విషయము లుండవలెను. విద్యార్థులు శిక్షకులు కలసిన ఆ చిన్న సమాజముకూడ మనము గ్రామసమాజమును ఏవిధముగా తయారు చేయుదుమో అట్లే తయారుకావలెను. స్కూలు సమాజము రాబోవు గ్రామసమాజమునకు నమూనాగా ఉండవలెను. పది పన్నెండుగురు ఉత్తమ శిక్షకులుందురు. వారి కుటుంబములోని వారు ఇంకొకరు ఇరువది ముప్పదిమంది యుందురు. ఏబది అరువది మంది విద్యార్థులుందురు. మొత్తమందరు కలసి ఒక నూరుమందిగల సము దాయమగును. వారికి మనము పనిచేయుటకు పనిముట్లు, పండించుటకు భూమి ఇచ్చితిమి. కావలసిన పుస్తకము లిచ్చితిమి. సాధనసామగ్రి అంతయు ఇచ్చితిమి. మీరు విద్యాదానము చేయుచు మీ అందరి జీవితము లను పోషించుకొనవలెనను భారము వారిమీద మోపితిమి. మేము మా జీవితమును పోషించుకొనవలసి యున్నది కనుక విద్యాదానము చేయ

జాలమని అన్నచో వారు నవీనవిద్యలో 'ఓనమాలు' కూడ నేర్చుకొన జాలరన్నమాట !

## నవీనవిద్యకు నిజమైన శిక్షకులు

ఈమాట వినుటకు కొంచెము కష్టముగా నుండును. ఎందుచేత ననగా ఈ భావములన్నియు క్రొత్తగా కన్పించు వర్గమునుండి మనము వచ్చియున్నాము. చివర కావర్గముకూడ ఎంతోలేదు. ఉన్న సమాజ మంతయు పనిచేయువారి సమాజమే. కాబట్టి ఇక మనము చేయవలసిన దేమన ఆపని చేయువారలనుండియే శిక్షకులను తయారు చేసికొనవలెను. వారిలో చదువును, సంస్కారమును ఉద్దేశింపజేయవలెను. వారిలోనుండి కూడ మనము శిక్షకులను తయారు చేసినప్పుడే అది ఆదర్శ శిక్షణవిధాన మగును. అంతవరకు పురాతనవిద్య చదువుకొనిన నవీనవిద్యను కోరు చున్న మనము నేర్పువిద్య నవీనవిద్య కొక చిత్తు ప్రతిగా నుండును. కనుకనే నన్నెవరైన నవీనవిద్యయొక్క ఆదర్శమును మీరెక్కడనైన నెలకొల్పితిరా ? అని అడిగినపుడు నవీనవిద్యాదర్శమును ప్రదర్శింపగల యోగ్యత మాకు లేదని నేను చెప్పుచుందును. ఈశ్వరానుగ్రహముచే దానినిగూర్చి యోచింపగల అర్హతమాత్రము మాలో కల్గినది. కాని దానిని నిర్మించుయోగ్యత కలుగలేదు. మేము తయారుచేయు విద్యార్థు లలో మాకంటె యెక్కువ యోగ్యత కలుగగలదు - అని చెప్పుదును. అంతట వారు మీతో సమానముగా పుస్తకము చదువగలవాడు మీ విద్యా ర్థులలో ఎవరైన నున్నారా ? అని అడుగును. దానికి నా సమాధానము "ఇంతవరకు మా విద్యార్థి యెవడును నా అంత విద్వాంసుడు కాలే"దని చెప్పుదును. అంతట వారు "అట్లయిన మీ విద్యార్థి మీకంటె ఎక్కువ యోగ్యుడెట్లు కాగలడు ?" అని ప్రశ్నింతురు. "నావంటి విద్వాంసులు కారు కనుకనే వారట్టివారుగా తయారగుదు"రని నా సమాధానము. నా వంటి విద్వాంసులు కారు కాని తప్పక నన్నుమించినవారే అగుదురు.

## 'సాక్షాత్కారము' గల విద్య

మేమీమధ్య తెలంగాణాలో తిరిగితిమి. ఇది అక్కడి సంగతి. ఒకచోట ఒక రైతు పెద్దపులి నెదుర్కొనవలసిన అవసరము కలిగెను. అతని చేతిలో ఒక కత్తిమాత్రమే ఉండెను. అది సామాన్యమైన చేతికత్తి మాత్రమే. అత డాకత్తితోనే ఆ పెద్దపులిని చంపివేసెను. నిర్భయముగా వెళ్ళి ఆకత్తితో దాని నెత్తిపై కొట్టెను. దాని నెత్తు రాకత్తి కంటుకొని యుండెను. అత డాకత్తి మాకు తెచ్చి చూపించెను. మేమతని ముఖముకూడ చూచితిమి. అక్కడ ఎవరయిన విద్వాంసు డున్నచో అతని విద్యయంతయు తుదముట్టి యుండెడిదని మాకు తోచినది. కాని ఈ రైతుయొక్క విద్య పెద్దపులినికూడ ఎదుర్కొనగల్గిన విద్య. ఇచ్చట మేము చెప్పదలచుకొన్న దేమనగా మనము గొప్ప విద్వాంసులమే అయినను ఆ విద్య కెక్కువ విలువలేదు. ఇది తెలిసికొను వివేకము మాలో కలిగినది. నేడు మన పాండిత్యమువలన మన కెంతో గౌరవము అనవసరముగా కల్గుచున్నదని నేనంగీకరింతును. దీనికి కారణము నేటి సమాజము అట్టి పాండిత్యమునకు గౌరవమిచ్చి యున్నది. పాండిత్యమున కేమియు విలువలేదని నేను చెప్పను. కాని బొత్తిగా "ఔట్ ఆఫ్ ప్రపోర్షన్" (అమితము)గా దానికి విలువ ఇచ్చినచో పని జరుగదు. కాబట్టి మన విద్యార్థులు మనకంటె పైకి వెళ్ళిరా, లేదా ? అను దానికి ప్రమాణము పనిచేయుటలో వారు మనకంటె ఎక్కువ కౌశలము చూపుచున్నారా, లేదా ? గుణములలో శ్రేష్ఠులుగా నున్నారా, లేదా ? అను దానిపై నాధారపడి యుండును. నేటి మన విద్యలోని ఒక మార్పేమనగా మనము మన కన్నులతో చూడక, ఇతర కన్నులతో చూచుచున్నాము. మన మితర దేశములకు వెళ్లుటకు ధైర్యము చాలదు. మన కన్నులతో చూచి యచ్చటి జ్ఞానమును సంపాదించు సాహసము లేదు. ఇతర దేశములగూర్చి వర్ణించు ఒక ఇంగ్లీషు పుస్తకము చదివి ఇంటిలో కూర్చుం

డియే జ్ఞానము సంపాదించితిమని అనుకొనుచున్నాము. అనగా ఇతరుల కన్నులతో చూచి మనము నేర్చుకొన్న జ్ఞానమును బట్టియే మనము విద్వాంసుల మనిపించుకొనుచున్నామన్నమాట! ఇటువంటి విద్యలో పరోక్షజ్ఞానమేగాని ప్రత్యక్షజ్ఞానముండదు. ఎచ్చట సాక్షాత్కారముండునో ఎచ్చట సాక్షాత్తు అనుభవముండునో దానినే జ్ఞానమని పిలుతుము. ఇట్టి జ్ఞానము మనలో లేదు. అనగా అనుభవమని చెప్పబడునట్టి విద్య మన యొద్ద లేదు. ఈ స్థితిలో మన విద్య మనకు తేజము నియ్యజాలదు, వీర్యవంతులను చేయజాలదు. ఈ దృష్టితో మనము నవీనవిద్యను చూడవలెను. నవీన విద్యావిధాన మంతయు సమగ్రదృష్టితో ఏర్పాటు చేయవలెను.

తమిళనాడులోని నవీన విద్యా కార్యకర్తల సడుమ.
కాంచీపురం 31-5-56

---

: ౧౫౩ :

# నవీనవిద్యయొక్క త్రివిధదర్శనము

ఆలోచించినమీదట ఒక నిర్ణయముచేసికొని దానిని అమలుచేయుటయే ఆలోచనకు ప్రయోజనము. ఆ అమలులో కొంతలోటున్నను ఇబ్బందిలేదు. సిద్ధాంతమునకు సంబంధించినంతవరకు ప్రభుత్వముగాని, తాలిమీ సంఘముగాని తయారుచేయు పథకమునకు నా దృష్టిలో ఏమియు ప్రాముఖ్యము ఉండదు. పేరినాయకంపాలెములో జరిగిన తాలిమీసంఘ సమ్మేళనమందు నేను "తాలిమీసంఘము చిన్నది, నవీనవిద్య పెద్దది" అని చెప్పితిని.

## నైతికమూల్యమును ఆర్థికముగా కొలవజాలము

నవీనవిద్యకు కొన్ని మూలసిద్ధాంతములు కలవు. నేటి సమాజములో శారీరక, మానసిక పరిశ్రమలకు వేర్వేరువిలువలీయబడుచున్నవి. దీనిని నవీనవిద్య అంగీకరింపదు. నవీనవిద్య ననుసరించి మనుష్యుడు శారీరకముగా గాని, మానసికముగా గాని ఏ సేవ చేసినను అది నైతిక విషయము; అతనికీయబడు జీతము ఆర్థికవిషయము. నైతికవస్తువునకు ఆర్థికవస్తువుతో విలువ కట్టుటకు వీలులేదు. ఒక మైలులో ఎన్నిగంట లున్నవని ప్రశ్నించుటయే తప్పు. ఒకమైలు కెన్ని గజములని అడుగ వచ్చును; కాని గంట లడుగరాదు. ఏలయన అవి వేర్వేరు వస్తువులు, అవి పరస్పరము మార్చదగినవికావు. నదిలో మునిగిపోవువాని నొకడు రక్షించెను. ఆ పనికి పది నిమిషములు పట్టెను. అది శారీరకమైన పనియేగాని మానసికముకాదు. కనుక అతనికి పదినిమిషములకు ఒక అణాకూలి యివ్వవలెనా? అతనికి వందరూపాయలిచ్చినను పుచ్చు

కొనడు. ఇందు డబ్బు పుచ్చుకొను విషయమేమున్నదని ఆతడనును. ఇట్లే ఎవరైనను శారీరికముగాగాని మానసికముగా గాని ఏ పని చేసినను, అది సమాజమునకు లాభకారి అయినచో అది ఒక నైతికవస్తువే అగును; దానికి ఆర్థిక మూల్యముతో ఎట్టి సంబంధమును ఉండదు. ఆర్థిక మూల్యమునకు ప్రతి మనుష్యుని ఆకలితోను సంబంధముకలదు. రెండు రూపాయల ఆకలి గలవానికి రెండురూపాయల భోజనముచేయు హక్కు గలదు; అతనికి రెండురూపాయలిచ్చుట సమాజమునకు కర్తవ్యము. అతడు వడ్రంగియా, రైతా, శిక్షకుడా అను విషయముతో ఎట్టిసంబంధ మును లేదు.

## ఆర్థిక విషయము

ప్రభుత్వము నవీనవిద్యను అంగీకరించినది కాని వారు నడుపు విద్యావిధానములో తరగతులుండుట మాకు విభ్రాంతిని కలిగించుచున్నది. ఇది ప్రభుత్వము దోషముకాదు, సమాజముయొక్క దోషము. ఈ తరగ తుల నన్నింటిని ఆమోదించిన విద్య క్రైస్తవులవలె పరిస్థితులతో రాజీ పడగలదు. క్రైస్తవులు ఆదివారమునాడు చర్చికివెళ్లి ప్రార్థన చేయుదురు. ఆ రోజున ఎవరైన ఒక చెంపపై కొట్టిన రెండవ చెంప చూపుదురు. కాని సోమవారమునాడు ఏటంబాంబు, హైడ్రోజనుబాంబు తయారు చేయుటలో నిమగ్నులగుదురు. ఎందుకనగా వారొక రాజీకి వచ్చి యున్నారు. కొన్ని విషయములు వ్యక్తిగత జీవితములో మంచివనియు, వానికి సమాజరచనతో ఎట్టి సంబంధమును లేదనియు వారి అభిప్రా యము. అట్లే మహమ్మదీయులు 'సలాం' అందురు. 'ఇస్లాం' అనుమాట కర్థము శాంతి. వారి జెండామీద చంద్రుడు, నక్షత్రములు అను అత్యంత శాంతము, సౌమ్యము అయిన చిహ్నములున్నవి. సూర్యునివంటి ఉగ్ర చిహ్నములు లేవు. పరమేశ్వరుని వారు 'రహీం' 'రహమాన్' (దయాళు) రూపములో ధ్యానింతురు. అయినను అతిస్వల్పవిషయమును

పురస్కరించుకొని గొంతుకలు కోయుటకు తయారగుచుందురు. ఈవిధముగనే హిందువులు కూడ పెద్దతనముతో సంధి చేసికొనిరి. నవీనవిద్య మాత్రము ఇట్టిపని చేయజాలదు. అది మొత్తము సమాజరచననే మార్చవలసియున్నది. ఈమధ్య కాంగ్రెసు 'సోషలిస్టు ప్యాటరన్ అఫ్ సొసైటీ' కావలెనని చెప్పినది. అదిమంచిదే. కాని పెట్టుబడిదారులు దానితో సంధి చేసికొనుచున్నట్లు కన్పించుచున్నది. ఈ తీర్మానము జరిగినప్పుడే మౌలానా ఆజాద్ దీనివలన ఏమంతపెద్దమార్పురాబోదని తెలియజేసెను. అట్లే హిట్లరుకూడ మాది 'నేషనల్ సోషలిజం' (జాతీయసమాజవాదము) అని చెప్పుచుండెడివాడు. కనుకనే 'సోషలిజం' ప్రమాదములోనున్నదని నేను చెప్పితిని. వారెంత అస్పష్టమైన మాటను ఎన్నికొనిరనగా దానికి మనయిష్టమువచ్చిన రూపము నీయవచ్చును. నేడు 'సర్వోదయ' శబ్దము కూడ కొంతవఱకిట్లే ఉపయోగింపబడుచున్నది. అట్లే 'నవీనవిద్య' కు కూడ అర్థముచెప్పబడునెడల ఈ సిద్ధాంతము నెరిగినవారు నవీనవిద్య ఒక స్వతంత్రవస్తువనియు, ప్రస్తుతము నడచుచున్న దానికి, దీనికి ఏమియు సంబంధములేదనియు చెప్పగలరు. నవీనవిద్యలోని ఆర్థికభాగ మేమనగా శారీరక పరిశ్రమ, మానసిక పరిశ్రమ అను తరగతులు పోవలెను.

## ఆధ్యాత్మిక భాగము

నవీనవిద్య యందలి ఆధ్యాత్మిక భాగమేమనగా జ్ఞానకర్మలను నవి రెండువస్తువులు కావు. ఒకే వస్తువు జ్ఞానముకంటె కర్మ శ్రేష్ఠమని గాని, కర్మకంటె జ్ఞానము శ్రేష్ఠమనిగాని చెప్పుట తప్పు. జ్ఞానము కర్మ ఒకటే అను ప్రాతిపదికపై ఈయబడిన విద్యయే నవీనవిద్య. ఇందు పరిశ్రమ జరుగుచున్నదను జ్ఞానమే ఉండదు. పని జరుగుచుండును. శిక్షణ లభించుచుండును. దానితోబాటు చక్కని నిర్మలవాయువుకూడ లభించుచుండును. నేడు కార్ఖానాలలోని కార్మికులు మూసిన ప్రదేశములో ఎనిమిదేసి గంటలు పనిచేయవలసి వచ్చుచున్నది. అక్కడ వారికి

బహిరంగమైన గాలియు లేదు, ఆనందము లేదు. ఆ పనికి జ్ఞానమునకు ఎట్టి సంబంధమును లేదు. కావున వారికి సినిమా మొదలయిన వాని ద్వారా ఆనందము సప్లయిచేయబడుచున్నది. వారి పనికి ఆనందముతో ఎట్టిసంబంధము లేదు. నవీనవిద్యలో ఈ విధముగా పనికొక గంట, ఆనందమున కొక గంట ఉండవు. నవీనవిద్యలో సచ్చిదానంద ముండును. పని, జ్ఞానము, ఆనందము ఏకరూపమై యుండును. మన మే పని చేయుచున్నను. దానితోబాటే జ్ఞానముకూడ కలుగుచుండుట జ్ఞానప్రాప్తికొక స్వాభావికమైన పద్ధతి. మనము రోగికి సేవ చేయు చున్నచో, దానితోబాటే ప్రయోగములుకూడ చేయుచుందుము. అనగా సేవ, అధ్యయనము చేయుచుందుము. ఏ డాక్టరైనను పరిశోధనలే చేయుదునుగాని రోగికి సేవ చేయనన్నచో పని యెట్లుజరుగును? పరి శోధనమునుండి పనిని వేరుచేయజాలరుగదా. అట్లే ఆనందమునుండి కూడ పనిని వేరుచేయజాలము. పనిని, ఆనందమును వేరుచేసినచో ఆనందము దోషయుక్త మగును. పని ఉత్సాహ శూన్య మగును. నాకు చిన్నప్పటి విషయ మొకటి జ్ఞాపకము వచ్చుచున్నది. రాజుగారు పుట్టిన రోజున మా స్కూలుకు సెలవిచ్చెడివారు. అట్లే రాజుగారు మరణించి నప్పుడును సెలవే! పిల్లలమయిన మాకు సెలవనిన పండుగ. కనుక మేము పూర్తిగా వేదాంతులమై భోతిసున్నమాట! జనన మరణములు మిథ్య అనియు. సెల వొకటే సత్య మనియు మా కనిపించెడిది. పుట్టిన రోజు కిచ్చు 'సెలవు', మరణమునకుకూడ ఎందు కివ్వబడుచున్నదో మా కర్థమయ్యెడిది కాదు. పిల్లలకు సెలవులో ఆనందము కలదు. దీని కర్థము వారు స్కూలును జైలుగా భావించుచున్నారన్నమాట. పిల్లలకు వారమున కొక్కరోజేకాక, ఏడురోజులును ఆనందము లభింపవలెనని మా కోరిక. పని, జ్ఞానము, ఆనందము అనగా సత్తు, చిత్తు, ఆనందము అనునీ మూడును కలిసి ఒకేవస్తువను అనుభవ మెచ్చట కలుగునో అది నవీనవిద్య.

## సాంఘిక భాగము

మనుష్యమాత్రులందరు సమానులనునది నవీనవిద్యలోని సాంఘిక భాగము. కనుక వేర్వేరు సాంఘిక భేదములు, వర్గభేదములు మొదలైన వన్నియు మిధ్య. ఈవిషయము సంగీకరించినచో ప్రస్తుతమున్న జాతీయ వాదము మున్నగు భేదములన్నియు నశింపగలవు. నవీన విద్యతోబాటు ఈ భేదము లన్నియు ఉండుటకు వీలులేదు. భూమి అందరిది, దీనికి ఎవ్వ రును యజమానులు కాఁజాలరు అను భూదానయజ్ఞ సూత్రము ఎంత వ్యాపకమైనదనగా ఏ దేశములోని భూమియైనను ఆ దేశముదే అనుట కూడ తప్పు కాగలదు. ప్రపంచమందలి భూమి అంతయు, మొత్తము మానవులందరిది. నవీనవిద్యలో మనుష్యునికి మనుష్యునికి మధ్య ఎట్టి సాంఘికభేదమును పాటింపము. నేటి సమాజ వ్యవస్థ అనేకవిధములైన భేదములపై నిల్చియున్నది. కనుక నవీన విద్యద్వారా హిందూదేశ మందలి సాంఘిక రంగములో ఒక గొప్పమార్పు రానున్నది. ఇచ్చటి పిల్లలందరు కలిసియే భుజింతురు. కలసియే ఆడుకొందురు, కలిసియే చదువుకొందురు. మనము వేర్వేరు మతములోని చెడుగులను విడిచి మంచి గ్రహింతుము. కొందరు 'సర్వధర్మ సమన్వయము' అనగా అన్ని మతములలోని అన్ని విషయములు మంచివే అని ఒప్పుకొనుట అను తప్పు అభిప్రాయములో నున్నారు. 'సెక్యులర్ ఏటిట్యూడ్' అనగా 'లౌకికవృత్తి' అనుదాని కర్థము మతమును గూర్చి ఏమియు మాట్లాడ కూడదు అని తలచుచున్నారు. అట్లుకాక మతముపేర సాగు దురాచార ముల నెదుర్కొనుటకే నవీనవిద్య నిలచియున్నది. నవీనవిద్యను తీవ్ర ముగా విరోధించుట సనాతనులు కర్తవ్యమని మేము తలచుచున్నాము. వారట్లు విరోధించినచో వారు నవీనవిద్య నర్థము చేసికొనలేదనిగాని, లేదా నవీనవిద్య వాస్తవముగా నవీనవిద్య కాదనిగాని చెప్పవలసి యుండును. అట్లే 'స్టేటస్-కో' (ఉన్నదున్నట్లు) ఉంచవలెనను వారు కూడ నవీనవిద్య నెదుర్కొన వలసినదే.

## దోషము విద్యార్థులది కాదు, విద్యది

ప్రశ్న : మీ ఆదర్శము మంచిదే. కాని విద్యార్థులు దానికి సిద్ధముగా లేనప్పు డేమి చేయవలెను ?

వినోబా : మంచి విషయమును స్వీకరించుటకు సిద్ధముగా నుండనిది విద్యార్థులా, శిక్షకులా ? అను సంగతి ఆలోచింపవలసియున్నది. శిక్షకులే ఈ విషయమున వెనుదీయుదురని మా అనుభవము. నేటి వాతావరణ పరిస్థితులనుబట్టి మొత్తము విద్యార్థులందరు ఈ విషయమున సిద్ధముగనే యున్నారు. కాని నేడు నడచుచున్న విద్యలో సెలవు కోరని వాడున్నచో, వాడు మూర్ఖుడని తేలును. నా చిన్ననాటి అనుభవ మేమనగా స్కూలులో ఈయబడు సెలవులు నాకు సరిపోయెడివికావు. మొదటి క్లాసులో 'రోల్-కాల్' (హాజరు) తీసికొనెడివారు. కనుక నేను దానికి హాజరై తరువాత తిరుగుటకు వెళ్ళిపోయెడివాడను. నేనచ్చట విద్య పూర్తిచేసియున్నచో, నేడు భూదానయజ్ఞ కార్యక్రమములోనికి రాకపోయెడివాడనే. ఆ విద్య నాకెంత రసహీనముగా కన్పించెననగా చివర కొకనాడు నేను కాలేజీనే విడిచిపేసితిని. మన విద్యావిధానము సరిగా నున్నచో పిల్లలు గురువులవెంట పిచ్చివారివలె వడి పోవుదురు. పిల్లలకు 'హీరో-వర్షిప్పు' (వీరపూజ) చేయు అలవాటుకలదు. గురువు 'హీరో' కావచ్చును. కనుకనే తలిదండ్రులకంటెకూడ గురువుమీది గౌరవ మెక్కువ అనునది ప్రపంచము మొత్తముమీద అనుభవసిద్ధము. కాని గురు వట్టివాడు కావలెను. ప్రస్తుతము పిల్లలకు సంస్కృత భాష కఠినముగా కన్పించుచున్నదని మేము వింటిమి. కాని అనుభవమేమనగా ఒకనాడు కొందరు పిల్లలకు నేను సంస్కృతం బోధించునప్పుడు వారికి దానియం దెంతో ఆసక్తి కలిగినది. సంస్కృతమును రసహీనముగా నొనర్చుట నేర్పులేనిదే జరుగదు అని నేను చెప్పుచుందును. 'సంస్కృతము' వంటి సుందరవిషయమును అసుందరము చేయుట ఒక విశిష్టకళయే! ప్రస్తుతము పిల్లలకు మొదటనే వ్యాకరణ

రూపములు బోధించుట జరుగుచున్నది. ఆ సైన్యమును జూచి వారు బెదరిపోవుచున్నారు. వారికి చక్కని శ్లోకములు నేర్పవలెను. అప్పుడే ఆనందము కల్గును. నేటిపరిస్థితి ఏమన విద్యావిధానమే తప్పుగానున్నది. ఈ స్థితిలో పిల్లలకు సెలవులు లభించుచున్నవి గనుకనే వారు బ్రతుకు చున్నారు. మీరు నేర్పుదానిలో నూటికి 33 వంతులు మాత్రమే జ్ఞాపక ముంచుకొని తక్కిన 67 వంతులు మరచిపోవుట కనుమతించుచున్నారు, అనగా అట్లు కోరుచున్నారు. ఇదికూడ వారికి గొప్ప ఉపకారమే.

ప్రశ్న :—'టెక్నికల్ ఎడ్యుకేషన్' అనగా 'మెడికల్' (వైద్యము) మొదలైనవానికి ప్రాతిపదిక విద్యతో ఎట్టి సంబంధము కలదు ?

వినోబా :—ప్రాతిపదిక విద్య పునాదియైనచో పై భవనము కూడ ఆ విధముగనే కట్టవలసియుండును. మొత్తము విద్యావిధానమే మారవలసియుండును. పునాది నలుచదరముగను భవనము ముక్కోణముగను ఉండజాలదు. నేటి మెడికల్ కాలేజీలో హిందూదేశమునందు దొరకని మూలికలను గురించి చెప్పుచున్నారు. మందులు ఇతరదేశములలో తయారయివచ్చుచున్నవి. ఇచ్చటి పిల్లలకు ఇచ్చటి మూలికలను గురించి బోధింపవలెను. ప్రస్తుతమున్న మెడికల్ కాలేజీలు విదేశీ మందులకు ఏజంట్లుగానున్నవి. యుద్ధకాలములో అచ్చటినుండి వచ్చు మందులు చాలవరకు సరియైనవికావు. మేము విదేశీమందులను బహిష్కరింప గోరుటలేదు. కాని దేశీయపద్ధతితో మనకు సంబంధము ఉండవలెనని కోరుదుము. అసలు జరుగవలసినది మెడికల్ కాలేజీ, ఏదైన నొక గ్రామముతో సంబంధించియుండుట. దాని ద్వారా ఆ పరిసరమునందలి జనులు ఆరోగ్యవంతులుగా నుందురు. పరిసర పరిస్థితులతో కాలేజీకి దగ్గరసంబంధముండును.

"7-2-56 వ తేదీని శివరామపల్లి (హైదరాబాదు) లో ప్రభుత్వ ప్రాతిపదిక విద్యా శిక్షకులతో జరిగిన చర్చ"

---

## :64: చరిత్ర చదువుట అనవసరము

భావస్వాతంత్ర్యముతోపాటు ఆలోచించు పద్ధతికూడ తెలిసి యుండవలెను. ఆలోచన ముక్కు, కన్ను, చెవి, మనస్సు, అనువానిచే జరుగదు. బుద్ధిచే జరుగును. కనుక మనస్సును, ఇంద్రియములను వశములో నుంచుకొని మనబుద్ధిని అనుసరించినచో ఆలోచించు విధానము చేజిక్కును. దీనిని విచారశాస్త్రమని అందురు. ఈ శాస్త్రము ప్రతివిద్యార్థి ప్రతి పౌరుడు నేర్చుకొనవలెను. ప్రస్తుతము విద్యార్థులకు పౌరులకు నేర్పబడు విద్యలో ఒక గొప్ప దోషమున్నది. ఇట్టి దోషములు చాల ఉన్నవి. కాని ప్రజల మెదడులో చరిత్రపేరుతో ఒకానొక వస్తువు బల వంతముగా ప్రవేశపెట్టబడుట పెద్ద దోషము. ఈ చరిత్ర నేర్పుట అను నది విద్యలో అన్నిటికంటె పెద్ద ప్రమాదమును తెచ్చి పెట్టినది. చరిత్ర చెప్పినన్ని అబద్ధములు కల్పితకథలుకూడ చెప్పవు. ఏలన కథలు వ్రాయు వాడు ఈ కథయంతయు కల్పితమని మొదటనే వ్రాయును. ఆమాత్రము సత్యగుణము ఆతనియందు న్నది. కాని చరిత్ర వ్రాయువాడు తానే కేవలము అంతయు సత్యము వ్రాసినట్లును, ఇతరు లసత్యము వ్రాసినట్లును వాదించును.

### పరిపాలకుల ఇష్టానుసారము-చరిత్ర

చరిత్ర పేరుతో చదివింపబడునది వాస్తవికమనుకొను చున్నారా? గడచిపోయిన రెండు ప్రపంచయుద్ధముల చరిత్ర జర్మనీ ఒక విధముగా వ్రాసి యుండును. రష్యా, అమెరికా, ఇంగ్లండు, ఇంకొక విధముగా వ్రాసి యుండును, ఎవడేతప్పు చేసెనో, ఏమి అన్యాయము చేసెనో, ఏ సంఘటన ఎప్పుడు జరిగెనో అను విషయములన్నియు అసత్యములే

వ్రాయబడును. ప్రధానములైన కాగితములన్నియు తగులబెట్టివేయుదురు. ఈ మధ్యనే రష్యాచరిత్ర ఇప్పుడు సవరించి తిరిగి వ్రాయుదురని పత్రికలో ఒక చమత్కారమైన వార్త వింటిని. తిరిగి వ్రాయుదురను దానికర్థము స్టాలిన్ చనిపోయినచో చనిపోనట్లు వ్రాయుదురని కాదు. స్టాలిన్ కాలములో మహా గౌరవహేతువుగా నెంచబడిన చరిత్ర యంతయు అసత్యముగా భావించి దానిని తిరిగి వ్రాయుదురన్నమాట! మహాత్మా గాంధీ ఒక విప్లవ వ్యతిరేకియైన వ్యక్తియని స్టాలిన్ కాలమునందలి చరిత్రలో వ్రాయబడెను. ఇప్పుడు ఆయన ఒక మహా పురుషుడని వ్రాయబడును. ఈశ్వరుని దయవలన ఆయన అసలు పుట్టనేలేదని వ్రాయరు. అంత పెద్దమార్పు చేయకపోవుట వారి అనుగ్రహ విశేషమే! చరిత్ర విషయములు పరిపాలకుల ఇష్టానుసారము వ్రాయబడుచుండును. ప్రజల మనస్సును తమ ఇష్టానుసారము త్రిప్పుకొనుటకు పూర్వ సంఘటనలను ఉపయోగించుకొనుచుందురు. ఈ చరిత్ర అంతయు పిల్లలకు బోధింతురు. ఆ చరిత్ర నిర్మించినవారు చనిపోయిరి గాని విద్యార్థుల మెదడు మాత్రము వారి కథల భారముక్రింద అణగినట్లుగుచున్నది. చచ్చిపోయిన రాజుల జాపితా వల్లించవలసిన అవసరమేమి? ఏయే సంఘటన ఎప్పుడు జరిగెనో తెలిసికొనవలసిన అవసర మేమియులేదు. ఎందరు రాజులు గతించిరో లెక్కలేదు. ఈ చెట్లపై ఎన్నియాకులు కలవో అంతమంది గతించిరి. వారి చరిత్ర చదివి చేయునదేమి? చరిత్ర పేరుతో ప్రజల బుద్ధులను ఒకే అచ్చులో పోయవలెనను ప్రయత్నము, దీని ఫలితముగా ప్రజలందరు 'ప్రిజుడిస్' వలన అనగా పక్షపాతము వలన పీడితులై పురుషార్థ హీనులగుచున్నారు.

## చరిత్రభారము మోపనక్కరలేదు

భూదానోద్యమము ప్రారంభమైనపుడు "ఈ విధముగా యాచించినచో పని యెప్పటికి పూర్తి కాగలదు? దీనివలన ఏమి లభించును?

చరిత్రలో ఎప్పుడైనా ఇట్టిది జరిగినదా ? అని ప్రశ్నింపసాగిరి. అంతట నేను చరిత్రలో బాబా ఎక్కడనైన పుట్టియుండెనా ? అని అడిగితిని. బాబాయే క్రొత్తగా పుట్టినాడు కనుక అతడు క్రొత్తగా చరిత్రను నిర్మించును. మీరు చరిత్రను నిర్మించువారా ? లేక కేవలము పూర్వ చరిత్రను వర్ణించువారా ? కర్తృత్వహీనులై పూర్వచరిత్రను పఠించుట, ఊహలు ఊహించుట - ఇది మావనికాదు. చరిత్రలో జరుగనిది ఎప్పుడును జరుగదని ఏల చెప్పవలెను ? శ్రీరామచంద్రుడు వేణువు ఊదలేదు కనుక కృష్ణుడు కూడ ఊదకూడదా ? పూర్వులు చేసిన పనినే చేయవలసియున్నచో మనము జన్మించుట యెందుకు ? పరమేశ్వరుడు మనకు జన్మ నిచ్చియున్నాడు. ఇక మనము చేసిన పురుషార్థ మేమున్నది? కనుక పూర్వచరిత్రయొక్క ఒత్తిడి యేదియు మన మెదడుపై పడరాదు. దీనికొక కారణము చరిత్ర అంతయు పక్షపాతముతో కూడియుండుట. అందు సత్యమెంతయున్నదో చెప్పజాలము. సత్యమున్నచో మెదడుపై ఒత్తిడి పడవలసిన కారణములేదు. ఏలన? మనజన్మ క్రొత్త సత్యములను తెలిసికొనుటకు, క్రొత్తప్రయోగములు చేయుటకు కల్గినది. కనుక విద్యార్థులు, పౌరులు చరిత్రభారమును తమ మెదడునుండి దింపుకొనవలెను.

## చరిత్ర దురభిమానమును పుట్టించును

బళ్ళారి కర్ణాటకములో నున్నదా ? ఆంధ్రదేశములోనా ? అని తెలియగోరిన చరిత్ర ఏమిచెప్పును ? ఆంధ్రులందరు చరిత్రను పరిశోధించి బళ్లారి ఆంధ్రలోనిదని చెప్పుచున్నారు. కర్ణాటకులందరు చరిత్రను పరిశోధించి అది కర్ణాటకములోనిదని చెప్పుచున్నారు. ఇక ఈ చరిత్ర వలన మనకు ప్రయోజన మేమి ? భూగోళముమాత్ర మేమి చెప్పును ? బళ్ళారి ఉన్నచోటనే ఉన్నది. చరిత్రవలన ఏమి తేలగలదు ? ప్రతి ప్రాంతమువారు తమ తమ ప్రాంతముల హద్దులు ఇతర ప్రాంతము లోనికి చొప్పింతురు. కర్ణాటకులు తమ ప్రాంతము గోదావరినుండి

కావేరి వరకు కలదనియు, కనుక కొంత తమిళదేశము నుండియు, మహారాష్ట్ర దేశము నుండియు, ఆంధ్రదేశము నుండియు భూభాగములు దానిలో చేరవలెననియు చెప్పుదురు. అప్పుడు వారికి సంతోషము కల్గును. మహారాష్ట్రులు తమ ప్రాంతము నర్మదనుండి తుంగభద్ర వరకు నున్నదనియు, కొంచెము గుజరాతునుండి, హిందీభాష మాట్లాడు భాగమునుండి, కర్ణాటకమునుండి భూభాగము లందు కలవవలెనని చెప్పుదురు. ప్రక్కరైతుపొల మొక మూరెడు కలుపుకొనవలెనను రైతు కోరికవలెనే ఇది హాస్యాస్పదమైన విషయము. ఇది చూచి చిన్న పిల్లవాడుకూడ నవ్వుచున్నాడు. కాని మీ అసెంబ్లీలలో ఈ హక్కులు బల్లగుద్ది అడగబడుచున్నవి. ఇవన్నియు నిష్ప్రయోజన విషయములని వారెరుగుదురు. అయినను ఒక భూతము పట్టినట్లు ప్రవర్తింతురు. దీనికి కారణము చరిత్ర. పూర్వపు చరిత్రలు ఏ పద్ధతిలో వ్రాయబడినవో అదే పద్ధతిలో వానిని మనము చదివినచో అందరికి స్వాభిమానము పెరుగును. కాశ్మీరు సమస్యపై పాకిస్తాన మందలి పత్రిక లనేకములు హిందూ దేశము చేయునది చాల అక్రమమనియు, ఆక్రమణ జరుగుచున్నదనియు వ్రాయుచున్నవి. నెహ్రూ పండితుడు అది వట్టి కల్లయని చెప్పుచున్నాడు. హిందూదేశ మందలి పత్రికలు పాకిస్తాను అక్రమము, దురాక్రమణ చేయుచున్నదని వ్రాయుచున్నవి. ఇద్దరును ఒకరి నొకరు అసత్యవాదులుగా చెప్పుచున్నారు. ఏమిచేయవలెను? నిర్ణయాధికార మెవరిది? కనుక చరిత్రాభినివేశములో సత్యనిష్ఠ నిలువదు. చరిత్ర యందలి ఆగ్రహము, పట్టుదల తొలగనంతవరకు మీరు పురోగమింపజాలరు.

## చరిత్రలో వివేకము

ఒక చిన్న విషయము: మీ తెలుగు లిపికి, కన్నడ లిపికి కొద్ది భేదం కలదు. రెండింటిలో కొంచెంకొంచెం మార్పులు చేసినచో రెండును కలిపి ఒక రూపముగా చేయవచ్చును. దీని కొక సంఘము నేర్పాటు

చేసికొని అందు నిశ్చయము చేసికొనవచ్చును. రెండు ప్రాంతములు ఒకటిగా చేయవలె ననుకొన్నచో మొదట మీ హృదయముల నేకము చేసికొనవలెను. పిమ్మట మీ రాష్ట్రమును పెద్దది చేసికొనదలచినచో, చేసికొనవచ్చును. కాని తెలుగు భాషలోని తలకట్టు నెత్తిమీద నుండ వలయునని తెలుగువా రందరు. అంత యెత్తుగా ఉండుట బాగుగా నుండదు. కొంచెం క్రిందుగా నుండవలెనని కన్నడులందురు. దానిమీద పురాతన గ్రంథములను తెచ్చి తలకట్టు ఎంత యెత్తుగా నున్నదని పరిశీలింతురు. దీనిలో చరిత్రాభిమానము వచ్చినదా ఇక పని జరుగదు. ఇద్దరును కొంత విడిచిపెట్టవలసి యుండును. పూర్వ చరిత్ర చూచి పని చేయదలచినచో పరిణామ మిట్లే జరుగును. కనుక మనము నిజముగా పురోగమనము కోరినచో ఈ యుగములో ప్రాచీన చరిత్రలోని సారమును గ్రహించి ఆ సారమును విడిచిపెట్టవలెను. చరిత్రకు ఏమాత్రము ఉపయోగములేదని మేమనము. వ్యాసభగవానుడు మహాభారతమను ఒక చక్కని చరిత్రను వ్రాసియున్నాడు. మనుష్యుని స్వభావ మెన్నిరకములుగా నుండగలదో తాను చూచినట్లు వ్రాసియున్నాడు. ఇట్టి చరిత్రవలన లాభము కలదు. అట్లుకాక చరిత్ర అను భూతము నెత్తిమీది కెక్కినచో సమాజ మెప్పటికిని పురోగమించ జాలదు. పూర్వులు చేసిన గొప్ప పనులవలన మన కుత్తేజన కలుగుట మంచిదే. కాని పూర్వులు మంచి పనులు చేసినట్లే చెడ్డపనులుకూడ చేసిరి. అట్టిచో ఆ మొత్తము సరుకంతయు మన మెదడులోని కెక్కవలసిన పనియేమి? మంచి విషయములు గ్రహింపవలెను. చెడ్డవిషయాలు వదలివేయవలెను. మనముపూర్వ చరిత్రనే అంటిపెట్టుకొని కూర్చున్నచో ఈ వివేకశక్తి నశింపగలదు.

## మానవ స్వభావమునకు చరిత్రయే లేదు.

చరిత్రలో 'రీడ్ బిట్వీన్ ది లయిన్సు'— పంక్తుల మధ్యనున్న భాగమును చదువుము, అచ్చుపడిన భాగమును వదలివేయుమని నేను

విద్యార్థులకు చెప్పుచుండును. మధ్యనున్న ఖాళీభాగమును చదువవలెను. ఒకసోదరు డొక చక్కని కావ్యగ్రంథమును మాకు పంపెను. దానిలో మధ్యమధ్య కొంచెము వ్రాసి నాలుగువైపులను కొంత ఖాళీగా ఉంచబడెను. ఆ కవిత్వము బాగుగనే ఉండెను, కాని ఆ పద్యములకు నలువైపుల ఉన్న వట్టి ఖాళీ భాగములో ఎక్కువ కవిత్వము కన్పించెను. ఈ విధముగ వ్రాయబడిన చరిత్రకంటె వ్రాయబడని చరిత్రకెక్కువ ప్రాధాన్యము కలదు. ఒక తల్లి తనబిడ్డను ప్రేమతో కౌగలించుకొనును, చక్కగా పాలిచ్చి పెంచుకొనును అను విషయము నెవ్వరును టెలిగ్రాము ద్వారా పత్రికలకు పంపరు. కాని ఎవరైన హత్యచేయబడినచో వెంటనే టెలిగ్రాము పంపబడును; అది చరిత్రకుకూడ ఎక్కును. అనగా అత్యంత మహత్త్వముగల మాతృ ప్రేమనుగూర్చి చరిత్రలో ఏమియు చెప్పబడదు; ఏమియు ప్రాముఖ్యములేని ఎవరిదో హత్య విషయము చరిత్రలో వ్రాయబడును. మానవుడు తన మానవత్వమును చరిత్రకెక్కించుకొనక, మానవత్వముపై పడిన దెబ్బలనుగూర్చి మాత్రమే చరిత్రలో వ్రాసికొనుచున్నాడు. కనుక మానవ స్వభావము చరిత్రమున తెలియబడదు. మానవ స్వభావమునకు విరుద్ధమైన సంఘటన లన్నియు వ్రాయుటద్వారా నిర్మింపబడిన చరిత్ర గ్రంథములో ఎక్కడచూచిన నక్కడ కేవలము హింసయే గోచరించును.

## చరిత్ర భయప్రచార సాధనము

ముద్రా శాలలు, ప్రెస్సు మొదలైనవి వృద్ధి నొందినవి గావున ఒకచోటివార్త లింకొకచోటికి పోవుచున్నవి. దీనివలన అనవసరముగా భయము వ్యాపించుచున్నది. రెండువందల ఏండ్లకు పూర్వము మన దేశములో అన్నిటికంటె గొప్ప యుద్ధమొకటి జరిగెను. అది పానిపట్టు యుద్ధము. కాని ఆ యుద్ధము జరిగినప్పుడు, ఆ సంగతి చీనా జపానులకు గాని ఇతర దేశములకుగాని తెలియదు, నేడు పాకిస్తాన్ ఒకటి రెండు

గ్రామాలపై దాడిచేసినంతమాత్రమున మొత్తము హిందూదేశములోను, పాకిస్తాన్‌లోను, ప్రపంచములోను ఉన్న వార్తా పత్రికలన్నిటిలో ఆవార్త వచ్చివేసెను. ఆ వార్తవినగనే దేశమంతట భయము వ్యాపించెను, వెంటనే సేన పెంచవలెననియు, అందుకొరకు ధనమెక్కువ ఖర్చు పెట్టవలెననియు చర్చ బయలుదేరెను. ఒక పార్లమెంటు సభ్యుడు పంచవర్ష ప్రణాళిక కట్టిపెట్టి సైన్యమునకు ఎక్కువ ఖర్చుపెట్టవలెననునంత వరకు కూడ వెళ్లెను. పాప మాతడంత భయపడెను. ఇదంతయు చరిత్ర వ్యాప్తికి ఫలము. కాని ఒక గ్రామముపై దాడి జరిగినదనుట కర్థము అయిదు లక్షల గ్రామములపై దాడి జరుగలేదనియేగదా ! ఓ పదిలక్షల జనాభాగల మీ అనంతపురంలో ఒక హత్య జరిగినచో తక్కిన 9,99,999 మంది జీవించియే యుందురు. పదిలక్షల మందిలో ఒకడు చనిపోయినచో అందు భయపడవలసిన విషయమేమున్నది? ఒకనికి మతిచెడినది. అది బాగుచేయించు ఏర్పాటు జరుగవలెను; సరియె. ఒకనికి ఆయుర్దాయము చెల్లినది, చనిపోయినాడు. ఇదియుసరియే. కాని ప్రజలందరు కంగారై పోదురుగదా ! ప్రస్తుతమున్న చరిత్ర పఠన విధానమే పాడుగానున్నది. దానిక్రిందపడి బుద్ధి శక్తి క్షీణించుచున్నది ; పురుషార్థము నశించుచున్నది.

అనంతపురము (ఆంధ్ర) 6 ఏప్రిలు '56

---

## : 65 : విద్యార్థుల కర్తవ్యములు

మేము మనదేశమందలి కర్తవ్యమును రెండు విధములుగా విభజించెదము. ఒకటి విద్యార్థులకు సంబంధించిన విభాగము, రెండవది పౌరులకు సంబంధించిన విభాగము. విద్యార్థులు భావిపౌరులు. ఈ విధముగా ఈ రెండు విభాగములు కలిసియే యున్నవి. నేటి విద్యార్థి రేపటి బాధ్యతగల పౌరుడగుచున్నాడు. మేము పౌరులనుగూడ విద్యార్థులనియే భావింతుము. ఇరువదిఅయిదు ఏండ్ల వానికి వోటుహక్కు లభించినంతనే ఆతడు పౌరుడైపోయెనని ప్రజ అనుకొందురు. కాని ఆ విభాగము అందరి సౌలభ్యము నపేక్షించి చేయబడినది. మన దేశములో చిన్నచిన్న బాలురే మొత్తము దేశమునకు మార్గదర్శకులైన ఉదాహరణలు వందలకొలది ఉన్నవి. శంకరాచార్యులవారు సుప్రసిద్ధమైన శాంకరభాష్యమును తమ పదునారవయేట వ్రాసిరి. ఇట్టి ఉదాహరణ లనేకము మనదేశములో కలవు. కావున మేము ఫలానావాని వయస్సెంత అను దానికేమియు ప్రాధాన్యమీయము. విద్యార్థిని మేము పౌరుడను దృష్టితోనే చూడగోరెదము. నేటి పౌరులనబడు వారినికూడ మేము విద్యార్థులుగనే యెంచెదము. నేడున్నస్థితిలో చాలమంది పౌరులు విద్యాభ్యాసము లేనివారే కన్పించుచున్నారు. విద్యాభ్యాసకాలము ముగిసి, మనుష్యుడు సంసారభారము వహించినప్పుడు అతను చదువుకొను కాలముకూడ ముగిసినట్లు తలచుచున్నారు. ఇది పూర్తిగా పొరపాటు, భారత సంస్కృతికి విరుద్ధము. మనుష్యుడు విద్యాభ్యాసము, అధ్యయనము చనిపోవువరకు చేయవలెనని భారతసంస్కృతి చెప్పుచున్నది. గృహస్థుల కర్తవ్యములలో కూడ స్వాధ్యాయము చేయుచుండుట అను ఒక విధి కలదు. ఈ ఆంధ్రదేశములో ఎక్కువగా అధ్యయనము

చేయబడు తైత్తిరీయోపనిషత్తులోకూడ మనుష్యుడు తనవివిధ కర్తవ్యములతోబాటు స్వాధ్యాయ మాచరించుచుండవలెనని చెప్పబడినది. వేరువేరు కర్తవ్యములను పేర్కొనుచు ప్రతిదానితోను "స్వాధ్యాయ ప్రవచనేచ" అనికూడ చెప్పబడినది. ముఖ్యముగా స్వరాజ్యము వచ్చిన పిమ్మట పౌరులు అధ్యయనము చేయనియెడల అది స్వరాజ్యమునకొక ప్రమాదమని మా అభిప్రాయము. విద్యార్థిదశ అనబడునది జీవితమునకు ప్రారంభము మాత్రమేయని మా తలంపు. విద్యార్థికి స్వతంత్రబుద్ధితో విద్య నభ్యసించుశక్తి కలిగినప్పుడు అతనిని మేము పౌరుడనియెంతుము. ఏ పౌరుడు తన విద్యార్థి దశను ముగించి అధ్యయనము చేయుశక్తిని సంపాదించికూడ అధ్యయనము చేయడో అతనికి ద్రవ్యార్జనశక్తి సంపాదించికూడ ద్రవ్యార్జన చేయనివాని స్థితి కల్గును. నడవగలశక్తి సంపాదించి నడచుట మానివైచిన ఏమగును? అట్లే అధ్యయన శక్తి లభించికూడ అధ్యయనము మానినచో చెప్పునదేమి? కావున విద్యార్థిని, పౌరుని వేరుచేయు ప్రయత్నము మేము చేయము. అయినను, కర్తవ్యవిభాగము మాత్రము విద్యార్థులకు వేరుగను, పౌరులకు వేరుగను ఉండునట్లే చేసెదము. నేడు విద్యార్థులకు కొన్ని విషయములు చెప్పగోరుచున్నాను. రేపు పౌరుల కర్తవ్యమేమి? అను విషయమున నా భావములు తెలియజేసెదను. ఇట్లు రెండు విధములైన కర్తవ్య విభాగములు కలిసిన ఒక పూర్ణసిద్ధాంతము మీ యెదుట పెట్టెదను.

## నాకు విద్యార్థులలో నేకరూపత కలదు

మా సభలలో ఎచ్చట విద్యార్థుల సంఖ్య ఎక్కువగా నుండునో ఆ సభ మిక్కిలి ప్రశాంతముగా నుండుట చూచుచున్నాము. విద్యార్థుల విషయమున నాకు కలిగిన అనుభవము అద్భుతము. హిందూదేశమందలి విద్యార్థులయెడ నా హృదయమున ఎంతో ప్రేమ కలదు. ఇందువలన విద్యార్థుల యెదుట నే నెప్పుడు ప్రసంగించినను వారితో

నేకరూపమయియే ప్రసంగింతును. తక్కినవారి సంగతి ఎట్లున్నను అన్నిటికంటె ముందు నేను విద్యార్థినని మీకు తెలుప గోరుచున్నాను. నా అభ్యాసము అధ్యయనముకూడ నేటివరకు సాగుచున్నవి. ఒక సహజమైన ఉదాహరణ నిచ్చుచున్నాను. మా యాత్రలో ఒక జపానుసోదరుడుండెను. యాత్రలోకూడ ఒక గంట అవకాశము జేసికొని నేను జపాను భాషనభ్యసించితిని. వయస్సు పెరిగినకొలది విద్యాభ్యాసమునకు కావలసిన స్మరణశక్తి తగ్గిపోవునను అనుభవము నాకెప్పుడును కలుగలేదు. శరీరము క్షీణించినకొలది స్మరణశక్తి యింకను తీవ్రమగుచున్నట్లుగా అనుభవము చెప్పుచున్నది. చిన్నప్పుడు ఒకశ్లోకము పదిసార్లు చదివిన వచ్చెడిది. ఇప్పుడు రెండుసార్లు మాత్రమే చదివిన వచ్చుచున్నది. అధ్యయనము చేయు అభ్యాసము నిరంతరము సాగుచుండుటయే దీనికి హేతువు. ప్రతిరోజు స్నానము చేయుటచే శరీరమెట్లు నిర్మలమగునో, ప్రతిరోజు ఊడ్చుటచే గృహమెట్లు నిర్మలమగునో, అట్లే ప్రతిరోజు అధ్యయనము చేయుటచే మనసు నిర్మలమగును. ప్రతిరోజు స్నానము చేయనిచో శరీరము నిర్మలముగా నుండనట్లే ప్రతిరోజు అధ్యయనము చేయనిచో మనస్సు నిర్మలముగా నుండదు- అని బుద్ధభగవానుడు చెప్పియున్నాడు. ఈ వాక్యము ననుసరించి నా అభ్యాసము నిరంతరము సాగుచున్నది. పరమేశ్వరుడు నన్ను తీసికొని పోవునపుడుకూడ నేను అధ్యయనము చేసియే వెళ్ళగలనని ఆశించుచున్నాను. అధ్యయన శీలుడనగుట చేతనే విద్యార్థుల హృదయముతో స్వాభావికముగనే ఏకరూపత్వము నొందగలుగుచున్నాను.

## చింతన స్వాతంత్ర్యము యొక్క ఆవశ్యకత

విద్యార్థుల మొకటి కర్తవ్యము వారు తమబుద్ధిని మిక్కిలి స్వతంత్రముగా నుంచుకొనవలెను. పరిపూర్ణ స్వాతంత్ర్యమున కెవరికైన నధికారము కలదన్న అది అందరికంటె ఎక్కువ విద్యార్థులకే

కలదు. శ్రద్ధలేకుండ విద్య లభింపదు. కనుక శ్రద్ధ వహించుట అవసరమే. కాని శ్రద్ధతోబాటు బుద్ధిస్వాతంత్ర్యముకూడ అంతటి ఆవశ్యకత కలదే. శ్రద్ధ, బుద్ధి వేరని చాలమంది అభిప్రాయము. కాని ఇది పొరపాటు. చెవి, కన్ను, వేరువేరు శక్తులయ్యును రెండింటికి పరస్పర విరోధము లేనట్లే శ్రద్ధ, బుద్ధి ఉన్నవి. శ్రద్ధలేనిచో విద్యలభించుట అసంభవము. తల్లి పిల్లవానికి చంద్రునిచూపి "అబ్బాయీ! చూడు అడుగో చంద్రుడు" అని చెప్పును. పిల్లవానికి తల్లిమీద శ్రద్ధలేక తల్లి చూపినది చంద్రు డవునో కాదో శంకకలిగినచో వానికి జ్ఞానము కలుగదు. కనుక జ్ఞానప్రాప్తికి శ్రద్ధ ఒక ప్రధానవస్తువు. జ్ఞానమునకారంభము మాత్రమే శ్రద్ధతోజరుగును. కాని జ్ఞానపరిసమాప్తి బుద్ధియందు గలదు. శ్రద్ధవలన జ్ఞానమారంభమగును. దాని సమాప్తి స్వతంత్రాలోచన వలన జరుగును. కనుక విద్యార్థులు చింతనస్వాతంత్ర్యమను తమ అధికారమును ఎప్పుడును పోగొట్టుకొనకూడదు. విద్యార్థులమీద అధికారము చలాయించు శిక్షకుడు శిక్షకుడు కాడు. మా మాట నచ్చినచో అంగీకరించుము, నచ్చనిచో ఏమాత్రమును అంగీకరించవద్దు అని చెప్పువాడే శిక్షకుడు. ఈ విధముగా బుద్ధి స్వాతంత్ర్యము నిచ్చువాడే నిజమైన శిక్షకుడు. ఏలయన బుద్ధిస్వాతంత్ర్యమే నిజమైన స్వాతంత్ర్యము. మహాపురుషుడుగదా అని అతడు చెప్పినదాని కంగీకరించుట తప్పు. నేను చెప్పినది నచ్చకపోవుటచే ఎవరైన దాని నంగీకరించనపుడు నాకు చాల సంతోషము కల్గుచుండును. నేను చెప్పినది నచ్చి ఎవరైనను దాని కంగీకరించినపుడు కూడ నాకు సంతోషము కల్గుచుండును. కాని నేను చెప్పినది నచ్చక పోయినను ఎవరైనను దాని కంగీకరించినపుడు మాత్రము నాకు మిక్కిలి దుఃఖము కలుగుచుండును. కావున బుద్ధి స్వాతంత్ర్య మవసరమని చెప్పుచుందును. దీనికి "చింతన స్వాతంత్ర్యము" అనునది మంచిశబ్దము. మనము మన చింతన స్వాతంత్ర్యముపై దెబ్బ పడకుండ చూచుకొనుచు మన స్వాతంత్ర్య మను అధి

కారమును సురక్షిత మొనర్చుకొనవలెను. విద్యార్థుల ఈ అధికారము ప్రపంచములో లాగివేయబడుచున్నది. కావున విద్యార్థులకు హెచ్చరిక చేయగోరుచున్నాను. ప్రస్తుతము "డిసిప్లిన్" క్రమశిక్షణ పేరుతో విద్యార్థుల మనస్సులను యంత్రవత్తుగా చేయు ప్రయత్నము జరుగుచున్నది. క్రమశిక్షణమందు నాకు విశ్వాసము కలదు. క్రమశిక్షణ లేకుండ పని జరుగదనికూడ నే నెరుగుదును. ఇంటికి నిప్పంటుకొన్నపుడు అక్కడ డిసిప్లిన్ లేనిచో కేవలము గడబిడ మాత్రమే జరుగును. కొద్దిమంది మాత్రమే 'డిసిప్లిన్' తో అగ్ని ఆర్పుటకు వెళ్ళినపుడు ఎంత త్వరగాను చక్కగాను పని జరుగునో అంతగా చాలామంది వెళ్ళినను డిసిప్లిన్ లేనిచో జరుగదు. కాని నేడు డిసిప్లిన్ పేరుతో అన్నిచోట్ల యంత్రీకరణము జరుగుచున్నది. విద్యార్థుల బుద్ధికిది పెద్ద దెబ్బ.

## యూనియన్ విధానము

ప్రపంచములో విద్యాశాఖలన్నియు ప్రభుత్వములచేతిలో నున్నవి. ఇంతకంటె పెద్ద ప్రమాదము ఇంకొకటియుండదని నా అభిప్రాయము, విద్యాధికారము ప్రభుత్వములచేతిలో నుండరాదని మేము ప్రతిపర్యాయము చెప్పుచునే యున్నాము, అది జ్ఞానులచేతిలో నుండవలెను. ఎందుకనగా ఈపని సేవాపరాయణత్వముతోనే జరుగవలెను, నేటిపరిస్థితి ఎట్లున్నదనగా ప్రపంచములోని ప్రభుత్వములు విద్యలను తమ అధీనములో పెట్టుకొని కూర్చున్నవి. విద్యాశాఖాధికారి ఏపుస్తక మంగీకరించునో దానిని విద్యార్థులందరు చదువవలసినదే, ఉత్తర ప్రదేశమందలి ఏబదియొక్క జిల్లాలలోని ఆరుకోట్ల మందికి ఒకేపుస్తక మీయబడును, అంతరిచేతను అదే చదివించబడును, ఇపుడు విశాలాంధ్ర ఏర్పడినది కనుక యంత్రీకరణము కూడ విశాలము కావచ్చును, ఎందుకనగా పూర్వము పదకొండు జిల్లాలకు మాత్రమే నియమింపబడిన పాఠ్య పుస్తకము ఇప్పుడు ఇరువది జిల్లాలలో ఉపయోగింపబడును. ప్రభుత్వము

'ఫాసిస్ట్' పద్ధతి దైనచో విద్యార్థులందరకు 'ఫేసిజమ్' నేర్పబడును, కమ్యూనిష్టు ప్రభుత్వమైనచో కమ్యూనిజము ప్రచారమగును, ధనికవాద ప్రభుత్వమయినచో ధనికవాదములోని గొప్పతనము చెప్పబడును. ప్లానింగువారి ప్రభుత్వమైనచో ప్లానింగునుగూర్చిన కథలు విద్యార్థులకు చెప్పబడును, ఇంతకంటె ఎక్కువ ప్రమాద మింకొకటి ఉండజాలదు. కావున విద్యాశాఖ విముక్తి గాంచవలెను. మొదట ముక్తియే ముఖ్యావసరము. కనుక విద్యార్థులను మేము "మిమ్ములను యంత్రములవలె తయారుచేయు ప్రయత్నము జరుగుచున్నది. కావున మీ విచార స్వాతంత్ర్యమును చింతన స్వాతంత్ర్యమును నిలబెట్టుకొను"దని హెచ్చరించ దలచు కొన్నాము. కాని విద్యార్థు లీ విషయము నర్థముచేసికొనలేదు. ప్రస్తుతము వారు వేరువేరు యూనియన్లు ఏర్పాటు చేయుచున్నారు. ఇది మాకు ఆశ్చర్యమును కలుగ చేయుచున్నది. యూనియన్ గొఱ్ఱెలకుండును గాని సింహములకుండదు. విద్యార్థులు గొఱ్ఱెలుకారాదు, సింహములు కావలెను. ఏ సిద్ధాంతమైనను నచ్చినచో దానిని ప్రచారము చేయవలెను. నచ్చనిచో దాని నంగీకరింప రాదు. నా కాశ్చర్యమును కలిగించు విషయమేమన ప్రభుత్వము మూలముగా వారిబుద్ధులు చల్లారిపోవుచున్నవి. వారు తమలోతాము యూనియన్లు తయారుచేసికొనుచున్నారు. మన దేశములో లక్షలకొల స్కూళ్లు నడువవలెను. పాఠశాలలునడువవలెను. కాని ఏ విద్యార్థియు ఏ యూనియన్‌లోను చేరకూడదు. "పౌరుడనైన పిమ్మట స్వాతంత్ర్యము తగ్గింగుకొనవలసిన అవసరము వచ్చినచో ఏ యూనియన్‌లోనైన చేరెదనుగాని నేడు నేను విద్యార్థిని. కావున నూటికి నూరుపాళ్ళ స్వాతంత్ర్యము ఉంచుకొనుటకు నాకధికారము కలదు. రాజకీయములను గురించి నేర్చుకొందును. ఆలోచింతును. కాని ఒక నిశ్చయాభిప్రాయమునకు మాత్రము రాను. నా అభిప్రాయములను మార్చుకొనగలుగు స్థితిలో చింతనచేసెదను. నేను యూనియన్‌లో ప్రవేశించినచో నాకున్న యీ అధికారము పోవును." అని విద్యార్థులు

చెప్పవలెను. దీనికర్థము విద్యార్థులలో సహకారముండరాదని కాదు. సేవ నిమిత్తము సహకారము అవసరమే కాని యూనియన్ అనునది యంత్రమువలె తయారు చేయునది. దేశ స్వాతంత్ర్యమున కిది చాల ప్రమాదకరమైనది.

## ఆత్మ నిగ్రహము

ఆత్మనిగ్రహము విద్యార్థుల రెండవకర్తవ్యము. తననుతాను నియమించుకొనగల్గినవాడే స్వాతంత్ర్యాధికారమును తనచేతిలో నుంచుకొనగలడు. నేను సంకల్పించిన దానిని తప్పక అమలు జరిపెదనను నిశ్చయ ముండవలెను. నేను నిజముగా సంకల్పించిననాడు ప్రపంచమునందలి ఏ శక్తియు దానిని భంగింపజాలదను నిశ్చయము విద్యార్థులలో కలుగవలెను. ఇందుకు దేహము, మనస్సు, బుద్ధి, వీనిని వశములో నుంచుకొనవలెను. నే నుదయము నాలుగుగంటలకు లేవవలెనని నిశ్చయించుకొన్నచో ఆ నిశ్చయమునుండి నన్ను మళ్ళించుటకు ఇంద్రియములకేమి శక్తికలదు ? ఇట్టి ఆత్మనిగ్రహము లేనిచో విద్యార్థి ప్రపంచములో నిలువజాలడు. కనుక విద్యార్థులు విద్యాభ్యాసముతోబాటు ఆత్మనిగ్రహము కూడ ఒక వ్రతముగా స్వీకరింపవలసి యున్నది. లేనిచో విద్య వీర్యహీనము కాగలదు. ఆత్మ నిగ్రహశక్తి అన్నిటికంటె గొప్ప శక్తి. మీరు స్థితిప్రజ్ఞుని శ్లోకములు వింటిరి. స్థితప్రజ్ఞు డెట్టివాడు ? ఎవని బుద్ధియందు నిర్ణయశక్తి కలదో అతడు స్థితప్రజ్ఞుడు. నేడు ప్రపంచములో చాల పెద్ద పెద్ద సమస్యలు బయలుదేరుచున్నవి. చిన్న సమస్య లిపుడు లేవు. ప్రపంచమంతయు ఇపుడు కలిసిపోయి యున్నది. కావున చాల విశాల పరిమాణములో యోచింపవలెను. నిర్ణయముకూడ వ్యాపకబుద్ధితో శీఘ్రముగా చేయవలెను. పూర్వమంతటి పెద్ద సమస్యలు ఉత్పన్నమయ్యేడివికావు. ప్రజలకు ప్రపంచమునుగూర్చి తెలియదు. మన దేశములో పానిపట్టు మహాయుద్ధము జరిగెను. కాని చీనా జపాను దేశస్థులకు

దానిసంగతి తెలియదు. నేటిస్థితి అట్టిదికాదు. ప్రపంచములో ఏమూల ఎంత చిన్న సంఘటన జరిగినను వెంటనే ప్రపంచమంతట దాని ప్రభావము పడుచున్నది. యూరోపు, అమెరికా ఖండములలోని సంఘట నల ప్రభావము హిందూదేశపు బజారుపై బడుచున్నది. ఈ విధముగా పెద్ద పెద్ద సమస్యలు నేడు మన యెదుట నున్నవి. కావున తొందరగా నిర్ణయము చేయవలసిన ఆవశ్యకత కలుగుచున్నది. నిర్ణయశక్తికి నేడున్నంత ఆవశ్యకత పూర్వము లేదు. మీరు చూచుచునే యున్నారు. నే డెవ్వరికిని కాలినడకను వెళ్ళునంతటి తీరుబడిలేదు. ప్రతివారును పెద్దపులి తరుముకొనివచ్చుచున్నట్లు విమానములమీదను రైళ్ళమీదను పరుగెత్తిపోవుచున్నారు. మీరు విమానములో ఎందుకు తిరగరాదని మమ్ముకూడ నడుగుచున్నారు. "మేము విమానములో తిరిగినచో మాకు గాలి లభించునుగాని భూమి లభింపదు. మాకు కావలసినది భూమి కనుక సమయము నష్టపెట్టుకొని నేలపై నడవవలసి వచ్చుచున్న" దని మేము జవాబిచ్చుచుందుము. సారాంశమేమనగా తొందరతొందరగా నిర్ణయములు చేయవలసిన కాలమిది. కనుక ఈ యుగములో అన్నిటి కంటె పెద్దశక్తి నిర్ణయశక్తి. దీనినే ప్రజ్ఞ అందుము. స్థిరమైన ప్రజ్ఞగల వానిని స్థితప్రజ్ఞుడందురు. విద్యార్థులు స్థితప్రజ్ఞులు కావలెను. దానికి మార్గము తమ మనస్సున ఇంద్రియములు, బుద్ధి మొదలగువానిపై నిగ్రహమునకు ప్రయత్నించుట. విద్యార్థులు తమ సంకల్పశక్తిని దృఢ పర్చుకొనుటకు ప్రతిజ్ఞ చేసికొనవలెను, మనమొక నిర్ణయము చేసికొనిన మీదట అది భగ్నమైనచో మనశక్తియు భగ్నమగును. కనుక నే నే నిర్ణయము చేసికొందునో అది ప్రాణము పోయినను తప్పను. అనునట్టి స్థితి కలుగవలెను. ఇట్టి నిశ్చయశక్తికి ఇంద్రియ నిగ్రహము మిక్కిలి ఆవశ్యకము.

## నిరంతర సేవాపరాయణత్వము

విద్యార్థుల మూడవ కర్తవ్యము వారెప్పుడును సేవాపరాయణులై యుండుట. సేవ లేకుండ జ్ఞానము కలుగదు. మహాభారతములో ఒక ప్రసంగము కలదు. అర్జునుడు, కృష్ణభగవానుడు, ధర్మరాజు ఒకచోట కూర్చుండి యుండిరి. తన గాండీవమును నిందించినవానిని సంహరించెదనని అర్జునుని ప్రతిజ్ఞ. ధర్మరాజు అర్జునుని ఉత్సాహమును వృద్ధి పొందించుటకై గాండీవమును నిందించుచు "నీవును, నీ గాండీవమును ఇంత బలవంతులయ్యును మాకీ కష్టములు తప్పలేదు. మన శత్రువులు నశించలేదు అని పలికెను. అర్జునుఁడు చాల ధర్మనిష్ఠ గలవాడు. అన్నగారి యెడల మిక్కిలి ప్రేమ గలవాడు. అయినను అతడు తనను తిట్టినను సహింపగలడు గాని, గాండీవమును నిందించిన సహింపజాలడు. ఇందుచే కృష్ణుని ఎదుటనే అతడు ధర్మరాజుపై చేయెత్తెను. కృష్ణుడాతని చేయి పట్టుకొని "నీ వెంత మూర్ఖుడవు! నీకు జ్ఞానములేదు. నీవు పెద్దల సేవ చేయలేదు. నీకు జ్ఞాన మెట్లు లభించును?" అని మందలించెను. మహాభారతములో ఇంకొకచోట యక్షప్రశ్నల కథ గలదు. అందు జ్ఞాన మెట్లు లభించునని ఒక ప్రశ్న అడుగబడెను. దానికి "జ్ఞానం వృద్ధ సేవయా" పెద్దల సేవవలన జ్ఞానము లభించునని సమాధాన మీయబడెను. పెద్దలయొద్ద అనుభవ ముండును. సేవాపరాయణులను చూచినపుడు ఆ పెద్దల హృదయము వికసించి వారు తమ దగ్గరనున్న సారమంతయు వారి కిచ్చివేయుదురు. కావున విద్యార్థులు సేవాపరాయణులు కావలెను. వృద్ధులకు, తల్లిదండ్రులకు, దీన దుఃఖితులకు, సమాజమునకు సేవజేయవలెను. మనము సేవచేయుచు ఉండిన యెడల అధ్యయన మెట్లు సాగునని అనుకొనరాదు. అంతేకాక సేవవలననే జ్ఞానము లభించునను నమ్మకముతో నుండవలెను. రామాయణమునం దొక కథ గలదు. విశ్వామిత్రుడు దశరథుని యొద్దకువెళ్ళి యజ్ఞరక్షకై

రామలక్ష్మణులను యాచించెను. దశరథుడు మోహగ్రస్తుడై యుండెను, కావున "నా రాముని కింకను పదునారు వత్సరములు నిండలేదే! అతని నెట్లు పంపగల"నని పలికెను. ఇది వినగనే విశ్వామిత్ర మహర్షి "మంచిది, నేను పోవుచున్నా" ననెను. విశ్వామిత్రుడు పలికిన ఈ మాటలతో భూమి యంతయు కంపించిపోయె నని వాల్మీకి వర్ణించెను. జ్ఞానవంతుని కోరికను రాజ్యముకూడ తిరస్కరింపజాలదు. పిమ్మట వసిష్ఠుడు దశరథునికి "నీవింత మూర్ఖుడవేమి? విశ్వామిత్రుడు రామలక్ష్మణులను యాచించినాడన్న దానివలన నీ పుత్రులకు కల్యాణమే కలుగును. వారు విశ్వామిత్రుని సేవజేసి ఆయనవలన జ్ఞానమును పొందగలరు సేవను మించిన విద్యాపీఠ మేదియు నుండజాలదు" అని బోధించెను. ఇది విని దశరథుడు విశ్వామిత్రునకు రామలక్ష్మణులను అర్పించెను. తరువాత రామలక్ష్మణులు సేవచేయుచునే జ్ఞానమెట్లు పొందిరో వాల్మీకి వర్ణించెను.

## ప్రపంచ పౌరత్వము

విద్యార్థుల నాల్గవ కర్తవ్యమేనగా వారన్నిటియందును సావధానులై యుండవలెను. ప్రపంచములో సాంఘికములైన ఆందోళనలు ఏవేవి సాగుచున్నవో వానినన్నిటిని పరిశీలించవలెను. వేరువేరు వాదము లెన్ని బయలుదేరుచున్నవో వాని నన్నిటిని తటస్థబుద్ధితో నర్థముచేసికొనవలెను. విద్యార్థులు సర్వవ్యాపకులు కావలెను. విద్యార్థులబుద్ధి సంకుచితముగా నుండకూడదు. నేను తెలుగు మాట్లాడువాడననిగాని, నేను హిందూదేశస్థుడననిగాని అనుకొనరాదు. నేను ద్రష్టను, ఇది అంతయు దృశ్యము నేను వీనికంటె వేరు. మతమును, భాషను పురస్కరించుకొని బయలు దేరిన వాదము లన్నింటినుండి నేను వేరుగా నుందును. తటస్థబుద్ధితో వానిని పరిశీలించుటయే నా పని అను అనుభవము కలుగవలెను. ఇట్టి వ్యాపకబుద్ధి విద్యార్థులకు తప్పక కలుగగలదు. కాని నేడు మనము

చూచునది దీనికి తలక్రిందులుగా నున్నది. భాషారాష్ట్ర నిర్మాణ విషయమున ఎన్ని కలహములు బయలుదేరెను? దానిలో హృదయము యొక్క సంకుచితత్వము ప్రకటితమయ్యెను. అటువంటి సంకుచితత్వము ఉండకూడదు. విద్యార్థులు వ్యాపకబుద్ధితో నాలోచించవలెను. మేము ప్రపంచ పౌరులమనియు ప్రపంచమంతట ప్రపంచ పౌరత్వ స్థాపనచేయు వారమనియు చెప్పుకొనవలెను. మేము భారతీయులమని కూడ చెప్పుకొనరాదు. భారతీయులనగా నేటి పౌరులు; కాని విద్యార్థులు మాత్రము భారతీయులకంటె ఇంకను పైన నున్నవారు. మనము విశ్వమానవులము; విద్యను ఉపాసించువారము; తటస్థబుద్ధితో ఆలోచించువారము; మనము సంకుచితులము, ఒకే మార్గము ననుసరించువారము కాజాలము.

కర్నూలు (ఆంధ్ర) 11-3-56

: 66 :

# గాంధీ గ్రామమందలి నవీన విద్యాశిక్షితులకిచ్చిన ఉపన్యాసము

నవీనవిద్య అను సమస్యకు వెనుక ఒక ఆధారము కలదు. ఆ ఆధారము అహింసానిష్ఠ. నేడు ప్రపంచములో అహింస అన్న నచ్చని వ్యక్తియు లేడు, సమాజమునులేదు. ఏలన అది అంత మధురమైనది. అయినప్పటికిని వ్యవహారములో మాత్రము ప్రజలకు అహింసపై విశ్వాసము నిలుచుటలేదు. ప్రజల హృదయములో నిశ్చయముగా అహింసపై ప్రేమకలదుకాని విశ్వాసము మాత్రము హింసపైనే కలదు. తల్లితండ్రులు పిల్లలకు నచ్చజెప్పుటకు ప్రయత్నింతురు. వారు విననిచో వారిని గద్దింతురు, బెదిరింతురు, అప్పటికిని విననిచో చివరకు వారిని కొట్టుదురు. ఆ కొట్టుటలోకూడ ప్రేమయేకలదు. ఆ బాలురకు మేలుకలుగవలెననియే వారి భావన. కాని ఎంత బోధించినను నచ్చనివారికి నచ్చజెప్పుటకు అమోఘమైనసాధనము తాడనమే అను భావము నేడు ప్రపంచములోని అన్ని జీవనరంగములలోను కలదు. ఇంటిలో కొట్టుదురు, ప్రభుత్వములో దండింతురు, సమాజములో వెలివేయుదురు, అంతర్జాతీయ క్షేత్రములో సైన్యము నుపయోగింతురు. ఈ విధముగా తమ తమ క్షేత్రములలో చిన్నవి పెద్దవియగు హింసారూపములు గోచరించుచుండును. ఇల్లు మొదలు అంతర్జాతీయ వ్యవహారములవరకు అందరికి చివరి యాధారము హింస. మేము బాలునకు బోధించితిమి. అత డర్థముచేసికొనలేకపోయినచో ఇంకను ఎక్కువ ప్రేమతో బోధించితిమి, దానివలనకూడ తెలియకపోయిన ఇంకను సౌమ్యమైన చికిత్స చేసితిమి. ఈ విధముగా మేము బోధించు విధానమునే ఎక్కువ సౌమ్యముగా అనుసరించితిమి. అహింస

మీదిశ్రద్ధ అనగా ఇది. కొట్టుటవలన, బాదుటవలన కాని పనికొంచెము మందలించుటవలన కావచ్చును. మందలించుటవలన కానిపని నచ్చ జెప్పినచో తప్పక జరుగును. నచ్చచెప్పుటచే జరుగనిపని ప్రేమపూర్వకముగా సేవచేయుటచే తప్పక జరుగును. ప్రేమపూర్వకముగా సేవ చేయుటచే జరుగనిపని దానికొరకు ప్రేమపూర్వకముగా ఎక్కువ త్యాగముచేయుటచే తప్పకజరుగును. ఈ విధముగా ఒకమాటుకంటె ఇంకొకసారి ఎక్కువగా నచ్చజెప్పి ఫలితమును సాధించుటకు మిక్కిలి సౌమ్యమయిన ఉపాయములు ఉపయోగింపవలెను. చివరకు అన్నిటి కంటె సౌమ్యమయిన ఉపాయమువలన కార్యముతప్పక సిద్ధించునను విశ్వాసముండుటయే అహింస.

ప్రస్తుతము మేము భూదానమును గూర్చి ప్రజలకు నచ్చజెప్పు చున్నాము. ప్రతి గ్రామము తిరుగుచు ప్రేమతో అడుగుచున్నాము. దాని వలన అంతమంచి ఫలితము లభింపలేదనుకొనుడు. అప్పుడు ప్రజలు ఒక తీవ్ర కార్యక్రమమును ప్రారంభింపవలెనని చెప్పుదురు. ఆ తీవ్ర కార్యక్రమము వలన కూడ ఏమియు జరుగనిచో ఇంకను తీవ్రమైనట్టియు అంతకంటెను ఎక్కువ తీవ్రమైనట్టియు కార్యక్రమము ప్రారంభింప వలసి యుండును. ప్రజల భావములు తరచుగా ఇట్లుండును. అహింస కొక హద్దునుపెట్టి వారాలోచింతురు. అహింసకు హద్దనగా మన మెవ రిని కొట్టము, చంపము. ఇంతవరకే వారు పెట్టుకొన్నారు. కాని ఆపనికి మాత్రము తీవ్రాతి తీవ్రములైన ఉపాయము లవసరమని వారి బుద్ధికి తోచుచున్నది. మేము దీనినే హింసక చింతన మందుము. ఇది అహింసా చింతన విధానముకాదు. ఇది శస్త్రాస్త్రములలో సాగుచుండును, చిన్న శస్త్రముతో పని జరగనిచో పెద్ద శస్త్రములు బయలుదేరును. వానివలన కూడ పని నెరవేరనిచో ఇంకను తీవ్ర శస్త్రములు కనిపెట్టవలెను. ఈ విధముగా అహింసకొరకై నప్పటికిని, తీవ్రము, తీవ్రతరము, తీవ్ర తమము, అను విధముగా ఆలోచించుచు పోయినచో అది పేరునకే

అహింసయగును కాని సిద్ధాంతమున కహింసకాదు. కనుక అహింసలో సౌమ్యము, సౌమ్యతరము, సౌమ్యతమము ఈ విధముగా ఆలోచనా పద్ధతి సాగును. అహింసయొక్క ఈ మూలభూత సిద్ధాంతము మనస్సుకు నాటుకొన్నచో మీరడిగిన ప్రశ్నలకు సమాధానము లభింపగలదు.

కర్మపరాయణులైన వారు ఎప్పుడును ప్రేమతో మాట్లాడుదురు. నచ్చజెప్పుదురు. కాని ఎదుటివానికి అర్థముకానిచో ఒక్కసారిగా వారి కంఠస్వరము పెద్దదైపోవును. దీనిపేరు హింసాప్రక్రియ. మనము ప్రేమతో బోధించినప్పటికిని కలుగని ఫలితము తీవ్రముగా బోధించుటచే ఎట్లు కలుగును ? ఏమియు ఫలితము కలుగదని తెలిసికొనవలెను. కనుక మనప్రేమ సరిపోనిచో ఇంకను ప్రేమించవలెనను భావము కలుగవలెను. ఈ సూచన సమాజ మంతటికిని ఉద్దేశింప బడినది. రాజకీయములలోను, వ్యాపార వ్యవహారములలోను, సామాజిక క్షేత్రములోను కుటుంబములోను, సర్వత్ర ఇది వర్తించును. ఇది శిక్షణకు మూలభూతమైన సిద్ధాంతము. ఈ సిద్ధాంతము స్పష్టముగా తెలిసినచో నవీన విద్యయందలి పై ప్రక్రియను తెలిసికొనుట సులభమగును.

అహింస అనగా చంపకపోవుట, కొట్టకపోవుట, ఆయుధ విసర్జనము అని మాత్రమేకాదు. అట్లన్నచో అది ఒక 'నెగిటివ్' అభావాత్మక వస్తువు అయిపోవును. అహింసా చింతన ప్రక్రియమే (ప్రాసెస్) భిన్నమయినది. ఈ విషయము మనమెప్పుడును దృష్టియందుంచుకొనవలెను.

ఇంకొక విషయము 'మనము' అని చెప్పబడునది ఎవరు ? అందు కొంత మానసికభాగమును, కొంత శారీరికభాగమును కలదు. మనమీ రెండిటిని కలిపినచో మన కర్తవ్యము స్పష్టమగును. మనకన్ను చాలదూరము చూడజాలదు. కళ్ళజోడు పెట్టుకొన్నచో మరికొంచెము దూరము చూడగలదు. అయినను దానికొక హద్దుగలదు. శ్రవణశక్తికిని హద్దుకలదు, కరచరణముల శక్తికిని హద్దుకలదు, కనుక మన కర్తవ్య

క్షేత్రము శరీరమునకు చుట్టుప్రక్కలనే యుండును. జీవితవిధాన మంతయు చుట్టుప్రక్కలనున్న ప్రజల సేవను దృష్టిలో పెట్టుకొని ఏర్పడవలెను. ఇది సేవనుగూర్చిన యొకసూత్రము. మానసికముగా మనము చాలదూరము చూడగలము. భూమిమీద కూర్చుండి ఆకాశమును గూర్చి ఆలోచింతుము. ఆలోచనశక్తి చాల వ్యాపకమయినది. కనుక ఆలోచనవలన మనము విశ్వమానవులము కావలెను. మనమొకేచోట నున్నామనుట నిజమేకాని మనమనస్సులో మాత్రము మనము అఖిల ప్రపంచ పౌరుల మను భావముతో నుండవలెను. ఆలోచనలో సంకుచితత్వము పనికిరాదు. పనిలోమాత్రము సన్నిహిత క్షేత్రములోనే పని చేయుదుము. ఈ రెంటిటిలోను విరోధము పనికిరాదు. దూరస్థులకు ఎంతమాత్రమును నష్టము కలుగనివిధముగా - ఇంతేకాదు వారికికూడ లాభము కలుగునట్లుగా, సన్నిహితులకు మనము సేవ చేయుదుము. విశ్వక్షేమమునకు విరోధముకాని పరిసర ప్రాంతముల సేవ— ఇది మన జీవనరహస్యము. మన మభ్యసించువిద్య ఇట్టి ద్విరూపశక్తితో నిండి యుండును. ఆలోచనలో నెచ్చటను సంకీర్ణత్వము, సంకుచితత్వము ఉండకూడదు. కాని ప్రత్యక్ష కర్మాచరణములోను, కార్య ప్రణాళికలోను, పరిసర ప్రాంతముల మీదనే అనన్యనిష్ఠ యుండవలెను. బుద్ధభగవానుడు సమస్త విశ్వమునందు దయగలవాడు. క్రీస్తు మహాశయుడు పాలస్తీనా పరిసరములలోనే పనిచేసెను. నేడు మన పిల్లలకు తెలిసినంతమాత్రపు భూగోళమైనను క్రీస్తుకు తెలియదు. ఆయనను పరీక్షకు కూర్చుండబెట్టిన భూగోళము పేపరులో పూర్తిగా ఫేలయియుండేవాడని నా అభిప్రాయము. ఆయనకు భాషకూడ ఒకటే వచ్చును. ఒకేభాష మాట్లాడుచు చాల తక్కువ భూగోళ జ్ఞానముగల ఆ వ్యక్తి విశ్వమునంతటిని ప్రేమించెను. దీనికి కారణము ఆయనది విశాల హృదయము. బుద్ధభగవానుని స్థితియు ఇదియే. ఆయన ఆ కాలపు రైతుల భాషయైన పాలీభాషలో మాట్లాడెడి వారు. బీహారు, ఉత్తర ప్రదేశ రాష్ట్రములలో కొంతభాగమే వారు

పర్యటించిరి. ఆయన తిరిగిన ప్రదేశమునకే "బీహార్" అను పేరు వచ్చెను. ఇంత చిన్న ప్రదేశములో వారు పర్యటించిరి. 'బీహార్' వెలుపలి ప్రపంచమును బహుశః ఆయనకూడ ఎరిగియుండరు. ఆయన మిక్కిలి సన్నిహితమైన ప్రదేశములోనే సేవచేసిరి. కాని ఆయన ఆలోచనలో సమస్త ప్రపంచమునకు క్షేమంకరములైన విషయములు నిండియుండెను. నవీన విద్యా విధానముకూడ నిట్టిదే. ఆలోచనలో వ్యాపకము, కర్మయోగవిశిష్టము—అనునది నవీన విద్యలోని రెండవ సిద్ధాంతము.

మూడవ సిద్ధాంతము చాల ముఖ్యమయినది. నవీన విద్యలో పని విషయమై ఇంత పట్టుదల ఎందుకు ? అను సంగతి బోధపడనిదే ఈ సిద్ధాంతము బోధపడదు. నేడు మనము అనేక విధములైన ప్రాపంచిక కార్యములు చేయుచున్నాము. ఒకడు పకీలైన ఇంకొకడు వర్తకుడు, ఒకడు ప్రొఫెసర్ అయిన మరియొకడు మంత్రి, ఒకడు రైతైన ఇంకొక డింకొకటి. ఈ పను లన్నియు సమాజమునకు లాభదాయకములని ఎంచ బడు చున్నవి. ఈ పను లెవడు సరిగా నిర్వహించునో అతడు మంచి యోగ్యుడైన లోకసేవకుడని యెంచబడును. నేటి సమాజ రచననుబట్టి అందేమియు దోషములేదు. కాని నవీనవిద్య కేవలము నేటి సమాజ మును దృష్టిలో పెట్టుకొని సేవచేయునదికాదు. ముందు నిర్మింపవలసిన సమాజమును దృష్టిలో పెట్టుకొని పనిచేయును. "దీనికి మంచివిద్య" అను పేరే ఎక్కువ తగియున్నది. ఎందుకనగా నవీనవిద్య అనుటచే కొంత భ్రాంతి కలుగుట కవకాశమున్నది. క్రొత్త వస్తువు పాడుగాను ఉండవచ్చును, ప్రాత వస్తువుకూడ పాడుగా ఉండవచ్చును, క్రొత్త వస్తువు బాగుగా నుండనువచ్చును. ప్రాత వస్తువుకూడ బాగుగా నుండ వచ్చును. కనుక క్రొత్త విద్య అనుటవలన ఏదో పెద్ద సద్గుణమే నిరూ పించినట్లు కాజాలదు. అయినను మేము దానిని "నవీనవిద్య" అని పిల్చుటకు కారణము మేమొక సమాజమును నిర్మింపవలసియున్నది.

అందు నిమిత్తము ఒక ముఖ్యమైన కార్యాచరణ సూత్రము ఇది. ప్రతి వాడును తన శరీరమునకు కావలసిన ఆహారమునకై శరీర పరిశ్రమ చేయవలెను. బుద్ధికి సంబధించిన ఇతర కర్మలుచేసి శరీరమును పోషించుట ఉత్తమధర్మము కాదు. బుద్ధితో పనిచేసి భోజనము సంపాదించుకొన్నచో అది ఉత్తమమైన పనికాదు. శరీరపోషణ శరీర పరిశ్రమ వలన జరుగవలెను. దీనినే "బ్రెడ్ లేబర్" అందురు. దీనికే భగవద్గీతలో "యజ్ఞము" అని పేరు పెట్టబడినది. దీనిని గూర్చియే క్రీస్తు చెమట ఓడ్చి భోజనము సంపాదించుట— "బ్రెడ్ లేబర్" అని చెప్పెను. నవీన విద్య కిదియొక మూల సిద్ధాంతము. ఈ తత్వమును పూర్తిగా అంగీకరింపనివారు నవీనవిద్యను పూర్తిగా అంగీకరింపనట్లే: ఏలన శరీర పరిశ్రమనుగూర్చి ఇంత పట్టుదల యేలని నన్ను మాటి మాటికి ప్రశ్నించుచున్నారు. ఆ చర్చ అంతయు ఇక్కడ చేయదలచుకొనలేదు. కేవలము ఆ విషయమును మీ దృష్టికి తేగోరుచున్నాను. నవీన విద్యలో ఉన్నది ఏదో ఒక పనిద్వారా జ్ఞానము సంపాదించుట, "లెర్నింగ్ త్రూ డ్రాయింగ్" ఇంతమాత్రమే కాదు, జ్ఞానసంపాదనకు ఏదో ఒక పని చేయవలెనని ఇతర శిక్షణ శాస్త్రజ్ఞులుకూడ చాలమంది చెప్పుచున్నారు. మనము వట్టి గణితము మాత్రమే నేర్పినచో అది గాలికి పోవును. కనుక కొన్ని వ్యవహారములు చేయుచు వానిద్వారా గణితము నేర్పుచున్నాము. కనుకనే పిల్లలు తేలికగా నేర్చుకొనగలుగు చున్నారు. ఇది పూర్తిగా మామూలు శిక్షణ విధానమునకు సంబంధించినది. ఇది నవీన విద్యకాదు. మన శరీరపోషణ శరీర పరిశ్రమచే చేసికొనుట ధర్మము. అట్లు చేయనిచో ఇతరుల నెత్తిపై కూర్చున్నవార మగుదుము. హింస నుండి ముక్తులము కాజాలము. ఇది మా సిద్ధాంతము. నవీన విద్యకు మూలమైన సింద్ధాంతమిదే. వ్యాయామము నిమిత్తము కొంత శరీర పరిశ్రమచేయుట మంచిదని జనులనుకొందురు. జ్ఞానప్రాప్తి నిమిత్తము ఏదైన 'ప్రాజెక్టు' తీసికొని పనిచేయుటయు మంచిదే. ఈ విధముగా

చేయబడునదికూడ పనియే. కాని ఇది "బ్రెడ్‌లేబర్"కాదు. నవీనవిద్య 'బ్రెడ్‌లేబర్' సిద్ధాంతముపై నాధారపడియున్నది. ఆ సిద్ధాంతమును నమ్ముచున్నది.

బాబా పదయాత్రపై ఇంత పట్టుదల ఎందుకు పూనియున్నారని కొందరడుగుచున్నారు. దీనికి చాల కారణములు కలవు. కాని ఒక కారణ మేమనగా, కొంచెము శరీర పరిశ్రమ జరుగవలెనని మేము కోరుచున్నాము. ఇదినా "బ్రెడ్ లేబర్", ప్రజలు నాకు భోజనము పెట్టు చున్నారు. నేను పది లేక అయిదుమైళ్ళు నడచుట అనగా నాచేతి మీదుగా కొంత "బ్రెడ్ లేబర్" జరిగినదని నేననుకొనుచున్నాను. ఈ విధముగా ఈ యాత్రకును "బ్రెడ్ లేబర్"కును సంబంధము కలిపి తిని. ఇంతేకాక గడచిన ముప్పదియేండ్లును "బ్రెడ్ లేబర్" సిద్ధాంతము మీదనే నా జీవితము నడచినది. సాధారణముగా నే నెనిమిది గంటలు పని చేయువాడను. అప్పుడప్పుడు ఎక్కువకూడ పనిచేసెడివాడను. ఒకసారి వ్యవసాయము, ఒకమాటు నీళ్లు తోడుట, పిండి విసరుట, పారిశుద్ధ్యము, నూలువడకుట, నేత, ఏకుట, వడ్రంగము, మొదలైన రకరకములైన పనులలో గంటలకొలది నిమగ్నుడనై ముప్పదియేండ్లపాటు పనిచేసితిని. దానివలన నా బుద్ధిశక్తి చాల పెరిగినదిగాని తగ్గలేదని చెప్పగోరు చున్నాను. రాత్రింబగళ్ళు కేవలము శరీర పరిశ్రమ చేయువాని బుద్ధి తీవ్రమగునని నేను చెప్పను. ఏవస్తువైనను మితిమీరినచో దాని వికాసము ఆగిపోవును. కాని ఏజీవితములో శరీర పరిశ్రమ తగుమాత్రముగానుండి దానితోపాటు చింతనకూడ సాగుచుండునో అచట చక్కని బుద్ధి వికాసము కలుగునని నేను చెప్పదలచుకొన్నాను. నా అనుభవ మిదే. చిన్నప్పుడు నా స్మరణశక్తి బాగుగనే అనగా సగటుకంటె ఎక్కువగనే ఉండెడిది. కాని నేడు 62 ఏండ్ల వయస్సులో నా స్మరణశక్తి చిన్న ప్పటికంటె చాల తీక్ష్ణమైనది. జ్ఞాపక ముంచుకొనదగిన విషయమును దేనిని నేను మరువను. ఎప్పుడైన ఏదైన పుస్తకములో మంచి విష

యము చదివి, అది నాకు నచ్చినచో ఆ భాషతోసహా అది నాకు జ్ఞాపక ముండును. దీనికి చాల కారణములు గలవు. కాని ఒక ప్రధాన కారణము జీవితములో శరీర పరిశ్రమ ఒక భాగముగా నుండుట. కర్మలేకుండా జ్ఞానము కలుగదు. కావున కర్మద్వారా జ్ఞానమును బోధింపవలెను. నవీన విద్యలో నున్నది ఇంతేకాదని నేను చెప్పదలచుకొన్నాను. శరీర పరి శ్రమ వలన జీవికను సంపాదించుకొనవలెను అను ఈ మహాసిద్ధాంత మును అంగీకరించి దాని ఆధారముపై నవీనవిద్యా నిర్మాణము జరిగినది.

ఇక పద్ధతిని గురించి కొంచెము చెప్పెదము. ప్రస్తుతము రాజ నీతి శాస్త్రము చిట్టచివరి శాస్త్రముగా నెంచబడుచున్నది. రాజనీతి శాస్త్రజ్ఞులు ఏరాజ్యము పాలనాధికారమును చలాయించదో అది అన్నిటి కంటె శ్రేష్ఠమయినదని చెప్పుదురు. ఎంత తక్కువ అధికారము చెలా యించిన అది అంత మంచిరాజ్యమన్నమాట. పరిపాలన యంత్రము కన్పించని రాజ్యమేదైన ఉన్నచో అది సర్వోత్తమ రాజ్యము కాగలదు. నేడు ఈశ్వరుని రాజ్యము ఇట్లే నడచుచున్నది. ఆయన ఎంత చక్కని ఏర్పాటుచేసినాడనగా, ఆయన ఏమూల నిద్రపోవుచున్నాడో ఎవరికిని తెలి యదు. ఆయన రకరకములైన శక్తులు, బుద్ధి, ప్రతిప్రాణికిని పంచిపెట్టెను. అనగా అదియొక పరిపూర్ణ వికేంద్రీకరణమన్నమాట. దానితోపాటు అందరికిని సహకారబుద్ధినికూడ ఒసంగెను. ఫలతః పరమేశ్వరు డున్నాడా, లేదా ? అనికూడ ప్రజలకు శంకకలుగుచున్నది. పరమేశ్వ రుని ప్రణాళికలోని అన్నిటికంటె గొప్పవిశేషమేమన, పరమేశ్వరు డున్నాడా ? లేడా ? అని శంకించు సాహసము ప్రజలలో కలిగినది. కేవల మిట్లు సందేహించుటయేకాదు. పైగా నాస్తికులయి ఈశ్వరుడు లేనేలేడనికూడ చెప్పుచున్నారు. కావున జరుగవలసినదేమనగా, ఢిల్లీలో భారతదేశపాలన ఇంతచక్కగా ఎవరునడుపుచున్నారని చూచుటకైన వెళ్ళినచో అక్కడేమియు కన్పించకూడదు, అతనికి పార్లమెంటు కన్పించదు. గొప్పగొప్ప భవనములు కన్పించవు. ఈ రాజ్యమును

పాలించువా రెచ్చట నున్నారని అడిగినచో వారు పొలములో పనిచేయు చున్నారని సమాధానమువచ్చును. "వారేనా రాజ్యకర్త"లని అడిగినచో "అవును వారే"నని సమాధానము. "ఇప్పుడే వారీపని పూర్తిచేసికొని పొలములో చెట్టునీడను కూర్చుండి వారిలో వారు మాట్లాడుకొను చున్నారు : ఏమన్నా ! ఈజిప్టుపై దాడిజరిగినది కదా ! దానికేమి చేయ వలెను ? ఏమి సలహా ఈయవలెను ?" ఈ మొదలయిన చర్చ సాగు చున్నది. వారిని "మీరేమి చేయుచున్నా"రని అడిగిన వారు "మేము ప్రపంచ రాజ్యకర్తలము. హిందూదేశమునకుకూడ రాజ్యకర్తలము. కనుక మా పొలముపని అయినపిమ్మట విశ్రాంతిసమయములో ఈ సంగతు లాలోచించవలసి వచ్చుచున్నది."అని జవాబిత్తురు. "ఆలోచించి మీరేమి చేయుదురు ?"— "మేము సలహా యిత్తుము"— "తరువాత నేమి జరుగును ?" — "అది ప్రజలకు నచ్చినచో స్వీకరింతురు. నచ్చనిచో స్వీకరింపరు" ఈ విధముగా ప్రపంచమును గూర్చిన చక్కని చర్చ నడుచుచుండును. ఇట్టి దృశ్యమెప్పుడు కన్పించునో అప్పుడు దానిని ఉత్తమ రాజ్యమని పిలుతుము. నేడున్నస్థితి ఏమనగా నెహ్రూపండితు డచ్చట నుండి తప్పుకొనునను మాట వచ్చినదా ! దేశమంతయు అల్ల కల్లోలమై పోవును. తరువాత ఎవరు రాజ్యము నడుపుదురు ? అను ప్రశ్న బయలుదేరును. ఇంకొకస్థితి ఏమన నెహ్రూపండితుడు భారత దేశము పాలనకై పదునారు గంటలు పనిచేయుచున్నాడు. అట్టిచో మొత్తము విశ్వరాజ్యమును పరిపాలించుటకు పరమేశ్వరున కెన్నిగంటలు పనిచేయవలసి యుండును ! ఈ ప్రశ్న హిందువుల నడిగినచో పరమేశ్వ రుడు క్షీరసాగరములో నిద్రపోవుచున్నాడనియు, ఆయన ఏమియు చేయుట లేదనియు చెప్పుదురు. అనగా రాజ్యముచేయుట అనునది ఒక పనికాదు. అది ఒక భావము. ఒక చింతన. చింతనచేతనే ప్రపంచ రాజ్యము నడువవలెను. క్రియాభాగము, ఆందోళన భాగము, ఆయోజన భాగము ఎంత తక్కువగానున్న రాజ్యమంత చక్కగా నడచును. ఏ

రాజ్యములో సైనికు లుండరో, ఆయుధసామగ్రి యుండదో, ప్రజల కేవిధమైన దండన ఉండదో, అయినను ప్రజలు పరిపాలన సాగించు చుందురో, మంచి సలహాను వినుచుందురో, తమ హృదయములలో నీతికి విలువ నిచ్చుచుందురో అది ఉత్తమరాజ్యము.

రాజ్యమునకు వర్తించిన ఈ న్యాయమునే మేము విద్యకుకూడ వర్తింపజేసెదము. ఎచ్చట శిక్షణ ఇచ్చుచున్నట్లును, గ్రహించుచున్నట్లును ఎంతమాత్రము కన్పించదో అది సర్వోత్తమమైన నవీనవిద్య, మీరేమి చేయుచున్నారన్న నేను భోజనము చేయుచున్నాను, లేదా నిద్రించు చున్నాను, ఆడుచున్నాను, లేదా చదువుచున్నాను. ఈ రీతిగా వేరువేరు పనులను పేర్కొందుము. అంతేకాని మేము గాలి పీల్చుచున్నాము. ఇటువంటి పనులను పేర్కొనము. నిద్రించువాడు, మాట్లాడువాడు, చదువువాడు, తినువాడు, వీరందరియందు గాలి పీల్చుపని నిరంతరము సాగుచునేయున్నది. అయినను దానిని పేర్కొనుట జరుగుటలేదు. తదితరములైన బాహ్య కార్యక్రమములే పేర్కొనబడుచున్నవి. ఇట్లే నవీన విద్యలో విద్యార్థులు, శిక్షకులు ఏమి చేయుచున్నారని ప్రశ్నించి నచో వారిపుడు పొలములో పనిచేయుచున్నారు. రోగికి సేవ చేయు చున్నారు, గ్రామమును పరిశుభ్ర పరచుచున్నారు— ఇటువంటి సమా ధానములు లభింపవలెను. అయినను జ్ఞానము పొందుట, శిక్షణ ఇవ్వ బడుట, జరుగుచుండ వలసినదే. శిక్షణ ఇచ్చుట, గ్రహించుట, జరుగు చున్నట్లు కన్పించినచో అచట కృతకృత్య మేర్పడును. మీరేమి త్రాగు చున్నారని అడిగిన పాలు, లేక టీ అని చెప్పుదురు. వానిలో పంచదార కలసియున్నను నేను పాలు పంచదార త్రాగుచున్నాననిగాని, తేనీరు పంచదార త్రాగుచున్నాననిగాని ఎవరును చెప్పరు, పంచదార మాధు ర్యము పాలలోను, తేనీటిలోను కలిసియే యున్నది. అయినను చూచు టకు మాత్రము అతడు పాలు లేక తేనీరు త్రాగుచున్నట్లే కన్పించును. కాని అతడు గప్‌చిప్‌గా పంచదారను త్రాగుచున్నాడు. ఇట్లు పంచదార

వలె శిక్షణ యుండవలెను, దానిపని మిక్కిలి రహస్యముగా జరుగును. చూచుటకు చేయి, ముక్కు, చెవి, కన్ను, నాలుక, పనిచేయుచున్నట్లు కన్పించును. కాని ఆత్మ పనిచేయుచున్నట్లే కన్పించదు. మీచెవులు వినుచున్నట్లును, నా నాలుక మాట్లాడుచున్నట్లును కన్పడుచున్నవిగదా! మీ చెవులుగాని, నా నాలుకగాని కోసి యిక్కడ పెట్టినచో, ఆనాలుక ఎట్లు మాట్లాడగలదు? ఆ చెవి ఎట్లు వినగలదు? దీనినిబట్టి చూచుటకు నాలుక మాటాడినట్లు కన్పించినను, కేవలము నాలుకయే మాట్లాడుట లేదనియు, చెవులు వినుచున్నట్లు కన్పించినను, కేవలము అదే వినుట లేదనియు తెలియగలదు. వాస్తవమునకు లోపలనున్న ఆత్మ తత్వము మాట్లాడుచున్నది. వినుచున్నది. కాని అది రహస్యముగా నున్నది. ఈ విధముగా నవీనవిద్యకూడ రహస్యముగా నున్నపుడే సర్వోత్తమమైన దగును. ఆవిద్య పైకెంత భాగము కన్పించునో అంతభాగము దానిలోని లోటుగా ఎంచబడును.

ప్రశ్న: కొందరు చెప్పుచున్నట్లు, నూలు వడుకుటతో సమవాయము చేసినచో ముందు రాబోవు పారిశ్రామిక సమాజముతో సంబంధము ఉండజాల దనుట సరియేనా?

వినోబాజీ: మా ఉపన్యాసములో మేము రాట్నము పే రెత్తక "బ్రెడ్ లేబర్" ను పేర్కొనుట మీరు వినియేయున్నారు. "బ్రెడ్ లేబర్" ను తొలగించు శిక్షణ ఇవ్వదలచుకొన్నచో ఇక నవీన విద్య పూర్తిగా నిరుపయోగము. కావున ప్రజలు పారిశ్రామికాభివృద్ధిని కోరుచు కొందరు శరీర పరిశ్రమ చేయువారు, తక్కినవారు చేయనివారు ఉండు ప్రణాళికతోపాటు నవీన విద్యనుకూడ నడుపదలచినచో, వారు పూర్తిగా పొరపాటుపడుచున్నారన్నమాట.

ప్రశ్న: ప్రభుత్వ పాఠశాలలలో పనిచేయువా రిందు ఏ విధముగా పాల్గొనగలరు?

వినోబాజీ : పరమేశ్వరుని కృత్యము లెట్లు ఊహకందవో, అట్లే మన ప్రభుత్వములుచేయు కార్యములు కూడ చాలమట్టుకు ఊహకందవు. భారతదేశములోని ఒక రాష్ట్రములో ఉపాధ్యాయులు భూదానోద్యమములో ఏ విధమైన సహాయమూ చేయరాదని ఆజ్ఞాపత్రము ప్రకటింపబడినది. ఇంకొక రాష్ట్రములో ఉపాధ్యాయులు, విద్యార్థులు భూదానోద్యమములో ఏదో కొంత పనిచేయవలెను. ఎందుకనగా వారి విద్యాభివృద్ధి దృష్టిలో ఇది మిక్కిలి ఉపయోగకరము—అను ఆజ్ఞాపత్రము వెలువడెను. ఇట్టి స్థితిలో మీ హద్దులలో మీ రుండగా మీ కర్తవ్యములను గూర్చి మే మేమియు చెప్పజాలము.

గాంధీగ్రామ్ (మధుర జిల్లా) మద్రాసు రాష్ట్రము
30-11-56

## : 67 : నవీన విద్యాశిక్షకుల నడుమ వినోబాజీ

నవీన విద్యనుగూర్చి మేము కొన్ని సంవత్సరములనుండి ఆలోచించుచున్నాము, మా భావములను ప్రకటించుచున్నాము. 35 సం. ల క్రితము మేము వార్ధావచ్చినప్పటినుండియు నవీన విద్యలో పనిచేయుచున్నాము. తాలిమీసంఘము పుట్టి ఇప్పటికి 20 సం. అయినది. కాని మా నవీనవిద్యా కార్యక్రమము అంతకుపూర్వము నుండియు నడచుచున్నది. మా అనుభవమునుబట్టియు, ఆలోచనలనుబట్టియు మా కేర్పడిన భావములను చెప్పుచునే వచ్చితిమి. ఆ భావములు కూర్చిన "శిక్షణ విచార్" అను పుస్తకము ప్రసిద్ధి కెక్కినది. నవీనవిద్యకు సంబంధించినవారి చేతిలోనే కాక పురాతన విద్యకు సంబంధించిన ప్రతి ఉపాధ్యాయుని చేతిలోను, పిల్లలనుపెంచు వారిచేతిలోను ఆ పుస్తకముండవలెనని నా కోరిక.

ఈ మధ్యనే గురుస్వామి (తమిళనాడులోని ప్రముఖ కార్యకర్త) మమ్మలను కలిసికొనుటకు వచ్చిరి. బాబాను కలిసికొనుటకు వెళ్ళినపుడు బాబాపని నెరవేర్చి వెళ్ళుట మంచిదని ఆయనకు తోచెను. పెద్దలను చూచుటకు వెళ్ళినపుడు వట్టి చేతులతో వెళ్ళరాదను రివాజు కలదు. గురుస్వామి తాను 4 గ్రామములకు వెళ్ళి అందు మూడు గ్రామములను గ్రామదానముగా సంపాదించితినని నాతో చెప్పెను. అనగా నూటికి 75 వంతులు సఫలుడయ్యె నన్నమాట! బహుశ ఆయనకు నేటివరకు ఏ పరీక్షలోను ఇంత మంచి మార్కులు వచ్చియుండవు!

నాలుగు గ్రామములకు వెళ్ళగా మూడు గ్రామదానములు లభించుటకు గ్రామదానము పిల్లలఆట కాదు. ఇకనేమన తమిళనాడులో ఇప్పుడు గ్రామదానమునకు వాతావరణ మేర్పడుచున్నది. మేము ఒరిస్సాలో పర్యటించు సమయమున అక్కడ వందలకొలది గ్రామదానములు లభించుచుండెను. అప్పుడిచ్చటి పెద్దలు కొందరు "బాబాకు తమిళనాడులో కొంత భూమి లభించవచ్చునుగాని గ్రామదానములు లభించు అవకాశములు తక్కువ. ఎందుకనగా ఇచ్చటి భూమి మిక్కిలి విలువగలది. ప్రజలకు భూమియందాసక్తి యెక్కువ" అని చెప్పిరి. దీని కర్థము "ఇచ్చటి ప్రజలు తెలివిగలవారు గనుక ఇచ్చట గ్రామదానములు లభింపవు. అచ్చట మూర్ఖులనుండి గ్రామదానములు లభించియుండును" అని తేలుచున్నది. కాని అప్పుడే మేము జగన్నాథముకు (తమిళనాడు భూదానసమితి సంచాలకుడు) తమిళనాడులో గ్రామదానములు తప్పక లభింపవలెనని జాబువ్రాసితిమి. తమిళనాడులోని వాతావరణము హిందూదేశములోని ఇతర ప్రాంతము లన్నిటికంటె గ్రామదానములకు ఎక్కువ అనుకూలమయినది. అప్పటికి మేము తమిళనాడులో పర్యటించలేదు. ఒరిస్సాలో తిరుగుచు మేము తమిళనాడులోని వాతావరణమునుగూర్చి ఆలోచించుచుంటిమి. తమిళనాడులోని వాతావరణము భూదానమునకు ఎక్కువ అనుకూలమగుటకు కొన్ని కారణములు కలవు.

(1) ఇచటి చిన్నచిన్న గ్రామములుకూడ ఏదో ఒక దేవాలయము చుట్టును నిర్మింపబడి యున్నవి. గ్రామములో అన్నియు గడ్డితో నేయబడిన చిన్నచిన్న గుడిసెలే అయినను వానికిమధ్య ఒక దేవాలయముండును. ఇక్కడ చిన్నచిన్న గ్రామములలోకూడ ఉత్తర హిందూదేశములోని మహానగరములలోకూడ లేనంత పెద్దదేవాలయములు కలవు. అనగా ఇక్కడ గ్రామములు భగవత్సమర్పితములా అనునట్లున్నవి.

(2) తమిళనాడులో కురళ్ మొదలు భారతియార్ వరకు చక్కని సాహిత్యము పుట్టినది. అందెచ్చటను భూమికి యజమానత్వము అంగీక

రింప బడలేదు. భూమిమీద మనుష్యునికి స్వత్వము లేదు. భూమి అందరిది. అందరును కలసి పనిచేయవలెను. పంచుకొని తినవలెను. అను భావము కల వందలకొలది వాక్యములు తమిళ వాఙ్మయములో లభించును.

(3) మూడవకారణ మేమనగా భారతీయ సంస్కృతియొక్క శుద్ధ స్వరూపము తమిళనాడులో కన్పించును. భారతీయ సంస్కృతిపై జరిగిన పై దేశపు దాడులు దక్షిణ దేశమునకు వెళ్ళివెళ్ళి తమిళనాడులో ఆగిపోయెను. కనుకనే భారతీయ సంస్కృతిలోని పరిశుద్ధ భావములు తమిళనాడులో లభించుచున్నవి. సంగీతమును ఉదాహరణగా తీసి కొనుడు. ఉత్తర భారత సంగీతములో ఇతర సంగీతము కలిసినది. దానివలన కొన్ని చెడుగులును వచ్చినవి. కొంత మంచియు వచ్చినది. అయితే నేనిక్కడ చెప్పదలచుకొన్నది ఇచ్చటి సంగీతములో అట్టి కలయిక లేదు. ఇక ఇచ్చటి ప్రజల జీవితములో కన్పించు నిరాడంబ రత్వము కూడ భారతీయ సంస్కృతిలోని ఒక గుణమే. కావున ఇచట గ్రామదానములు తప్పక లభించునని నేను ఒకటిన్నర సంవత్సరములకు ముందే వ్రాసియుంటిని. ఇప్పుడది యిచ్చట మాకు అనుభవమునకు వచ్చుచున్నది.

ఇప్పటికి తమిళనాడులో మాకు 6 నెలలు గడచినవి. మేమిచ్చటి వాతావరణమును చూచుచు వెళ్ళితిమి. ప్రజల హృదయములో ప్రవే శించు యుక్తిని వెదకికొనుచు వెళ్ళితిమి. ఇంత పరిచయమైన మీదట ఇప్పుడు హృదయములో కొంచెము ప్రవేశము దొరకినది. ఇందు హృదయమును గూర్చిన ప్రశ్నయే లేదు. ప్రజాహృదయము మావెంట మొదటినుండియు ఉన్నది. కాని యిక్కడ కార్యకర్తల హృదయము మాత్రము కొంచె మెగుడుదిగుడుగా నున్నది. దానిని సరిచేయుటకు కొంతకాలము పట్టెను. ఇప్పుడిచ్చట వాతావరణ మేర్పడినది. ఇప్పుడు మీరు ప్రతి గ్రామమునకు వెళ్ళి ఈ సిద్ధాంతము తెలియజెప్పినచో

వందలకొలది గ్రామదానములు లభింపగలవు. కాని మీరు నవీనవిద్యా శిక్షకులు. కనుక ప్రజలదగ్గరకు వెళ్ళి మామూలుగా ప్రసంగింపక అధ్యయన పూర్వకముగా ప్రసంగింతురు. నవీనవిద్య అందరికిని, బీదల పిల్లలకుకూడ లభింపవలెనని వారికి బోధింతురు. కాని బీదవాని చేతికి భూమి రానంతవరకు ఆవిద్య లభింపజాలదు. భూదాన గ్రామదానోద్యమములతో నవీనవిద్య గట్టిగా పెనవేసికొని యున్నది. కావుననే "ఆర్యనాయకము"గారు మాతోపాటు తిరుగుచున్నారు. ఇంతేకాదు. ప్రాతిపదిక విద్యకు గ్రామదానము ప్రాతిపదిక కనుక తిరుగుచున్నారు. గ్రామదానముతో నవీనవిద్యకు ఈ విధముగా సంబంధము కలదు.

ఇచ్చటి విద్యాశాఖ భూదానమున కనుకూలమే. కాని హిందూదేశములోని ఇతర రాష్ట్రములలో ఉపాధ్యాయులిట్టి పనులలో పాల్గొనరాదనుచున్నారు. వారి ఉద్దేశము ఉపాధ్యాయుల పని మూసియున్న క్లాసు రూములోనే యున్నదని. అనగా వారు ఉపాధ్యాయులను జైలులోని ఖైదీలవలె చూచుచున్నా రన్నమాట. కొన్నిచోట్ల మేము జైలువంటి స్కూళ్ళను కూడ చూచితిమి. అచట పిల్లలను ఒక పెద్ద గదిలో పెట్టుదురు. దాని కిటికీలు పిల్లలకు బయటవస్తువులు కనపడనంతయెత్తుగా నుండును. ఇట్టి జైలెందుకు నిర్మించితిరని అడుగగా "పిల్లలకు బయటి ప్రపంచము కన్పించినచో వారి మనస్సు నిలకడగా నుండ" దని సమాధానము వచ్చినది. అప్పుడు నేను "ఈ విధముగా కొట్టు గదిలో మనస్సు స్థిరముగా నుండునట్లు చేయదలచినచో పిల్లలకు వారి పక్కబట్టలు కూడ తెచ్చుకొనుటకు అనుమతి యివ్వండి. దానివలన వారి మనస్సు బాగుగా స్థిరపడు" నని చెప్పితిని. ఈ విధముగా వారు బహిరంగముగా స్కూలు నడుపుటకుకూడ భయపడుచున్నారు. వారు మాకు తమ "మేన్యుఅల్"లో వ్రాయబడిన నియమమును కూడ చూపిరి. దాని ప్రకారము స్కూలు భవనము లోపలివారు బయట కంత యెక్కువగా చూచుటకు వీలులేన ట్లుండవలెను. పరమేశ్వరుడు సృజించిన

విశ్వమును చూడకూడదని కంటిని నిరోధించు విద్యకూడ ఒక విద్య యేనా ? అని మాకనిపించినది. ఉత్తర ప్రదేశమందలి ఒక స్కూలులో గోడలపై కొన్ని వందల రకముల అడవి జంతువుల బొమ్మలు చూచి తిని. పిల్లలను బయట సృష్టిలోనికి పంపకూడదుకాని గోడలపై ప్రపంచ మందలి చిత్రములన్నియు వ్రేలాడగట్టుటలో అర్థమేమి ?

ఉపాధ్యాయులు సామాజికకార్య మేదియు చేయరాదను అభిప్రా యము పూర్తిగా దురభిప్రాయము. ఉపాధ్యాయులు తగాదాలతో నిండిన రాజకీయములలో పని చేయరాదనుట సరియైనది. కాని ప్రస్తుతము రాజకీయకార్యములు వారిచే చేయింపబడుచున్నవి. మా అభ్యర్థికి కొంచెము పనిచేసిపెట్టుమని ఉపాధ్యాయులకు తాకీదులు వచ్చుచున్నవి. ఏ ఉపాధ్యాయుడైనను ఎవరికైన వ్యతిరేకముగా అభిప్రాయము తెల్పి నచో అతనిపై అసంతుష్టికలిగి అతనిని కష్టపెట్టవలెనని ఇంకొకచోటికి బదిలీచేయుటకూడ జరుగుచున్నది. ఈ విధముగా ఇంతదూరమువరకు ఇటువైపు జరుగుచున్నది. అటువైపు భూదానమువంటి కార్యక్రమములో ఉపాధ్యాయు లెంతమాత్రమును ఆసక్తి చూపరాదని తాకీదు ఇవ్వబడు చున్నది. నేడు పిల్లలు స్కూలుకు వెళ్ళుచున్నప్పుడు చూడగా కొందరి శరీరముపై మంచిబట్టలున్న కొందరి శరీరముపై చిరుగుగుడ్డలు. కొందరు పిల్లలకు కడుపునిండా భోజనముకూడ లభించియుండదు. వారికి ఉపా ధ్యాయులు నవీనవిద్య ఏమి బోధింపగలరు ? పిల్లవానిపొట్ట వీపునకంటు కొనియుండగా ఆతడు తూనికప్రకార మాహార మెట్లు తినగలడు ? ఇక ఉపాధ్యాయుడు "పిల్లలారా ! పాలలో శ్రేష్ఠమైన కేలరీలున్నవి ; అవి త్రాగిన వెంటనే అరుగును. కనుక రొట్టెవలనగాని అన్నమువలనగాని కొన్ని కేలరీలు లభించినంతమాత్రమున చాలదు. కొన్ని కేలరీలు పాల వలనకూడ లభింపవలెను" అని ఉపన్యాస మిచ్చునా ? ఆ పిల్లవా డిదంతయు విని ఏమిచేయును ? ఇట్టి స్థితిలో గ్రామగ్రామమునకు వెళ్ళి ప్రజలకు బోధించుట ఉపాధ్యాయుని కర్తవ్యము కాదా !

సంస్కృతములో ఉపాధ్యాయులకు "ఆచార్య" అని పేరు. ఆచార్య శబ్దమున కర్థము "ఆచినోతి అర్థాన్, ఆచరతి, ఆచారం కారయతి" "అన్ని విషయములను అధ్యయనము చేయువాడు, స్వయముగా ఆచరించువాడు, ఇతరులచే ఆచరింప చేయువాడు—ఇట్టివాని కాచార్యుడని పేరు" అని చెప్పబడినది. మనదేశమందలి గొప్పగొప్ప జ్ఞానులు ఆచార్యులని పిలువబడిరి. ఉదాహరణము శంకరాచార్యులు, రామానుజాచార్యులు. హిందూదేశములో ఆచార్య శబ్దమునకున్న గౌరవము బయట దేశములలో ఏభాషయందును లేదు. ఇచట "ఆచార్యదేవో భవ" అని చెప్పబడినది. ఇటువంటి ఆచార్యులు హిందూదేశములో నుండెడివారు. వారు కేవలము పుస్తకములే వ్రాయలేదు. మొత్తము సమాజమునే తీర్చి దిద్దిరి. గొప్పగొప్ప తత్వజ్ఞానులు పుస్తకాలు వ్రాయుచుందురు. ఇంగ్లీషులో తత్వజ్ఞానముపై విద్వాంసులు వ్రాసిన ఎనిమిదేసి తొమ్మిదేసి వందల పుటలుగల గొప్పగొప్ప గ్రంథములు కలవు. వారు పుస్తకములు వ్రాసి ఏదో ఒకరోజున చనిపోవుదురు. శంకరాచార్యులు, రామానుజాచార్యులు ఇట్లు చేయలేదు. వారు తత్వజ్ఞానముపై గ్రంథములు వ్రాసిరి. హిందూదేశమందలి అన్ని ప్రాంతములలోను పర్యటించి తత్వజ్ఞానమును ప్రచారము చేసిరి. శాంకర, రామానుజ సిద్ధాంతములు పూర్తిగా పల్లెటూరి జనులవరకు కూడ ప్రాకిపోయినవి. అటు కేంట్, హేగెలు సిద్ధాంతములు గ్రామముల దగ్గరకు వెళ్ళినవా ? వారు వ్రాసిన గ్రంథములు చదివి అర్థము చేసికొనుట కూడ కష్టమే. వారు బాలురకు బోధించినవారుకారు. శంకర రామానుజులు బాలురకు బోధించెడివారు. శాంకర భాష్యము నవీన విద్యకు భాష్యము. అది ప్రత్యక్షముగా విద్యార్థులకు బోధింపబడి, బోధించునపుడు కలిగిన అనుభవముల ఆధారముపై వ్రాయబడిన భాష్యము: కనుకనే ఈ భాష్యములభాష నేడు మనము మాట్లాడుకొను భాషవలె ఇంత సరళముగా నున్నది. ఇచ్చటి తత్వజ్ఞానుల భాష సరళముగా నుండుటకు కారణము వారు విద్యార్థులకు

పాఠములు చెప్పుటయే. మనదేశమునందలి సర్వోత్తమ సాహిత్యము నవీనవిద్యా సాహిత్యమే. ఉపనిషత్సాహిత్యము కూడ ఇట్టిదే.

ఉపనిషత్తులలో ఒక కథ కలదు. ఎనిమిది పదేండ్ల బాలకు డొకడు చేతిలో సమిధ పట్టుకొని ("సమిత్పాణి"యై) గురువు దగ్గరకువెళ్ళి "నేను జ్ఞానార్థినై వచ్చితిని" అనెను. గురువు అతనితో "ఈ 400 ఆవులను మేపుచుండుము. ఈపని పూర్తియైన పిమ్మట నావద్దకు జ్ఞానము నిమిత్తము రమ్ము. ఈ గోవుల సంఖ్య వెయ్యివరకు పెరగనిదే ఈపని పూర్తియైన ట్లెంచబడదు" అని చెప్పెను. 400 గోవులు 1000 అగుటకు 1-1½ సం॥లు పట్టును. అనగా ఆపది సం॥ల కుఱ్ఱవానికి 1½ సం॥ల ప్రణాళిక యొకటి ఇవ్వబడె నన్నమాట. పిమ్మట నాతడు ప్రతిరోజు గోవులను మేతకు తోలుకొని వెళ్ళుచుండెను. సాయంకాలము గురువు నొద్దకువెళ్ళి ప్రార్థన చేయుచుండెను. గురువతనికి ప్రేమతో భోజనము పెట్టుచుండెను. 1½ సం॥ల తరువాత ఆయన శిష్యునివైపు చూచి "నీ ముఖము తేజస్సుతో ప్రకాశించుచున్న దేమిరా? నీకేదో జ్ఞానము కలిగి నట్లు కన్పించుచున్నదే" అని అడిగెను. దానిమీద శిష్యుడు "జ్ఞానము గురువువలననే లభించునుగదా! కనుక అది నాకు మీ దయవలననే లభించవలె"నని చెప్పెను. అంతట గురువు "అది సరియే, కాని నీ ముఖముపై జ్ఞాన తేజస్సు కన్పించుచున్నది. నీకెవరైనా జ్ఞానదానము చేసిరా?" అని అడిగెను. శిష్యుడు "అన్యే మనుష్యేభ్యః ఇతి"— "నాకు మనుష్యులుకాదు, ఇతరులు జ్ఞానదానము చేసిరి. ఆయెద్దు కొంచెము జ్ఞానమును ఇచ్చెను. హంస కొంతయిచ్చెను. అగ్ని యిచ్చెను. మద్గు పక్షి యిచ్చెను" అని చెప్పెను. అప్పుడు గురువు ఈ నాలుగును నీకేమి జ్ఞానము నిచ్చెనని అడిగెను. ఇదియంతయు ఉపనిషత్తులలో వ్రాయబడి యున్నది. వానివలన లభించిన జ్ఞానము చాల మంచిది. తరువాత దానిని పూర్తిచేయుటకు అవసరమైనది గురువు చెప్పెను. ఉపనిషత్తుల

లోని గురువులు విద్యార్థులను వారి దృష్టి బయటికి పోకుండునట్లు ఎత్తుగోడల మధ్య నుంచలేదు.

ఉపాధ్యాయులును, విద్యార్థులును భూదానోద్యమములో పని జేసినచో వారు తమ కర్తవ్యము నెరవేర్చుటలో వెనుకబడుదురని ఒక అభిప్రాయము ఇప్పటికిని భారతదేశములో గలదు. వీనికి మేము చెప్పున దేమన ఇది నవీన విద్యయొక్క సిద్ధాంతముకాదు. పైగా ఇది విద్యకు సంబంధించిన విషయమేకాదు. సమాజసేవ, సృష్టి నిరీక్షణము, శరీర పోషణ ఇవన్నియు జ్ఞానప్రాప్తికి సాధనములు. ఈ మూడింటినుండి పిల్లలను దూరముగా నుంచినచో పిల్లలకు జ్ఞానమెట్లు కలుగును? సమాజసేవ వలన పిల్లలకు జ్ఞానము కలిగింపక వారిని పరీక్షలో కూర్చుండ బెట్టినచో వారికి జ్ఞానము లభించునా? పిల్లలకు సృష్టితో సంబంధము లేకుండజేసి రెండవవైపున ప్రపంచమందలి జంతువుల బొమ్మలన్నియు చూపించుటా? సృష్టి పరిచయము సృష్టిద్వారా కలిగించుటకు బదులు బొమ్మల ద్వారా ఏల కలిగించవలెను? ఇందుకొరకు విద్యార్థులు ఉపాధ్యాయులు ఇద్దరును సృష్టిలోనికివెళ్ళి చూడవలెను. మూడవ విషయము, మనుష్యుని కాకలివేసినపు డన్నము తినవలెను. కాని నేడు ఉపాధ్యాయునికి కూడ తన పోషణకు గురించిన చింతలేదు. ఎందుచేతనన్న అతడికి జీతమివ్వబడుచున్నది. విద్యార్థులకును ఆ చింతలేదు. కారణము తల్లిదండ్రులు వారిని పోషించుచున్నారు. ఉపాధ్యాయులపైనను, విద్యార్థులపైనను వారి పోషణభారము ఉండకూడదను విపరీతాలోచన కూడ ప్రస్తుతము సాగుచున్నది. లేనిచో వారు మంచి శిక్షకులు కారట. ఇది పూర్తిగా తప్పు ఆలోచన. బాలురు తమను తాము పూర్తిగా పోషించుకొనలేరనుమాట సత్యమే. ఆ బాధ్యత వారిపై లేదు. అయినను తమ ఆజీవికను సంపాదించుకొనుటలో విద్యార్థులు కొంతభాగమును తీసికొన్నచో వారి జ్ఞానము వృద్ధిపొందును. ఈ విధ

ముగా సమాజసేవ, సృష్టి నిరీక్షణము, ఆజీవికా సంపాదనము అను నీ మూడును జ్ఞానప్రాప్తికి సాధనములు.

ఉపాధ్యాయులును, విద్యార్థులును ఎప్పుడును తిరుగుచు, ఇటు నటు పరుగులిడుచున్నచో చిత్తైకాగ్రత యుండదు కావున వారధ్యయనము చేయరను సంగతిని మే మంగీకంతుము. కావున వారేపని చేయుదురో దానితో అధ్యయనమునకు సంబంధము ఏర్పడవలెను. వారు ప్రజలలో ప్రచారము చేయుటకు వెళ్ళినను, భూదానము కోసము వెళ్ళినను, ఇంకొక సేవకోసము వెళ్ళినను అందు జ్ఞానదృష్టి యుండవలెను. నేటి యనుభవమును చర్చించి సారాంశములను తేల్చవలెను. అంతేకాని ఇట్టి సమాజసేవనుండి నవీనవిద్యనుగాని ఇంకే విద్యనుగాని దూరముగా నుంచుటతప్పు. మద్రాసురాష్ట్రములో ఇటువంటి తప్పుడు ఆలోచనలు మేమంతగా వినకపోవుట ముదావహము. గ్రామములోనికివెళ్ళి ప్రజలలో ప్రచారము చేయుటచే ఒక గొప్పపని జరుగుట కవకాశమున్నపుడు అట్లు చేయక గ్రామములోనికే వెళ్ళకపోయినచో ఎంత సోమరులము కఠినులము అనబడుదుమో మీరే యోచింపుడు. వీదవారిపని కొలది పరిశ్రమచేతనే నెరవేరును. ఆమాత్రము చేయుటకు కూడ మన మిష్టపడనిచో కఠినుల మగుదుము. కొంచెము తిరిగి పరిశ్రమ చేయవలసిన పనియిది. ఆమాత్రము పరిశ్రమ చేయుటకు కూడ ఇష్టపడకపోయినచో సోమరుల మగుదుము. ఇంతేకాక అందు శిక్షకదృష్టి లేదని కూడ యెంచబడును. నేడు మేము గురుస్వామితో చెప్పినదేమనగా. మీరు గ్రామదానములు సంపాదించుచు వెళ్ళండి. గ్రామదానములు లభించినచోటనెల్ల నవీనవిద్యాప్రయోగము చేయండి. అప్పుడు మీరు చేయుపని మిక్కిలి తేజస్వి, యశస్వి కాగలదు. మీకు అందరు గ్రామస్థుల సహకారము లభింపగలదు. పిల్లలలో కూడ ఉత్సాహము బయలుదేరగలదు. ప్రభుత్వమునుండి సహాయము పొందుటకుకూడ సులభము కాగలదు. అన్ని విధముల గ్రామదాన గ్రామములో నవీనవిద్యా ప్రయో

గము చాల చక్కగా సాగును. ఇంతేకాదు మేమొక అడుగుముందుకు వేసి చెప్పునదేమన ప్రభుత్వసహాయ మేమియు లేకపోయినను, అంతే కాదు విరోధమున్నను గ్రామదాన గ్రామములలో నవీనవిద్య వికసించియే తీరును. ఏలయన గ్రామదానము వచ్చినచోట గ్రామశక్తి మేల్కొనును. ఆ గ్రామశక్తి నాధారము చేసికొని చాల చక్కగా నవీనవిద్య నడవ గలదు. కనుక మీరు ఈ పనిలో సహకార మివ్వండి. ఈ సంగతి నేను నవీన విద్యాచార్యునిగా చెప్పుచున్నాను. భూదానకార్యకర్తగా చెప్పుట లేదు. దీనివలన నవీనవిద్య మిక్కిలి గట్టి పునాదిపై నిలబడగలదు. మీరీ విషయమును బాగుగా ఆలోచింతురని నమ్ముచున్నాను.

ఇంక మేము మీ ప్రాంతములో మూడు నాలుగు నెలలుందుము. ఈ వ్యవధిలో మీకు మాకు తగినంత పరిచయము కలుగవలెను. మీరు కొంచెము పరిశ్రమ చేసినచో తమిళనాడులోని వాతావరణము మారిపో గలదనియు, నేడు తమిళభాషకు ఏర్పడిన స్వతంత్ర రాష్ట్రముయొక్క శక్తి వృద్ధిపొందగలదనియు మీకు అనుభవ పూర్వకముగా తెలియ గలదు. తమిళరాష్ట్ర మేర్పడినదనగా ఇక తమిళ భాషలోని వైభవము శక్తి, బయటకు రావలెను. తమిళముయొక్క గొప్పతనమేమి? శక్తి యేమి? నిఘంటువులో తమిళమను మాటకు "మధురమని యర్థము" భారతీయార్ "మాన్ఱ్రంద కోళికళిక, తమిళపోల్ హనిదానదు అంగుంకాణోం" "మేము నేర్చుకొన్న భాషలన్నిటిలోను తమిళము వంటి తియ్యని భాష యింకొకటిలేదు" అని చెప్పెను. ఇంకొక భాషతో పోల్చి చెప్పినచో వ్యవహారము కొంచెము కఠినమగును. కనుక "తమిళమాళి" అనుటకు బదులు "తాయ్‌మొళి" అనవలెను. "తాయ్ మొళి" అనగా మాతృభాషవంటి తియ్యని భాష యింకొకటి లేదని చెప్ప వలెను. అయినను బాబా ఇతర ప్రాంతపువాడై తటస్థ బుద్ధితో చెప్పున దేమన తమిళమువంటి మధురభాష యింకొకటిలేదు. కాని యిక్కడ దారిద్ర్యము, ద్వేషము. ఎక్కువతక్కువల భేదము, జాతిభేదము మొద

లైన వన్నియు నున్నచో వాక్కులో మాధుర్యము వచ్చునా ? అప్పుడు తమిళభాష చెవినిబెట్ట జాలనంత పాడుభాష కఠోరభాష కాగలదు. జీవితములో మాధుర్యము ప్రకటమయినపుడే ఆ భాషయును మధురమగును. తమిళములో పరుషశబ్దోచ్చారణమే యుండకూడదు. ఎప్పుడును ఎవరిని ఏవిధమైన నిందచేయుట, అనునది తమిళములో నుండకూడదు. ఏక భాషా ప్రాంతము ఏర్పడినదనగనే రెండు సౌకర్యము లేర్పడునని నేను చెప్పదలచుకున్నాను. పరస్పరము ప్రేమించుకొనుటకును సౌకర్యమేర్పడును. కలహించుకొనుటకును ఏర్పడును. నేను మిమ్ములను తిట్టవలెననుకొన్నను మీ భాష నాకు రాదుగనుక తిట్టజాలను. కాని మన భాష యొకటే అయినచో తిట్టను గలను, ప్రేమించను గలను. మనందరికీ ఒకే తమిళభాష ఏర్పడినది గనుక ప్రేమయే వృద్ధిపొందవలెనని ఎక్కడనూలేదు. ద్వేషముకూడ వృద్ధిపొంద వచ్చును. భూదానము, గ్రామదానము సర్వోదయ కార్యక్రమము మీరు చేసినచో అప్పుడు నిజముగా తమిళభాష మధురమైనది కాగలదు.

వతలకుండ (మధురజిల్లా) మద్రాసు రాష్ట్రము. 4-12-56.

---

•

విజ్ఞానమందలి మహాశక్తి ఇప్పుడు మానవునికి చేజిక్కినది. అది మానవుని ఊరక కూర్చుండనీయదు. ఇది అతని కుపకారమే. ప్రస్తుతము జరుగుచున్న ఈ సంఘర్షణ లన్నిటియందునుగూడ ఈశ్వరుని హస్తమే మాకు కన్పించుచున్నది. కల్యాణదాయకములగు ఆపత్తులివి. విచార మధనము జరిగినప్పుడే ప్రపంచమునకు హితకరములగు నిర్ణయములు వెలువడుచుండును. వంద, రెండువందల సంవత్సరములకు పూర్వము యూరోపుఖండవాసులు ప్రపంచమంతట వ్యాపించిరి. వారు ప్రపంచములో కొన్ని భావములను వ్యాపింపజేసిరి, విజ్ఞానము నాధారముగా జేసికొని నవసమాజ నిర్మాణము, నూతనమగు అర్థశాస్త్రము, నవ్యమనస్తత్వశాస్త్రము వారు ప్రచారములోనికి తెచ్చిరి, విజ్ఞానముతో బాటు క్రొత్తభావము లేర్పడెను. ఈ భావములు ప్రపంచమంతయు వ్యాపించెను. ఇప్పుడు ఆసియాకూడ మేల్కొనుచున్నది.

## ఆసియా విశిష్టత

అసియాకు ఒక విశిష్టత కలదు. ప్రపంచమందు ధర్మసంస్థాపన చేసిన వారందరు ఇచ్చటనే జన్మించిరి. యూరోపు, అమెరికా మున్నగు దేశములలో జన్మింపలేదు. ఇది ఒక యాదృచ్ఛిక సంఘటనకాదు. జరదాష్ట్రుడు, క్రీస్తు, మహమ్మదు, బుద్ధుడు, మహావీరుడు, లావర్జు, కన్‌ఫ్యూషియస్ — వీరందరును చైనా మొదలు అరేబియా వరకు గల భూమిలో జన్మించిరి. ఇదియొక విశేష సంఘటనమేకాని ఆకస్మిక సంఘటనము కాదు.

మానవసమాజము ప్రాచీనకాలమున వీరి సిద్ధాంతములచేతనే సమృద్ధమై యుండెను. యూరోపునకుకూడ మత సిద్ధాంతము లిచ్చట నుండియే వ్యాపించెను. మానవ సమూహము మొదట ఆసియాలోనే ఉండెను. హిమాలయము, కాకేషస్ ప్రాంతములందు మానవనివాసము లుండెడివి. ఈ అత్యంత ప్రాచీనమైన మానవజాతి ఆలోచనాక్షేత్రము ఈ మతముల రూపమున నుండెను. అప్పుడు యూరోపు మేల్కాంచిన ప్రస్తుతయుగము ప్రారంభమయ్యెను. విజ్ఞానకాంతులు వ్యాపించెను. దాని ప్రభావము అసియామీద అనగా హిందూదేశము, అరేబియా, చైనాల మీదకూడా పడినది. కాని విజ్ఞానము ఆసియాలో పుట్టినదనియు, దాని వికాసము మాత్రము పాశ్చాత్య దేశములలో జరిగినదనియు వైజ్ఞానికు లందఱు ఎఱుగుదురు. ప్రాచ్యదేశములలో మత సిద్ధాంతములు బయలు దేరినట్లే పాశ్చాత్యదేశములలో విజ్ఞానము బయలుదేరెను. రెండిటి కలయిక ఇప్పుడు పరస్పర సహాయకారియని ఋజువు కాబోవుచున్నది.

## విజ్ఞానము-ఆత్మజ్ఞానము

ప్రస్తుతము మొట్టమొదట సంఘర్షణ కన్పించినను అట్లే ఎల్ల కాలమును ఉండుట సంభవముకాదు. ఎందుకనగా ధర్మమునకు మనుష్య జీవనముతో ఆంతరంగిక సంబంధము కలదు. ఇంద్రియములు, మనస్సు బుద్ధి, ఆత్మ — ఇవి ఆంతరంగిక సృష్టికి సంబంధించినవి. అనగా ఆధ్యాత్మ జీవనమునకు సంబంధించిన విషయములు. శరీరము బాహ్య సృష్టికి— అనగా భౌతిక జీవనమునకు సంబంధించినది. భౌతి కాధ్యాత్మిక జీవనములు పరస్పర విరుద్ధములు కాకపోవుటయే కాక పరస్పర పూరక ములు. పక్షికి రెండు రెక్కలుండునట్లే మానవజీవనమున కివి రెండు రెక్కలు. ఈ రెండింటి బలమువలన, సహకారమువలన జీవితము సమృద్ధమగు చున్నది. జీవనవికాసము కేవలము ఆధ్యాత్మికజీవనము వలనను కాదు ; కేవలము భౌతికజీవనమువలనను కాదు. రెండును

కలిసినపుడే అది కలుగును. కనుక విజ్ఞానమునకు, అధ్యాత్మికజీవన మునకు నడుమ కన్పించు పైపై సంఘర్షణను చూచి నేను భయపడను.

ఒకవేళ రెండు పక్షములందును కొన్ని లోట్లుండుటకూడ సంభవమే. ఈ మథనమువలన అది తొలగిపోయి వానియందు పరిశుద్ధత ఏర్పడవచ్చును. పరమేశ్వరునిగూర్చి మనము సంప్రదాయ సిద్ధముగా భావించు భావములలోకూడ విజ్ఞానముయొక్క ప్రభావము ఉండవచ్చును. స్థూలములగు ఆలోచనలకు బదులు సూక్ష్మ వివేచనవైపు మన మెక్కువగా ఆకర్షింపబడవచ్చును. ఈ విజ్ఞాన యుగములో విగ్రహారాధన యుగము పరిసమాప్తమగుచున్నట్లే ఎంచవచ్చును దానికిబదులు నిరాకార పూజకు సంబంధించిన భావము వ్యాపించుచున్నది. అనగా నిరాకార దేవుడు పూజింపబడునని కాదు. అట్టివాడు ఊహామాత్ర సిద్ధుడే. నిరాకార పూజ అనగా సృష్టియందంతటా పరమేశ్వరుని భావింపగల బుద్ధి కలుగుట. దీనివలన మానవసేవకు విలువ పెరుగును. విగ్రహారాధనకంటె ఈ దృష్టి ఎక్కువ వ్యాపకమయినది. దీనితో పోల్చినచో విగ్రహారాధన పిల్లల చదువువంటి దగును. "కిండర్ గార్డన్" పద్ధతిలో పిల్లలను చదివించినట్లే మొట్టమొదట భక్తులకు భక్తిని బోధించుటకు విగ్రహారాధన ఉపయోగింపబడెను. కాని ఇప్పుడు విజ్ఞానము పెరుగుట వలన పరమేశ్వరుని కొద్ది ప్రదేశములలోనే చూడవలెనను కోరికకు అంత మహత్త్వములేదు. విశ్వరూపుడగు పరమేశ్వరుని సమస్త మానవ సమాజ రూపముగను, సమస్త సృష్టిని పరమేశ్వర రూపముగను చూచునట్టి దృష్టి రాగలదు. ఆయనసేవ కర్మయోగముద్వారా జరుగును. ఇప్పుడు కేవలము నైవేద్యము, పుష్పములు, సమర్పించు సేవకూడ జరుగుచున్నది. రాతిని పూజించు విధముగా కాకపోయినను గాంధీజీ సమాధిపై ప్రపంచ ప్రఖ్యాతులగు వ్యక్తులు భక్తి భావముతో పుష్పమాలలు సమర్పించుచున్నారు. ఏమక్కు ఆ పూవులను వాసన చూచుచున్నదో మాకు తెలియదు. కాని ఇదికూడ పూర్వపు విగ్రహారాధన

యొక్క అవశేషమేయని మనము తెలిసికొనవచ్చును. ఇదికూడ పోవు నదే. విజ్ఞానము వ్యాపించిన కొలది ఇట్టివానియందలి ఆకర్షణ తగ్గిపోవు చుండును. అ విజ్ఞానముచేతనే క్రొత్త క్రొత్త ఆకర్షణలు కూడ మనకు లభించుచుండును. అట్లే విజ్ఞానమునందని లోట్లుకూడ ఆధ్యాత్మిక ప్రభావము వలన తీరగలవు. విజ్ఞానము కేవలము భౌతిక విషయములను గూర్చి ఆలోచించుట అనునదిపోయి ఈ విధముగా అందలి లోపము దూరముకాగలదు. విజ్ఞానము నేడు అగ్నిపరీక్షలో నున్నది. కాని తన పరీక్ష నదే చేసికొనజాలదు. లేబరేటరీలో ప్రతి వస్తువుపైన ప్రయోగము జరుగును. కాని స్వయముగా ప్రయోగము చేయువానిపై ప్రయోగము జరుగదు. ఇప్పుడు విజ్ఞానము మానవత్వ దష్టిని స్వీకరింపవలసి యున్నది. ఆసియా యూరప్ ఖండములకు సంబంధము కలిసినచో విజ్ఞానము చేతనమననేమో తెలిసికొన గలదు. ఇంతకు పూర్వము విజ్ఞానము కేవలము జడవాదిగనేయుండి, చేతనమననేమో తెలియనిదై యుండెను. కాని ఇకముందు చేతన వస్తువుయొక్క మూల్యమును గ్రహించుట జరుగును. జడత్వదృష్టి తగ్గును. విజ్ఞానము మన జీవిత ములో లోతుగా ప్రవేశించిన కొలది దానికి మానవత్వముతో సంబం ధము తప్పనిసరి కాగలదు. ఈ విధముగా విజ్ఞానముపై మానవత్వము యొక్క ప్రభావము పడినచో రెండును పరస్పరము ప్రభావితములై భావి మానవ జీవితమును సఫలము చేయగలవు. నేటి సంఘర్షణలో మనమెట్టి ఆవేశమును చెందక మన బుద్ధిని శాంతముగా నుంచుకొని మన సమస్యలను నైతిక మార్గమున పరిష్కరించుకొను నెడల దాని ప్రభావము ప్రపంచ మంతట వ్యాపింపగలదు. పూర్వము ఏదైన నొక పనియొక్కగాని, భావముయొక్కగాని పరిణామము ఎక్కువ వ్యాపక మయ్యేడిదికాదు. కాని ఇప్పుడు మంచివిషయ మేదైన నున్నచో ప్రపంచ మంతట దాని ప్రభావము వ్యాపించుచున్నది. ప్రపంచదృష్టి దానివైపు లాగబడుచున్నది. ఎచ్చటైన సూర్యగ్రహణము పట్టినచో ప్రపంచమందలి

జ్యోతిశ్శాస్త్రజ్ఞులందరు దానినిగురించి ఆలోచించి సముచితమైన నిర్ణయము చేయుటకై సమావేశము కాగలుగుచున్నారు. దీనంతటికి అర్థమేమనగా విజ్ఞానము మానవులను పరస్పరము సన్నిహితుల నొనర్చినది.

## విజ్ఞానము-అహింస

మతము లోపలినుండి మానవునికి ఏకత్వజ్ఞానమును కలిగించుచుండగా, విజ్ఞానము బయటనుండి మానవులను ఒకచోటికి తెచ్చు ప్రయత్నము చేయుచున్నది.

ప్రపంచములో నేడత్యవసరమయిన విషయ మేమనగా ప్రతి దేశమందలి సర్వసమస్యలును నైతిక మార్గముననే పరిష్కారము కావలెను. అప్పుడే విజ్ఞానముయొక్క పూర్తి లాభము ప్రపంచమునకు కలుగగలదు. అట్లుకాక హింసామార్గమున తమ సమస్యలు పరిష్కరించుకొను ప్రయత్నమే సాగినచో విజ్ఞానము, హింస - యీ రెండును కలిసి మానవునే తుదముట్టించును. పూర్వకాలమునను హింస జరిగెడిది. కాని అది చాల పరిమితమైన పరిధిలో జరిగెడిది. నష్టముతోబాటు దానివలన కొంత లాభముకూడ కలిగెడిది. కాని నేడు హింస కొనసాగుచు, దానికి విజ్ఞానముకూడ తోడుపడినచో మానవుని సమస్యలే కాదు, మానవుడే పరిష్కారమై పోవును. కావున నేడు ప్రపంచములో నైతిక విధాన మెక్కువ ఆవశ్యకము. విజ్ఞానము, అహింస-వీనికలయిక చాల అవసరము. ఈ రెండును కలిసిననాడు ఇది భూతలస్వర్గమే కాగలదు. విజ్ఞానముతో కలిసి హింస కొనసాగినచో ప్రపంచము నరకతుల్యమగును. మానవత్వము నశించును. ఇప్పుడట్టి పరిస్థితి ఏర్పడినది. విజ్ఞానమొక గొప్ప విషమప్రశ్నను ప్రపంచము నెదుట పెట్టినది. భగవద్గీతలో కృష్ణభగవానుడు అర్జునునికి క్షాత్రధర్మమును జ్ఞాపకముచేసి యుద్ధముచేయుమని చెప్పెను. కాని దానితోపాటే అనాసక్తుడై యుండ

వలెనని, లాభనష్టముల దృష్టి విడిచిపెట్టవలెనని, మనస్సును శాంత ముగా నుంచుకొని యుద్ధము చేయుమని బోధించెను. కాని నేడు మన ఆలోచనలలో శాంతి అనుకొనుటయే అసంభవముగా తోచుచున్నది. ఎంతసేపును ఒక భయంకరదృశ్యమే మన యెదుట ప్రత్యక్షమగు చున్నది. విజ్ఞానము, హింస కలిసి మెలిసి నడుచుటకు వీలులేదు. అనాసక్తుడై హింస చేయుట అను విషయము నిప్పుడెవ్వరును అంగీక రింపరు. పూర్వకాలమున హింసవలన చాల తక్కువ నష్టము కలిగెడిది. ఎందుకనగా అప్పుడు విజ్ఞానము లేదు. నేటి కాలమున ఎక్కడనైనను హింస అనుమాట వినబడిన చాలు. వేరువేరు దేశములలో సైన్యములు ప్రోగుచేయుట, శస్త్రాస్త్రములు సన్నద్ధముచేయుట ప్రారంభమగుచున్నది. దీనికి హేతువు ఏమిచేయవలెనో ఎవరికిని తోచకపోవుటయే. అందరు భయభ్రాంతులై పోవుచున్నారు. ఎవరికిని మార్గము కన్పించుట లేదు. విజ్ఞానమువలన శస్త్రాస్త్రములు సంపాదించుకొనుటయే విజ్ఞాన ప్రయోజ నముగా నడచుచున్నది. యూరోపు, అమెరికా, రష్యా-ఏదేశమందలి ఆలోచనాపరులైనను ప్రస్తుతము వారిని బాధించు ఆలోచన ఒక్కటే. అది ఈ విజ్ఞానమను అగ్ని మన యింటిలోనే అంటుకొనదుగదా అని. అగ్ని మనకు వంటచేసి పెట్టుటయేకాదు. దానిని సరిగా ఉపయోగింపక పోయినచో ఇంటినికూడ తగులబెట్ట గలదు. నిప్పు లేనప్పుడు జనులు పండ్లు, కాయలు తిని కాలక్షేపము చేయుచుండిరి. కాని నిప్పు ఉపయో గము తెలిసిన పిమ్మట మనుష్యునికి చాల లాభము గలిగెను. మొదట దానినిచూచి భయపడి, దానికి కాపలాకూడ పెట్టెడివారు. లాభముతో బాటు భయముకూడ కల్గెడిది. లాభముతోబాటు భయమునుండి తప్పించు కొను ఏర్పాటుకూడ ఆవశ్యకము. అప్పుడే లాభము కలుగగలదు. అట్లే విజ్ఞానమను మహాగ్ని పరిశోధనమునకు అపారమగు లాభమును కలి గించవచ్చును. కాని దానివలనకలుగు భయమునుండి తప్పించుకొను మార్గముమాత్రము మనకు దొరకవలెను. కనుకనే మానవత్వమును

గూర్చి ఆలోచించువా రిప్పుడు నైతిక ప్రయోగములవైపు తమ దృష్టిని మరల్చుచున్నారు.

ఇది చూచుటకు చిన్నపనివలె కన్పించును గాని నిజమున కిది పెద్ద పనియే. ఇది కేవలము భూ సమస్యనుగాని, పేదతనపు సమస్యను గాని పరిష్కరించుట అని తలచరాదు. అదే అయినచో శక్తినిగురించి ఆలోచింతుము. శాసనమువలన, రక్తపాతముతో కూడిన విప్లవమువలన ఈ పని త్వరగా జరుగునని అందురేని అట్లేల చేయరాదు? కేవలము భూసమస్యను పరిష్కరించుట దీని ఉద్దేశ్యముకాదు. సోదరులారా! భూసమస్యకు వినోబా అక్కరలేదు; భూదానము అక్కరలేదు; పద యాత్రయు అక్కరలేదు. అది యెట్లును జరుగుచున్నదే. మాపని నైతిక మార్గమున దృష్టిని ప్రసరింపజేయుట, నవయుగమునకు తగిన నవ్య మానవుని తయారుచేయుట.

## క్రొత్త విలువలను స్థాపించుట

మనము నవ్యమానవుని గూర్చి మాట్లాడుచున్నామన్న దాని కర్థ మేమి? నేటివరకు మానవుడు తలతో ఆలోచించుచుండిన, ఇప్పుడు పాదముతో ఆలోచించుననియా? పాదములతో నడుచుచుండినవా డింక నుండి తలతో నడచుననియా? నవ్యమానవు డనుమాట కర్థము క్రొత్త మూల్యములను స్థాపించుట. అనగా మూల్యములలో పరివర్తనముకలుగ చేయుట. దొంగతనమునకు విరుద్ధముగా అంతటను జనులలో ఏకాభి ప్రాయము కన్పించుచున్నది. దేశమంతట దొంగతనము పాపమని ఎంచ బడుచున్నది. దొంగతనము పాపమైనచో ఎక్కువగా నిలవచేయుటకూడ పాపమే. ఇది ఈ క్రొత్తభావము. ఇది ప్రాచీనులకు తెలియనిదికాదు. వారు త్రికాల వేదులయిన ఋషులు, మునులు. అస్తేయముతోపాటు అపరిగ్రహమును వారు జోడించియే యుండిరి. కాని సమాజమున కది పట్టుపడలేదు. స్థూలముగా చూచిన నిలవచేయుట దొంగతనముగా ఎంచ

బడుటలేదు. కాని నిలవచేయుటవలన కూడ దొంగతనమే జరుగును. ఆ దొంగతనము మామూలు దొంగతనముకంటె మించినది. ఒక దొంగ యున్నాడన్న వాడు గతిలేక దొంగతనము చేయును. అన్నగారింటిలో అన్నము పెట్టనిచో రాత్రి రహస్యముగా వెళ్ళును. తెరచిన తలుపునుండి ప్రవేశము లభించనిచో గోడకు కన్నము వేయును. ప్రేమతో రానీయనిచో దొంగతనముగా ప్రవేశించి బెదరుచు ముందుకు సాగును. వానిని మనము నీచుడని యెంచుదుము. కాని రోజంతయు దొంగతనమననేల? బందిపోటు చేయునట్టి వానిని గౌరవించి సభలలో అగ్రస్థాన మిచ్చుచున్నాము. దీని నేమనవలెను?

ఫలానావాని యోగ్యత ఎక్కువగనుక అతని కెక్కువ జీతమివ్వవలెనని చెప్పుచున్నారు. క్రొత్త విలువలలో ఆలోచించు ప్రయత్నము చేసినపుడు మన కీ భేదదృష్టి యుండునా? సంపద అంతయు సమాజముదే అనియు, మనము సమాజమునకు సేవకుల మనియు చెప్పగలిగినప్పుడు మన ఆకలితీరుట కెంత అవసరమో అంతే లభింపవలెను. నిలవచేయు నంతకాదు. వినోబా హిందూదేశ విధానమునకు విరుద్ధమగు విషయములు చెప్పుచున్నాడని కొందరనుచున్నారు. మేము చేయు పని వలన అనగా సంపత్తి అంతయు సమాజముది అను సిద్ధాంతమువలన వ్యక్తిగత సంపద అనగా ఆస్తికి విరోధము కలుగున్నదనియు ఈ విధముగా రాజ్యాంగమునకు యిది విరుద్ధముగా నున్నదనియు కొందరి యభిప్రాయము. రాజ్యాంగము వీరికి భగవంతుడు తయారుజేసి యిచ్చినట్లున్నది! దొంగయే బలవంతుడై సమాజములో ప్రతిష్ఠ పొందుచున్నాడు. ఒకవైపున దొంగలను జైలులో పెట్టుచున్నారు; ఇంకొకవైపున వారికే అగ్రాసన మిచ్చుచున్నారు. ఆ జైలుకుపోవు దొంగ బెదరుచు బెదరుచు కొద్ది దొంగతనము మాత్రమే చేయును. కాని పట్టపగలు బందిపోటువేసి కొల్లగొట్టువాని దొంగతనము సమాజమునకు దొంగతనముగనే కన్పించుటలేదు. ఈ విలువను మనము మార్చవలసి

యున్నది. కమ్యూనిష్టులుకూడ దీనిని దొంగతనమనియేపిలుచుచున్నారు. ధనవంతులను దొంగలనియే తలచుచున్నారు. కాని దొంగలను తొలగించుటకు దొంగతనమే చేయవలెనని చెప్పుచున్నారు. ఇందు మీకేమియు సారము కన్పించుట లేదు. మేము దీనిని తప్పుమార్గ మని తలచుచున్నాము. దొంగలను దొంగతనముతోనే యెదిరించుట అను మాట సరిగా లేదు. అట్టిప్రయోగము పరశురాముడుకూడ చేసియుండెను. ఇరువదియొక్క సారులు ప్రయోగము చేసి భూమిని నిక్షత్రియముచెయ్యవలెనని ప్రయత్నించెను. అయినను భూమి నిక్షత్రియము కాలేదు. ఇది ఒక ఆశ్చర్యకరమగు విషయము. మన మెవరినయినా ఉరితీయదలచుకొన్నప్పుడు ఒకసారిమాత్రమే ఉరితీయుదుము. కాని ఆయన ఇరవైయొక్కసారులు ఉరితీసెను. అయినను దాని ఫలితముగా భూమిమీద క్షత్రియులు మిగిలియేయుండిరి. కారణమేమన పరశురాముడు స్వయముగా బ్రాహ్మణుడయ్యును క్షత్రియుడుగా మారెను. ఇక క్షత్రియుల నెట్లు నశింపజేయగలడు? పరశురాముని పాఠము నిజమని తేలుచున్నది. కమ్యూనిష్టులు దొంగతనమును దొంగతనముచేతను, హింసను హింసచేతను పోగొట్టదలచుచున్నారు; కాని దీనివలన వారనుకొన్నదానికి వ్యతిరేకముగా దొంగతనము, హింస పెరుగుచున్నవి. కారణమేమన వీరి సిద్ధాంతముల వలననే పూర్వ సిద్ధాంతములకు బలము లభించుచున్నది. కాని మేము చెప్పునదేమన మీరు ప్రాత విలువలను ఒక్క క్షణములో నశింపజేయగలరు. మనము వారి దగ్గరనుండి తీసికొనుటకు ధనవంతుల దగ్గర అసలు ఏమియున్నది? వారివద్ద పచ్చని లోహము, రాళ్ళు, కొన్ని కాగితములు ఉన్నవి. ఈ వస్తువులు లాగుకొనుటలో విశేషమేమున్నది? గజనీ మహమ్మదును గురించి ఒక ప్రసిద్ధ కథ గలదు. పదునేడుసార్లు హిందూదేశముపై దండెత్తి అతడిచ్చటి సంపత్తును కొల్లగొట్టెనని చెప్పుదురు. కాని ఏ సంపత్తిని కొల్లగొట్టెను? అతడు వజ్రములతోను, ముత్యములతోను తన కొట్టుగదులను నింపి ఆ గదులకు ఒకటి, రెండు,

మూడు అని నంబర్లు వేసి ఇది వజ్రముల గది, ఇది ముత్యముల గది అని గుర్తులు పెట్టుకొనెనని చెప్పుదురు. వాని కాతడు తాళములువేసి యుంచుకొనెను. అవసానకాలము సమీపించినపుడు వాని కివి జ్ఞాపకము వచ్చెను. శరీరము పోవునదే కాని ఈ ముత్యములు, వజ్రములు, ఈ బంగారము కూడ విడువవలసియుండునని అతనికి తోచగనే దుఃఖముతో అతడేడువసాగెను. ప్రక్కనున్నవారు "ఎందుకు దుఃఖించుచున్నావు? ఏమి కావలెను?" అని అడిగిరి. ఆతడు వజ్రములు, ముత్యములు నింపిన కొట్లు చూడగోరుచున్నానని చెప్పెను. కాని ఆతడు చివరకన్నియు విడిచియే వెళ్ళిపోయెను. ఎవరైనను పదిరూపాయల నోటు తీసికొని మన దగ్గరకు వచ్చి నెయ్యి కావలెనని అడిగినచో మనము వానితో "నీ పదిరూపాయల నోటు మాకెందుకు పనికివచ్చును? నెయ్యి మాకు ఆహారపదార్థము. మా పిల్లలు దానిని భుజింతురు" అని చెప్పవలెను. అప్పుడా డబ్బుగలవాడు క్షణకాలములో బికారి అయిపోవుట మనము చూడగలము. మనమిట్లు చేయుటలేదు. ప్రజలు పరాధీనులైయుండుటచే మాయలో చిక్కుకొని అంగడిమీద ఆధారపడియున్నారు. అంగడిమీద ఆధారపడియుండుటచేతనే, తాము నష్టపడి వస్తువు లమ్ముకొనవలసి వచ్చుచున్నది. ఇక చవక, ప్రియము అని ఆలోచనఉండుట కవకాశము లేదు. కమలాఫలములు బండి నిండుగా బజారులోకి వచ్చును. కాని వర్తకులు తమలో తాము కట్టుకట్టి ధర పడగొట్టుదురు. అప్పుడు తక్కువ ధరకే అమ్మవలసియుండును. తిరిగి ఇంటికి తీసికొనిపోవుట కవకాశముండదు. ఈ విషయము నాగపూరు బజారులో నేను స్వయముగా చూచితిని. తప్పనిసరి అయి సరుకు అమ్మివేసి రామనామము జపించుటకుబదులు వర్తకులను తిట్టుకొనుచు ఇంటికి మళ్ళుదురు. అయితే ఇక్కడ మనము తెలిసికొనవలసిన విషయమేమనగా ప్రజలలో చాలమంది పల్లెటూళ్ళలోనే నివసింతురు. ఈశ్వరకృపచే నేటికిని నూటికి 80 మంది పల్లెటూళ్ళలోనేయున్నారు. వారీ కమలాఫలములను తినలేరా?

కాని అది అమ్మవలసిన వస్తువని వారి మనస్సులలో స్థిరపడిపోయినది. ధనవంతులను కొల్లగొట్టుటకు గాని, వారిని చూచి అసూయపడుటకు గాని వారియొద్ద ఏమున్నది ? అన్ని వస్తువులు రైతులయొద్దనే యున్నవి. వారివద్ద మంచి ఆరోగ్యమున్నది. వారారుబయట పనిచేయుదురు. నిజము నకు లక్షాధికారి యెవడును లేడు. ఒకవేళ అట్టి బిరుదు ఈయదలచు కొన్నచో కర్షకునికే ఈయవలెను. నిజమైన శ్రీమంతుడు కర్షకుడే. కాని ఈ సంగతి కమ్యూనిస్టులు తెలిసికొనజాలక దొంగతనమును దొంగతన ముతో పోగొట్టవలెనను గందరగోళములో పడి తామే దొంగలుగా తయారగుచున్నారు. పూర్వకాలమున హత్య జరుగుటను అందరు ఏవ గించుకొనెడివారు. కాని ఇప్పుడు ఎందుకు హత్యజరిగినదని అడుగు చున్నారు. ఏదైన మంచిపని కొరకు హత్య జరిగినచో దానిని చెడ్డదని తలచుటలేదు. దీని కర్థమేమనగా చెడ్డపనులుకూడ మంచిపనుల కొఱకు చేసినచో మంచిగా తలచబడుచున్నవి. ఈ విధముగా చెడ్డపనులకు ప్రాతినిధ్యము లభించుచున్నది. కాని మనము ప్రాత విలువలను మార్చ వలసియున్నది. మేము కేవలము దొంగతనమునే పాపమని అనము. నిలవచేయుటను కూడ పాపమందుము. ఈ విధముగా దొంగతనము యొక్క మూలకారణమునే మేము నశింపచేతుము. ఎందుకనగా నిలవ చేయుట వలననే జనులలో దొంగతనమునకు ప్రేరణ కలుగుచున్నది. ఈ విధముగా మేము క్రొత్త విలువలను స్థాపింపగోరుచున్నాము.

విజ్ఞానయుగములో జను లజ్ఞానులుగా నుండజాలరు. అందరును ఆలోచనాపరులగుదురు. ముందుముందు సమష్టి క్షేమమునకు సంబం ధించిన ఆలోచనలే సాగును. కావుననే సోదరులారా ! భూదానయజ్ఞ మను ఈ పనిని సామాన్యమైన పనిగా నెంచబోకుడని మేము చెప్పుచు న్నాము. ఇది మూల్యపరివర్తన మను ప్రధానమైనట్టియు, విప్లవాత్మక మైనట్టియు పని. ఈ దృష్టితో దీని నర్థముచేసికొని తీవ్రతతోను, శ్రద్ధ తోను ఈ పనిలో ప్రవేశింపుడు. (మకామ్ – పూర్ణియా 27-11-53)

## : 69 : శిక్షక శిక్షికల నడుమ

హిందూదేశములో ఇంగ్లీషువారి రాజ్యము వచ్చినప్పటినుండియు హిందూదేశపు ప్రజలలో రెండువిభాగములు ఏర్పడెను. కొందరు చదువు కొనినవారు, కొంద రే విద్యయు లేనివారు, నూటికి అరవైమందికంటె ఎక్కువ విద్యావిహీనులుగా నుండిరి. కొందరు ఆంగ్లవిద్యలో ప్రవీణు లయిరి. విద్యా విహీనత - ఇంగ్లీషువిద్య, అను రెండు పెద్దవిభాగములు హిందూదేశములో ఏర్పడెను. ఇప్పుడు భాష ననుసరించి రాష్ట్రనిర్మాణము జరిగినది. ఇక మాతృభాషలు చదువుట ఎక్కువగుననియు, ఆ మాతృభాషల ఆధారముపై ఈ రెండు విభాగములును తిరిగి ఏకము కాగల వనియు ఆశించుచున్నాము. ఇంగ్లీషువారి రాజ్య మిచ్చట నూరు సంవత్సరములకు పైగా సాగినది. అయినను హిందూదేశములో విజ్ఞానమంతగా వ్యాపింపలేదు. దీనికి కారణము విజ్ఞాన మంతయు ఇంగ్లీషు గ్రంథముల లోనే బంధింపబడియుండుట. విజ్ఞానమునకు సృష్టితో సంబంధము కలదు. వ్యవసాయములో విజ్ఞానము ఉండవచ్చును. వంటలో విజ్ఞానము ఉండవచ్చును. పారిశుధ్యములో విజ్ఞానము వుండవచ్చును. ఈవిధముగా జీవితమందలి ప్రతిభాగమందును విజ్ఞానము అవసరము. ఇంగ్లీషు తెలియకపోవుటచే కోట్లకొలది జనులకు విజ్ఞానము తెలిసికొనుటకు వీలు లేకపోయినది. విజ్ఞానమునకు ఇంగ్లీషు జ్ఞాన మావశ్యకము. ఇకనిప్పుడు నూరు సంవత్సరములకు పిమ్మట వైజ్ఞానిక గ్రంథములు మాతృభాషలో తక్కువగా నున్నవని ఘోషించుచున్నాము. ఈ త ప్పెవరిది ? ఆ మాతృభాషలదా ? లేక ప్రణాళిక వేయువానిదా? కాని నేడుకూడ ఇంగ్లీషు లేకుండ విజ్ఞాన మెట్లు నేర్చుకొనగలము ? అనుచున్నారు. ప్రశ్న సరిగానే యున్నది. ఉన్నత విజ్ఞానమును నేర్చుకొనవలెనన్న నేటిస్థితిలో

ఇంగ్లీషు, ఫ్రెంచి లేక జర్మన్‌భాషలద్వారానే నేర్చుకొనగలము. కాని ఆ భాషలద్వారా అది హిందూదేశములో వ్యాపింపజాలదు. ఇక ముందు విజ్ఞానమునకు మాతృభాషతో సంబంధము కలియనిచో విజ్ఞానము నేర్చుకొనువాని మెదడులోనే విజ్ఞానము నశించిపోవును. మనము చాల పెద్ద తప్పు చేయుచున్నాము. విజ్ఞానమువంటి గొప్పవిషయము మాతృభాషలోనికి రానిచో అది యెట్లు వ్యాపించగలదు? అను విషయము మన మాలోచించుటలేదు.

విజ్ఞాన విషయమును విడిచిపెట్టుడు. అది మొన్ననే పశ్చిమము నుండి వచ్చినది. కాని ఆత్మ జ్ఞానము మనదేశమందలి వస్తువే. ప్రాచీన కాలమున ఇది దేశమందు వ్యాప్తమై యుండెను. సంస్కృతము మన దేశభాష. వేలకొలది సంస్కృత పదములు ఇతర భాషలలోను కలవు. ఇంగ్లీషువలె సంస్కృతము దూరస్థ భాషకూడ కాదు. అయినను ఆత్మ జ్ఞానమునకు సంబంధించిన వాఙ్మయ మంతయు సంస్కృతములోనే ఉండిపోయి మాతృభాషలోనికి రాకున్నచో నేడు దానికి కలిగినంతప్రచారము కలిగియుండెడిదా? ఉపనిషత్తులలో ఉన్నతమయిన ఆత్మజ్ఞానము కలదు. షడ్దర్శనములలో ఉన్నతమైన వేదాంతము కలదు. ఉన్నత జ్ఞానమును నేర్చుకొనగోరినవారు సంస్కృతము నభ్యసింపవచ్చును. ఉన్నత జ్ఞానమునుగూర్చి పరిశోధింపవలెనన్న సంస్కృతము తప్పక నేర్చుకొనవలెను. కాని ఆత్మజ్ఞానముయొక్క ఉపయోగ ప్రచారములకు సంస్కృతము నాశ్రయించినచో అది వ్యాప్తిజెందుట యెట్లు? ఒక విషయమును పరిశోధించుట వేరు; దాని నుపయోగించుట వేరు; ప్రచారము చేయుట వేరు. ఆత్మజ్ఞానమును ఉపయోగించుటకును, ప్రచారము చేయుటకును భక్తపుంగవులు అది యంతయు మాతృభాషలోనికి తెచ్చిరి. అది అట్లే చేయవలెను. హిందూదేశమునకు సహజమే అయినప్పటికిని ఆత్మజ్ఞానము సంస్కృతములోనే ఉండిపోయినచో అది హిందూదేశములో వ్యాపించి యుండెడిది కాదు.

ఈ సంగతి విజ్ఞానమునకుకూడ వర్తించును. ఉన్నత విజ్ఞాన పరిశోధన చేయవలెనన్న ఇంగ్లీషు, ఫ్రెంచి మొదలయినభాషలు నేర్చుకొనవలసియుండును. కాని విజ్ఞానముయొక్క ఉపయోగ ప్రచారములకు మాతృభాషతప్ప వేరు గతిలేదు. పరిశోధనలోను, ఉపయోగములోను గల భేదము మనము గ్రహింపపచ్చును. రేడియోను గూర్చిన పరిశోధన వేరు ; రేడియోయొక్క ఉపయోగము వేరు ; రేడియోను అందరును ఉపయోగింపవచ్చును. దాని పరిశోధన మాత్రము కొద్దిమందియే చేసినారు. విద్యుత్తును ప్రతియింటను ఉపయోగించుచున్నారు. స్విచ్చినొక్కుటయే తడవుగా అందరకు వెలుతురు లభించుచున్నది. విద్యుత్పరిశోధన మాత్రము శాస్త్రజ్ఞులు చేయవలసిన పని. పరిశోధన చేయవలసిన వారు మాతృభాషయేకాక ఇతర భాషలును నేర్చుకొనవలసియుండును. ఆ భాషలలోని విషయములను మాతృభాషలోనికి తెచ్చి జ్ఞానమును వృద్ధినొందింపవలసియుండును. కాని దేశమంతట దాని ఉపయోగము జరుగవలె నన్నను, ప్రచారము కావలెనన్నను, వ్యాప్తి సాధింపవలెనన్నను అందుకు మాతృభాష అత్యవసరము.

ఇంగ్లీషులో ఉన్నతజ్ఞానము పిల్లలకు కలిగించుట యెట్లని నేటికిని ప్రయత్నములు జరుగుచున్నవి. దానికి ఒకటే ఉపాయము కలదు. జనులందరిపైనను ఇంగ్లీషను రుద్దరాదు. అప్పుడే కొద్దిమంది చక్కని ఇంగ్లీషు నేర్చుకొనగలరు. అట్లుకాక చాలమంది ఇంగ్లీషు నేర్చుకొనిన నాడు ఇంగ్లీషు ప్రమాణము పెరుగజాలదు. కనుక దానివలన ఏమియు లాభము కలుగదు. ఇంగ్లీషువారి రాజ్యములో దాని కుపయోగము కలదు. ఇకముందు శెలిగ్రామివ్వవలెనన్న మాతృభాష ద్వారా గాని, రాష్ట్రభాష ద్వారా గాని ఆ పని జరుగును. మంచిఇంగ్లీషు నేర్చుకొనుట కొద్దిమంది పని. దానికొఱకు లక్షలాది ప్రజలపై దానిని రుద్దుట ఏల ? బాల్యము ననే మధ్యమశ్రేణినుండి అందరు బాలురకు ఇంగ్లీషు నేర్పుటను గూర్చి ఆలోచించుచున్నారు. ఈ మూడవ విషయము కొంచెము మెల్లని

కంఠముతో పల్కుచున్నారు. ఎందుకనగా అందు తప్పున్నదని ఆ చెప్పువారు కూడ ఎరుగుదురు. అందరిమీద ఇంగ్లీషు రుద్దుట తప్పు. ఇంగ్లీషు అవసరము లేనపుడు కూడ దానిని ఉంచుట రెండవ తప్పు. అది అనవసరభారమగుట మూడవతప్పు. ఆ భారము మనుష్యుడు విసరి పారవేయును. దానివలన వ్యయము కూడ చాల ఎక్కువగును.

చాల చిన్నవయసునుండి ఇంగ్లీషు నేర్పినచో పిల్లలు బాల్యము నుండియే చక్కని ఇంగ్లీషు మాట్లాడగలరు అను ఆలోచన తప్పు. ఇంగ్లీషు వాతావరణమున్న సమాజములో బాల్యమునుండియు ఇంగ్లీషు నేర్పవచ్చును. కాని వ్యాకరణము ద్వారా భాషను నేర్పవలసిన పద్ధతిలో మాతృభాషలో వ్యాకరణ సాహిత్య జ్ఞానములు చక్కగా కుదిరిననేతప్ప ఇతర భాషాజ్ఞానము కలుగజాలదు. మాతృభాషలో వ్యాకరణము, సాహిత్యము రానివాడు ఇతర భాషలలో వ్యాకరణము, సాహిత్యము ఎట్లు నేర్చుకొనగలడు ? కనుక ఇంగ్లీషులో విద్యాబోధన నూటికి నూరుపాళ్ళు మూర్ఖత్వము. ఇంగ్లీషు ద్వారా బోధించినచో జ్ఞానము వృద్ధిపొందునని అనుకొందురు. ఇంగ్లీషులో జ్ఞానదాయకమని చెప్పదగిన విషయ మేమున్నది ? ఈ సంగతులన్నియు ఎందుకు చెప్పుచున్నాననగా మీరం దరును శిక్షకులు. కనుక దీనిని గురించి ఆలోచించుట మీ కర్తవ్యమై యున్నది.

చాలమందికి ఇంకొక అభిప్రాయము కూడ కలదు. అది ఇతర దేశములతో రాజకీయసంబంధముంచుకొనవలెనన్న ఇంగ్లీషు రావలెనని. ఇదికూడ భ్రమయని మా అభిప్రాయము. ఇతర దేశములతో రాజకీయ సంబంధము నిలుపుకొనవలెనన్న మన దేశమును బలిష్ఠము చేసికొన కుండ మనమేమియు చేయజాలము. మనదేశమునకు రాజకీయ స్వాతం త్ర్యము లభించినది. కాని ఆర్థిక స్వాతంత్ర్యము లభించనిదే దేశము నిలువదు. పైగా విదేశీయులతో వారిభాషలో మాట్లాడుటకు తయారగుట అనగా మనలను మనము సర్వనాశనమొనర్చుకొనుటయే. అనగా మన

ప్రజల తెలివితేటలను మనముపయోగించుకొనలేక పోవుట. ఇంగ్లీషులో చక్కగా మాట్లాడగలిగినవారు మంచి చిలుకలు కాగలరు; కాని మంచి చింతనశీలురు కాజాలరు. కనుక అట్టివారివలన మన పని నెరవేరదు. మన దేశములో ఒక చాణక్యునివంటివా డున్నాడనుకొనుడు. అతనికి ఇంగ్లీషు రానిచో అతని తెలివి మన కుపయోగింపజాలదు. దీనికిబదులు జరుగవలసిన దేమనగా సంయుక్తరాజ్య సమితిలో మన ప్రతినిధిగా వెళ్లువాడు హిందీలో మాట్లాడవలెను. నేడట్లు జరుగుటలేదు. మనదేశమున కీ పరిస్థితి లాభదాయకము కాదు. సంయుక్తరాజ్యసమితిలో మన మింగ్లీషులో మాట్లాడుటవలన మనకు గౌరవము లభించుచున్నదనుకొనుట కూడ పొరపాటే.

భారత ప్రభుత్వము యొక్క వ్యవహారమంతయు ఇంగ్లీషులో నడచుచున్నది. దీనికి ఫలమేమి ? మీ దేశ వ్యవహార మెట్లు నడచుచున్నదో అమెరికా, ఇంగ్లండులలోని జనులు ఇంటిలోకూర్చుండి తెలిసికొనగలుగుచున్నారు. మీ దేశములోని రైతులకు మాత్రము అది తెలియుటలేదు. ఇందు రెండుసంగతులు జరుగుచున్నవి. మీ దేశ వ్యవహారములను ఇతరుల యెదుట పెట్టుట ఒక తప్పు. మీ దేశపు రైతులకే అది తెలియకుండా ఉంచుట ఇంకొక పెద్దతప్పు. ఈ తప్పు ఎవడైనను తెలిసికొనగలడు. నీ దేశ వ్యవహారములను ఇతర దేశస్థుల యెదుట బహిరంగపరచుట తెలివితక్కువతనము. ఈ సంగతిని కనీసము రాజనీతిజ్ఞులైనను అంగీకరింతురు. నేను అహింసను పాటించువాడను. నా విషయ మేదైన బహిరంగముగా నున్నప్పటికిని నేను లెక్కచేయను. కాని రాజనీతిజ్ఞులు మాత్రము ఇతరుల యెదుట మన సంగతులు బహిరంగపరచరాదను మాటను అంగీకరింతురు. రాజకీయములలో రాజ్య రహస్యములను గోప్యముగానుంచెదమని ప్రమాణముచేయుదురు. వారికి రహస్యముగా నుంచవలసిన ఆవశ్యకత తెలియును. వారి దృష్టిలో దేశ వ్యవహారములను ఇతరుల యెదుట బహిరంగపరచుట తప్పే. ఇక

తమవారినుండియే దాచిపెట్టుట మరింత గొప్ప తప్పు. ఏకకాలములో రెండు తప్పులు చేయుచున్నారు. ఇంత సామాన్య విషయము ఎందు కర్థమగుటలేదో నా కాశ్చర్యముగా నున్నది.

ఇంకొక విషయము. ప్రపంచములో జీవనాధార వస్తువు లన్నియు పరిశ్రమవలన తయారగుచున్నవి. ఆహార పదార్థము లన్నియు పరిశ్రమ వలన తయారగుచున్నవి. లక్షలకొలది, కోట్లకొలది జనులు శరీర పరిశ్రమ చేయవలసివచ్చుచున్నది. వారందరిని మనము తక్కువ శ్రేణిలో ఉంచియున్నాము. నేడు హిందూదేశములో విద్య ఎట్లుపయోగపడుచున్నది ? శరీర పరిశ్రమనుండి తప్పించుకొనుట కొక సాధనముగా విద్య తయారయినది. విద్య కిదే అర్థమయినది. మనము విద్యావంతుల మయినచో శరీర పరిశ్రమనుండి తప్పించుకొనవచ్చును. ఇంతేకాదు, ఇంకను ఎక్కువ లాభము మనకు కలుగును. అదేమన భోజన పదార్థములను పండించువానికంటె మనకు ఎక్కువ మంచిభోజనము లభించును. ఈ విధముగా విద్యకు మనము రెండులాభములను కనిపెట్టితిమి. (1) మనము శరీరపరిశ్రమ చేయనక్కరలేదు. (2) శరీరపరిశ్రమచేయు వానికంటె మన జీవన ప్రమాణము ఉన్నతముగా నుండును. ఇద్దరిలోను గల భేదము స్పష్టముగా కన్పించుచునే యున్నది. ఉన్నతవిద్య పొందిన వారి దుస్తులు వేరు, ఆసనము వేరు, భాష వేరు, పని వేరు. అనగా ఇతరుల వస్త్రములకు కానంతఖర్చు వీరి సబ్బులకు అగునన్నమాట ! ఇతరుల కడుపులోనికి వెళ్ళనంత నూనె వీరి శిరోజములకు పట్టునన్నమాట! ఇతరుల భోజనమునకుకానంతఖర్చు వీరి పానీయముల కగునన్నమాట! ఇతరుల పిల్లలకు లభించని సొమ్ము వీరి కుక్కలకు లభించుచున్నది ! ఈ విధముగా జీవితము స్పష్టముగా కన్పించుచున్నది. ఇందు అహింస నడుచుననియే మీ రనుకొనుచున్నారా ? ఇతరులను పీల్చి పిప్పిచేయువారే అహింసనుగూర్చి మాట్లాడుట నాకు చాల ఆశ్చర్యమును కలిగించుచున్నది. వారట్లు మాట్లాడుటకు తాత్పర్యము మా స్థితి యిట్లే యుండవలెనని.

ఇట్టి అహింస నిలబడునదికాదు. ఇది అహింసయే కాదు. ఇదిమోసము. మనము మన విలువగల వస్తువును విడిచిపెట్టుటకు ఎప్పుడు తయారగుదుమో అప్పుడు అహింసవచ్చును. శిక్షకు డీ విషయ మెప్పుడును ఆలోచించుచుండవలెను. ఈ విధమయిన భేదభావము శిక్షణ సాగుచున్నప్పటికిని పెరుగుచుండును, లేదా అట్లే నిలబడియుండును. శిక్షణలో ఈ ప్రమాద మొకటి కలదు. శిక్షకుడు పిల్లలకు బోధించునపుడు అది ఎంత గౌరవమని భావించునో పాఠశాలను చీపురుతో శుభ్రపరచునప్పుడుకూడ అది అంత గౌరవమని భావింపవలెను. నేను చెప్పున దేమియు క్రొత్త సంగతి కాదు. దీనికి కృష్ణభగవానుడే ప్రమాణము. శ్రీకృష్ణు డర్జునునికి గీతను ఉపదేశించెను. ఆ కృష్ణుడే సాయంసమయమున అర్జునుని గుఱ్ఱములకు మాలీసుచేసెను. శ్రీకృష్ణుడు జగద్గురువని చెప్పబడెను. ఎందుకనగా గీతవంటి మహోపదేశమును ఆయన ప్రపంచమున కిచ్చెను. కాని, గుఱ్ఱములకు మాత్రము కృష్ణుడు తమకు ఉత్తమోత్తమ సేవకుడను అనుభవము కలిగెను. గీత నుపదేశించునపుడు కృష్ణునకు ఎంత గౌరవభావము కలిగెనో గుఱ్ఱములకు సేవచేయునపుడు అంతకంటె తక్కువ కలుగలేదు. కవికూడ "కళ్ళెము మొదలయిన సేవా సాధనములు చేతిలో ధరించినట్టియు, జ్ఞానముద్రతో నిండినట్టియు కృష్ణునికి నమస్కారము" అని వ్రాసెను. బ్రహ్మర్షియైన కులపతి గోసేవచేయుచు గోమయము నెత్తుచున్నాడని కవి వర్ణించెను. శిక్షణలో ఇది అవసరము. నేటి శిక్షణలో దీనికి తలక్రిందుగా జరుగుచున్నది.

మూడవ విషయము, విద్యా విషయమున జీవితము ముక్కలుగా చేసివేయబడినది. పిల్లవాడు 25 సంవత్సరములవరకువిద్యనభ్యసించును. అంతవరకు అతనిని పోషించు బాధ్యత తల్లిదండ్రులది. 20 ఎకరముల పంట ఒక కాలేజి విద్యార్థి తినివేయును. ఇది లెక్కవేయబడిన విషయమే. మా కొక రైతు మిత్రుడు కలడు. మంచివాడు. ఆయన కొడుకు లిద్దరుకలసి 40 ఎకరముల పంట తినివేయుచుండిరి. కాలేజి చదువులో

వారి కంత ఖర్చగుచుండెను. వారికి గ్రామములో మంచి రైతులని పేరు. వారికి మొత్తము 60 ఎకరములు కలదు. 60 ఎకరములు కలవాడు గ్రామములో మంచిరైతని పిలువబడును. 20 ఎకరములతో మొత్తము తన సంసారమంతయు గడుపుకొనుచున్నానని ఆయన చెప్పెను. ఎవ డెంత ఉన్నతవిద్య నభ్యసించునో అతని ఆయుర్దాయ మంత తగ్గిపోవును. యఫ్. ఏ. ప్యాసయ్యెను. తరువాత బి. ఎ. తరువాత యమ్. ఎ. ఆ పిమ్మట టి.డి. ఇంగ్లీషులో 26 అక్షరములు కలవు. అవన్నియు ప్యాసగుచుండును. ఒకడు బి. ఏ. బి. టి. అయిన యింకొకడు పి.టి. అగును. ఈ విధముగా ఏమేమియగునో నాకు తెలియదుకూడ. తల్లిదండ్రులు మాత్రము డబ్బు ఖర్చు పెట్టుచుందురు. అనగా ఈ బాలురజీవితములో పురుషార్థమన్న దేమియు ఉండదు. ఏదయినా చెప్పుకొనదగినపని వారు స్వయముగా చేయుదురనుమాట కల్ల. అక్బరు చక్రవర్తినిగూర్చి ఒక ప్రసిద్ధమయిన కథకలదు. ఆయన కొక జ్ఞానవంతుడగు గురువు కలడు. ఆయన చక్కనివిద్య బోధించుచుండెను. అక్బరుకు 13 సం॥లవయస్సు వచ్చునప్పటికి "నే నింకను ఎంతకాలము విద్య నేర్చుకొందును, పదమూడు సం॥ల వయస్సు వచ్చినదికదా, ఇంకను సింహాసనము ఖాళీగా ఉండుటయేనా" అనిపించినది. అక్బరు తండ్రి అతని బాల్యములో చనిపోయెను. రాజుకు బదులుగా గురువే రాజ్యవ్యవహారములు చూచుచుండెను. ఆయన అక్బరుకు విద్యనేర్పి రాజుగా చేయవలసినవాడు. కాని అక్బరు మనస్సులో "నేనింకా ఎంతవరకు విద్యను నేర్చుకొందును" అని తోచెను.

ఒకనా డతడు లేచి కొలువుకూటమువైపు బయలుదేరెను. సిపాయిలు ద్వారము నొద్ద నిలవబడియుండిరి. వారు తలుపులు తెరచి మార్గమిచ్చిరి. అతడు తిన్నగా వెళ్ళి రాజసింహాసనము నధిష్ఠించెను. అక్కడనుండి "ఇప్పుడు నేను రాజునైతిని. నా ఆజ్ఞ పాలింపు" డని సేవకుల నాజ్ఞాపించెను. సేవకులు "ఏమి సెలవు" అని అడిగిరి. అక్బరు తన

గురువును జైలులో పెట్టుమని చెప్పెను. సేవకులు ఆజ్ఞను పాలించిరి. గురువును జైలులో పెట్టిరి. ఆ గురువొక పెద్ద ప్రసిద్ధవ్యక్తి. అక్బరు మనస్సునందు కూడా ఆయనపై గౌరవము కలదు. అయినను అక్బరు 12, 13 రోజులు చక్కగా పాలించినపిమ్మట ఒకనాడు గురువును కలిసి కొనుటకు జైలుకు వెళ్ళెను. గురువుతో "మీరు నన్ను క్షమించవలెను. ఎంతకాలము పురుషార్థహీనులమైయుండుట అని తాళలేక అట్లుచేసితిని. నేటినుండి మీరు ముక్తులు; మీ సలహాను మేము తీసికొనుచునేయుందుము. ఈ విధముగా మీ ప్రేమను సహాయమును కోరుచున్నాను" అని చెప్పెను. అంతట గురువు "నీవు చేసిన పని మంచిదే. కాని నా కిప్పుడు యాత్ర లకు వెళ్ళవలెనను కోరిక గలదు. నన్ను వెళ్ళనిమ్ము" అని చెప్పెను. ఈ విధముగా గురువు యాత్రలకు వెళ్ళెను. అక్బరు ఆయన యాత్రకు చక్కని ఏర్పాటు స్వయముగా జేసెను. పదమూడేండ్ల అక్బరు హృద యములో పురుషార్థహీనుడనై జీవిత మెట్లు గడుపుదునని బాధ బయలు దేరెను. కాని ఇక్కడ 13×2=26 లేక 25 సం. లు వచ్చినప్పటికిని విద్య పూర్తియగుటలేదు. తన గ్రామములో విద్య పూర్తియైనచో తిరుచి వెళ్ళును. అక్కడిది పూర్తిఅయినచో సేలము వెళ్ళును. సేలములోని విద్య పూర్తిఅయినచో చెన్నపురి వెళ్ళును. అచ్చటిది పూర్తిఅయినచో బొంబాయి వెళ్ళును. బొంబాయి పూర్తిఅయినచో లండన్ వెళ్ళును. తరువాత అక్కడనుండి వాషింగ్టన్ తిరిగివచ్చును. 30 సం.ల వయస్సు వచ్చినది. చూపు చెడినది. బొమ్మ దించుకు పోయినది. పంచేంద్రియ ములు పటుత్వముతప్పినవి. పనిచేయు అలవాటులేదు. మామూలు భార్య పనికిరాదు. చదువుకొన్న భార్య కావలెను. ఇద్దరును కలసి ఇంటిలో ఏ పనియును చేయరు. కనుక ఇంటిలో నౌకర్లు కావలెను. దీనికి డబ్బె క్కువ అవసరము. ఆ డబ్బు వినియోగమౌటకు కుటుంబమున కొక డాక్టరవసరము. ఇట్లు 10-12 సం. లు నౌకరీచేసి ముసలివాడయ్యెను. 30 వ ఏట పనిచేయువాడును, 40 వ ఏట పనిచేయనివాడును, 50 వ

ఏట మరణమున కధికారియుఅయినాడు. తాత్పర్యమేమనగా నేటి విద్యా విధానము పురుషార్థహీనతను పెంచునదిగా నున్నది. శిక్షకులు కూడ ఎట్టివారు తయారగుచున్నారు ? జీవితములో ఎప్పుడును పురుషార్థమునకు సంబంధించిన ఏ పనియు చేయనివారే. అయోగ్యులే శిక్షకులుగా తయారగుచున్నారు. ఎప్పుడును రాజకీయములలో పాల్గొననివాడు రాజనీతి శాస్త్రమును బోధించుచున్నాడు. ఎప్పుడు ఒక గవ్వయైనను సంపాదింపనివాడు అర్థశాస్త్రమును బోధించుచున్నాడు. ఇంద్రియనిగ్రహము అభ్యసింపనివాడు తత్వజ్ఞానము బోధించుచున్నాడు. అనగా ఏ విషయమును గూర్చియు ఎప్పుడును అనుభవములేనివారే శిక్షకులగుచున్నారు. శిక్షకుడనగా పురుషులకు శిక్షకుడే శిక్షకుడు; బాలురకు కాదు. ఇదికూడ మారవలసియున్నది.

మీరు చేయవలసినవి మూడు. (1) ఇంగ్లీషు బంధమునుండి మనము విడుదల పొందవలెను. ఇంగ్లీషు జ్ఞానముతో మనకు విరోధము లేదు. అనవసరముగా దాని భారమును మనపై మోపు విషయము వేరు. (2) పరిశ్రమపైని శ్రద్ధ కలుగవలెను. (3) శిక్షకునితోకూడి శిక్షణ పొందుచునే పురుషార్థమును సాధింపవలెను.

ఇది యంతయు సర్వోదయమునకు సంబంధించిన శిక్షణ విచారధార. ఇది అమలులోనికి ఎప్పుడువచ్చును ? హిందూదేశమువంటి పెద్ద దేశములో ఆస్తి హక్కువంటి చెడ్డవస్తువు లేనప్పుడు. ఆస్తి హక్కు ఉన్నంతవరకు వర్గభేదములు మొదలయినవికూడ నుండును. అవి నశింపవు. విద్య మారనిచో అది పైవర్గము వారిచేతిలో నుండును. ఆస్తి హక్కు నశించునపుడు విద్యకూడ చక్కబడును. కావున సర్వోదయము విద్య విషయమున యోజించుచున్నట్లే, దానితోపాటు సమాజములో క్రాంతిని కలుగజేయు కార్యమునకూడ లగ్నముకాగోరుచున్నది. భూదానము, గ్రామదానము, గ్రామపరిశ్రమలు—— ఇవి యన్నియు సమాజము యొక్క స్వరూపమును మార్చివేయునట్టివి. అటునుండి సమాజ నిర్మా

ణమును మార్చు పని, ఇటునుండి విద్యావిధానమును మార్చుపని జరిగినచో సర్వోదయ కార్యము సంపూర్ణ మగును. కావున మధురజిల్లాలోని శిక్షకులు భూదాన గ్రామదానములలో పనిచేయుటకు సమయ మిచ్చినట్లే మీరుకూడ ఈజిల్లాలో ఈయగలరని ఆశించుచున్నాను.

మకామ్ - మానాపిరాయి
(జిల్లా-తిరుచి) మద్రాసురాష్ట్రము
12-1-57

# శుద్ధిపత్రము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| iii | 8 | శిక్షణకావున | శిక్షణ. కావున |
| ,, | ,, | లభించునని | లభించునవి |
| 10 | ,, | మేధా | మేధ |
| 14 | 4 | మానిసిక | మానసిక |
| ,, | 10 | ప్రెశ్న | ప్రశ్న. |
| 15 | 16 | పుట్టింపబడదు. | పుట్టింపబడదు, |
| 16 | 9 | వికాసార్థముల్ | వికాసార్థములో |
| 19 | 12 | నీతిమంతిని | నీతిమంతుని |
| 21 | 2 | ప్రవత్తి | ప్రవృత్తి |
| 23 | 19 | ఇవ్వబడునది. | ఇవ్వబడునది." |
| 25 | 17 | నివృత్తి | నివృత్త |
| 28 | 18 | జీవన్మృతుడనే | జీవన్మృతునే |
| 35 | 10 | ప్రతిఫలమున | ప్రతిఫలముగ |
| 38 | 20 | బాధ్యతాహిత | బాధ్యతాసహిత |
| 39 | 19 | ఏమిచేయునో | ఏమిచేయును ? |
| 40 | 18 | గృహస్థుడను | గృహస్థును |
| 41 | 21 | జీవితమున | జీవితమన |
| 42 | 11 | :ఇవ్వబడగలదు.— | ,ఇవ్వబడగలదు." |
| 44 | 21 | చేయుట | చేయుటచే |
| ,, | ,, | తలచి | తలచునది |
| 45 | 8 | యోఒద్దే | యోఒర్థే |
| ,, | 17 | చేయుచున్నాను. | చేయుచున్నాను." |
| 46 | 5 | అబ్బునుగాని. | అబ్బును. కాని |
| 61 | 7 | చేయడు | చేయుడు |
| 64 | 6 | పోవుచున్నవని | పోవుచున్నదని |
| ,, | 7 | క్రింతము | క్రితము |
| 70 | 5 | గంటలలైనన | గంటలైనను |
| 72 | 18 | విధానములో | విధానము |
| 73 | 10 | పరిశేషపద్దతి | పరిశేషపద్ధతి. |

| | | | |
|---|---|---|---|
| 73 | 22 | కళను, | కళను |
| 74 | 1 | పరిశ్రలో | పరిశ్రమలో |
| .. | .. | అచుతడనుకొనును. | ఆతడనుకొనును, |
| 75 | 1 | పరిశ్రమకు | పరిశ్రమ |
| .. | 14 | .. | .. |
| 76 | 21 | పరిశ్రమలను | పరిశ్రమను |
| 79 | 1 | పరిశుద్ధని | పరిశుద్ధిని |
| 80 | 13 | మోపింపజేయుటగాని | మోపింప |
| .. | 15 | వడుట | నడుటకాని |
| 81 | 21 | నిర్మించుట | నిర్మించుటకాదు |
| 82 | 12 | భాపూ | భావూ |
| .. | 23 | ఇదే | ఇదీ |
| 85 | 16 | మనము | జ్ఞానము |
| .. | 22 | ఇట్లది | ఇట్లిది |
| 92 | 6 | శిషకు | శిష్యునికి |
| 111 | 24 | కూడిదానినిగా | కూడినదానినిగా |
| 112 | 10 | మాతృవాన్,పితృవాన్ | మాతృమాన్,పితృమాన్ |
| 127 | 11 | మన్నగు | మున్నగు |
| .. | 12 | కన్పట్టుకుండును | కన్పట్టుచుండును. |
| 128 | 7 | కేలవము | కేవలము |
| 129 | 21 | వలెదు. | వలెను. |
| .. | .. | ఇందుకు | ఇందును |
| 130 | 10 | జ్ఞానమయుము | జ్ఞానమయము |
| 142 | 9 | నాజీవితమునకును | మనజీవితమునకు |
| 143 | 4,6 | దళ్లవన్ | పళ్లవన్ |
| .. | 4 | అను | అను |
| 144 | 2 | నిష్ఠ | నిష్ఠ, |
| .. | .. | ప్రేమ | ప్రేమ, |
| .. | 3 | దృష్టి | దృష్టి — |
| 145 | 20 | యుక్క | యొక్క |
| 148 | 2 | పదము | సంగతు |
| 149 | 18 | అసగ్రమైన | అసమగ్రమైన |

| | | | |
|---|---|---|---|
| 154 | 4 | "స్కిన్" | "రస్కిన్" |
| 169 | 9 | "స్వరాజ్యమని" | "స్వరాజ్య"మని |
| 171 | 22 | హేతువైనది | హేయమైనది |
| 173 | 6 | తృప్తినిక్కూడ | తృప్తినికలుగ |
| 175 | 1 | కారణము. | కారణము, |
| .. | 12 | పేరుమాత్రము | పేరు |
| 178 | 17 | కుండా | కూడ |
| .. | 22 | విద్య | విన్యా (వినోదా) |
| 181 | 10 | చర్థా | చర్చా |
| 192 | 1 | చేసింత | చేసినంత |
| 206 | 12 | తాళము | తాళము |
| 207 | 26 | యోగిచు | యోగించు |
| 208 | 8 | యొక్కకనికి | యొక్కనికి |
| 211 | 11 | గీతమాయీ | గీతాయీ |
| 215 | 10 | రేఖాకితములు | రేఖాంకితములు |
| 217 | 16 | అవి | అవి వ్రాగుటకు |
| 218 | 22 | సంస్కరణము | సంస్మరణము |
| 222 | 10 | లంభించిన | లభించిన |
| 223 | 19 | కుకుభ్యాం | కకుద్భ్యాం |
| 226 | 23 | మెక్కడ ? | మెక్కడో ! |
| .. | .. | యెక్కడ ? | యెక్కడో ! |
| .. | .. | లెక్కడ ? | లెక్కడో ! |
| 229 | 25 | గురించియు | గుర్తించియు |
| 230 | 6 | నేర్చుటకు | నేర్పుటకు |
| .. | 21 | పెద్దవారైనన | పెద్దవారైన |
| 235 | 11 | మీకేమియు | మాకేమియు |
| .. | 20 | నిచ్చువాడను | నిచ్చువాడును |
| 238 | 2 | నున్నారు | చున్నారు |
| .. | 8 | యుత | యత |
| .. | 12 | కావా ? | కాదా ? |
| 239 | 11 | లభింపవలెను | భుజింపవలెను |
| 241 | 8 | వచ్చినప్పు | వచ్చినప్పుడు |

| | | | |
|---|---|---|---|
| 243 | 12 | నూలు | నూలుతో |
| .. | 21 | మునము | మనము |
| 249 | 12 | చెప్పుచున్నాను. | చెప్పుచున్నారు. |
| 251 | 1 | విరుద్ధమైన | విశుద్ధమైన |
| 257 | 15 | ఆవశ్యకత | ఆవశ్యకత గ్రామవాసులకు. |
| 258 | 15 | ఆభాషలతో | ఆ భాషలలో |
| 267 | 10 | దాని | రాని |
| 268 | 16 | జీవితములు | జీతములు |
| 271 | 6 | బ్రహ్మవిద్య | భ్రమవిద్య |
| 291 | 11 | లవరసర | లవసర |
| 298 | 24 | గ్రామము | ప్రతిగ్రామము |
| 311 | 21 | వస్తువును | వస్తువు |
| 319 | 19 | ఇంకొందరు | ఇంకొక |
| 320 | 9 | ఉద్దేశింప | ఉద్దీపింప |
| .. | 11 | చదువుకొనిన | చదువుకొని |
| 321 | 22 | ఇతర | ఇతరుల |
| 327 | 22 | సనాతనులు | సనాతనుల |
| .. | 23 | విరోధించినచో | విరోధించనిచో |
| 328 | 17 | హిరో | హీరో |
| 330 | 3 | మక్కు | ముక్కు |
| 332 | 5 | వర్ణించు | వర్లించు |
| 346 | 15 | మేనగా | మేమనగా |
| 350 | 18 | ప్రక్రియమే | ప్రక్రియయే |
| 357 | 20 | కృతకృత్య | కృతకత్వ |
| 359 | 4 | సహాయమూ | సహాయము |
| 367 | 17 | పోషణకు | పోషణను |
| 368 | 5 | కంతుము | కరింతుము |
| .. | 25 | పొందుటకు | పొందుట |
| 374 | 3 | అవిజ్ఞానము | ఆ విజ్ఞానము |
| .. | 10 | దష్టిని | దృష్టిని |